విరాట్ గ్రంథమాల-5.

శ్రీవిరాట్పోతులూరి వీర బ్రహ్మేంద్రస్వామి సుప్రసిద్ధ శిష్యుడు

# సిద్దయోగి ప్రసిద్ధ భారతం

-: ఆధారం :-

శ్రీమద్ గద్వాల ఆస్థాన కవిఱేడు, కవిసింహ, ఆంధ్రకవి శేఖర కీ॥శే॥ పోకూరి కాశీపత్యవధానిగారి "సిద్ధయోగి చరిత్ర" మను పద్య కావ్యం.



విభావసు

ఫణిదపు ప్రభాకరశర్మ

శ్రీ విరాట్ గ్రంథమాల 5.

సర్వస్వామ్యములు : రచయితవి

భావనామ సంవత్సరం
భాద్రపద మాసం.
1994 వ సంవత్సరం
సెప్టెంబరు నెల.




మొదటి ముద్రణ : 1000 ప్రతులు

**మూల్యం : రు 100/-**

కవరు పేజీ :
చిత్రకారులు : శ్రీ V. S ప్రకాష్.




ముద్రణ :
రామా ప్రింటింగ్ ప్రెస్,
చెరుకుపల్లివారి వీధి,
విజయవాడ-520002.

ప్రతులకు :-

1. ఫణిదపు ప్రభాకరశర్మ., రచయిత.
ఇంటి నెం. M I G : 36, F. 3, హవుసింగ్ బోర్డుకాలనీ,
భవానీపురం : కామకోటీనగర్-520.012
విజయవాడ, కృష్ణాజిల్లా : ఆం. ప్ర,

2. శ్రీసాయి రాఘవేంద్ర బుక్ హవుస్.
బృందావన్ హోటలుకు ఎదురుగా
ఏలూరు రోడ్డు, విజయయవాడ-520.002.
కృష్ణా జిల్లా : ఆం. ప్ర.

3. శ్రీసాయి సేల్సు కార్పొరేషన్.
**Door No.** 29-6-24, రామచంద్రరావు రోడ్.,
సూర్యారావు పేట, విజయవాడ 520.002.
కృష్ణాజిల్లా : ఆం. ప్ర.

3. శ్రీ మంగళాపురపు బాబూరావు.,
ప్రొ॥ విశ్వకర్మ సాహిత్య ప్రచారమండలి,
తెల్లగాంధీ బొమ్మదగ్గర, సంతబజారు.
చీరాల : 523-155, ప్రకాశంజిల్లా : ఆం. ప్ర

5. విశ్వ బ్రాహ్మణ ధర్మపీఠం, 72–కళ్యాణ్‌నగర్
గడ్డి అన్నారం, దిల్‌సుక్‌నగర్, హైదరాబాదు–500-660. ఆం.ప్ర.

# విషయసూచిక

సూచన : 175వ పేజీలోని ఇరువది ఎడవ భాగమును ఇరువది తొమ్మిదవ భాగంగా చదువుకొనగలరు.



విశ్వగురుడు సాయి విశ్వేశరుడు సాయి
అత్రిసుతుడు సాయి హరియు సాయి
అందరొర్కటి గదా ఆలోచనము సేయ
భవ్యగుణ పవిత్ర భరతపుత్ర



# అంకితం

బ్రహ్మ, విష్ణు, మహేశ్వర స్వరూపుడు అత్రి అనసూయలకు అనుంగు పుత్రుడు, సర్వేశ్వరుడు, సాక్షాత్ దత్తాత్రేయస్వామికి భక్తి ప్రపత్తులతో అంకితం.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

శ్రీపోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామిస్తోత్రం

1· శ్లో॥ సాక్షాద్విష్ణు స్వయము పగతం యోగిముఖ్యావతారం
శైవజ్ఞాన స్థిరపటు తపస్సిద్ధ బీజాను రూపం
బ్రహ్మానందాభ్ధ్యుపరి విలసత్సింహపీఠాధి పత్యం
వీరబ్రహ్మం కథిత సకలం సద్గురుం తన్నమామి

అవతార పురుషులు

2. చం॥ ఒక యవతారమెత్తి యొక ఒప్పమి దిద్దు యుగమ్ము నొంట, నిం
కొక యవతారమెత్తి అఖి లోన్నతు(డంతము సేయు పాప మిం
కొక యుగమం–ద ధర్మ ేటులున్నపుడెల్ల యథేచ్ఛ దైవమో
డక అవతారముల్ నెఱపు టల్ పది కాదిక యెన్ని మాఱులో

అవ్విధముగ

3॥ తే॥గీ॥ పోతులూరి వారి జ్యోతి. వీరబ్రహ్మ
యోగి పుంగవుండు ఉర్విపైన(
గలుగ( బోవు పనుల కాలజ్ఞు(డై చెప్పి
గ్రంథ రచన( జేసి ఘనతకెక్కె

పైగా

మ॥ మతసామ్యమ్మును చాటి చెప్పుటకు బ్రాహ్మజ్ఞాని నాడేస్వశి
ష్య తతిం జేర్చెను సిద్ధయోగిని మతాన్యస్థుండె యైనన్ స్వయం
కృత శక్త్యుత్తము(జేసి హిందు ముసిలిం హృత్సీమలం బ్రేమపూ
రిత బీజంబుల నాటి ఐక్యతను నేర్పెన్మైత్రి శోభిల్లగన్

5. శా॥ ఆ యోగీశ్వరు శిష్యకోటి పరమాణ్వర్థంబు సిద్ధయ్య ఈ
అయుష్మాకుల యధార్థ జీవిత చరిత్రాంశమ్ము వర్ణింపగా
వేయిన్నొక్కటి గ్రంథ శోధనలగావించెంబ్రభాశాలియై
ఈ యుత్సాహి ప్రభాకరుండు అగుతబో ఇష్టార్థ సిద్ధుల్ సదా!

6, తే॥ గీ॥ బ్రహ్మగురుని భారతము విశ్వసుర గోత్ర
విచయ గాయత్రి యును, సిద్ధునిది ప్రసిద్ధ
భారతము, జందెము కథ ప్రభాక రాఖ్య
శర్మగారి రచనలు ప్రశస్తములు-సు
వీరి కిడువ బ్రహ్మంగారు వృద్ధి, యశము

మాగులూరి రామకోటేశ్వరరావు
రిటైర్డు ఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్సు-
వేటపాలెము 14-10-94

# సంస్మరణ

నన్ను ఈ గ్రంథరచనకు ప్రోత్సహించి ప్రేరేపించిన పంచాంగరత్న. కీ॥ శే॥ బ్రహ్మశ్రీ సోమవరపు చంద్రశేఖరాచార్య సిద్ధాన్తిగారిని ఈ సందర్భంగా సంస్మరించుచున్నాను.

# కృతజ్ఞతలు

ఈ గ్రంథమును సాంగోపాంగముగా చూచి.
అడిగిన వెంటనే వారి అమూల్యాభిప్రాయము
వ్రాసియిచ్చిన బ్రహ్మశ్రీ కపిల వ్రాయి
లింగమూర్తి, రిటైర్డు తెలుగు లెక్చరర్,
నాగర్ కర్నూలు–గారికి,

ఆశీస్సులందించిన బ్రహ్మశ్రీ మాగులూరి
రామకోటేశ్వరరావు, రిటైర్డు ఇన్స్పెక్టర్
ఆఫ్‌స్కూల్సు, వేటపాలెం గారికి.

ఓం నమః శివాయ

సిద్ధం నమః

సిద్దయ్య వంటి శిష్యుడుంటే బ్రహ్మంగారి వంటి గురువు ఉండకపోడు అని సామెత. సఖ్యానికి కృష్ణార్జునులవలె గురు శిష్య సంబంధానికి దాదాపు మూడు వందల యేండ్లనుండి తెలుగునాట బ్రహ్మంగారు సిద్దయ్యలు ఉదాహరణంగా నిలిచినారు.

వీరగురుడు వేమనగారి కంటె కొంచెం ముందువాడు. విశ్వబ్రాహ్మణ వంశీయుడు. మయబ్రహ్మ. రాఘవేంద్రస్వామి, లాహిరి మహాశయుల వంటి మహిమాన్వితుడైన గేస్తు.

వీర గురుని మతం : జీవునికి స్వతహాగా నామరూపాలేవీ లేకున్నా శరీరాన్ని ధరించినపుడుపాధి ననుసరించి అతనికి నామ, రూపాదులు, గుణ కర్మలు ఏర్పడుతున్నవి. కనుక ఈశ్వరుని స్థితి గూడ అంతే. ఒక్కడైన ఆ యీశ్వరుడే మాయలో ప్రతిఫలించి ఈశ్వరుడు, అవిద్యలో ప్రతిఫలించి జీవుడనబడుచున్నాడు. అవేవీ లేనపుడతనికి బ్రహ్మమని వ్యవహారం కనుక మానవులు ముక్తికోసం ఉపాధి రహితమైన ఆ యీశ్వరునే ఉపాసించవలె. అపుడతడు నిర్గుణుడు, నిరాకారుడు, నిరంజనుడు, సర్వవ్యాపి, సాక్షీ మాత్రుడు. అతని ఉపాసనకు వర్ణ, కుల భేదాలతో ఏ నిమిత్తం లేదు.

దృశ్యమానమైన ఈ చరాచర జగత్తంతయు గుణాత్మకమైన ప్రకృతి కార్యం. అదీసృష్టినంతా సాక్షిమాత్రుడైన పరబ్రహ్మ సాన్నిధ్యంలో చేస్తుంది. ఇపుడు మనం చేస్తున్న సంసారం గూడా అంతే. సంసారం పురుషుడు చేయడు. అతని స్త్రీ చేస్తుంది. ఆమె లేకుంటే పురుషునికి సంసారం ఉండదు. అందుచేతనే 'తరుణులు లేకుంటే పురుషుని పని గోవిందా'- అన్నారు. అయితే పురుషుడు లేకుంటే స్త్రీ గూడ సంసారం చేయలేదు కాబట్టి బ్రహ్మంగారి మతంలో స్త్రీ పురుషులు విడివిడిగా బ్రతుకవలసిన అవసరంగానీ బ్రహ్మచారులు గానే ఉండిపోవలసిన అవసరంగానీ, లేదా సన్యాసం తీసుకోవలసిన అవసరం గానీ లేదు. ఆయన మతంలో కర్మ సన్యాసమే గాని కాయిక

సన్యాసంతో నిమిత్తంలేదు. వారు సంసారం చేస్తూనే సాయుజ్యాన్ని పొంద వచ్చు. ఇది ఆయన మతం.

ఈ కారణాల చేత ఈ మతం సామాన్యజనుల నెక్కువగా ఆకర్షిం చింది. అందుచేత ఆయన శిష్యులలో బ్రాహ్మణులు, తురకలు, పంచములు, పాలేర్లు, అనే భేదం లేకుండా అందరూ చేరినారు. అది కులమతాతీతమైన సర్వజన సామాన్యమైన ఒక విశ్వమానవ మతమై నిలిచింది.

బ్రహ్మంగారి యొక్క ఈ మతంలో చేరిన వారిలో అగ్రగణ్యుడు సిద్ధయ్యగారు. గురుపాదం పట్టి మళ్ళీ అంతటివాడని ప్రసిద్ధి చెందినాడు. ఇతడు తొలి జన్మలో కాశ్మీర దేశవాసియైన ఆనందభైరవయోగి యనే రాకు మారుడట. ఒకపుడు వేటకు వచ్చి పులికొరకు మాటుగాచి బాణం విడువగా అది అనుకోకుండా ఒక గోవుకు తగిలి మరణించగా రాకుమారుడు పశ్చాత్తాప పడి ఆ సమీపంలోని ఒక యోగిని జేరి తనకు ప్రాయశ్చిత్తం చెప్పవలసిందని కోరెనట. అపుడతడు "నీవు పాపఫలం అనుభవించక తప్పదు. కనుక మరు జన్మలో పింజారి కులంలో పుట్టి నన్ను కలుసుకొంటావు"-పొమ్మని చెప్పెనట. ఆ ప్రకారం ఆతడు మరు జన్మలో దూదేకులింట పుట్టి, గాలి శారదా దేవి ఒకే జన్మలో షిరిడీ బాబా-పర్తిబాబా అనే ఒకే పురుషుని రెండవతారాలు చూచి నట్టు తాను మొదటి జన్మలోను ఈ జన్మలోను-అనగా రెండు జన్మలలోను ఒకే మహనీయుని ఆశ్రయించినాడు.

సిద్ధయ్యకు తల్లిదండ్రి ఏ ముహూర్తంలో ఆ పేరు పెట్టినారో గాని, మత్స్యేంద్ర గోరక్షనాథాదులు తమ సాధనలచే సిద్ధులు కాగా సిద్ధయ్య పుట్టుక చేతనేసిద్ధుడైనాడు. పెరిగిన తర్వాత అతని పేరును సార్థకం చేసికొన్నాడు. ఇది ఆ మహనీయుని చరిత్ర. 58 ప్రకరణాల బృహద్గ్రంథం.

"చిత్రం వట తరోర్మూలే వృద్ధాశిష్యాః గురుర్యువా" అన్నట్లుగా గురువు బ్రాహ్మణుడు. శిష్యుడు తురక కాబట్టి ఈ బ్రహ్మంగారు సిద్దయ్యల గురుశిష్య సంబంధం గూడ ఒక చిత్రమే. ఇటువంటి గురుశిష్య సంబంధ వృత్తాంతాలు నేను విన్న, కన్నవానిలో రెండు ప్రముఖంగా ఉన్నవి. 18 వ శతాబ్ది మొదటి పాదంలో మా పితామహపితామహుడు జోగయ్యగారని మేడి

పూరులో ఒక మహనీయుడున్నాడు. ఆయన మహిమలు బ్రహ్మంగారికి వలెనే చాలా చెబుతారు. ఆయనను రంగాచార్యులనే ఒక వైష్ణవుడు ఎంతో భక్తితో సేవించి, అతడు గూడ గురువు వంటి మహిమాన్వితుడయ్యెనట. ప్రజలాయనను అయ్యవారి రంగాచార్యులని పిలచేవారట.

మా మేనమామ మరియు విద్యాదాతయైన చేవూరి లక్ష్మయ్య గారని దేవరకొండ తాలూకాలోని గన్నెర్లపల్లి నివాసి. "సాహెబలి" అనే దూదేకుల అతడు మిక్కిలి భక్తి తాత్పర్యాలతో సేవించి అచ్చమైన అచల యోగియైనాడు. ఈయనను నా చిన్నతనమున నేను చూచినాను. కాబట్టి గురుశిష్యుల నడుమ జాతి భేదం, కులభేదం ఉండదనిపిస్తుంది. శిష్యుడు గొప్పవాడు కావటానికి గుర్వనుగ్రహ మొక్కటే ముఖ్య కారణంగా కనిపిస్తుంది."

విశ్వకర్మ బ్రాహ్మణులందరికి తమయింట భువనేశ్వరమన్నా, ప్రతిమలన్నా, యంత్రాలన్నా, అవన్నీ తాము సృజించినవేనని, వాని మహాత్యాలపై విశ్వాసం తక్కువ. అందుచేత వారు నిరాకార బ్రహ్మంపైపే ఎక్కువ మొగ్గుతారు.

బ్రహ్మంగారు గూడ మొదట లక్ష్యశుద్ధి కోసం అల్లాడుపల్లి వీరభద్రుని యిష్టదైవంగా పెట్టుకున్నా అనంతర కాలంలో నిర్గుణ పరబ్రహ్మకే ప్రాముఖ్యమిచ్చి, శ్రీకృష్ణుడర్జునుని నిమిత్తంగా పెట్టుకొని పురాణ కాలంలో లుప్తమైపోయిన ఇక్ష్వాకులనాటి ఉపనిషన్మతాన్ని భగవద్గీత పేర మళ్ళీ పునరుద్ధరించినట్లు వీరగురుడు సిద్దయ్యను మిషగా పెట్టుకుని సనాతనమైన అచలమతాన్ని మళ్ళీ లోకానికి చాటి చెప్పినాడు.

ఈ సిద్ధయోగి చరిత్రను కీ॥శే॥ బ్రహ్మశ్రీ కవి సింహ. పోకూరి కాశీపత్యవధానిగారు సిద్దయోగి చరిత్ర పేర ఈ కథను సలక్షణమైన కావ్యంగా తీర్చినారు. అదే ఈ కవిగారికి మంచి ప్రేరణ నిచ్చింది. దానిలోని పద్యాలే గాక కవితా చమత్కారాలు కూడ వీరు దీనిలో సిద్దయోగి వివాహ సందర్భంలో ఉపయోగించుకున్నారు.

శ్రీ ప్రభాకరశర్మగారు తమ యొక్క ఈ కృతికి 'సిద్దయోగి ప్రసిద్ధ

వ్యాసమహర్షి చతుర్వేద విభాగం, అష్టాదశపురాణ పరిష్కరణం చేసిన పిమ్మట కురుపాండవ యితిహాసాన్ని రచించి దాన్ని ఒక్కొక్క పురాణంలో తులనాత్మకంగా చూడగా ఆయితిహాసమే అన్నిటికంటె మిల్లుసూపిందట అందుచేత దానికి భారతమని పేరు పెట్టినాడని పారంపరికమైన ఒక ఉదంతం ఉంది. అలాగే ఇంతవరకు వచ్చిన సిద్ధయోగి చరిత్రలలో వస్తు గౌరవంలో యిది వానిని మించుతుంది కాబట్టి భారతమనే పేరు దీనికి సార్ధకమే. ఇది వట్టిభారతమే గాక సిద్దయోగి జీవితంలోని ప్రసిద్ధమైన సంఘటనలే దీనిలో సంగ్రహించ బడినవి గాబట్టి యిది మామూలు భారతం గాక ప్రసిద్ధ భారతం గూడ అయింది.

"యన్న భారతే తన్న భారత"—భారతంలో లేనిది భారతదేశంలో లేదు. భారత దేశంలో లేనిది భారతంలో లేదు. అనగా భారతదేశంలోని సమస్త మత సంస్కృతులు మన భారతేతిహాసంలో ఉన్నవని తాత్పర్యం. అందుచేతనే అదివైయాసికీ సర్వ సంహితయని, పంచమ వేదమని ప్రశస్తి చెందింది.

అలాగే బారత దేశంలో జనించిన మహాపురుషుల జీవితాలలో ఎవరిలో గూడ అభారతీయమైన సిద్ధాంతాలు తలెత్తలేదు. కనుక ఈ దేశంలోని మహాత్ముల జీవితాలన్నీ రామాయణ భారత భాగవతాలే అవుతవి. అటువంటి వానిలో యిదొకటి.

ఈ యితివృత్తంలో ఉపనిషత్తులలోని తత్త్వచింతన, తిరుక్కురళ్ లోని విజ్ఞాన మార్గం, యిస్లాం మతంలోని భగవద్విశ్వాసం త్రివేణీ సంగమమై అల్లుకుపోయినవి.

శర్మగారిందులో సిద్దయ్యపాత్ర చిత్రణలో ఎంతో మెళకువ వహించినారు. అతడు గాయపడిన కుక్క పిల్లలు మొదలైన వానిని దగ్గరదీసి ఉపచరించడం (9) సవతి తమ్ముని బాణంతో దెబ్బతిన్న హంసను రక్షించిన బుద్ధుని, గుర్తుకు తెస్తున్నది. కోళ్ళపందెం మాన్పించడం (10) కబేళాకు తరలించుకుని పోతున్న గోవును కాపాడిన శివాజీని, వీరగురుడు సమాధిచెందిన





పిమ్మట దానినుండి లేచి మళ్ళీ సిద్దునికి ప్రత్యక్షం కావడం (40) ఆంగ్లేయుడైన మనోక్కుప్రత్యక్షమైన రాఘవేంద్రస్వామిని తలపిస్తున్నవి.

వీరగురుడా విధంగా సిద్దయ్యకు ప్రత్యక్షమై తన కుమారులకు గూడ ఈయని పాదుకలు యోగదండం సిద్దయ్యకు ప్రసాదించినాడు. అవిపుడు ముడుమాలలో ప్రతియేట ఆశ్వయుజ శుద్ధ సప్తమినాడు మాత్రం సిద్దయ్యగారి మఠంలో ప్రదర్శింపబడుతుంటవి.

గురువులకెపుడైనా స్వపరలనే భేదబుద్ధి ఉండదు. తమ పేరు ఎవరు నిలుపగలరో వారికే వారు తమ విద్యను ధారబోస్తారు. దీనికి మహాభారతంలో మనకు ద్రోణాచార్యుడొక నిదర్శనం. అతనికి కుమారునిపై ఎంత ప్రేమ ఉన్నా బ్రహ్మాస్త్రం అర్జునునికి తక్క తన కుమారుని కుపదేశింపలేదు.

ఇక్కడ వీరగురుడు గూడ అంతే! సిద్దయ్య ఇస్లాం మతానికి చెందినవాడు. ఇస్లాం అంటె భగవంతునిపై విశ్వాసం; అతనియెడ విధేయతతో బ్రహ్మంగారిని సేవించినాడు. ఆ విధంగా సేవించినందుకు తన్నందినవారు తనయంతయని బ్రహ్మంగారు మరె అతనిని గూడ తనంతటి వానిని చేసినాడు. ఆ విషయం ఇందులో శర్మగారు ఎంతో ఉదాత్తంగాను. ఔచిత్యంగాను నిరూపించినారు.

సూర్యునికి ప్రకాశం, అగ్నికి దాహకశక్తి ఎట్లా వెన్నంటియే ఉంటాయో మహాత్ములకు మహిమలు గూడ అంతే సహజం. కానవివారు స్వార్థానికిగాక లోక క్షేమాని కుపయోగించినపుడే వాని సార్థకత. ఆధునిక విద్యావంతులీ మహిమలను నమ్మరు. కాని అవి తర్కానికి అందవు. ప్రత్యక్షంగా చూచి అనుభవించిన వారికే వాని నిజం బోధపడుతుంది.

ఇది నిజానికి ఒక చరిత్ర అయినా శర్మగారు దీనిలో జ్ఞానం (5) మనో నిగ్రహం (6) విష్ణుపురాణోక్తమైన ఆహార విజ్ఞానం (78) కుల గర్వం కూడదని తెలుపటానికి గురు చరిత్రలోని నృసింహ సరస్వతి పంచమునిలో వేదవాదులకు సమాధానం చెప్పించిన వృత్తాంతం (18) శిష్యుని కవసరమైన సాధన చతుష్టయ సంపత్తి (22) గురుసేవా విషయం తెలుపుట ధౌమ్యుని

శిష్యుల వృత్తాంతం (25) గురుమహిమ (30) షట్చక్రవివరం (30) పున్నామనరకాలు (45) పుణ్య తీర్థాలు (48) మొదలైనవి సందర్భ శుద్ధిగా యిందులో పొందుపరచి వస్తువుయొక్క గుణగౌరవాన్ని పెంచినారు. అంతేగాక—

అధ్యాత్మోపనిషత్తు, కఠోపనిషత్తు, మహోపనిషత్తు, ముండకోపనిషత్తు, మనుస్మృతి, తిరుక్కురళ్, విష్ణుపురాణం, బ్రహ్మావైవర్తం— భగవద్గీత, ఉత్తరగీత, గురుగీత మొదలైన ఆర్షవాఙ్మయం నుండి, ఖురానె షరీఫ్, తిర్మజి, మిష్కత్, బుఖారి అనే మహమ్మదీయ మత గ్రంధాలనుండి గూడ యెడనెడ అవసరమైన శ్లోకాలు, సూరాలు, ఉదహరించడం రచనకు నిండు దనాన్నిచ్చింది.

వీరిదివరకే "శ్రీ వీరబ్రహ్మగురు భారతం" అనే పేర వీరగురుని కధను గూడ ఒక బృహత్సంపుటంగా వెలువరించినారు. కనుక ఇదే విధంగా వీరిచేత "ఈశ్వరీదేవి భారతం" గూడ రావలసి ఉంది.

వైశ్య సాహిత్యంలో వాసవీకన్యపై ఎంత సాహిత్యం వచ్చిందో చెప్పలేం. ఈశ్వరమ్మగారు వీర గురునికి అధ్యాత్మిక వారసురాలు. బ్రహ్మచారిణి. స్త్రీలలో అధ్యాత్మిక విద్యావేత్తలరుదు. కనుక నారీలోకానికీమె చరిత్ర అవసరం. కనుక ఇదే ఫక్కీలో శ్రీ శర్మగారిని ఆమె చరిత్రను గూడా అందించవలెనని కోరుతూ సిద్దయోగి చరిత్రతో ఒక ప్రసిద్ధ పురుషుని జీవితాన్ని వచన ప్రబంధంగా సంతరించిన శ్రీ శర్మగారిని (విభావసు) మరీ మరీ అభినందిస్తున్నాను.

తే 1-12-1944

వాణీసదనం :
17-34 విద్యానగర్ కాలనీ,
నాగర్ కర్నూలు : 509-209.

ఇట్లు
సాహిత్యారాధకులు
కపిలవాయి లింగమూర్తి.

# మనవి-మాటలు

నేను 'శ్రీ వీరబ్రహ్మగురు భారతం'-అను శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి కాలజ్ఞాన సహిత సంపూర్ణ జీవిత చరిత్ర వ్రాయుటకు సద్గురుడు నాకిచ్చిన ప్రేరణ వగైరా విషయాలను నేను ఆ గ్రంధంలో వివరించినాను. అయితే అప్పట్లో నేను సిద్దయ్యగారి చరిత్ర వ్రాయాలనే తలంపుగానీ అందుకు తగ్గ ప్రయత్నంగానీ చేయలేదు.

అయితే ఈ 'సిద్దయోగి ప్రసిద్ధ భారతం' అను సిద్దయ్యగారి చరిత్ర వ్రాయడానికి నన్ను ప్రోత్సహించిన ప్రప్రధమ అభిమాని కీ॥ శే॥ పంచాంగ రత్న. బ్రహ్మశ్రీ సోమవరపు చంద్రశేఖరాచార్య సిద్ధాన్తిగారు. వారు వారి పంచాంగ ప్రచార కార్య క్రమంలో, శ్రీ వీరబ్రహ్మ గురుభారత గ్రంధాలను కూడా చాల చోట్లకు తీసికొని వెళ్ళినారు. అలా వెళ్ళడంలో వారు ముడుమాల సిద్దయ్యగారి మఠం గూడ సందర్శించినారు. అక్కడ మఠ సంబంధీకులు కొంతమంది "ఎవరుబట్టినా బ్రహ్మంగారి చరిత్రనే వ్రాయుచున్నారు, సిద్దయ్యగారి చరిత్ర అంటూ ఎవరూ ప్రత్యేకంగా వ్రాయడంలేదు"—అనే ఒక అసంతృప్తిని వ్యక్తం చేయడమేగాకుండా "అలా ఎవరైనా వ్రాస్తే మాచేతనైనంత సాయం మేము గూడా చేస్తామని" చెప్పారుట.

అప్పుడు నేనన్నాను బ్రహ్మంగారి చరిత్ర అంటే, ఎంతోమంది వ్రాసిన గ్రంధాలున్నాయి. అదీగాక స్వామి చరిత్రమీద పరిశోధనలు గూడా జరిగాయి, జరుగుతున్నాయి-వాటన్నిటి ఆధారంతో గురుభారతం వ్రాయడం సాధ్యమైంది. మరి అలాంటి గ్రంధాలుగానీ, వ్యాసాలుగాని సిద్దయ్యగారి గురించి లేవాయెనే, మరి ఆయన చరిత్రకు ఏదో కొంత ఆధారం కావాలి గదా"—అని నేనన్నాను. శ్రీ చంద్రశేఖరాచార్య సిద్ధాన్తిగారు, వారి సంచార కార్యక్రమంలో కడప ప్రాంతం గూడ వెళ్ళినపుడు, వారికి లభించిన శ్రీమద్‌గద్వాల ఆస్థాన కవిఱేడు, కవిసింహ ఆంధ్రకవి శేఖర కీ.శే. పోకూరి కాశీపత్యవధానులుగారు రచించిన సిద్ధయోగి చరిత్ర పద్యకావ్యం సంపాదినచి నాకిచ్చి. దాని ఆధారంతో సిద్దయోగి చరిత్రి వచన కావ్యం వ్రాియమని వారు కోరినారు. అది చదివిన తరువాత కధకు నాకు కొంత ఆధారం దొరికినది, దాని ఆధారంతో నేను నా పద్ధతిలో రచన సాగించి

నాను. అవధానిగారి గ్రంథం యథాతథంగా నేను వచనానుసరణం చేయ లేదుగానీ ఆధారం మాత్రం అవధానిగారి గ్రంథమే ఇంకా యితర విషయాలు ఎన్నో తీసికొని సందర్భాను సారాన్నిబట్టి చరిత్రలోచొప్పించడం జరిగింది. ఉదా॥ బ్రహ్మంగారి వద్ద అన్ని సంవత్సరాలుండి అఖరకు వట్టి చేతులతో తిరిగివచ్చిన కుమారుని చూచి 'మఠాధిపత్యం నీ కెందుకివ్వలేదు'—అని తండ్రి అడిగితే, అది కుమారుల హక్కేగాని. శిష్యునికాయధికారం లేదని సిద్ధయ్య తండ్రి కెరింగించడం లాంటి విషయాలను యిందులో పొందు పరచడం జరిగింది. ఇటువంటివి యింకా కొన్ని విషయాలు కూడా యిందులో చోటు చేసుకున్నవి.

పాఠకులకు విసుగు కలిగించకుండా ఉండడం కోసం కథను నవలా పద్ధతిలో వ్రాసి అచ్చటచ్చటా కొన్ని వర్ణనలు చేయడం జరిగింది. దీనిని పాఠకులు హర్షిస్తారనే ఆశిస్తున్నాను. ఇది కేవలం సిద్దయ్యగారి చరిత్ర కనుక, సిద్ధయ్యయొక్క పాత్రకే ఎక్కువ ప్రాముఖ్యం యివ్వడం జరిగింది.

ఈ 'సిద్ధయోగి ప్రసిద్ధ భారత' రచనకు నాకు ప్రేరణ యిచ్చి, ప్రోత్సహించిన శ్రీచంద్రశేఖరాచార్య సిద్ధాన్తిగారు, ప్రస్తుతంలేరు. వారుంటే ఈ గ్రంథాన్నిచూచి ఎంత సంతసించి యుందురో చెప్పజాలను. వారి దివ్యాత్మకు నా కృతజ్ఞతాపూర్వక అంజలిఘటించడం కంటే వేరుచేయ గలి గిన దేమీలేదు.

ఈ గ్రంథ ముద్రణకు ఆర్థిక సాయమందించి ప్రోత్సహించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారికి నా కృతజ్ఞతాభివందనములు అర్పించు చున్నాను. అడిగిన వెంటనే అమూల్యాభిప్రాయము వ్రాసిచ్చిన బ్రహ్మశ్రీ కపిలవాయి లింగమూర్తిగార్కి, ఆశీసులందించిన బ్రహ్మశ్రీ మాగులూరి రామకోటేశ్వరరావుగార్కి నా నమస్సులు.

గ్రంథమును అందముగా అచ్చువేసి సకాలమున కందించిన శ్రీ ఘంటసాల శివలింగం (రామాప్రింటింగ్ ప్రెస్) గారికి, వారి సిబ్బందికి కృతజ్ఞతలు తెలియ చేయున్నాను.

ఈ గ్రంథమును వీరబ్రహ్మగురు భక్తులందరూ. అభిమానులూ, సిద్ధయోగి భక్తులు, సాహిత్యాభిమానులు సహృదయంతో స్వీకరించుదురని ఆశిస్తున్నాను....

విజయవాడ — విభావసు. ఫణిదపు ప్రభాకరశర్మ.
4-11-94 —

# 'యజ్ఞోపవీతం కథ' గురించి పెద్దల పలుకులు, ప్రశంసలు

"యజ్ఞోపవీతం కథ మీరు చెప్పిన తీరు అనుపమం. దాని కొఱకు మీరు చేసిన పరిశ్రమ అనన్య సాధ్యం. శాస్త్ర పురాణాలను గాలించి గహనమైన విషయాన్ని ఇంత సరళ సుందరంగా అందించట మంటె మాటలు గాదు. 'విద్వానేవనజానాతి విద్వజ్జన పరిశ్రమం!

ఇందులో మీరు విభజించిన ఒక్కొక్క ప్రకరణం ఒక ఖండ విజ్ఞాన సర్వస్వం. యజ్ఞోపధారణావశ్యకతను గురించి మీరు చెప్పిన సమన్వయం నేటి కాలానికి ఎంతో ఉపయోగకరంగా ఉంది.

షణ్ణవతిని గురించిన మీ సమర్థన శాస్త్రపరిశీలన ముఖ్యంగా నామటుకు నాకు అనేక విషయాలను తెలిపింది.

ఇందులో మీరు చెప్పిన 27 తత్వాలు వాని నుండి పుట్టిన వారి వివరణ గూడ మిక్కిలి ఉపయోగకరంగా ఉన్నది. గ్రంథంచివర యజ్ఞోపవీత ధారణా క్రమమేగాక గాయత్రి అష్టోత్తరం గూడ ఈయడం పుస్తకానికి పరిపూర్ణత చేకూర్చింది.

మీరు చెప్పినంత వరకు నేను యజ్ఞోపవీతానికి ఇంత కథ ఉంది అనుకోలేదు. ఇంతవరకూ మీరు వెలువరించిన పుస్తకాలు ఒక ఎత్తు. ఈ ఒక్కటే ఒక ఎత్తు. కలం పట్టినందులకు జాతికి సాహిత్య సేవ నర్పించి ధన్యులవుతున్నారు. ఇది నాకు మిక్కిలి ఆనందాన్ని కలిగించింది.

ఈ కథ తరువాత మళ్ళీ మీరు ఏ కథ చెబుతారోనని ఎదురు చూస్తున్నాను.

(సం) కపిలవాయి లింగమూర్తి,
లెక్చరర్ ఇన్ తెలుగు.
నాగర కర్నూలు : 1-8-86.

యజ్ఞోపవీతం కథ గురించి

శ్రీశర్మగారు ప్రాచీన అధునాతన గ్రంథముల నెన్నిటినో విమర్శనా దృష్టితో పరిశోధించి గ్రంథమును వ్రాయుచు అనేక విషయములను వివరించి సాహసముతో తనభిప్రాయములను ప్రకటించిరి.

ప్రాచీన కాలము నాటి ధర్మముల అధునాతన కాలమునకు తగినట్లు, సవరించి చెప్పుట వీరిలోని ప్రత్యేకత, యజ్ఞోపవీతమును గురించి ఇంత సప్రమాణముగా నిరూపించి చెప్పిన గ్రంథము ఇంకొకటి లేదనుట అతిశయోక్తి కానేరదు. ఇంతటి గ్రంథమును రచించిన నప్పటికిని తాను సంకలిత మనియే చెప్పుకొనెను. ఇది వీరి వినయ సౌశీల్యమును సూచించును.

కాశీభట్ల సుబ్బరామశర్మ.
సప్తగిరి : డిశంబరు 1988. లో ప్రచురితము.

* * *

'యజ్ఞోపవీతం కథ' సావధానంగా చదివాను.

బరువైన కథల్నీ, గాథల్నీ పలుచని నేత జరీ చీరెల్లా ఆకర్షకంగా పరిచి చూపగలగటం ఒక గొప్ప కళే. విశ్వకర్మ భగవానుడు మీకా విద్య ప్రసాదించాడు.

ప్రామాణిక గ్రంథాలుగా మీరు స్వీకరించిన గ్రంథాలను కొందరే చదువుతారు. కాని అవి ఆధారంగా మీరు ప్రపంచించిన కథనాత్మక విశేషాలు సర్వులూ చదువుతారు.

చదివించడం కోసమే కష్టపడీ విషయాన్ని సులభతరంచేసి సుందరంగా అందించారు. నేను వివరాల్లోకి వెళ్ళి ప్రస్తుతం పరామర్శించడం అనావశ్యక మేమొ!

(సం) సాహిత్య [illegible]
హైదరాబాదు,

మీ రచన ఎక్కడా కుంటుబడక సముద్రము నున్న నౌకవలె చల్లగా, హాయిగా సాగినది. మీ రచనకా యిద్దరు పిల్లలు, ఒక స్త్రీ, ముగ్గురు పురుషుల గూర్చి చక్కగా పిల్లలకు, స్త్రీకి ప్రాతినిధ్యము కల్పించి సామాజిక స్పృహయేగాక, సామాజికోపన్యాసము గావించినారు. ఆ ఆరుగురు షట్చక్రాలు. తాతయ్య సహస్రార మనుకొన్నాను.

శ్లోకములకు తాత్పర్యములు కూరలలో ఉప్పువలె రుచికరము. కార్మికులకు, సాలీలకు, వంగి వడ్డించువారికి, ఆపరేషను కాలమున అందరికి వచ్చు జందెపు బాధకు చక్కని తీర్పునిచ్చినారు. ఇది మీ సునిసిత ప్రజ్ఞ.

స్త్రీలకు జందెముల గూర్చి ఒక అధ్యాయము, శూద్రులకు జందెమును గూర్చి ఒక అధ్యాయము చదివినపుడు మీ బహుముఖప్రజ్ఞ చక్కగా పొడగట్టినది.

మీ రచన సరళము. సరసము. సర్వజన రంజకము. విషయ నిరూపణ మెట్టు మెట్టుకు చక్కని రసవాహకము. సభ్యుల ప్రశ్నలు చతురతా గర్భములు. ప్రత్యుత్తరములు విషయపూర్ణములు. త్రిగుణ వివరణ, ఉదాహరణములు అత్యద్భుతములు. మీ హృదయము ఆర్షవిజ్ఞాన పూర్ణకలశము. మీ పరిశోధనా తపస్సునకు నా ప్రత్యేక నమస్సులు.

(సం) రావగుండ్ల వెంచలరావు
డిప్యూటి తహశీలుదారు.
కావాలి : నెల్లూరు జిల్లా 25-10-86.

o .... o

# "భవ్య గుణ పవిత్ర భరతపుత్ర"

# గురించి

# అభిజ్ఞుల అభిప్రాయాలు ఆశీస్సులు

మీ గ్రంధము తల నుండి తోక వఱకదే చదివించినది. మొదటి భాగమున కంటె రెండవ భాగమున భాష చిక్కబడినది. మీ భావములు చక్కగా నున్నవి.

మీరు దేశభక్తులనునది మీ ప్రభాకరశతకమే చెప్పినది. దానితో పాటు మీకు సామాజిక స్పృహ చక్కగా నున్నది.

"కోడలన్న ఇంటి కూ లిది కాదయా " (216)
"అసలు గొడవ అత్త అధికార దాహమే" (210)
"ఊళ్ళు పెరుగుచున్న ఉత్పత్తి మాటేటి?" (225)
"సంతు" ఎంత తక్కువయితె అంత మంచిదిగదా! (148)

అన్న మీ మాటలు మఱువరానివి.

"మనిషి కాదు వాడు మకురుదున్న" (279)
".... .... ఏమిదున్నాలయా!" (297)
".... .... తిరిగి తంతారయా!" (277)
"స్వార్థబుద్ధి పట్టి చావి కొట్టర చెంప" (270)
"కాలము గడిపేటి కాకరా యుళ్ళంద్రి" (271)
".... మొట్టరా నెత్తిన" (276)

వంటి మాటలు మీ ఎడద లోతుల నుండి ఉబికిన తేట నీటి ఊటలు. హాస్యపు బాటలు.

"కలిమి నమ్మి మైత్రికాల దన్నకు మయ్య!" 261
"నడుము మీది పుండు నడమంత్రపు సిరిరా" — 262

వంటి సామెతలు మీపద్యాలలో చక్కగా వొదిగి కూర్చున్నవి.

కాకిలో సంఘజీవిని చూడ గలిగినారు. రాముడైన రావణ బ్రహ్మైన, వాలియైన కర్మకు లోబడినవారే. కలిమిలేములు కాలమునకు కవల పిల్లలను కొన్నాము. కాని మీరు పాపపుణ్యములు కూడ కవల పిల్లలనినారు. ఇవి విన్న తరువాత మీరెంతటి కర్మయోగులో!—అంత ద్రష్టలు. ఋషిత్వ మందుకొనుచున్నారు.

మీరు ఆట వెలదిని అలసిపోవు వఱకాడింప గలిగి యుండియు ఛందో నియమముల నామకార్థమని నారు. నే విన్న ఒక యోగి పద్యరచనలో పండి తులు గణము తప్పని, విషగణమని గొణిగినారు. అందుకాయోగి

"గురు గణం బొక్కటి కుందనపు ఛాయయై
వాక్కున అమృత ధారలొలుకు చుండ,
విషగణం బేమినా వెంట్రుకల్ పీకునా?
అమిత సత్కార్తి కావల అడవి మూర్తి" -

అనిన ధీమా మీలో సమగ్రముగా నున్నది.

అతివకైదవ తనము తీసి వేయుటకు ఎవరికి హక్కు అనినపుడు, విధవా వివాహము మనస్ఫూర్తిగా ఆహ్వానించినపుడు బాధగల రుషుల గాథలు చెప్పెడి మీరు సంఘ సంస్కర్తలే.

కవిలోక మెల్ల దుయ్యబట్టెడి కుకవిని మీరు ఆదరించుట మీ ఉదారత. ఆటంను ఆత్మ అన్నపుడు మీ శాస్త్రజ్ఞానము నాకు సురాళ మంటినది.

"చెప్పినాను గాని గొప్పకోసముకాదు" — (288)
"వసుధ చెప్పతగ్గవాని గాదు - (284) అని మనసారా చెప్పు మీరు నిజ ముగా కీర్తిరమణి మాయకు దూరస్థులే.

సాయి భక్తులగు మీరు సారవంతమైన రచనలచే సౌందర్యకళికల నాంధ్ర దేశమున వెదజల్లుదురని, వెదజల్లగలరని నా ఆకాంక్ష.

సెలవు

రా॥. చెంచలరావు :

20-10-90

కవితా స్వంతులు! "విభావసు" ప్రభాకరశర్మగారికీ,

మీ "భవ్యగుణ పవిత్ర భరతపుత్ర" అందింది. శీర్షికలు ఎంతో వైవిధ్యం కలవి. లోకజ్ఞుడై భాషాచ్ఛందములు వశీకరించుకొన్న సత్కవికి మాత్రమే సాధ్యమయ్యే కవితలు.

'మనసులోని పుండు మాన్పంగ సాధ్యమా!'
'హాస్య మెపుడు మంచి ఆరోగ్యమే కదా!'
'అణువులేక అసలు ఆత్మయే లేదురా!'
'సంతు తక్కువైన సౌఖ్యమ్ము మెండురా!'
'బిరుదులన్న బరువు భారముల్ పొందుటే!'
'కలిమి నమ్మి మైత్రి కాలదన్నకు మయ్య!'

ఇట్టి సూక్తులు మిమ్మల్ని వేమన్న కుర్మి తమ్ముణ్ణి చేశాయి. ఆట వెలదిని ఒక ఆట ఆడించి వదిలారు.

సం॥ (సాహిత్య బ్రహ్మ) : డా॰ వి. వి. యల్. నరసింహారావు
హైదరాబాదు 19-10-90.

* * *

శ్రీ ప్రభాకరశర్మగారు ప్రస్తుతం 'భవ్యగుణ పవిత్ర భరతపుత్ర' అను శతకమును రెండు భాగాలు కలిపి వేశారు. ఇందులో త్రిశతులున్నాయి. త్రికాల జ్ఞానమునకు వివరణలా, త్రినేత్రంతో చూసి వివరించి చెప్పినట్లుగా ఉన్నాయి

శ్రీశర్మగారి కవిత్వంలో ప్రాచీనత ఉంది. అధునికత ఉంది. నవ్యత ఉంది. నాణ్యత ఉంది. ఈ నాణ్యతకు తగ్గ కవన అల్లికా నైపుణ్యం ఉంది ఈ నైపుణ్యం పాఠకులను ఆకర్షిస్తుంది. పఠితల మనస్సులను రంజింప చేస్తుంది.

(సం). టి. రంగస్వామి, M.A.,
సమాలోచన మాసపత్రికలో
ప్రచురితం : ౧. 16-1-1991.

"భవ్యగుణ పవిత్ర భరత పుత్ర" అను గ్రంథము నాకు చేరినది. మీ యభిమాన శిరీషములకు, నా ప్రశంసా పూర్వక కృతజ్ఞతలు.

కం॥ ధీర ప్రభాకరశర్మా !
సారస్వత వీధి చివర । సౌధంబున నీ
వీర గురు భారతంబును
పేరిమి మణిదీపమనగ । పెట్టితి వాహా !

ఇంత కంటె మీకు యెక్కువ చెప్పవలసిన అవసరములేదు. మీయజ్ఞో పవీతకథయందే మీ సమర్థత చక్కగా సాగినది.

సం॥ దేవరాయపల్లె పెంచల నరసింహాచార్యులు.
చెర్లోయెడవల్లి 17-11-1990.

* * *

"మీరు పంపిన "భవ్యగుణపవిత్ర భరతపుత" అందినది. చాల భవ్యంగా ఉంది. చాల ఆనందంగా ఉంది. పద్యాలధార సహజంగా, సరళంగా ఉంది. మంచి పదాలు వాడారు.

సం॥ కన్నెకంటి ప్రభాకరశాస్త్రి.
M,R.O. దొనకొండ : 14-11-90.

* * *

మీరు ప్రేమాభిమానములతో పంపిన 'భవ్య గుణపవిత్ర భరతపుత్ర' 1.2 భాగములు అందినది. మీరు గద్య రచనలోనే గాక పద్యరచనలో కూడ పరిశ్రమచేసి పేరందుటకు ఎంతో ఆనందించినాను. ఇతఃపూర్వము నాటికా నాటికములను వ్రాసి గణుతి గన్నారు. ఈ కార్యములన్నియు అస్మ దాదులకు **ఆనందదాయకములు.** విశ్వబ్రాహ్మణ గోత్రగాయత్రిని వ్రాసి వైదిక గ్రంథ రచయిత అయినారు. మీ రచనా వ్యాసాంగ మిట్లే నిరవ ధికమై కొనసాగుచూ విశ్వమానవ శ్రేయస్సంపాదకము కావలెనని ఆశించు చున్నాను.

ప్రత్నానంద డా॥ కొండూరు వీరరాఘవాచార్యుల
తెనాలి 19-10-94

* * *

తాము ఆదరాభిమానములతో పంపిన 'భవ్య గుణపవిత్ర భరతపుత్ర' శతకములు 1,౨ అందినవి. అందగానే ఆద్యంతముచదివి ఆనందించితిని. మాన్యులు శ్రీ లింగమూర్తిగారి భూమిక క్లుప్తముగా సమీక్షా సంపన్నముగా నున్నది. భవ్య గుణచరిత్రులైన మీ కవితాహృదయమునకు అద్దము పట్టి నట్లున్నది: చిట్టి చిట్టి ఆటవెలదులలో పుట్టెడు పుట్టెడు భావ సంపదలు. సామాజికముగా సర్వులకు మార్గ దర్శకమగు మంచి కవితా ధోరణి మీకు అలవడుట మిగుల అభినందనీయము.

(సం) కొండేపూడి సుబ్బారావు.,
ద్వారకానగర్ : విశాఖపట్నం 6-10-90.

* * *

'భవ్య గుణపవిత్ర భరతపుత్ర' అను పద్యకావ్యము పంపినారు. అందినది. సంతోషము. చదివినాను. చాల నీతిదాయకంగా ఉన్నది.

(సం) పామర్తి నాగభూషణశర్మ,
యలవర్తి ఆంజనేయశాస్త్రి సంస్కృత పాఠశాల
తెనాలి 31-10-90

శ్రీవిరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి సుప్రసిద్ధ శిష్యుడు

# సిద్ధయోగి ప్రసిద్ధ భారతం

శ్రీ రమణీ మణీ విహార సముజ్వలశోభిత, సత్కళభాసిత, సంభాషిత, సంపూజిత, సత్కవి సంస్తుత, సమరాంగణ తేజోవిరాజిత, సదాగతి బోధిత, సనాతన సదాతన, ప్రపూజిత, నిత్య సత్కర్మానుష్ఠాన, వేదవేదాంగశాస్త్ర పురాణేతిహాస కావ్య ప్రసాదిత, ప్రమోదిత, ప్రచండ భాస్కరద్యుతి ప్రకాశిత, ప్రభాసిత, ప్రమోదిత, విశ్వవిజ్ఞాన గంగాజల సంప్రోక్షిత, యోగిజనమండిత, ఋషిజనవందిత, మధుర మధుర రసవత్కావ్య నిర్మాణ కవిపండితజన శైశిష్ట్యశ్లోక స్తోత్ర వినోదిత, మహోన్నత కీర్తి ప్రభాసిత, భాషిత, భూషిత, సజ్జనసేవిత, సంపూజిత, సకలజన ప్రార్థిత సర్వభారతాహారధాన్య ప్రసాదిత, ఆంధ్రజన హృత్కమల సదానివాసిత, తెలుగు జాతి జనజన్మప్రసాదిత, నేత, లోకమాత, భారతీదేవి మృదులాంక భద్రపీఠ్యవస్థిత, చిరుదరహాసలాస విలాస శోభిత, సుభాషిత, సుందరరూప విలాసిత, చంద్రకాంతి వదనారవింద ప్రభాసిత, వజ్రవైఢూర్య, మరకత, మణిఖచిత సువర్ణరత్న కిరీట కాంతి ప్రకాశిత, అరుకోట్ల అఖిలాంధ్రజనములకుమాత! ఆంధ్రమాత.

పసిడిపంటల కొండలవలె పండించి యావత్ప్రపంచమునకు ఆహారము నందించగల్గ కల్పవల్లి, ధాన్యాగారమైనది తెలుగుతల్లి సకలజనాళికి సంపూర్ణ శాంతి, దాంతి, కాంతి ప్రసాదించు పవిత్రభూమి. ఆంధ్రభూమి. పలువిధ సంస్కృతులను, సాంప్రదాయములను పరిహసింపక, పరిష్వంగమున చేర్చుకొని వెలుంగు నదియె తెలుంగుభూమి. పలువిధ జాతులను లాలించి, ప్రేమించి, పోషించి అక్కున చేర్చుకొని ఆదరించి, అభిమానించు అమృతమూర్తి తెలుగుతల్లి. తెలుగు, తమిళము కర్ణాటకము, హిందు, ముస్లిము, మళయాళాది సాంప్రదాయముల సమన్వయము చేసికొని, సర్వులను సొంత బిడ్డలవలె పొదివిపట్టుకొని, తన ప్రేమామృత సుధా చంద్రి

కల నందరకు గోరుముద్దల తినిపించి, జోకొట్టి జోలపాటలు పాడి ఉయ్యాలలూపిన విశుద్ధ సత్త్వగుణప్రదాయిని, ప్రకాశిని, ప్రభాసిని, ప్రమోదిని ఆంధ్రజనని. ఆమె హృదయమొక అమృతవాహిని. అఖండతేజస్విని. భవాని. రుద్రాణి ఆంధ్రావని.

అట్టి ఈ విశాలాంధ్రధరత్న గర్భసీమయందెన్ని గ్రామములు, సిరిసంపదల కాలవాలమై, చరిత్ర ప్రసిద్ధమై వెలయుచున్నవో! పలువిధ పరిశ్రమలతో, నిత్యరణ గొణధ్వనులతో ఎన్నిపట్టణములు కోటికి పడగలెత్తి నిల్చుండినవో! ఆకాశము నంటు భర్మ్యహర్మ్యములతో, విపరీత జనసందోహములతో, పాశ్చాత్య నాగరికతా లంకారిణులైన ఎన్నినగరములు, ఎన్నిమండలములు అమ్మ గర్భమునుండి ఆవిర్భ వించి అందాలనీనుచున్నవో! ఆనందాల ననుభవించుచున్నవో! ప్రపంచ చరిత్ర యందు ఆంధ్రభూమి ఎంతటి ఘనకీర్తి నార్జించియుండెనో! మారుతున్న చరిత్ర గతికి తట్టుకు నిలబడి, నూతన నాగరికతల సహితము తనలో జీర్ణింప చేసికొనుచు నిల్చియున్నదో! ఆంధ్ర సంస్కృతి ఎంతటి మహత్తరమైనదో! ఎంతటి మహోన్నత మైనవో! ఎంతటి ప్రేమపూర్ణమైనదో! ఆధ్యాత్మిక సంపదకు ఆంధ్రభూమి ఎంతటి ఆదర్శవంతమైనది కదా!

ఇంతటి సువిశాల, సుందర, సుమనోహర, సౌహార్ద్ర సౌశీల్య సౌమనస్య వాతా వరణ పూరితము, సౌగంధికాది పలువిధ పుష్పజాతుల కాలవాలము. వట, జంబూ ఫలాది వృక్షసంతతుల కాధారభూతము, అయిన ఆంధ్రమాత అంకసీమన వెలు గొందు కాంచన మండలమా యనునట్లు కనక కాంతుల శోభిల్లు కడప మండలము కడుంగడు. రమణీయము. కడప మండల ప్రాశస్త్యము పేనోళ్ళకొనియాడదగినది. నగరకీర్తిని ఎంతని వర్ణింపగలము. ఈ మండల ప్రఖ్యాతి నెంతని వివరింప గలము. ఎంతటి ప్రశస్తి! ఎంతటి ధీశక్తి!

కడపమండల నైసర్గిక స్వరూపము కఠిన పాషాణమయమైనట్లు, పర్వత సానువుల పరివృతమైనట్లు కన్పించినా, అచ్చటి ప్రజల హృదయములు తెల్లని చామంతి పుష్పములు. సుందర సుకుమార నందనోద్యానవనములు. మధుర జానపద గీతికా స్రవంతులు. అచ్చటి జానపద స్త్రీలలామల కన్నులు సువికసిత తెల్లని

నందివర్ధనములు. హృదయములు మెత్తని వెన్న కలిపిన వెన్నెల ముద్దలు. కాని ఆగ్రహము వహించిరా! —వారి హృదయములు సూర్యాగ్నిగోళములు. నయనములు రక్త వర్ణశోభితములై కెందారమల బోలి విస్ఫులింగముల వెదలగ్రక్కుచుండును. ధీరవనితల కామండలము దీటైన ప్రదేశము.

ధన కనక వస్తు వాహన సమృద్ధము కడప మండలము.

అట్టి ప్రఖ్యాతి వహించి, ప్రకాశించు ప్రపూజిత మండలాంతర్గత, యిడుముల రహిత, కలుముల సహిత, పలువిధజాతుల కులాల సుమాల మాల 'ముడుమాల సకల కళా సమన్వితము. సర్వసంపదల కొలవాలము. సుమనోహరము. సుందరము. సుశిక్షితుడైన శిల్పాచార్యుని నిర్మాణకౌశలమునకు ప్రత్యక్ష దర్పణము. యీ ముడుమాల గ్రామము. గ్రామము చూడ కన్నుల పండువ చేకూర్చును కమనీయమైన ప్రణాళిక గణనీయమైన నిర్మాణకుశలత.

సూర్యోదయాత్పూర్వమే నిద్రమేల్కాంచి సామగానాది వేద పాఠముల గానము సేయుచూ యావద్గ్రామ వాతావరణమును వేదనాదములతో ప్రభావితము సేయుచు, ప్రభాసితము సేయుచు, ప్రతిధ్వనింప సేయుచు, పునీతము సేయు సత్కుల బ్రాహ్మణుల ఆ గ్రామ ఆధ్యాత్మిక వికాసమునకు అధిపతులై, పెద్దలై పెన్నిధులై పేరు గడించినారు.

తెల్ల తెల్లని వెన్నముద్దలవలె వెలిగిపోవుచూ, శాంతికి ప్రతిరూపములైన కపోత సంతానముల కొలవాలమై, తెల్లని హిమన్నగపు శోభల వెదజల్లు సువిశాల మసీదు ప్రాసాదములలో నుండి వెలువడు దివ్యఖురాను 'ప్రార్థనలు, "అల్లాహో" అక్బర్! వినాదములతో ప్రాతఃకాల శీతల వాయుతరంగములతో కలసి భక్తిబీజముల నెద జల్లుచూ, ఆయా సమయముల నంతయు పవిత్రవంతము సేయు ముస్లిము పండితులకు, ముల్లాలకు, ఖాజీలకు, ముడుమాల ఆనంద వేదిక, అనురాగాల మాలిక.

న్యాయాన్యాయములను సూక్ష్మాతి సూక్ష్మముగ పరిశీలించి తీర్పుచెప్పుటలో న్యాయాధికారులు స్వపరభేదములను విదనాడి ఆ గ్రామమున పేరు ప్రఖ్యాతుల బడసిరి. కీర్తి ప్రతిష్ఠల నార్జించిరి. ఇంక వ్యాపారులా! ఇతర రాష్ట్రీయులతో కడుంగడు నైపుణ్యమును ప్రదర్శించుచు తెలివితేటలతో వ్యాపా

రముల నడిపించుచు, పుష్కలముగ ధనార్జనసేయుచు, దాన ధర్మముల మఱువక, సజ్జన సాంగత్యముసేయుచు, సాధుసన్యాసుల నాదరించుచు, సత్సంఘంబుల నిర్వ హించుచు, వేసవికాలములందు స్వచ్ఛందముగ చలివేంద్రముల నిర్వహించుచు పేద జనుల పోషించుచు, యాచక బృందముల నాదరించుచు, కళలను, కళాకారు లను ప్రోత్సహించుచు గ్రామమునకు జీవగఱ్ఱలై వరలు చుండిరి.

కర్షకులు కేవలము కర్షక వృత్తితోనే గడుపుటగాక అర్షవిజ్ఞానము నాకళింప చేసికొని అందు విజ్ఞానమును సంపాదించుచుండిరి. అత్యంత శేముషీ విభవ సంపన్నులు అనాటి కర్షకులు. అజ్ఞానదూరులు. అవిశ్రాంత శ్రామికులు. ప్రమోద భరితవాక్చరితులు. నిత్యనారాయణ నామ పీయూష పానమత్తులు. ప్రసంగపాటనాస రక్తులు. ప్రయోక్తలు. వక్తలు. సత్ప్రవర్తకులు. సత్యసంధులు. నిత్యకృషీవలులు. అమాయకులు, రసహృదయులు, రంజిత మనస్కులు, నిష్కపటులు, పంటకాలము లందు పంటల నూర్పుళ్ళ తరుణమున గ్రామశిల్పాచార్యులకు, బ్రాహ్మణులకు సంప్రీతిగ, సంతృప్తిగ, సంతుష్టిగ, సమ్మదమున ధాన్యరాసుల కొల్చిపంపు ధర్మ పరులు. ధార్మికులు, శాంతిప్రియులు, శాంతి సంభాషణాచతురులు. సత్యవాక్పరి పాలకులు.

ఆశ్రయించిన వారల కన్యాయము చేయని మహోన్నత సాంప్రదాయ బద్ధ జీవులు ఆ గ్రామప్రజలు. అన్నార్తులై వెడలిన వారల కచట ఆదరణ అభిమానము లభించునేగాని నిరాదరణ కానరాదు. అసహనము గాని, అపహాస్యముగాని ఆ ప్రాంత మందు కానరాదు. కష్టించి, చమటోడ్చి నాల్గుకాసుల సంపాదించుకొని కడుపునింపుకొన కలిగిన వారిని చీదరించి సీత్కరించి వెళ్ళగొట్టు మనస్తత్వము కాదా గ్రామ ప్రజలది ఆహ్వానించి, ఆదరించి, అభిమానించి, వారిలో వారి గానే భావించి బ్రతుకు బాటను జూపు మార్గదర్శకులు ఆ గ్రామ ప్రజలు. కరుణాంత రంగులు. కష్టజీవులు, దయార్ద్రహృదయులు, ధర్మశీలురు, దాతృత్వమూర్తులు.

ఇక నచ్చటి మధుర గాయక బృందములు ఎల్లవేళల సుమధుర మంగళ వాయిద్య ఘోషలతో యావద్గ్రామమును పావన మొనర్చుచుందురు. తెల్లవారుచుండ గనే ఆయా దేవాలయములందు మంగళ తూర్యారవంబులు మారుమ్రోగుచుండును. ప్రాతఃకాలము పవిత్ర నాదములతో [illegible]

ఎంతో రమ్యముగ, భక్త్యానంద పారవశ్యమున పులకింతలతో ప్రభాతమై, సుప్రభాతమై ప్రకాశించుచుండును.

వీధి బడులు విజ్ఞానపు గుడులు. ఉచిత విద్యా బోధన తప్ప విద్యా విక్రయ మప్పటి కాలమందులేదు. ఆటవిడుపని అయ్యవారికి ఒక రాగి కాని యిచ్చెదరు. దసరా పండుగలందు "అయ్యవారికి చాలు అయిదు వరహాలు, పిల్లవాండ్రకు చాలు పప్పుబెల్లాలు"—అని విద్యార్థులు గానము సేయుచుండ విద్యార్థుల తల్లిదండ్రులు బ్రహ్మ దీవెనలైన యా బాలబాలికల దీవెనల కానందపడి వారికి పప్పుబెల్లములు, పలకలు, బలపములు పంచెడివారు, అయ్యవారికి తోచిన కానుకల సమర్పించి సంప్రీతులయ్యెడి వారు బాలబాలికలు కడు రమ్యముగ కోలాటముల వేసెడివారు. మంచి మంచి పాటలు పాడెడివారు దేవాలయములు, అంగళ్ళు, చావిళ్ళు ఆదర్శ వంతమై యుండెడివి అంతః కలహములకు, అనవసరపు సమావేశములకు తావుండెడిది కాదు దేవాలయములు కేవలము దైవ కార్యములకే ఉపయోగించెడి వారు. ఆ వాతావరణ మెప్పుడూ కలుషిత మయ్యెడిదికాదు.

గ్రామము నందచ్చటచ్చటా చిన్న చిన్న తోటలను బోలు అడవులుండెడివి. గ్రామస్తులు ఆయా పండుగ దినములందు ఆయా ప్రాంతములకువెళ్ళి ఆనందించెడి వారు. పెరుగుతున్న పచ్చిక పైరు ఆకుపచ్చని తివాచీవలె ఎంతో ఆనందముగ నుండెడిది. విస్తరించుకొని నిల్చున్న వృక్షరాజములు పలువిధలతాని కుంజములు, ఫల వృక్షములు, పండుటాకులు, ఎండుటాకులు చేయు గలగలమను ధ్వని ప్రకృతి లోని అందాలలో కొన్ని.

ప్రత్యేకముగా వినాయకచవితి దివసంబున అడవి ప్రాంతములకు వెడలి పలువిధ పత్ర పుష్పములను సేకరించుటలో బాలురు, వృద్ధులు పోటీలు పడెడివారు. అడవిలో రకరకముల పత్రిని కనుగొని సేకరించుటలో వారి యానందము వర్ణనాతీతము ఉసిరిగాది పత్రముల త్రెంపుట యందును, మాచిపత్రి, బిల్వపత్ర సేకరణ యందును, విష్ణుక్రాంతాది పుష్పములను పసిగట్టి సమీకరించుటయందును నేర్పు ప్రదర్శించి, వారి వారి ప్రయత్న సాఫల్యమునుబట్టి సంతోషించుచుండెడివారు.

మహోన్నతములైన పర్వత పంక్తులు. పయనించిపోవు మేఘమాలికలు, ఆ మేఘమాలికలలోనికి చొచ్చుకొనిపోయిన పర్వతశిఖరములు. ఇటువంటిరమణీయ దృశ్యములు కవులకు కమ్మని కవితా నిర్మాణమున కాధారభూతములు.

సృష్టియందు ప్రతివారు సత్పవిత్రులుగను, సచ్ఛీలురుగను. సత్సాంప్ర దాయికులుగను, పరమపావనులుగను నుండిన, మఱిక అపవిత్రు లెవరు? పాపు లెవరు? అప్పుడింక భగవంతున కవతారము లెత్తవలసిన ఆవసరమే యుండదు కదా! కనుక సృష్టియందు పుణ్యుల, పాపుల సమిష్టి సృష్టి జరిగి తీరవలసినదే !

ఎవరు ఎవరిని పాపులందురు? ఎవరిని పుణ్యులందురు? వారి ముఖములపై వ్రాసియుండదు కదా! పురుషులందు పుణ్య పురుషులు వేరయా:—అని చెప్పిననూ, ఆ పుణ్య పురుషుని గమనించి గుర్తించుట సామాన్య సాధారణ మానవున కలవి కాని పనియే! అయిననూ ప్రతి దేశమునందునూ అన్ని రకముల ప్రజలు కలసియే యుందురు. అటులనే మడుమాలయందునూ పైన చెప్పుకున్న పవిత్రజన సందోహ ముతో బాటు పతితులూ యుండిరి....పతిత పావనులూ యుండిరి.

ఇంకనా గ్రామ పశువులా!–చెప్పదరమె వాటిశోభ! ప్రతిభా ప్రయోజనములు పరిపుష్టమైన శారీరక సౌష్ఠవ సంపద చూచుటకెంత ఆనందము చేకూర్చునో. వృషభరాజములను గాంచిన నాటి నందికేశ్వరుని సుందర శరీర సౌష్ఠవము అటులనే యుండునా యనిపించును. ఘలమైన మూపురములతో, మెత్తని గంగడోళ్ళతో, పదునైన కొమ్ములతో, చేయెత్తినగాని అందని ఎదుగుదలతో, గంభీరముగ గంగా పతి వాహనములా యనినట్లు పవిత్రముగ కన్పట్టుచుండును.

గోమాతలు సాక్షాత్తు ప్రకృతి మాతలు. సంపూర్ణ క్షీర భరితములైన పొదుగు లతో దండిగా నిండుగా కన్పించును. ముఖమున పసుపు రుద్దబడి, రూపాయి బిళ్ళంత కుంకుమబొట్టుతో పచ్చని పండు ముత్తైదువులబోలి క్రాంతి పథగాముల వలె సంక్రాంతి శోభలతో సదా బాసించుచుండు నాగో సంపద. బుజ్జాయిల చూచి ఎంత ఆనందింతుమో! తోకలు పైకెత్తి వీధులందు పరుగులుతీయు ఆవు దూడల అందము, వాటి ముఖములందు ద్యోతకమగు సంబరము, సంతోషము వర్ణనాతీతము. అటులనే గేదెలును పుష్కలముగనుండి, బలము కలిగి ఆరోగ్య

వంతముతై యిబ్బడి కిబ్బడి పొంగిపొరలి నిష్ఫలము ఎరిగి సంతరించుచున్న గ్రామము ముడుమాల.

అక్కడి కప్పుడప్పుడు తాపస శ్రేష్ఠులు తారస పడుచుందురు. దివ్యబోధలు సేయు యోగులు, ఋషులు, సాధువులు, సన్యాసులు ఆ గ్రామము నప్పుడప్పుడు సందర్శించుచుందురు. సత్కాలక్షేపము సేయుచు గ్రామీణులకు సాధువృత్తిని సాత్విక ప్రవృత్తిని ప్రబోధించు చుందురు.

ద్వైతాద్వైతా విశిష్టాద్వైత సారమును సుబోధశైలితో ప్రజల కెఱుక బఱచు మతాధికారులు, మతాధికారులతో బాటు మహమ్మదీయ గురువులు ఖురాను గ్రంథ పఠనము సేయుచు ఖురాను వాక్యముల ప్రచారము సేయుచు, భగవద్భక్తిని, మత తత్త్వమును ప్రబోధము సేయుచుండిరి.

నీతిమంతులు, స్వమత నిష్ఠాగరిష్ఠులు ఆచారమును పాటించువారు. ధర్మ కార్య నిర్వహణయందు ఆసక్తి గలవారు న్యాయవర్తనులు, సాధు సన్యాసులకు భోజనాది వ్యవహారముల చూచువారు గ్రామము నందుండిరి ఉపకృతులు సేయువారే ఎక్కువగాని, అపకృతులు సేయువారు లేరని చెప్పజాలము. కాని అసలు లేకుండుట సృష్టి కార్యమున కవరోధమే కారణము సృష్టియందే అపకృతి సేయువారలు గలరు. మంచి చెడులు కవల పిల్లలని పెద్దలు వచించుచుండిరి గదా! దాన స్వీకారము సేయువాడు లేకున్న దానమిచ్చు వాడెవనికిచ్చును? పాపపరిహారము సేయవలయునన్న పాపి యుండవలయునుగదా। కనుక అపకృతులు సేయువారు లేరని చెప్పుట తగదు. పాపిలేక యుండిన పరమేశ్వరునికి పని యెట్లు ?

క్రిష్టియను మత గ్రంథమైన బైబిలులో ఒకసారి తొంగిచూచిన ఒక సత్యము బోధపడగలదు. భగవంతుడు ఆదాము అవ్వను సృజించి ఒక ప్రత్యేక వృక్ష ఫలములను స్వీకరించవలదని ఆజ్ఞాపించినాడు. కాని సైతాను పరమేశ్వరునిపై పగబట్టి వారిచే ఆపండ్లను భుజింపచేయును. పరమేశ్వరుడు సృష్టికర్త. తానే సర్వం సహా సృష్టికి మూల కారకుడు. అనగా తనే సృష్టి చేయువాడు. అట్టితరి ఈ 'సైతాను' నెందులకు సృష్టించుకొనవలయును?—ఇదే సృష్టి రహస్యము—అందుకే అంటిని

భూమి వయిన పాపి పుట్టుకయుండిన, కర్మమేది విశ్వ కార్మికునకు
కనుక పుడమితల్లి కనుచుండె పాపులన్ భవ్యగుణపవిత్రభరతపుత్ర।

పాపిలేక జగతి పాదమ్ము కదుపదు పుణ్యపాపములకు పుడమినెలవు
కవల పిల్లలయ్యె కాలమ్మునకు రెండు భవ్యగుణ పవిత్ర భరతపుత్ర

పుణ్యు డనగ భూమి పులకించు సత్యమ్ము కాని పాపిలేక కదలబోదె
పుట్టె పాపి ముందు పుణ్యుడా వయినరా భవ్యగుణ పవిత్రభరతపుత్ర।

అవ్విధముగ ఆ గ్రామమునందు ముక్తిసాధించవలయుననెడి ముముక్షువులూ ఉండినారు నారాయణుని నిరసించే నాస్తికవాదులూ ఉండకుండా వుండరు.

భక్తితో భగవంతుని పొందవలయును ఆ దేవదేవుని దివ్య దర్శన మనుభ వించవలయును. నిత్య నైమిత్తికాది ఆచార వ్యవహారములు వదలక సౌశీల్యముతో, సహృదయముతో సత్సంకల్పముతో సత్కాలారాధనతో సమారాధనా కార్యక్రమము నిర్వహించుచు కొంతకాలము ఆ భగవత్సేవలో భగవదారాధనలో, ప్రార్థనలో నామ స్మరణలో గడుపు వారలనేకు లుండిరి.

అటువంటి సత్ప్రవర్తనా శీలురతో, సత్యారాధనా వాంఛాపరులలో; సమా రాధకులలో దూదేకుల కులసంజాతుడు, ముస్లిం మతానువర్తి, శమదమాది గుణ సంపన్నుడు, ప్రతినిత్యము క్రమము తప్పక మూడు పర్యాయములు నమాజు చేయుచు, అందరియందు ప్రేమాదరముల ప్రదర్శించుచు, దైవము ప్రేమ స్వరూపు డని, ప్రేమ లేక దైవములేదని ప్రబోధముసేయుచూ, ప్రజలందరూ దేవుని ప్రేమించవలయునని, ప్రార్థించవలయునని, పూజించవలయునని ప్రచారము సేయుచు తన నిత్యకృత్యమును సాగించుకొనుచు జీవనముసేయుచున్న సత్కుల వంశభూష ణుడు, సంసారి సయ్యద్ పీరు సాహెబ్.

కులమేదైననూ, మతమేదైననూ సహాయ సానుభూతులు అందించువాడేగాని, పక్షపాత బుద్ధితో వ్యవహరించెడివాడుకాడు. అకారణముగ ఒకరి వ్యవహారముల యందుగానీ, ఇతర విషయములందుగాని, తలదూర్చెడివాడుగాడు. తనకు తగదని యనుకున్న తరుణమున నోరువిప్పెడివాడుకాదు. ఒకవేళ ఎట్టిపరిస్థితులలోనైన

మాటాడవలసివచ్చినను, సమయా సమయములనుబట్టి తనమాట, తనబాట తప్పెడి వాడుకాదు ధర్మపథమును వీడిచరించడు. అసలా పద్ధతియే అతనికి గిట్టదు. అతనిసత్ప్రవర్తన సత్యవాక్పరిపాలన ధర్మాచరణ మొదలైన అతని అలవాట్లను చూచిన వార్లకాశ్చర్యము కలుగక మానదు.

ఎవరైన ఖురాను పఠించుచుండినపుడు ఎంతయో శ్రద్ధతో వినుచుండును. అతనికి అర్థముగాకయున్న ఒకటికి రెండు పర్యాయములు గురువుల నడిగి తెలిసి కొనుచుండును. వేదములలోని విషయములను గూడ హిందూ పండితుల నడిగి తెలిసికొనెడివాడు. ధర్మమన్నది ఏమతమునకైననూ ఒక్కటే. ఇందులో సందేహ మెందులకు ?—అనుకొనెడివాడు.

కాదంబిని అనదగ్గ 'అదంబి' యను కన్యారత్నమును వివాహముచేసికొని నాడు. సుఖజీవనము చేయుచుండినాడు. అదంబీ పీరు సాహెబులు రసానంద డోలికల నూగుచు, ఈ ప్రపంచమునే మరచి ఆనంద సాగరపుటంచులు తాకుతూ, మైమరచి ఒకరిలో మరియొకరు లీనమై సుఖానుభూతి నందుచున్నారు. వారి ఆనం దమే ఆనందము. రోజులు....నెలలు... సంవత్సరములు గడిచిపోవుచున్నవి.

అదంబియు భర్తకు దగ్గభార్య. నిజముగ పతివ్రత. పతిమాట కెదురాడదు. తన మనసులోని మాటను సలహారూపమునగానీ, సందేహముగాగానీ వెలుపరిం చునేగాని తన నిర్ణయము నెప్పుడూ అతనిపై రుద్దదు. వాగ్వివాదమునకు ఎప్పుడూ దూరముగనే యుండును. పతియే తనకు దైవము. అతడే గురుడు. ఆచార్యుడు, బంధుగుడు సర్వసపర్యలూ తానే స్వయముగచేసి సంతృప్తి చెందునారీలలామ. భర్తనే మాత్రము ఆయాస పెట్టెడిదిగాదు. ఏనాడూ కఠినముగ మాటాడిఎఱుగదు. ఆమెకతడు సర్వస్వము అతనికామె సర్వస్వము.

అదియొక వేడుక దినము।

బంధుగులింట శుభకార్యము నిర్వహించుచున్న సమయమున వారలీ పీరుసాహెబ్ దంపతులనుకూడ నాహ్వానించినారు. పీరుసాహెబు వృత్తి దూదినేకి పరుపులుకుట్టుట. తనకెక్కడనో పరుపులు కుట్టు పని యున్నందున కార్యక్రమమునకు పీరుసాహెబు వెళ్ళలేక అదంబి నొక్క దానినే పంపినాడు. ఆమెయూ ఎంతో సంబరముగ

వెడలినది. అచ్చటికి విచ్చేసిన అనేక మంది బంధుగులతో పరిచయ మగుటయే గాక, వారు మాట్లాడు పలువిధములైన పలుకులు, నర్మగర్భపు మాటలు, వారలు ధరించిన వస్త్రములు, వారివారి ప్రవర్తన ఆమె నెంతయో ఆశ్చర్యపరచుటయే గాక ఆవేదనాభరితురాలను చేసినవి.

"ఓ!—అదంబీ!— నీవా!-ఎవ్వరో అనుకొంటిని ఎంతగా మారిపోయితివి. నీవు ఒక్కర్తెవే వచ్చితివా! పీరు సాహెబు క్యోం(నహీం( ఆయా! అరే బేటీ! తూ బహుత్ మోటా హోగయా! దేఖో!—మోటా అయిపోతే పిల్లలు కలుగరని పెద్దలు అందురు. జాగ్రత్త!—అనినది ఒక వృద్ధురాలు.

"అరే! అదంబీ! తూ మాం( నహీబన్‌గయా అభీతక్. అరేఅల్లా ! హమారీ హాత్‌మే క్యాహై! పరేశాన్ పడకు. సమయము రావలయును దేనికైనమా—" అని మరి యొకస్త్రీ.

"బేటీ ! ప్రతిరోజూ నమాజు చేయుచుంటివా!"

"హాఁ! —మోసీ!"

"ఆఁ! నమాజులూ నమస్కారములూ చేసినంత మాత్రమున పిల్లలు పుట్టుదురాయేమి? అదృష్టముండవలయును గదా! ఏ జన్మమున చేసికొనిన పాపమో!" అని మరియొక మహిళ కొంచెము కటువుగా మాటలాడినది.

అదంబి మనసు చివుక్కుమనినది. "వీరందరికీ చర్చనీయాంశము తాను సంతానవతి కాలేదన్న విషయము తప్ప అన్యమేమియునూలేదు" అని తనలో తాననుకొని బాధపడినది.

"అదంబీ!"—ఎవరో ఆప్యాయముగ పిల్చినారు. వయసులో చాలా పెద్ద వారు. "బేటీ!" ప్రేమపూర్వకమయిన ఆ పిలుపులో ఎంతో ఆదరణ ఓర్పు, పరామర్శ కూడుకొని యున్నవి. "సర్వమూ ఆ సద్గురు దయ. అల్లాయే సద్గురుడు. అల్లా దయ లేకుండ ఏదియూ జరుగదు. గంపెడు పిల్లలు కలిగిన ప్రతివారూ అదృష్టవంతులనుకొనుట పొరపాటు. వారలన్న మాటలను మనసున పట్టించుకొనకు. అది వారియొక్క కుసంస్కారమునకు నిదర్శనము. ఘర్ ఛలో" —అని చెప్పినాడు.

"బాబా ! తుమ్ కౌన్‌హో బాబా! భగవాన్‌కా సమాన్‌హై ! బాబా ! ఏక్‌బాత్ పూఛ్‌నా చాహితీ హూఁబాబా!"

"పూఛో బేటీ!"

"నాకు సంతానయోగం యుండెనా ! బాబా! మేరీ హాథ్ దేఖియ్యే ! బోలియ్యే బాబా!"— అని చెయి ముందుకు చాపినది అదంబి.

"హాథ్ దేఖ్‌నేకా జరూరత్ నై బేటీ ! భగవాన్‌కా ప్రార్థన్ కరో ! ప్రార్థన మనిషిని బలవంతుని చేయును. మనసును నిర్మలముచేయును. ఆత్మబలము చేకూర్చును. భగవంతుడు దయామయుడు. తప్పక బిడ్డలను ప్రసాదించును."— అని బాబా అక్కడనుండి వెళ్ళిపోయినాడు.

ఆమె మనసు ఎంతో కుదుటపడినది. ఆరాటమంతయూ తగ్గినది. బాబా ముఖావలోకన మాత్రమున ఆమెలో బాధ చాలవరకుపశమించినది. అయిననూ ఆలోచనల అలలు అంతము కావుకదా ! కడలకేళిలో అలల జీవనం ఆలోచింపతగినదే. "భగవాన్! నాపట్ల నీకెందుకింత నిర్దయ. దయాకీజియ్యే ! భగవాన్!"—అని రెండు చేతులెత్తి అల్లాను ఆత్మలో ఒకసారి స్మరించుకొని బయలుదేరినది.

అదంబి ఇంటి కొచ్చినదేగానీ! ఆమె మానసమంతయు వ్యథాభరిత సంకుల సమరముగనే యున్నది. వారలనిన మాటలు జ్ఞప్తికివచ్చి చెవులలో గింగిర్లెత్తించుచున్నవి. పీరుసాహెబు ఆమె మౌనమును, ఆలోచనారాహిత్య పరిస్థితిని, పరధ్యానమును, బాధను గ్రహించినాడు. గుర్తించినాడు. అదంబి ఏదో చెప్పరాని వ్యథకు లోనైనదనీ, బాధను దిగమ్రింగుకొని బ్రతుకుచున్నదని గ్రహించినాడు.

"అజీ!"— అని ఆమె భుజముపై చేయివేసినాడు.

ఆమె అతని భుజముపై తలవాల్చి వెక్కి వెక్కి ఏడ్చినది.

"అరే! క్యాహువా బేగం ! ఎందుకివ్విధి రోధించుచుంటివి. ఇప్పుడు మనకేమైనది. ఎందుల కిలా బాధాపరితప్త హృదయవై విలపింతువు- అల్లా మనకన్నియు యిచ్చియుండెను కదా !"— అనినాడు. ఆమెను తన హృదయమునకు దగ్గరగా తీసికొనినాడు. ఎంతో అప్యాయముగ, ప్రేమగా ఆమె వీపుపై నిమిరినాడు.

అతని ప్రేమకు, ఓదార్పుకు ఆమె పరవశత్వమందీ యింకా పెద్దగా రోధించినది.

"ఓహో ! తుమ్ పాగల్ హోగయా అదంబీ! మత్‌రో! మత్‌రో! బతావో ముఝె ! క్యాహువా ! ఆరోగ్యము బాగులేదా ! ఎందులకిట్లు నిష్కారణముగా

వ్యథా భరితురాలవయ్యేదవు. నీలో నీవు కృశింతువు."- అని లాలనగా ప్రేమ అడిగినాడు పీరుసాహెబ్ !

అప్పుడు బంధు గృహమునందు జరిగిన సంఘటనలు, వారి మాట ఆమె నేవిధముగ బాధించినవో నిదానముగ వివరించినది.

"మాషా అల్లా ! ఇంత మాత్రమునకే నీవింతగా చలించిపో వలయును దుష్టస్వభావులు అవ్విధముగనే పల్కుచుందురు. అల్లా కరుణామయుడు ఎవ్వ బాధించడు. అయన ప్రేమ స్వరూపుడు. తన వారిని అల్లా ఎప్పుడూ విడిచిపెట్టడు అని చెప్పినాడు.

"సంతులేని బాధ నన్ను దహించి వేయుచున్నది. ఎన్నిసిరి సంప ఉన్ననూ గృహస్థులకు సంతాన లోపము కన్నమిన్న యేముండును. తోటి వా వారి వారి బాలబాలికలను చూచి ముద్దులతో సుద్దులతో ఆనందము చెందుచు మనకు పట్టిన దౌర్భాగ్యమునకు మనము కుమలక చేయున దేమున్నది.

"గార్హస్థ్య ధర్మము నవలంబించుచు శృంగార వశులైన భార్యాభర్తల సుతులులేక యున్న ఆ భవనము వనమేగాని గృహ మెట్లు కాగలదు. బం మిత్రులు సంతానము వల్లగదా వృద్ధి బొందునది. అటువంటి సంతాన హీనమై వంగడము కేవలము గడముగాక మరేమగును. పితృసముపార్జితవిత్తానుభ పాత్రులగునట్టి పుత్రులులేని విభూతి కేవలము భూతిగాక మరేమగును. వంశాభివృ తగిన సంతతి లేకుండిన మానవోదితము కేవలము దితముగాక మరేమగును

"మనము వార్ధక్యమున బడి చేవచెడి అటునిటు గదలలేని నిస్సహాయ వి లత్వ స్థితి యందున్నప్పుడు ప్రేమతో పోషించుచు చేయూత నందించు సుతులులే జీవనము వమ్మేగదా।

ఎప్పుడైన బంధుగుల యింటగానీ మిత్రుల యింటగానీ జరుగు శుభ కార ముల కరుగు తతమున బుట్టి దుర్భాషలు విని భరించుట లేక ఎదురేగిన గొడ్డుబో దుశ్శకునమని నిందించిననూ నిందింతురుగదా లోకులు. ఇట్టిదుర్భర, దురూహ దుస్సంఘటనల నెట్లు నెదుర్కొనుట?-ఎటులా బాధ భరించుట। భరించి మ గలుగుట"—అని ఆదంపీసతి దుఃఖించినది.

—o—

# సిద్ధయోగి ప్రసిద్ధ భారతం

## —: రెండవ భాగం :—

"బేగం! ఈ రోజు గ్రామమున నాటకము వేయుచున్నారు సిద్ధముగమ్మ. మనమునూ వెడలి చూచెదము. జనమంతయు వెడలుచుండిరి"— అనినాడు పీరు సాహెబు బయటినుండి వచ్చి.

"వేడి నీరు తోడి దొడ్డి యందుంచితిని. స్నానముచేసి రండు. భోజనానంతర మటులనే వెడలుదము"— అనినది అదంబి

పీరు సాహెబు శుచిగా స్నానముచేసి వచ్చి బట్టలు మార్చుకొని అన్నము వద్ద కూర్చొనినాడు. అదంబి ఎంతో ఆదరముగ అప్యాయముగ అతనికి అన్నము కూరలు వడ్డించినది.

"బిస్మిల్లా-హి-ర్రహ్మా-ని-ర్రహీమ్"- అను ఖురాను ఆయతును పఠించి కొంత అన్నము తీసి అవతలుంచి భుజించుట ప్రారంభము చేసినాడు. అంతవరకూ అదంబి భర్త వెంబడే కూర్చుండి విసనకఱ్ఱతో వీచుచునే యున్నది.

పిదప తానునూ—భోజనము పూర్తిచేసికొని భర్తతో నాటకము చూడ వెడలినది.

గ్రామ మధ్యమున నున్న ఖాళీ స్థలమునందు నాటక రంగము ఏర్పరుపబడి యుండెను జనము చేరియుండిరి. మంచి వెలుగుల నిచ్చు దీపములు రంగ స్థలమున కటునిటు అమర్చబడి యుండెను. "మృకండ మహర్షి" అను నాటకము ప్రదర్శించ బోవుచున్నట్లు రంగస్థలముపై నుండి విన్పించినారు. నాటకము ప్రారంభమైనది.

నాటకము జరుగుచున్నది. పాత్రధారులు తమ తమ నటనా కౌశలమును ప్రదర్శించుచుండిరి. మధ్య మధ్యన మృదు మధురమైన తమ తమ కంఠస్వరములను విశాలము చేసికొని కడు రమ్యముగ రంజితముగ రాగాలాపనముల చేయుచుండిరి. పద్యములను హృద్యంగమముగ పాడుచుండిరి. రాగతాళ యుక్తముగ గీతములను గానము చేయుచుండిరి. జనమునూ సంతోషముచెందుచుకరతాళధ్వనులుచేయుచుండిరి.

అది మృకండ మహర్షి ఆశ్రమము. ఋషిపత్ని 'మరుద్వతి' కూర్చొని

సలలితములైన శీతలజలముల నింపుక నిడుము"-అనినారు. మరుద్వ
ఎంతయో సంతసించి లోనికేగి శీతల జల పూర్ణములైన కలశంబుల తెచ్చి
బోవునంత-

"అమ్మా! ఆశ్రమమందు మీరు తప్ప అన్యులెవరూ కానరారు. మహ
బహుశా తపశ్చర్యకై వనాంతరములకు వెడలి యుండవచ్చును. మీ పుత్రు
తండ్రితో కలసి వనాంతరముల కేగినారా!"—అని ప్రశ్నించినారు.

మరుద్వతి ముఖపద్మము మ్లానమైనది. అవనతశీర్షయై "అమ్మా నాకిం
సంతానము కలుగలేదు"—అని చెప్పినది.

"సంతులేని స్త్రీచేతి నీరము గ్రోలుట తగదు. ఆ విషయము మీ
తెలుసుగదా! అన్యథా భావింపకుడు. మా ప్రవర్తన వలన మీ మనసు గాం
ఉండవచ్చును. మీరిచ్చు నీటిని స్వీకరింపలేము క్షమింపుడు" —అని ఆ
కన్యలట నుండి వెడలిపోయిరి.

మరుద్వతి మనసు తీవ్రముగా గాయపడినది. ఆమె ఆలోచనలు తీవ్ర
నందుకొనినవి. సంతులేని స్త్రీయొక్క మనోవేదన, ఆవేదన ఆమె ము
నుండి సెగలు పొగలుగా వెలువడినది. ఒక ప్రక్క అవమానభారమును మోం
ఒక ప్రక్క పుత్రులు లేరను బాధతో కృంగుచు, నిస్సహాయురాలై, ఏమియ
చేయలేక అటులనే ఆశ్రమపుటరుగుపై కూలబడినది. దిగులుతో....రగులు
వ్యథతో.

ఆదృశ్య మంతటితో ముగిసినది.
తదుపరి దృశ్యము ప్రారంభమైనది.

బ్రహ్మసభకు అడుగిడిన మృకండ మహర్షిని భటులు సంతానహీనుడని
బెట్టి బయటకు నెట్టు దృశ్యమది. ఆ దృశ్యమునకు ప్రేక్షకులు కంట తడి
నారు. అంతటి మహర్షికే సంతాన భాగ్యము లేనంత మాత్రమున ఎంతటి అవ
పడవలసి వచ్చెనని, పలువుదు పలువిధములుగ బలుక జొచ్చిరి.

నాటకము పరిసమాప్తమైనది.

నాటకము తిలకించి వచ్చిన ఆదంబికి కంటికి కునుకురాలేదు. తిండి మీద యిచ్ఛ తొలగిపోయినది. బలవంతమున నింత తినుటకైన మనస్కరించుట లేదు. "నేను గొడ్రాలినా! నేను గొడ్రాలినై జీవితాంత మిటుల ఎందుకట్టివలె జీవించ వలసిన దేనా!" —అని తనను తానేదియో ఊహించుకొనుచు మనశ్శాంతికి దూరమై, ఆవేదనతో అల్లల్లాడి పోవుచున్నది.

పీరు సాహెబు ఆమె బాధనంతయూ అర్థముచేసికొనినాడు. కాని తాను మాత్రమేమి చేయగలడు. సంతానము కావలయునన్న కలుగుటకు, వలదన్న యూరుకొనుటకు, అది దైవకార్యముగాని, మానవ కార్యము కాదుగదా! తనకు మాత్రము సంతానము కావలయునని ఉండదా! పసిపిల్లల నెత్తుకొని ఆడించుకొనుచు హృదయమున కత్తుకొనుచు ఆనందింపవలయునని ఉండదా!....ఉన్నది. మరేమి చేయగలడు? ఆదంబి ఆడది గనుక ఊఱక దుఃఖించుచున్నది. తాను పురుషుడు గనుక కొంత నిగ్రహించుకొనక తప్పదు. అంతియే తేడా!

"బేగం! నీవింత బేలవైనచో ఎటుల? యింతగా భ్రాంతి తగదు. అదృష్ట ముండిన, వారలేనాడో కలిగి యుండెడివారు. కాని మనకా భాగ్యము లేదు కనకనే సంతానము కలుగలేదు. అంత మాత్రమున యివ్విధముగ ప్రతి నిత్యమేదో దృశ్యమును, సంఘటనను తలంచుకొని, ఊహించుకొని, బాధపడుట విజ్ఞులు చేయ వలసిన పనికాదు.

"పుత్రులు కలిగిన వారందరూ అదృష్టవంతులనియూ నీ ఉద్దేశ్యము. పిచ్చి దానా! పెరిగిన తదుపరి వారలు ఇతర వ్యామోహ బంధనాలలో చిక్కుకొని తల్లి తండ్రులను సంపూర్తిగా మరచి, వారి కర్మమునకు వారి నొదలి వెడలి పోవుట మనము కనుట లేదా! వినుట లేదా!

"పుత్రధర్మమును సంపూర్తిగా విస్మరించి శత్రువుల వలె మారి ఇటు కులము నకు, అటు కుటుంబమునకు కూడ మాయని మచ్చ చేకూర్చి పెట్టు కుపుత్రకుల చరిత ములు మనము వినుట లేదా!- చెప్పుము.

"పైగంబరు లెందరో సంతానము లేకనే సద్గతి పొందినారు. సద్గతి పొందు టకు సంతానము తప్పక యుండవలయు ననెడి సిద్ధాన్తముపై నాకు నమ్మకములేదు.

భగవచ్చింతన, భక్తి, గురుపూజ, గురుసేవ-యిత్యాది సత్క్రియలన్నియును మన
అల్లాకు అత్యంత సన్నిహితులను చేసి ఆయనలో ఐక్యమునకు దోహదపడు
గాని, కేవలము సంతానమే అందునకు కారణమని నేను విశ్వసింపను

"పైగా మన గ్రామమున బుధులు పురాణములు చెప్పుచుండిరిగదా! వినలే
బేగం! శుకులు సంతానము బడసిరా! మరివారికి సద్గతులు కలుగలేదా! క
సద్గతి కావలయున్న సంతానమే అవుసరములేదు. నా మాట వినుము. వారే
అనిరని, వీరేదో అనిరని ఊరక ఆ కలుగని సంతానము కొఱకు కుందకుము. బాధ
పడకు." — అని ఊరకుండినాడు.

ఆదంబి అటులనే కూర్చుచున్నది. పీరు సాహెబు చెప్పిన మాటలన్నిం
వినినది.

పీరుసాహెబు లోనికిపోయినవాడల్లా, మరలా వెనుకకు వచ్చి "ఇంకొ
మాట చెప్పనా!" — అనినాడు. ఆమె ఏమీ మాట్లాడలేదు. అతనే మరలా చెప్ప
ప్రారంభించినాడు.

"సంతతి కలిగినదే యనుకొనుము. కర్మకాలి ఏ వికలాంగులో జన్మిం
రనుకో!- అట్టి సమయమున వారియొక్క దీనావస్థను కనులారా చూచుచు, ఆ దు
తికి వారితోబాటు తలితండ్రులూ కుందుచుందురు. సంతానము లేకున్న లేరను
దొక్కటియే బాధ అప్పుడు రెండు బాధలై వారలన్పీల్చి పిప్పిసేయును గదా!

"లేక రోగపీడితులై జన్మించి రనుకొనుము! అప్పుడో! ఆ తలి తండ్రులక
కించెత్తయినను మనశ్శాంతియుండునా! ఆనంద ముండునా! ఆవేదన తప్ప!

"కనుక!— ఎందులకొ సంతు. ఊరుకొనుము. సంతుకొఱకట్లూరక చిం
నొందకుము. కృశించకుము. సంతు లేదులేదు అనుకొనుచు దిగులంది భోజనాది
కార్యక్రమములు విసర్జించి అస్తహీనమిటు ఆవేదనా భరితవై, అసహన వేదనా
పీడితవై దుఃఖించ సంతుకలుగునా ఆదంబీ! ఆలోచించుము.

"మొదటనే నేను నుడివితిని గుర్తుండియే యుండును. సంతు అనునది
భగవత్ప్రసాదము. దానికొ భగవంతుని సంపూర్ణదయ ఉండవలయును.

గానిఅన్యథా కలుగదు. అదియునుగాక సంతానము బడయు అదృష్టము మన కుండెనో లేదో ఎవరెరుగుదురు? భగవదానుగ్రహము లేక సంతానము బడయుట సాధ్యముకాదు. కనుక ఊరడిల్లుము. ఊరక నిన్ను నీవు కృశింపచేసికొని, నన్నునూ కృశింప చేయకు"....అని ఆదంబిని పీరుసాహెబు ఊరడించినాడు.

రాత్రి యయినది.

తన పను లన్నియు ముగించుకొని ఆదంబి భర్తను చేరినది. పీరుసాహెబు ఆమెను రెండు భుజములు పట్టుకొని దగ్గరగా చేర్చుకొనినాడు. ఆమెయూ అతని హృదయమందిమిడిపోయినది. "ఆదంబీ! భగవంతుడు తప్పక మేలు సేయును. దిగులందకు నిత్య శోకము వలన భోజన మరుగదు. అజీర్ణ వ్యాధి సంభవించును. శిరోభారము, ఉదరశూల, వాతాది రోగములు కలుగును. శరీరము కృశించును. కనుక అటువంటి అనారోగ్య పరిస్థితుల నాహ్వానించకుము. వ్రతములు సేయ వలయునన్ననూ పూజలు సేయవలయునన్ననూ, నమాజులు నిర్వర్తించవలయు నన్ననూ శరీరము పుష్టిగ నుండవలయును గాని, అనారోగ్యమైన శరీరముతో ఏదియూ నిర్వహింపజాలము. కనుక సంతోషముగా నుండుము"....అని ఆమెను మరీ దగ్గరకు తీసికొనినాడు.

"భగవంతుని కిష్టమైన కార్యములు సేయుట భగవత్సేవలో భాగమేకదా!"-- అనినది ఆదంబి

"అవును అంతియే కాదు భగవత్కథలను వినుట చదువుట చదివి యితరులకు విన్పించుట, వివరించి చెప్పుట....యివన్నియూ భగవత్సన్నిధికి దగ్గ రగా నుండినామనుటకు నిదర్శనము. సత్పురుషుల జీవిత చరిత్రముల పఠన పాఠనములు స్వాముల సన్నిధికి దగ్గరగా నున్నట్లు నిదర్శనము"....అనినాడు.

"అటులయిన మనకున్న సంపదలో కొంత భాగము సాధువులకు, సన్యాసు లకు బీదసాదలకు దానము సేయవలయునని యున్నది. వ్రతములకూడ నొనరిం తును. ప్రార్థనలు సేతును"....అనినది.

3)

"ఆదంబీ!- నీ అభీష్టమునకు నేనేనాడైననూ ఎదురు సెప్పితినా। నీ మనసుకు నచ్చినట్లు సేయుము. అయితే ఒక్క మాట. నీనేమి చేసిననూ మన ఆర్థిక పరిస్థితి కూడ ఒకింత దృష్టి యందుంచుకొని మాత్రము ప్రవర్తింపుము. సద్వర్తనము సర్వేశ్వరునకు సంప్రీతికరము. నీవాచరించునవి అల్లాకు అత్యంత ప్రీతికరము. అందుకు నాప్రత్యేకానుమతి అవసరమని తలంపను నీఅభీష్టము నెరవేర్చుకొనుము" అనినాడు

నాటి నుండియు అదంబిలో చాల మార్పు వచ్చినది. ఆ పరమేశ్వరుని అల్లా అని ఖుదాయని....నిత్య నమాజు చేయుచున్నది. హిందువుల పద్ధతి ప్రకారము వ్రతములు సేయుచున్నది. ఉపవాసముల నెరపుచున్నది.

కడీ బీబి, పీర్లకు సరిగ దుస్తులు చేయించి తొడుగుచున్నది. మౌల్వీలకు దక్షిణ లిచ్చుచున్నది. మౌలు, ఖవ్వాలీలు నేర్పరచుచున్నది. ఫకీర్లకు అన్నదానములు. సమారాధనలు సేయుచున్నది. పైగంబరులకు సేవ లందించుచున్నది.

తిరుపతి వేంకటేశ్వరునకు ముడుపులు కట్టినది. అలివేలు మంగమ్మకు చీరలు సమర్పించినది. బీబి నాంచారమ్మకు పూజలు సేయించినది. జెండాల నెత్తించినది బాలబాలికలకు తినుబండారముల పంచినది.

ఈ విధంబుగ తన కాలమునంతయు సాధు సత్పురుషుల సేవలలో వెళ్ళించుచు సద్బోధలను వినుచు సమయము నంతయు అల్లా స్మరణతో భక్తిలో సేవలో గడుపుచున్నది.

...o...

# సిద్ధయోగి ప్రసిద్ధ భారతము :

## మూడవ భాగం

అదీ సుప్రభాతం.

పక్షులు గూళ్ళనుండి వెలువడి ఆహారాన్వేషణలో సంచరించుచు, శ్రవణా నందకరమగు శబ్దములు చేయుచున్నవి. ప్రాతఃకాలపు చల్లగాలులు మెల్లగావీచు చున్నవి. మంగళాంగులు వారివారి ముంగిళ్ళలో కలయంపిజల్లి రంగవల్లుల తీర్చు చుండిరి. బాలభానుడు మంచుతెరల తొలగించుకొని భూమాతను పులకింపచేయు చున్నాడు.

ఆదంబి తన మామూలు కార్యక్రమములోని భాగముగ స్నానాదికముల ముగించుకొని, ప్రాతఃకాలపు నమాజు పూర్తిచేసికొనినది. ఇక గృహాంతర్భాగము నకు వెడలు సమయమున తలతిరిగి క్రిందపడిపోయినది. పీరుసాహెబు గ్రహించి, వెంటనే ఆమెను క్రిందపడకుండ పొదవి పట్టుకొని మెల్లగాలోనికి నడిపించు కొనిపోయి మంచముపై పరుండబెట్టినాడు. భార్యకేమో అయినదని భయపడి చుట్టు ప్రక్క జనముల నందర కేకలు పెట్టినాడు.

ఒక వృద్ధురాలు వచ్చిచూచి.

"అరే ! పీరూ! తుమ్‌బాప్ బన్‌జాతాహైరే ! తండ్రివి కాబోతున్నావురా!"- అనినది.

అంత పీరుసాహెబు ఆనందమున శవధులులేవు. "అరే ! మాజీ! సచ్!"- అనినాడు. "సచ్ బేటా ! మైసచ్ కహ్‌తీహూఁ!"- అనినది వృద్ధురాలు.

అప్పటి కప్పుడు ఆమె నోటినిండా పంచదార నింపినాడు పీరు సాహెబ్.

"భగవాన్ ! ఎంతటి దయామూర్తివయ్యా ! ఇన్నాళ్ళకు దయకలిగినదా స్వామీ !- ఆదంబీ! నీ పూజలు, ప్రార్థనలు అన్నీ అల్లాకు చేరినవి. అల్లా కరు ణించినాడు."- అని భార్యను దగ్గరగా తీసికొని ఆనందమున మునిగిపోయినాడు.

ఆదంబి కపోలములు తెల్లగా మారుచున్నవి. స్తనాగ్రములు నలుపుకు దిరుగుచున్నవి సన్నగా ఉండునడుము బాగా పెద్దదయినది. దేహమంతయు

బాగా నిండుగా పెరిగినది. చూచుటకామె ఎంతో అందముగానున్నది. మనిషియు ఆనందమున మునిగి తేలుచున్నది.

పుల్లమామిడికాయలు కోరుకొనుచున్నది పీరుసాహెబు అడిగినదే తడవుగ అన్నియు సమకూర్చుచుండినాడు. చల్లని పిల్లగాలులు కూడ ఆమెయనిన ఎందులకో అంతమక్కువ? ఆమె చుట్టూచేరి ముద్దులాడుచున్నావా అనినట్లు ఆమెముంగురులు అలవోకగా అందముగా కదలుచున్నవి. మేలి ముసుగు సహితము చిరు కదలికల సూచించుచు, చూపరులకొక అనుభూతిని ఆనందమును కల్గించుచున్నవి గులాబి రంగు మేలి ముసుగులో పచ్చని బంగారపు ముద్దలా వెలిగిపోవు ఆదంబి అందము వర్ణనాతీతము. ఆమెను ఆ విధముగా ఎంతసేపు చూచిననూ తనివి తీరదు. ఆమె నవ్వినపుడు, ఎఱ్ఱటి పెదిమలలో నుండి వెలువడు తెల్లనిహాసము ఎంతటి జడునినైన కదలించికమానదు. ఆమె నడుచునపుడు ఓరగంటచూచునపుడు ఆమెలో ప్రస్ఫుటమగుచున్న ప్రత్యేకపు సౌందర్య చిహ్నములు—పీరుసాహెబును పరవసింప చేయుచున్నవి.

బహుశా భూమాతయు ఆగర్భస్థ శిశువును చూడవలయునని తలంచెనో యేమో! ఆదంబికి రేవడి మన్ను తినవలయునని ఆకాంక్ష అధిక మగుచున్నది. జలకన్నెలు గర్భస్థ శిశువును దర్శించి సంతసించి వెలువడిరి కాబోలు ఆమె బంగారు దేహమునుండి వెలువడుచున్న చిన్న చిన్న నీటి బిందువులు ముత్తెముల వలె మెఱయుచున్నవి. కాంతి కన్నెలకును ఆ శిశువును చూడ కోర్కె జనించెనో యేమొ! ఆదంబి ముఖపద్మము ఎంతటి తేజో విరాజితమైనదో చెప్పలేము. ఆమె కన్నుల నుండి వెలువడు కాంతిపుంజములే అందుకు తార్కాణములు. అగ్నిదేవుడునూ గర్భస్థ శిశువును చూడదలచి, గర్భమందు ప్రవేశించి, శిశువును చూసి సంతసపడి బహిర్గత మగుచుండెనా యనినట్లు ఆమె విడుచు గాలి గోర్వెచ్చగా తగులుచున్నది. ఆకాశము గూడ గర్భమందు ప్రవేశించె నేమో! ఆమెకు జఠరాగ్నియు గగనమైనది. పంచ భూతముల కిట్లు ప్రియమైన ఆ శిశువు ఎంతటి అదృష్టజీవియో?- ఎవరు చెప్పగలరు.

పీరుసాహెబు ఆదంబిని కాలు కదుపనిచ్చుటలేదు. "అజీ! తుమ్ కామ్ గీమ్ నహీ కర్నా! అంతయూ నేనే చూచుకొనెదను. నీవు సంపూర్ణముగా విశ్రాంతి

గై కొనుము. వంటపని యంతయూ నేనుచూసుకొందును"—అని అసలు ఆమెను లేవనిచ్చుటలేదు.

"అరే? పీరూ బేటా! మేమందర మింతమంది యిటనుండగా నీ కెందుకురా యింత పరేశాను అవుతావు. దేఖో బేటా! పని గురించి నీవు ఊరక కంగారు పడకు నీవు వ్యాపారము చూసి కొనుము ఆదంబిని గూర్చి నీవేమీయూ ఆలోచించకు. ఆవేదన పడకు"—అని ఆ వృద్ధ మహిళ ఇంటి పని, అదంబి పని, అంతయూ తాను స్వీకరించినది.

"అరే! మాజీ! తుమ్!"— అని పీరుసాహెబు ఏదో అనబోవుచుండ "ఛుప్! జావ్!"- అని మాజీ అతనిని బయటకు నెట్టినది.

"మాషా అల్లా!"—అని అనుకొనుచు పీరుసాహెబు తన పనికై తాను వెడలినాడు,

నవ మాసములు పూర్తి యయినవి.

నేడో రేపో పురుడు రావచ్చునని అందరూ ఎదురు చూచుచుండిరి. మాజీ ఆదంబి వెంటనే యుండి సర్వ సపర్యలు చేయుచున్నది.

ఆనాడింకా తెల్లవారలేదు.
"మాజీ !"—నిద్ర లేపినది ఆదంబి.
"క్యాబేటీ! క్యైసేహై!"....అనినది మాజీ
"మంత్రసానికి కబురు పంపండి మాజీ!-"అనినది ఆదంబి.
మంత్రసాని కొఱకు పరుగులు తీసినాడు పీరుసాహెబ్
నొప్పులు అంతకంతకూ అధిక మగుచున్నవి.

మంత్రసాని లోపలకు వెళ్ళినది. గది తలుపులు మూయబడినవి. మాజీ మరి కొంతమంది మహిళలు కూడ లోపలనే యుండిరి. పీరుసాహెబు, తన స్నేహితులు గది బయట పచార్లు చేయుచుండిరి.

ఆందోళనతో పీరుసాహెబు ముఖ మంతయూ చెమటలు పట్టినవి మాటి మాటికి ఆకాశము వంక చూచుచు, చేతులు చాపి అల్లాకు మొక్కుకొనుచున్నాడు.

"అరే! పీరూ! బేటా! గబ్రావోమత్! గబ్రావోమత్! భగవానుడు కరుణా

మయుడు. కొడుకే పుడతాడులే. మరేమియూ భయములేదు. మరేమియు భయము లేదు అంతయూ సవ్యముగాజరుగును''- అని ఎవరో వీపు తట్టి చెప్పినట్లయినది.

పీరు తల ప్రక్కకు త్రిప్పి చూచుసరికి అక్కడ ఎవ్వరూలేరు.

"ఖాసిం! ఏమనుచుంటివి".... అనినాడు పీరు వెంబడున్న ఖాసింను చూచి.

"నేనా! నేనేమీ అనలేదే!....అనినాడు ఖాశిం

"ఏమీ అనలేదా !"

"అవును. ఏమీ అనలేదు."

"బేటీ!''.... ఆ పిలుపు అంతకు ముందు ఎక్కడో వినినట్లున్నది. అంత బాధలోనూ ఆదంబి కళ్ళు తెరచినది. తెల్లని దుస్తులతో, తెల్లని గడ్డముతో, తెల్లని తలపాగతో, మెడలో రుద్రాక్షమాలికలతో, చంకన పెద్ద సంచితో, ఒక వృద్ధుడు తెల్లగా నవ్వుతూ దర్శనమిచ్చినాడు.

"ముఁహ్ ఖోలో!....''-అనినాడు అతడు.

ఆదంబినోరు తెరచినది.

అతడు ఆమె నోటిలో చిటికెడు విభూతి వుంచి "అంతయూ మంచియే జరుగును. భయమేమియూలేదు'' అనినాడు.

ఆమె కళ్ళు మూతలు పడినవి.

"బాబా !''- అన్నది ఆదంబి.

ఆమె ఎవరినో పిల్చుచున్నదని అనుకొనినారు చుట్టు జేరిన జనము.

నొప్పులు ఎక్కువైనవి.

తూరుపుతెల్లనగుచున్నది గది అంతయు ఒక్కసారి చెప్పలేని వెలుగులతో నిండిపోయినది. ఆ వెలుగు ఎక్కడనుండి వచ్చెనో మరల ఎటుపోయెనో ఏరికీ తెలియదు. ఒక లిప్తకాల మందరూ నిశ్చేష్టులయిరి.

ఆదంబి ఒక్క పొలికేక పెట్టినది.

వెలుగు మాయమైనది.

ఆదంబి పక్కలో బాలుడుండినాడు. ఆదంబి ప్రసవించినది. మిగతా పనులు మంత్రసాని నిర్వహించినది,

ఖ శ్మన గది తలుపు తెరచుకున్నది.

“అరే! పీరూబేటా! అబ్బాయి పుట్టినాడురా!”....అని మాజీ సంతోషముతో యటకువచ్చి చెప్పినది ఒక్కసారిగా వార్త గ్రామ మంతయూ ప్రాకినది. కాంతి శ ప్రవేశము....మంత్రసాని అవసర రాహిత్యము. అప్పుడే ప్రజలందరూ ప్పుకొనుట ప్రారంభించినారు.

బాలుడెంతయో అందముగ నుండినాడు. “అపరంజిబొమ్మ ఆదంబిఅయితే, మె నోటి నుండి ఊడిపడ్డ బంగారుబొమ్మ ఈ బిడ్డ” అని మెచ్చుకొనుచుండిరి. ు వెంట్రుకలు నిండుగ నుండి నల్లగ నిగనిగ మెఱయుచున్నవి. ఫాల భాగము ాలమై ప్రకాశించుచున్నది. విశాలమైన బాహువులు కలిగి వినూత్న శోభంతో ుగొందుచున్నాడు బాలుడు.

అప్పుడే సంభ్రమ పరవశ్య త్రొక్కినది మలయ మారుతములు ఆనంద ంగ వీచినవి. జీవకోటి అంతయూ ఏదియో విశ్రాంతి చెందినట్లు వాతావరణ ంతయు ఆనందము, అహ్లాదముగ నుండుటేగాక ప్రశాంతముగ నున్నది.

ఇక జనమంతయూ బాలుని చూడవచ్చుచుండిరి. “అతడెవరైననూ మహా యుడా! లేకున్న అంతటి కాంతిపుంజమెట్లు ఆ గృహమున కొచ్చును. వచ్చెనుపో ంత్రసాని అవసరము లేకయే ప్రసవ మెట్లాయెను. ఆలోచనము సేయ అత వ్వరో మహానుభావు డనియే తోచుచున్నది”—అనుకొనుచున్నారు.

“అబ్బో! ఎంత అందముగ నుండెనో ఈ ముఖము. చందమామతో మానముగ నున్నది. ఏమా సౌందర్యము. ముక్కు చూడుడు. సంపంగిపువ్వు రె తీర్చిదిద్ది నటులున్నది. కన్నులు చూడుడు, చక్రములవలె గుండ్రముగ ుడునూ రెండు కలువ పూవులవలె ఎట్లు ప్రకాశవంతములై యున్నవో, నుదురు బ్బ! క్రొన్నెల. పెదవులు ఎర్రగా పగడములు ...కాంతివంతములై ప్రకాశించు న్నవి. చెక్కిళ్లు చిన్న చిన్న అద్దములు. భుజములువిశాలములూ ఉన్నతములునూ, మబొమలు చిన్నతరహా విల్లంబులవలె వంకర తిరిగి యున్నవి. శరీరముమేల్మి ంగారము. పచ్చగా పసినిమ్మపండువలె మెఱసిపోవుచున్నది. మెడచూడుడు. ఖాకృతితో అమూల్యమైన శిల్పమువలె ముచ్చటగా ముద్దుగానున్నది. సుందరా

కారమై శోభిల్లుచున్నది. ఇంత చక్కని పుట్టుక యింతకు మున్నెదనూ చూచి యుండలేదు. అదియునుం గాక బాలునిలో యెన్నియో శుభచిహ్నములు గోచరించుచున్నవి. ఈతడు మహాభోగి కావచ్చును. లేకున్న మహాయోగియైననూ కావచ్చును. మామూలు మనిషి మాత్రముకాదు. కీర్తి ప్రతిష్ఠలబడయును మహామాన్వితుడగును."— అని బాలుని గాంచిన వారలు అనేకులు అనేక రకములుగా పల్కుచుండిరి.

ఈ మాటలకు ఆజననీ జనకు లెంతయో సంతసించుచుండిరి. ఆనందించుచుండిరి. వారి అదృష్టమునకు వారే పొంగి పోవుచుండిరి అవధులెరుగని ఆనందము ననుభవించుచుండిరి. ఆయానంద రసానుభూతిలో వారు ఆహారమును సైతము మరచుచుండిరి. అదంబి ఆ బిడ్డను ఒక్క నిమిషమైనను వదలి యుండదు. పక్షితన బిడ్డను ఎల్లప్పుడు రెక్కలలో పొదివి దాచుకొనినయట్లు బిడ్డను అదంబి గుండెలలో దాచుకొనుచు కాపాడుకొనుచున్నది.

ఇంటి పనులన్నియూ మాజీయే చూచుకొనుచున్నది.

అప్పటికి వారం రోజులు గడిచినవి. ఎనిమిదవరోజు కూడ గడచి తొమ్మిదవ రోజువచ్చినది. అదంబికి అన్న అల్లీఖాను. వదిన కాశింబి, గూడ వచ్చి చూచినారు. కాశింబి మేనల్లుని ఎత్తుకొని ముద్దాడినది. అల్లీఖాను ఏవోబొమ్మలు తెచ్చి అల్లునకు కానుకగా నిచ్చినాడు.

"ఆలస్యమైన నేమిగాని అచ్చము పనసపండు వలెనున్న బిడ్డను కంటివి. ఎటులైనను అదృష్టవంతు రాలివేనుమా!"— అని వదినెను ఎత్తిపొడిచినది కాశింబి.

పురుడు పోసినారు. స్నానాది కార్యక్రమములన్నియు పూర్తియయినవి. కుల పెద్దలందరూ చేరినారు. ఫకీరులు, పైగంబురులు బారులు తీర్చినారు. ముల్లాలు ఖురాను గ్రంథ అయతులను పఠించినారు "సైదయ్య"— అని బాలునికి నామకరణము చేసినారు. ఫకీరులను అన్న వస్త్రములతోను దక్షిణ తాంబూలముల నిచ్చి సత్కరించినారు. సంతృప్తి పరచినారు.

ఇరువది ఒకటవ రోజు వచ్చినది.

బిడ్డను ఊయలయందు వేయవలయుననిరి. దానినే డోలారోపణ మహోత్సవముగా చెబుదురు. ఇరుగు పొరుగు ముత్తయిదువలందరూ చేరి బాలుని ఊయలలో పరుండబెట్టినారు. జోలపాటలు పాడుట ప్రారంభించినారు.

జో!జో! ముద్దుల కూన ! జోజో!- నా కన్నా !
జో! జో ! తేజోవితాన ! జో!జో!- విజ్ఞానా!
జో!జో! సైదయ్యనామా! జో! జో!- సుధామా !
జో!జో! పరంధామా! జో! జో! మహాత్మా!

అని పలు విధములుగా ఎవరికి తోచినట్లువారు జోలపాటలు పాడి ఆ సమయమును ఆనంద పరవశము గావించినారు.

"జోలపాటలు వింటూ, ఏదో ఆలోచన చేయుచుండినట్లు అర్ధనిమీలిత లోచనుండై ఆనందించుచున్నాడే! ఇతడు మహాభక్తుడగునా ఏమి?''— అని ఒక సుందరాంగి వ్యాఖ్యానించినది.

''ఎన్ని పాటలు పాడినసూ అఱుకడు, ఉలకడు, నిశ్శబ్దమును పాటించి, మౌనము వహించియున్నాడు. బహుశా యితడు గొప్ప మునీశ్వరుడగునేమొ!''- యనినది ఒక మోహనాంగి.

''అబ్బో ! కనులువిప్పి చూచుచుండెనే! చూచుట మొదలిడిన కన్నార్పడేమే బాలుడు. దృష్టి నిలుపుట యిప్పటినుండియే సాధన చేయుచుండెను కాబోలు. జ్ఞానియై అజ్ఞానమును పారద్రోలి ప్రపంచమున జ్ఞానజ్యోతిని వెలిగించునా!''— అనినది మరో మంగళాంగి.

''అరగన్నుల నవలోకించుచు సర్వమును గ్రహించుచున్న సర్వాంతర్యామి వలె నుండెను. యోగీశ్వరుడై వెలంగునాయేమి ?''— అని తన అభిప్రాయమును వెలిబుచ్చినది మరొక శుభాంగి.

ఆ విధముగ సైదయ్యయొక్క బాల్యావస్థచేష్టలను చూచి ఎవరికి తోచిన విధముగ వారు, వారి వారి అభిప్రాయములను వ్యక్తపరచుచుండిరి.

ఈ విధముగ ఆనాటి డోలారోహణాది కార్యక్రమములు ఆనందముగ ముగిసినవి.

—o—

## సిద్ధయోగి ప్రసిద్ధ భారతం

### —: నాల్గవ భాగం :—

సైదయ్య నామధేయం రాను రాను అనోటా అనోటాపడి సిద్దయ్యగా రూపు దిద్దుకొనినది పీరుసాహెబు పేరుకు ముస్లిమేగాని అతనికి నేస్తులందరూ హిందువులే. హిందూ మతాచారములనే ఎక్కువగా అవలంభించుట, హిందువులతో ఎక్కువగా పరిచయములుండుట వలన అతని మాటలు, నడవడిలో ఎక్కువ హిందూత్వమే గోచరమగు చుండును. అదియునుంగాక మంచిని ప్రేమించే తత్త్వము కలిగిన పీరు సాహెబు, ఏ మతాచారములను దూషించెడి వాడు కాదు. మంచి ఎచ్చట నున్నను స్వీకరించవలయుననెడి తత్త్వము కలిగిన వాడు. దూదేకుల వంశ సంభవులైన వీరు ఎక్కువగా హైందవాచారములనే పాటించుచుండెడి వారు. హైందవులే స్నేహితులు గూడ ఎక్కువ.

గ్రామము నందు బాగుగ చదువుకొనిన బ్రాహ్మణులుండిరి. వారిండ్లలో దూదినేకుటకు, పరుపులు కుట్టుటకు, పీరుసాహెబే వెడలు చుండెడివాడు. అందు వలన బ్రాహ్మణులలో కూడ పీరు సాహెబుకు మంచి పేరు పలుకుబడి కలదు. తన జ్ఞానమున కందని అనేకవిషయములను ఆయా బ్రాహ్మణ పండితుల నడిగి తెలిసి కొనెడివాడు. అతనికా జిజ్ఞాస ఎక్కువ.

సిద్దయ్య శుక్ల పక్ష నిశాకరుని చందంబున దినదిన ప్రవర్ధమానుడై వెలుంగుచున్నాడు. మతాచారక్రియల ప్రకారము సిద్దయ్యకు అన్నప్రాశనము కూడ ముగించినారు. రోజులు, నెలలు సంవత్సరములు గడిచి పోవుచున్నవి.

ఆనాడు శాస్త్రిగారింటిలో దూదినేకి పరుపు కుట్టుట పూర్తి చేసి ఇకనింటికి బయలు దేరినాడు.

"ఏం! పీరూ। కుమారుడెటులుండెను"—అడిగినాడు శాస్త్రి.

"బాగానే ఉన్నాడు బాబూ!"—పీరుసాహెబు.

"ఇప్పుడెంత వయసు?"—శాస్త్రి.

"ఐదవ సంవత్సరము రాబోవుచున్నది."—పీరు.

"ఐదు వచ్చుచున్నాదా! అయిన నింక ఆలస్యమేల? అక్షరాభ్యాసము చేయించి పాఠశాలకు పంపుము. మీవాడి జాతకము అమోఘముగ నున్నది. మొత్తము మీద మహర్జాతకుడు."—అనినాడు శాస్త్రి అతని కివ్వవలసిన ధన మొసంగుచు.

ఉర్దూ భాష నేర్పించుటయా ? లేక ఆంధ్రభాషయందు ప్రవేశ పెట్టుటయా?- అను శంక బయలుదేరినది. నాడు ఈ ముడుమాల ప్రాంతమంతయు నవాబుల పరిపాలనలో నుండి నప్పటికినీ ముస్లింమత ప్రాబల్యము మెండుగా యున్నప్పటికినీ, ముడుమాలలో ఉర్దూ బోధించు పాఠశాలలు లేవు. కేవలము ఆంధ్రభాషను బోధించు వీధిబడులు మాత్రమే యున్నవి. అందువలన సిద్దయ్యను వీధి బడికి పంపుటకే నిర్ణయించినారు.

ఆనాడు అక్షరాభ్యాస కార్యక్రమము.

పాఠశాలలో అనేకమంది విద్యార్థుల మధ్యమున, ఉపాధ్యాయులు కొంతమంది కొలువున్న తరుణమున, పళ్ళెరమందు బియ్యము పోసి 'ఓం' కారముతో ప్రధానోపాధ్యాయుడు సిద్దయ్యకు అక్షరాభ్యాసము ప్రారంభముచేసినాడు. బడి పిల్లలందరకూ పప్పుబెల్లములు, పలకలు, బలపములు పంచినారు. ఉపాధ్యాయులకు నూతన వస్త్రములు కానుకలనిచ్చి సత్కరించినారు పీరు సాహెబు దంపతులు.

ఉదయమున వ్రాసిచ్చిన ఓ.న. రెండక్షరములను సాయంకాలమునకే చూడకుండ వ్రాసి చూపించి నాడు సిద్దయ్య. అంతియే కాదు వారము దినముల తిరుగకుండగనే ఓ.న. మాలన్నియు ఒప్పు చెప్పుటేగాక,చూడకుండ వ్రాసి చూపించినాడు. "ఏమిది! యింత వేగమా! యింతకు ముందట్టి విద్యార్థినే గానము. యితడు మానవుడా లేక ఈశ్వరాంశ సంభూతుడా! —అనుకొనునంతలో ఒంట్లు అన్నియూ ఒప్పచెప్పినాడు. గుణింతములు ఎక్కములు ఒకటేమిటి, ముందే తనకవన్నీ వచ్చునన్నట్లు చెప్పి చెప్పకముందే వ్రాయుటయో, నోటితో చెప్పుటయో సిద్దయ్య చేయుచుండెను

"ఓ నమః శివాయః" -అని చెప్పుమని యడిగిన "ఓం నమశ్శివాయ" అని చెప్పినాడు. ఆ చెప్పునపుడు అతనిలో ఉప్పతిల్లిన భక్తిభావమునకు గుర్తుగా కనులు మూసికొనుట గాంచి ఉపాధ్యాయులు ఆచ్చెరువందినారు. నాటి నుండి

"ఓం నమశ్శివాయ"- ఆతనికి నిరంతర ధ్యాన మంత్రమై గురువులకు రెండు చేతులతో నమస్కరించునపుడు గూడ "ఓం నమశ్శివాయ" అనెడివాడు.

అతని గ్రహణశక్తికి ఉపాధ్యాయులు అచ్చెరువొందుచుండిరి. పురాణములన్నను, పురాణకథలన్నను ఎంతయో ఉత్సాహమును, ఆసక్తిని ప్రదర్శించెడివాడు. అనేక ప్రశ్నములను వేసి తన సందేహములను తీర్చుకొనెడివాడు. అతని ఉత్సుకత, తెలిసికొనవలయుననెడి జిజ్ఞాసకు అవతలివారు ఆశ్చర్యపడుటయేగాక, ఇంతటి చిన్నవయసులో ఇతని కంతటి జిజ్ఞాస ఎట్లు యలవడినదా!-యని విస్తుబోయెడివారు. అదియును గాక హిందూ పురాణములను, వాటి వివరణలపై అతను చూపెడి మక్కువ విపరీతము.

మామూలు చదువులపై మక్కువ తగ్గినది. భూగోళము, గణిత శాస్త్రము, దేశచరిత్ర యిత్యాది విషయములపై అతను శ్రద్ధచూపెడివాడు కాడు. భాగవతము భారతము, రామాయణము, యిత్యాది కథలందు కావ్యములందు అతనికి శ్రద్ధపెరుగజొచ్చినది. అంతియేగాదు అతనిలో భావవిప్లవము కూడ పెరుగజొచ్చినది.

సిద్ధయ్యలో మార్పు వచ్చుచున్నది. అతను ఎక్కువ ఎవరితోనూ మాటలాడెడివాడుకాదు. ఎప్పుడూ ఏకాంత ప్రదేశములనే ఎన్నుకొనెడివాడు. ఏదో పోగొట్టుకొనిన వానివలే, దేనికోసమో అన్వేషించుచున్న వానివలె కన్పించెడివాడు.

ఏకాంత ప్రదేశములలో ఎవరికీ కనపడకుండా కళ్లుమూసికొని గంటల తరబడి అటులనే కూర్చుండెడివాడు. ఏదో ఆనంద మనుభవించెడివాడు. ఆకలిదప్పులు అతనిని బాధ పెట్టెడివికావు. ఎంత తినిననూ అరగిపోయెడిది — ఏమీ తినకున్ననూ ఆకలియుండెడిదిగాదు. ఒక్కొక్క సమయమున అసలు భోజనమే చేసెడివాడుకాదు. అంతగా భుజించి నప్పుడెటులుండెనో, ఏమీ భుజింప నప్పుడునూ అటులనే యుండెడివాడు. అతని మానసిక, శారీరక స్థితి ఎవరికీ అంతుబట్టెడిదికాదు.

"సిద్ధయ్యా ! పాఠశాలకు పోవాతండ్రీ !"— అని తండ్రి అడిగిన ఏదియో అర్థముగాని నవ్వుమాత్రము నవ్వెడివాడు. ఆ నవ్వులోని భావమేమిటో, అది

ఎక్కడ హరికథా కాలక్షేపములు జరిగినను, పురాణ ప్రవచనములు జరుగు చున్నను మొట్టమొదటి శ్రోత, ప్రేక్షకుడు సిద్దయ్యయే. ఆఖరి ప్రేక్షకుడు, శ్రోత కూడ సిద్దయ్యయే. హరిదాసుగారి పాదములకు నమస్కరించేవాడు సిద్దయ్య. "ఎవరునాయనా ! నీవు. నాకు నమస్కరించుచుంటివి"- అని అడిగితే "ఎవరైతే నేమిలెండు. హరికథా సుధారసము నిట్లు భక్తిప్రబోధముచేయు మీబోటి మహనీయు లకు నమస్కరించుట నా అదృష్టము."- అనెడివాడు.

"సుఖీభవ !"- అని దీవించెడివాడు హరిదాసు.

అనాడు దసరా పండుగ.

ఉపాధ్యాయులు, బాలురు నూతన వస్త్రములను ధరించి పాఠశాలయందు సమావేశమైనారు.

అది ఉషః కాలము.

ఉపాధ్యాయుడు "ప్రార్థన సేయుడు" - అని అనగనే సిద్దయ్య ఏ మాత్రము తొట్రుపడకుండ, గురుధ్యాన శ్లోకమును అత్యంత రమణీయముగ, కమ్మగ శ్రోతల కానందము కలుగనట్లు గానము చేసినాడు.

శ్లో॥ గురుబ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః।
గురుసాక్షాత్పర బ్రహ్మతస్మై శ్రీగురవేనమః।

ప్రధానోపాధ్యాయుడు అమితానంద భరితుడై సిద్దయ్యను ఒక్కసారిగా కౌగలించుకొని, అక్కున చేర్చుకొని "నాయనా! సిద్దయ్యా ! ఎక్కడ నేర్చుకున్నా వురా ! ఎలా నేర్చుకున్నావు. ఈ శ్లోకము నేను నీకు చెప్పలేదే" — అని ఆశ్చర్యమును వ్యక్తము చేసినాడు.

"నిన్న దేవాలయ ప్రాంగణమున కలిగితిని. అక్కడ ఒక్కసాధువు కూర్చొని యుండెను. అతనిని చూడగానే నాకేలనో ఆనందము కలిగినది మన సంతయు ఎంతయో ప్రశాంతి చెందినది అతనికి నమస్కరించ వలయుననెడి కోరిక తరుముకు వచ్చినది. వెళ్ళి అతని పాదములకు నమస్కరించితిని" — అనినాడు.

"తరువాత"— ప్రధానోపాధ్యాయుడు.

"ఆ సాధువు నన్ను దగ్గరగా చేర్చుకొనినాడు. ఒడిలో కూర్చొండబెట్టుకొనినాడు. నా తల నిమిరినాడు. నా ఒడలంతయూ నిమిరినాడు. అతనలా చేయుచున్నప్పుడు నాకేదో విధముగా అనిపించినది. అది నేను పైకి చెప్పలేను. అదొక రకమైన ఆనందము. తరువాత అతను నా నోటిలో చిటికెడు విభూతి వేసినాడు. తరువాత అతని దగ్గరనున్న సొరకాయ బుఱ్ఱలోనున్న నీటిని నాచేత త్రాగించినాడు. "ఏంచదవు కుంటున్నావు!- అని అడిగినారు. చెప్పినాను. "సంతోషము. గురుప్రార్థన చేయుట ఎవ్వరైననూ నేర్పినారాలేదా"— యని అడిగినారు. ఎవరూ యింతవరకు నేర్పలేదని సమాధానమిచ్చితిని. 'అయిననే చెప్పెదను. నేర్చుకొనుము'— అని నాకీ శ్లోకము నేర్పించినాడు."- అని సిద్దయ్య చెప్పగా ప్రధానోపాధ్యాయుడు ఇతర ఉపాధ్యాయులు గూడా 'సెహబ్బాస్! సిద్దా! ముందు ముందు నీ జీవితమెటు పయనించునో తెలియదుగానీ, నీభక్తి తాత్పర్యములు అభినందనీయములు. నీ గురుభక్తి ప్రశంశనీయము. ఇంకేమైననూ నేర్చుకొంటివా!"- అని అడిగినారు.

"నేర్చుకొంటిని"
"ఏదీ చెప్పుము"

"శ్లో॥ యంశైవాః సముపాసతే శివ ఇతి బ్రహ్మేతి వేదాంతినో
బౌద్ధాః బుద్ధ ఇతి ప్రమాణ పటవః కర్తేతి నైయాయికాః
అర్హన్నిత్యథ జైన శాసన రతాః కర్మేతి మీమాంసకాః
సోయంవో విదధాతు వాంఛిత ఫలం త్రైలోక్య నాధోహరిః"

సిద్దయ్య ఆ శ్లోకము చదువగనే విద్యార్థులందరు హర్ష ధ్వానములు చేయుచు, కరతాళ ధ్వనులు మ్రోయించినారు. ఉపాధ్యాయుడు సిద్దయ్యను తదేకముగ జూచుచు "నీవేమైన అవతార పురుషుడవా! యింతటి పిన్నవయసున యింతటి పెద్ద శ్లోకము నెట్లు నేర్చితివి ? ఎట్లు కంఠస్థము చేసితివి ? ఔను సిద్దయ్యా ! దీనికర్థము గూడ తెలుసుకొంటివా !"— అనినాడు ఉపాధ్యాయుడు.

"ఆయనయే చెప్పినారు. చెప్పినది మనసునందు నాటించుకొంటిని. చెప్పమనిన చెప్పెదను"— అనినాడు సిద్దయ్య.

"తప్పక చెప్పుము"— అనినాడు పంతులుగారు.

"ఎవనిని శైవులు శివుడనీ, వేదాంతులు బ్రహ్మదేవుడనీ, బౌద్ధులు బుద్ధుడనీ, ప్రమాణవాదులైన నైయాయికులు కర్తయని, జైనులు అర్హతుడనిన్నీ। మీమాంస శాస్త్రజ్ఞులు కర్మయనిన్నీ పేర్కొందురో, ఆ త్రైలోకేశ్వరుడైన శ్రీహరి మన వాంఛితములను, సఫల మొనర్చుగాక !"— అని చెప్పి ఊరకుండినాడు.

"ఆహా ! ఎంత చక్కగా చెప్పితివయ్యా !"— అని ప్రధానోపాధ్యాయుడు సిద్దయ్యను అభినందించినాడు.

దసరా కీర్తనలుపాడి "జయాభిజైభవ ! దిగ్విజైభవ !"—అని నినాదములు చేయుచూ ఉపాధ్యాయులు, విద్యార్థులు బయల్వెడలిరి.

* * ——— * *

## సిద్దయోగి ప్రసిద్ధ భారతం

—: ఐదవ భాగం :—

అనాడు శివాలయ ప్రాంగణమునందు పురాణ కాలక్షేపము జరుగుచుండెను. అనేకమంది భక్తులు గుమిగూడి యుండిరి సిద్దయ్య ముందు వరుసలోనే కూర్చుని యుండెను. శాస్త్రిలవారు చెప్పు విషయములను శ్రద్దగా వినుచుండెను.

శ్లో॥ ఆహార నిద్రాభయమైధునాని సామాన్యమే తత్పశుభిర్నరాణాం
జ్ఞానంహి తేషా మధినో విశేషో జ్ఞానేన హీనాః పశుభిస్సమానాః

ఉత్తర గీత 2:44

అహారము, నిద్ర, భయము, మైధునము నాలుగును ప్రాణి ధర్మములు. ఇవి జంతుకోటికి ఎంతటిఅవుసరమో మానవులకును అంతియే. అయిననిందు విశేష మేమిటనిన మానవులకు జ్ఞానమనునది అధికముగా నున్నది. పశువుల కదిలేదు. అందువలన జ్ఞానహీనుడు పశు సమానుడు. అని ఉత్తరగీత బోధ సేయుచున్నది.

"శాస్త్రీజీ! నమస్సులు. జ్ఞానమన నేమిటో తెలిసికొనవలయునని యున్నది. ఇప్పుడు చెప్పుటకు సాధ్యమేనా స్వామీ!"—అనినాడు సిద్దయ్య అంజలి ఘటించి.

"చాల మంచి ప్రశ్నయే వేసినావు నాయనా! మంచి ప్రశ్నయే కాదు. బృహత్తరమైన ప్రశ్న కూడాను. జ్ఞానమనుదానిని నిర్వచించి చెప్పుట నాబోటి వానికి కడుంగడు కష్టమైనదే. అయిననూ జ్ఞానమనిన దానికి ఏదో కొంత ఉపోద్ఘాతము మాత్రము చెప్పగలను. వినుము. అసలు సామాన్యార్థములో చెప్పుచుంటిని. లోతుగా చెప్పవలయునన్న ఏ యోగులో, జ్ఞానులో అయినగాని విపులముగా విస్తతృముగా చెప్పగలరు. సామాన్య మానవులకు సాధ్యముగాదు.

"శ్రీకృష్ణ పరమాత్మ ప్రత్యేకించి 'జ్ఞానయోగము' అను ఒక యోగమునే అర్జునున కుపదేశించినాడు గీతా శాస్త్రమునందు. అది అటుయుంచి సామాన్యార్థమున నాకు తెలిసినది చెప్పగలను.

"తమిళ దేశంలో తిరువళ్ళువర్ అనే మహా పండితుడు, భక్తుడు, దైవాంశ సంభూతుడు ఉండెడివారు. ఆ మహానీయుడు 'తిరుక్కురళ్'అనే మహత్తర గ్రంథమును సంతరించినారు. ఆ గ్రంథమునకు 'తమిళ వేదము' అని గూడా పేరున్నది. అందులో ఆ మహానుభావుడు జ్ఞానమును గూర్చిన విశేషముల నుటంకించిరి. అవి నేనిప్పుడుగ్గడించెదను.

"అఱివఱ్ఱం గాక్కుం కరువి
సెఱువార్కుం ఉళ్ళళిక్కల్లాగా అరణ్॥"

అని చెప్పినారు. అనగా తనకై తాను పతనము గాకుండ, యితరులను పతనము గానీయకుండ కాపాడు సాధనమే జ్ఞానము. అంతియేగాక ఒకవేళ, ఎవరైన మనపై పగ బూని ప్రతిఘటించిననూ నాశనము గానటువంటి బలమైన కోట ఒకటి మన లోపల నిర్మింపబడి ఉన్నది. అదియే జ్ఞానము. జ్ఞానము పతనమును తొలగించును. జ్ఞానమునకు పతనమనునది లేదు. అది శాశ్వతమైనది.

"సెన్ఱ ఇడత్తాల్ సెలవిడా తీదొరీ ఇనన్ఱిన్పాల్ ఉయ్ప్ప
దఱివు"

"ప్రతి మానవునకు మనసనునది యొకటున్నది. దీనిని ఎవరికి వారు వారి యాధీనము నందుంచుకొనవలయును. అదియే బహు దుర్లభమైన కార్యము. మనసు నాధీనము నందుంచుకొనుట బహు ప్రయాసకరమైనది. ఇది సాధనమునగాని సాధింపజాలము. ఇది ఒక జన్మమునందే సాధ్యమగునని తలంచరాదు. ఎన్ని జన్మముల తదుపరి సాధ్యపడినను మంచిదే. మానవుడా కార్యమందు గనుక విజయమును సాధించెనేని జ్ఞానసముపార్జన సులభము. మనసును తన యధీనమునందుంచుకొనుటయేగాక చెడుమార్గమునుండి మళ్ళించి మంచిలోకి ప్రవేశపెట్టునదియూ జ్ఞానమే.

"ఎప్పొరుళ్ యార్యార్ వాయిక్కేట్పినుం
అప్పొరుళ్ మెయిప్పొరుళ్ కాణ్బదఱివు॥"

"పలువురు పలు విషయములు తెల్పుచుందురు. ప్రతివారు చెప్పిన ప్రతి

విషయము సత్యమని నమ్మరాదు. అందలి నిజతత్త్వమును విశ్లేషించితెలిసి కొనుటయూ జ్ఞానమే.

"ఎన్ పొరుళ వాగచ్చెల చ్చొల్లి త్తాన్ పిఱర్వాయ్
నున్ పొరుళ్ కాణ్బదఱివు"

"ఇంకొక్క విషయముగూడ నున్నది. మనము మాటలాడు ప్రతివిషయము ఎదటివారి హృదయమునకు హత్తు కొనునట్లు మాటాడవలయును. ఇతరులు మాట లాడునపుడు వారి మాటలలోని సూక్ష్మములైన విషయములను తెలిసికొనుటయు కూడ జ్ఞానమే యగును.

"తిరువళ్ళువర్ మహానుభావుడు యింకా కూడ చెప్పియున్నాడు. సజ్జన సాంగత్యము కూడ జ్ఞానమేనని తిరువళ్ళువర్ తన మాటలలో

"ఉలగం తళీ ఇయదొట్పం; మలర్ దలుం
కరామ్బలుం ఇల్లదఱివు"

అనగా ఎవరైననూ మనలను పొగడినప్పుడు పొంగిపోవుట, తెగడినప్పుడు కృంగిపోవుట అనునవి లేకుండ మనల గలుగుటయూ జ్ఞానమే. మంచి మైత్రిని సదా నిలుపుకొనవలయును. అట్లు నిలుపుకొనవలయుననెడి భావన, ఆలోచన, అందుకు తగ్గ కృషియు కూడ జ్ఞానమే.

"ఎవ్వదుఱైవదు ఉలగం, ఉలగత్తోడు
అవ్వ దుఱైవదు అఱివు"

ప్రపంచపు పోకడ ఎటులుండెనో గమనించి తద్విధముగ అనుసరించుటయూ జ్ఞానమేనని ప్రవచించినాడు తిరువళ్ళువర్ మహాశయుడు. ప్రపంచపోకడ ననుస రించి మన జీవితమును సాగించుటయు మంచిదని పెద్దలు వచించుచుందురు.

"అఱి ఉడైయార్ అవదఱివార్
అఱి విలార్ అఃదఱి కల్లాదవఱ్.

జరుగబోవు దానిని తెలిసికొనెడి సామర్థ్యము, శక్తి, కలిగియుండుట కూడ జ్ఞానమే. అటువంటి శక్తిసామర్థ్యములు కలవారు జ్ఞానులు. జ్ఞానహీనులు అట్టి శక్తి సామర్థ్యములు లేనివారే.

"అంజువదం జాపై పేదైమై
అంజువదు అంజల్ అఱివార్ తొళిల్.

"నిర్భయత్వమును నేర్చుకొనవలయును. భయము పుట్టించువానిని చూచి భయపడకుండ ఎట్లుండగలము? భయము గొల్పు దానిని చూచి భయపడుట సర్వ సాధారణము. రాబోవు దానిని గ్రహించి రక్షించుకోగలిగిన జ్ఞానముగలవారికి భయము పుట్టించున దేదియూ రాదు.

"అఱివుడైయార్ ఎల్లాం ఉడైయార్
అఱివిలార్ ఎన్నుడైయ రేనుం ఇలర్"

"మామూలు సిరిసంపదలు లేకపోయిననూ జ్ఞానసంపన్నులు సర్వము కలిగినవారే. జ్ఞాన మనునది ఒక సంపద. ఆ సంపదకు విలువ గట్టగలిగిన వారెవరూ లేరు. అటువంటి అద్వితీయమైనది జ్ఞానసంపద. జ్ఞానము వినా ఏయితర సంపదలు కలిగియున్ననూ అది జ్ఞానముతో సరికాదు. కావున జ్ఞాన సంపద అద్వితీయమైనది, అమోఘమైనది"—అని చెప్పి ఊరుకున్నారు శాస్త్రి.

"నా కింకనూ తెలిసికొనవలయుననెడి జిజ్ఞాస ఎక్కువగా నున్నది. నాకింకా చెప్పండి స్వామీ!" అనినాడు సిద్దయ్య.

అతని మాటలకు, మన్ననలకు, పెద్దల యెడల గౌరవ మర్యాదలకు భక్తి ప్రపత్తులకు శాస్త్రిలుగారు చాలసంతోషపడినారు తెలిసికొనవలయుననెడి జిజ్ఞాసయూ జ్ఞానమే! నీకీ విషయములపై జిజ్ఞాస కలుగుట పూర్వజన్మ విశేషము. నాయనా! మాది చెన్నపట్టణం. నేను మీ ఊరిలోనున్న శ్రీధరాచార్యుల వారింట మకాంచేసియున్నాను! రేపు నీవు అక్కడికి రా! మిగతా విషయములు చెప్పగలను" అనినారు శాస్త్రిలు.

ఆనాటికి పురాణ కాలక్షేపము ముగిసినది.

...0...

## సిద్ధయోగి ప్రసిద్ధభారతం

### —: ఆరవభాగం :—

ప్రాతఃకాలము.

శాస్త్రిలుగారు కాలకృత్యములు తీర్చుకొని, స్నానసంధ్యాదులు ముగించుకొ పంచలో ఒక్కరే వాలుకుర్చిలో కూర్చుని యున్నారు. సిద్దయ్య ప్రవేశిం "నమస్తే!"-అనినాడు.

"ఓ! నీవా! రా!" —అనినాడు శాస్త్రిలు.

సిద్దయ్య అరుగుమీద కూర్చుండినాడు.

"ఇంతకూ నీ వెవరు ? ఎవరబ్బాయివి" — అనినాడు శాస్త్రిలు.

"పీరుసాహెబు కొడుకును....సిద్దయ్యను."

"ఏమిటి తురుష్కుడవా! ఛీ! ఛీ! వెంటనే యిక్కడి నుండి వెళ్ళిపో! ఇం ప్పుడూ యిటువైపు రాకు. నిన్నింత సేపూ నేను చెప్పినది ఒక తురుష్కునకా!" అనినాడు శాస్త్రిలు.

సిద్దయ్య ఒక్కసారిగా ఆదరిపడినాడు.

"నేనేంతప్పు చేసానని అంతగా దండిస్తున్నారు."

"నీవు తురుష్కుడవై పుట్టుటయే నీవు చేసిన తప్పు"

"మేము కుట్టిన పరుపులపై పరుండి, మీరు సుఖ నిద్ర చెందుతున్నా మేము కుట్టిన పరుపులు మీరు పరుండుటకు పనికివచ్చినపుడు మాకు జ్ఞానబో సేయుటకు కులము అడ్డమా!"—అనినాడు సిద్దయ్య.

"అధనప్రసంగము సేయకు! పో! యిక్కడనుండి"—శాస్త్రిలు.

"మరిదంతా జ్ఞానమేనా శాస్త్రీజీ!" -సిద్దయ్య....

"పోరా బయటకు అంటుంటే!" —అని మీద మీదకు వచ్చినాడు శాస్త్రి.

సిద్దయ్య కదలలేదు....

"బెల్లం కొట్టిన రాయివలె నిలబడుదువు. కదలవేమీ ?"

"జ్ఞానమా!....లేక జ్ఞానహీనమా! -నిన్నటికీ ఈనాటికీ ఈ జ్ఞానంలో యింత మార్పెట్లు వచ్చెనాయని ఆలోచించుచుంటిని. నిన్న ఆరోగ్యముగనున్న నయనమ్ముల కింతలోనే ఉన్నట్లుండి ఎట్లు పసికిర్లాయనా యని యోచించుచుంటిని. నిన్నటి నాలుక తెల్లవారేసరికి తాటి పట్టెగా ఎట్లు మారెనాయని ఆలోచించుచుంటిని". అని నాడు సిద్దయ్య.

శాస్త్రిలుగారి కోపం హద్దులు దాటినది. కాని అతని అడుగు ముందుకు పడలేదు. ఎవరో మంత్రించి నట్లు ఆటులనే నిలబడి పోయినాడు.

"ఏమి? రండి! కొట్టుడు. ఎందులకట్లు నిలబడిపోతిరి జ్ఞాన స్వరూప మింత త్వరగా మారి పోవునని తలంచనైతిని. ఇటువంటి జ్ఞానమును మీమీ భోషాణములలో వైచి, మీమీ బిడ్డలకు, ముందు తరములవారికి దాచి పెట్టిఅందించుడు. మాకు అవసరము లేదు. వచ్చెదను." -అని అచట నుండి సిద్ధయ్య విసవిసా నడిచి వచ్చేసినాడు.

సిద్దయ్య అక్కడనుండి బయలుదేరి ఏకాంత ప్రదేశమునకు వెళ్ళినాడు. అక్కడ ఒక పచ్చని చెట్లగుబురులో ఎవ్వరికీ కన్పించకుండ కళ్ళు మూసికొని కొన్ని గంటలు గడిపినాడు. అతనా అచేతనావస్థలో ఎంతసేపు ఆటుల యుండెనో అతనికే తెలియదు.

"సిద్దయ్యా!"-అన్న పిలుపుకు మాత్రము కళ్ళు తెరచి మరల మూసికొని నాడు.

"సిద్దయ్యా!" - మరల అదే పిలుపు వినిపించినది.

కళ్ళు తెరచి చూసుసరికి తెల్లని గడ్డము, తెల్లని గుడ్డలు, తెల్లని తలగుడ్డ తెల్లనిజోలె, శుద్ధసత్త్వస్వరూపుడు....అతని చూపులు చల్లగా తెల్లగా హాయిగా ఆనందముగా ఉండెను.

"బాబా!"-అనినాడు సిద్దయ్య.

"హాఁ! బేటా! మై బాబాహూఁ! బేటా! ఎంతసేపటినుండి నీవీ సమాధి స్థితిలో నుంటివో తెలియునా! ఇంచుమించు ఆరు, ఏడు గంటలైనది. ఇపుడు సూర్యుడు

వేదాంతులు. చెప్పడమే వారి వృత్తి. చేయుట వారికి సరిపడదు. ఫరవాలేదు. నేను చెబుతాను. రా!"—అని సిద్ధయ్యను ఇంకా గుబురుగా ఉండే వృక్షచ్ఛాయలలోనికి తీసికొని వెళ్ళినాడు. వెంబడి కూర్చొన బెట్టుకొని హస్తమస్తక సంయోగము చేసినాడు.

"అడుగు నాయనా! అడుగు! ఇప్పుడేమి కావలయునో అడుగు"—అనినాడు బాబా!

"బాబా! మనసును ఆధీనములో నుంచుకొనుట చాలా కష్టమని చెప్పినారు. అది కొంచెము వివరముగా చెప్పండి బాబా!"-సిద్ధయ్య.

"చెబుతాను నాయనా! శ్రీ కృష్ణ పరమాత్మ అర్జుననకు భగవద్గీత బోధ చేయుచు, ధ్యానయోగము లేక ఆత్మసంయమయోగము అనే ఒక యోగమును గూర్చి బోధచేయుచుండిన సమయమున అర్జునుడు కూడ నీ వడిగినట్లే అడిగినాడు.

శ్లో॥ యోఽయం యోగస్త్వయా ప్రోక్తస్సామ్యేన మధుసూదన।
ఏతస్యాహంనపశ్యామి చంచలత్వాత్ స్థితం స్థిరామ్॥.

గీత : 6 : 3.

అనిన ఓ! కృష్ణా! నీ చేత జీవాత్మ పరమాత్మల ఏకత్వమనెడి యోగము చెప్పబడినది నిజమే! కాని దానిని నే నెఱుంగజాల కుంటిని. నా మనసు చంచలమైన దగుటవలన, స్థిరత్వము లేకపోవుటవలన నీ ప్రబోధము నా మనసు కెక్కుట లేదు.

శ్లో॥ చంచలం హి మనః కృష్ణ! ప్రమాధి బలవద్దృఢం ।
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివసుదుష్కరమ్॥.

గీత : 6 : 34

మనసు మిక్కిలి చంచల స్వభావము కలిగి నటువంటిది. దేహమును, యింద్రియములను అధికముగ క్షోభపెట్టు నటువంటిది. ఎవ్వరిచేతకూడ నిరోధింప సాధ్యము కానిది. కాబట్టి అట్టి మనస్సును నిగ్రహించుట శక్యముగాదని నేను తలంతును, వాయువును నిరోధించ సాధ్యమా కృష్ణా! అట్లే మనస్సును -అనినాడు అర్జునుడు."

శ్రీకృష్ణపరమాత్ముడు భక్తవత్సలుడు అపుడు చెబుతాడు.

శ్లో॥ అసంశయం మహా బాహో! మనో దుర్నిగ్రహంచలం ।
అభ్యాసనతుకౌంతేయ। వైరాగ్యేణచ గృహ్యతే॥ గీత 6:35

అనగా మనస్సు నిగ్రహింప శక్యము కానిదని పరమేశ్వరుడు కూడ ఒప్పుకొనినాడు. మిగుల చపలమైనదను విషయమున సందేహములేదు. అయినను అట్టి మనస్సును అభ్యాసము చేతను, వైరాగ్యము చేతను, నిగ్రహించుకొనవచ్చును. దీనియందు మనో నిరోధము ప్రయాసమైనదని చెప్పుచూ, శ్రీకృష్ణుడు అభ్యాస వైరాగ్యములు కలవానికి సాధ్యమేనని ప్రవచించినాడు. కనుక అభ్యాసవైరాగ్యములు కలవారు తప్పక ఆ బ్రహ్మ పదమును బొందగలరని తన యాశయమును భగవానుడు తెలిపెను. ఇపుడెవరైన బ్రహ్మ భావమునందు మనస్సు నిలకడలేదనిగాని, సంకల్పము నశించలేదనిగాని చెప్పువారుండిన వారికి అభ్యాస వైరాగ్యములు పూర్తిగా లేవని తెలిసికొనవలయును.

"చూడు నాయనా!- ఇక్కడ ఒక్క విషయము చెప్పెదను వినుము. ఈ మనస్సు కోతి వంటిది. అట్టి కోతి కల్లు త్రాగిన ఎట్లుండునో, అంతియేగాక అదే సమయమున దానికి తేలుకూడ కుట్టిన దానిపరిస్థితి ఎట్లుండునోయూహించుకొనుము. మనసు కూడ కోతియొక్క స్వభావము కలది. అయితే అట్టి కోతికి మత్తుమందు ప్రయోగము చేసిన ఏవిధముగ చలనములేక పడియుండునో, అదేవిధముగ మద మనెడి మద్యముచేతను, అసూయ యనెడి తేలు కాటుచేతను. అహంకారమనెడి మనస్సు బ్రహ్మధ్యానము, లేక భగవచ్చింతన అను మందును గనుక స్వీకరించిన శాంతి నొందును.

"కనుక జ్ఞానము పొందుటకు మనోనిశ్చలత, దృఢత్వము, ధీరత్వము ఎంతైనను అవసరము. సరే ఇక వెళ్ళెదము. అర్థమైనదని యనుకొందును. కనుక నీవు గురువును చేరు సమయ మాసన్నమగుచున్నది. గురు సేవలో నీవు సర్వము గ్రహించగలవు. నీగురువు నీకొఱకెదురు చూచుచుండెను"-అనినాడు బాబా!

"నా గురు వెక్కడుండిరి బాబా!"- అని వెనుదిరిగి చూచుసరికి బాబా అక్కడలేడు. సిద్ధయ్య ఆలోచన చేసికొనుచు ఇంటికి చేరినాడు.

## సిద్ధయోగి ప్రసిద్ధ భారతము

### —: ఏడవ భాగం :—

"బాబా!" -పిల్చినాడు సిద్దయ్య.

"అరే బేటా! కహాఁగయారే! నీ కొఱకే వెదకుచుంటిని. పాఠశాలకు రాలేదని పంతులుగారు చెప్పినారు. ఎక్కడకు వెళ్ళితివి? బడికి వెళ్ళకున్న పాఠము లెట్లు వచ్చును!"-అనినాడు పీరుసాహెబు.

సిద్దయ్య ఏమియూ మాట్లాడలేదు.

ఇంతలో ఆదంబి లోపలనుండి వచ్చి "అరే! మేరేలాల్! కహాఁగయాబేటా! అచ్ఛా! అందర్ ఆవ్! ఖానా తయ్యార్ హై"-అని భర్త వైపు కూడ చూచి "తుమ్ భీ ఆవోనా!-అనినది.

పీరుసాహెబు, సిద్దయ్య లోపలకు వెళ్ళినారు.

తండ్రి, కొడుకు లిద్దరూ కాళ్ళు చేతులు ముఖము కడుగుకొని పీటలమీద కూర్చుండినారు. ఆదుంబి వారిద్దరి మధ్యమున అన్నము వడ్డించినది.

"ఖావో! బేటా! ఆజ్ ముర్గీగా పులావ్! బహుత్ పసంద్ హైనా! ఖావో!"-అనినదీ ఆదంబి.

"ముర్గీ!"- అని ఒక్కసారిగా అన్నమువద్ద నుండి పైకి లేచినాడు.

"క్యాహువా బేటా। క్యాహువారే।"- తండ్రి.

"బాబా। కోడిని చంపి దాని మాంసముతో కూర వండితిరా।"

"హాఁ బేటా।"

"తప్పు చేయుచుంటిరి బాబా! మనతోబాటే నిన్నటి వరకూ మనతో పెరిగిన ప్రాణి. అదియునుగాక మనము నిత్యము ఆహారమిచ్చి, పెంచి పోషించబడిన ప్రాణిని మనమే నిర్దాక్షిణ్యముగ చంపి తినుచుయా! అరే అల్లా! హమ్ కితనా పాప్ కర్తాహై! బాబా! నీవు నన్ను చంపి తినగలవా! అదీ శరీరమే! ఇదీ శరీరమే!"-అనినాడు సిద్దయ్య.

"బేటా,"— ఆశ్చర్యపోయినాడు పీరుసాహెబు.

"హా! బాబా! మాంసాహారము మహా పాపము. ఒక జంతువును బలవంత మున ప్రాణము దీసి, దాని శరీర మాంసములను యీ విధముగ పచనముచేసి, మన శరీరమును పెంచుకొనుటకు ఆ శరీరము నావిధముగ హింసించి. బాధించిభుజించుట మానవత్వమునకు నిదర్శనము కాదు. నేనింతవరకూ తప్పు చేసితిని. పాపము చేసితిని ఇక నుండి నేనీ రక్త భోజనము చేయను. నాశరీరమును పెంచుకొనుటకు మరో ప్రాణి శరీరమును భుజింపను. ఇతర ప్రాణుల శరీరములను పీక్కు తిను నాలో నా తోటి జీవులపై ప్రేమ ఎక్కడిది? ప్రేమలేని జీవితము వృధా! ప్రేమ దైవ స్వరూపము. జంతు హింస నేను సహింపను.

"మనిషి కరుణామయుడు కావలయును. తన్ను తాను ప్రేమించుకొనినట్లు తనతోటి జీవులను ప్రేమించగలుగవలయును. అప్పుడే మానవత్వమున కొక అర్థము నేను మాంసము తినను. నన్ను తినమని బలవంతము చేయవలదు.

"మాంసమనగా దేహమందలి వ్రణమని పెద్దలు చెబుదురు. మరి వ్రణము నెవరైన భుజింతురా! వద్దు తండ్రీ వద్దు నాతోటి జీవిని నా కొఱకై భుజింపలేను." సిద్దయ్య ఏడ్వ ప్రారంభించినాడు.

"సిద్దయ్యా! నీకివన్నీ ఎవరు చెప్పిరయ్యా!"

"అల్లా!"

"అల్లా!"- ఆశ్చర్యపోయినారు తల్లితండ్రులు.

"తండ్రీ! మనుష్యుల ఆహారము మూడు విధములుగ విభజింపబడినది, ఒకటి అమృతము, రెండవది మృతామృతము, మూడవది మృతము.

"అమృతమనగా చనిపోనిది. మృతామృతమనగా చనిపోవునది — చని పోనిది. మృతమనగా చనిపోయినది — అని, నేతిని, పాలను, ఫలములను అమృతములని అనుచుందురు. ఎందువలన? మనకా పదార్థములు వేనినుండి లభించుచున్నవో లేదా మనకు యేవి వాటిని ప్రసాదించుచున్నవో అవి మరణించవు. జీవించియుండును. పాలనిచ్చిన ఆవుగాని, గేదెగాని, మేకలుగాని పాలనిచ్చి

నందువలన మరణించదు. అదియునుగాక ఆవుపాలను తనకై తానుగా యిచ్చు చున్నది మచ్చికచేసికొనిగాని, మరేదైననుగాని, పశువులనుండి మనిషి పాలను బొందుచున్నాడు. అనగా పశువు పాలను మనిషికి ప్రదానము చేయుచున్నది. ఆ కారణమున అది మరణించదు దానికి వలయు బలకరమైన ఆహార పదార్థములను మానవుడు నిత్యమూ దాని కొసంగుచున్నాడు.

"అటులే పండ్లనుకోసికొన్న పిదప చెట్టుఎండిపోదు. పండ్లు కోయకపోయి నను పక్వము కొచ్చిన పిదప పండ్లురాలి క్రిందపడును. అప్పుడునూ చెట్టు ఎండిపోదు.

"కాని ప్రాణి తన దేహమును మానవున కివ్వగలదా ? చెట్టు ఫలముల నిచ్చి నట్లు, పశువు పాలనిచ్చినట్లు ప్రాణితన దేహమును మనుష్యుడు తినుట కంగీక రించునా !— ఆలోచింపుడు. ఎవరు ప్రాణము వారికి తీపియేగదా!

"కనుక ఫలాదులు అమృత సమానములు. ఈ అమృతాహారమే మనుష్యు లకు శ్రేష్ఠతమము. అప్పుడే పుట్టిన బిడ్డకు తేనె తినుపించుటలోగల ఆంతర్య మిదియేగదా !

"రెండవది మృతామృతాహారము. ఇది కొంత కాలములో ఉత్పత్తిక్షయము లను పొందుచుండును. రకరకముల ధాన్యములిందు కుదాహరణములు. కర్ష కులు మరల విత్తుటకు అవసరమైనంతటి అమృత సంజ్ఞిక ధాన్యములను సంగ్ర హించి దాచి యుంచెదరు. తక్కిన ధాన్యమును విక్రయించెదరు. అది ఒకవిధ మైన మృతసంజ్ఞను బొంది తినుటకుపయోగ పడుచుండును. ఇది మధ్యమ తరగ తికి చెందినదైనను ఈ మృతామృతాహారము కూడ శాస్త్ర సమ్మతమనే పెద్దలు చెప్పిరి. ఇక్కడ ప్రత్యేకించి రక్తమాంసములతో కూడిన ఏ జీవినీ హింసించుట లేదను సత్యమును మనము గ్రహించవలయును.

"మూడవది మృతాహారము : మాంసము, చేపలు యిత్యాదులు ఈ తరగతికి చేరును. ఒక ప్రాణిని చంపకున్న ఈ ఆహారము లభించదు. రక్తమాంసములు గలిగిన ప్రాణిని వధించినగాని, దాని ప్రాణము పోయిన పిదప ఆ శరీరమును పచ నముచేసికొని తినుటయేగదా ఇందుకు ప్రత్యేకత. దీనినే పూర్వకాలమందు రాక్షసా

హారమని చెప్పిరి. బాబా ! ఎందు కట్లనిరని నీవడుగవచ్చును ! నాటి కాలమందు రాక్షసజాతి మనుష్యులు అడవులలో స్వచ్ఛందముగ సంచరించుచు అక్కడక్కడ కాపురముసేయుచు పశుపక్ష్యాదులను చంపితినుచుండెడివారట. బహుశ అందువలన అనగా రాక్షసజాతి మనుష్యులు తినుచుండిరి గనుక దీనిని నాటి ఋషులు మొదలగువారు రాక్షసాహారమని వర్గీకరించిరేమో తెలియదు. ఏది ఏమైననూ, దీనిపై వాదోప వాదములనవసరము. ఎందువలన యనిన అవునని చెప్పిన దానిని కాదనియు, కాదని చెప్పిన దానిని ఔననియు వాదించుట కవకాశములు లేకపోలేదు. కారణము గత కాలమునందే యిట్టి అఘాయిత్యము లుండినవి. యజ్ఞముల పేరిట, యాగముల పేరిట అమాయక పశువుల వధించిరని వింటివి.

"నాకు మాత్రము మాంసాహారముపై ప్రీతిలేదు. అదినాకు నిషిద్ధము "అహింసా పరమో ధర్మః'— యనునది నా సిద్ధాన్తము. తోటి జీవిని హింసించి సుఖముబడయుట పరమాత్ముడు మెచ్చడని నా మతము."- అని సిద్దయ్య ఊరకుండెను.

సిద్దయ్య జ్ఞానమునకు పీరుసాహెబు ఆశ్చర్యపోయినాడు. అదంబి ఆవాక్కయి నిలువబడినది. సంతోషమున సిద్దయ్యను అక్కున చేర్చుకొని "బేటా ! యిటువంటి పెద్ద పెద్ద విషయములన్నియు ఎవరు చెప్పిరి !"- అనినది అదంబి

"అడవిలోని సఫేద్ దాడివాలాబాబా ! అయనే అప్పుడప్పుడు వచ్చి అడుగయే అనేక విషయములను చెప్పుచుండిరి. అయన ఈ విషయములన్నియూ చెప్పినారు. అయనను చూచిన అల్లాను చూచినట్లుండును."

సఫేద్ దాడీవాలాబాబా ! అనగనే అమెకు సిద్దయ్యను కనబోవు ముందర ప్రత్యక్షమైన బాబా కనుల ముందు కనబడినాడు. మనసులోనే అతనికి నమస్కరించినది.

"నీకవి బాగా నచ్చినవా తండ్రీ!''—అనినాడు తండ్రి.

"హాఁ! బాబా! అహింస మానవ ధర్మంగావాలనేది నాధ్యేయం. తోటి ప్రాణిని హింసించడం మానవత్వానికి కళంకమని నా ఉద్దేశ్యము బాబా! అందుకే నా మాట విని మీరు కూడ యిక నుండి మాంసాహారము మానుకొనుడు." -అన్నాడు సిద్దయ్య

"అలాగే! బేటా! నీకు యిష్టములేని పని మేము మాత్రము ఎందుకు చేయ
దము. అటులనే ఈ రోజునుండి మాంసాహారమును విసర్జించుచుంటిమి. కాం
గూరలతోటి జీవించెదము." అని భార్యవైపుజూచి "క్యాజీ బేగం".

"జీహాఁ!"-అనినది ఆదంబి.

"బేటా!-అటులయిన తినగూడనివి యింకేమైననూ ఉన్నావా!" అనినా
పీరు సాహెబు.

"ఉండియే ఉండును. బాబాను అడిగి తెలుసుకొని చెప్పెదను".- అనిన
సిద్దయ్య.

పీరుసాహెబు సిద్దయ్యను గుండెల కద్దుకొనినాడు. ఆదంబి సిద్దయ్య
హృదయాని కత్తుకొని "నీవొక మహానుభావుడవే అయ్యెదవో!- మహనీయుడ
అయ్యెదవో! తెలియదు"-అని లోలోన అనుకొని లోనికి తీసికొని పోయినది.

పీరు సాహెబు కూడ వారితో లోనికి పోయినాడు.

...o...

# సిద్ధయోగి ప్రసిద్ధ భారతం

## —: ఎనిమిదవ భాగం :—

"బాబా!....మాంసాహారమును విసర్జించితిని. అంతియేగాక యింకనూ భక్ష్యాభక్ష్య వివరములు తెలుపగలరాస్వామీ!"—అనినాడు సిద్దయ్య.

"ఉన్నవి నాయనా! కాని యుగములు మారుచున్న కొలదీ దర్మములు కూడ మారుచున్నవి. ఒక యుగమున నున్న ధర్మము మరియొక యుగమున అధర్మ మగుచున్నదీ. ముఖ్యముగ ఆచార వ్యవహారములయందు ఒకనాటి ఆచారము మరో నాటికి దురాచారమగుచున్నది. ఒకనాటి దురాచారము మరోనాటికి సదాచారమై వర్ధిల్లుచున్నది. ఆచారమునకు ధర్మమునకు చాలా దగ్గర సంబంధమున్నదీ. 'ఆచార ప్రభవో ధర్మః' —ఆచారము నుండియే ధర్మముద్భవించినదని పెద్దలు చెబుతారు. అయిననూ కొన్నికొన్ని విషయములను తెలుపుదును. వినుము.

"విష్ణుపురాణమందు భక్ష్యాభక్ష్య పదార్ధముల గురించి పదిహేను శ్లోకములలో వివరణ యియ్యబడినదీ. అయితే యిందులో విషయములన్నియు యథావిధిగ యిప్పటి కాలమందు పాటించుటకు కుదురదు. కారణము ఈ గ్రంథ నిర్మాణము జరిగి ఎన్నియో యుగములు మారినది. అప్పటికీ ఇప్పటికీ సామాజిక పరముగ ఎన్నియో మార్పులు వచ్చినవి. కనుక వాటిని కేవలము తెలిసికొనుటకు మాత్రము ఉపయోగించుకొనవలయునే గాని, తు.చ. తప్పకుండ పాటించుటకే కాలమందు సాధ్యపడదు. ఏది చెప్పిన అద్దిగ్రుడ్డిగా నమ్ముటకు ఈనాటి ప్రజలు సిద్దముగా లేరు. వారిలో విమర్శనా జ్ఞానము బాగుగా వృద్దిపొంది యున్నదీ. మంచి చెడుల బేరీజు వేసి కొనెడి పరిజ్ఞానముగూడ అలవడియున్నది. కనుక బలవంతముగ ఏ నిర్ణయమును ప్రజలపై రుద్ద సాధ్యము కాదని తెలియుము. నేను చెప్పు విషయములు, వ్యాఖ్య కొంతవరకు విప్లవాత్మకముగ నుండవచ్చును, గాని విషయ విశ్లేషణ మత్యంత ఆవశ్యకము, అనివార్యము గూడ.

"పిసినిగొట్టువాడు, నేరములుచేసి బంధించబడి, ప్రజలలో పలుకుబడిని పోగొట్టుకొని, సామాజిక, సాంఘిక బహిష్కరణ పొందిన మానవుడు, చోరుడు

మొదలగు వారిచ్చు ఆహారమును స్వీకరించరాదు. తినరాదు అని శాస్త్రము. అయి ననిది ఎంతవరకు సాధ్యమొ ఊహించవలయును.

రంగు లద్దకము చేయువాడు యిచ్చు ఆహారమును కూడ తినరాదని చెబు తున్నారు. రంగులద్దకము చేయువాడు చేసిన పాపమేమో యిందు తెలియరాదు. అతడు దొంగతనము చేయుటలేదు. దుర్వ్యాపారము సేయుటలేదు. రంగులద్దుట వృత్తిగా స్వీకరించి, కష్టపడి సంపాదన చేసి కొనుచుండినాడు. మరి అతనిపై ఏల నిషేదము నుంచినారో అనూహ్యము.

"పతితుడు. ఉపనయనాది సంస్కారములు లేని వ్యక్తుడు, దుష్టుడు, బైట చేరిన స్త్రీ, విధవ, నేతనేసి జీవించెడి వాడు. పాషండుడు, వధచేసి జీవించువాడు, వేటాడి జీవించువాడు, వ్యభిచారిణి, రాజద్వేషి, చర్మకార వృత్తితో జీవించువాడు. ఆ యుధములతో జీవించువాడు, ఆయుధములమ్ముకొని బ్రతుకువాడు, వస్త్రములుతికి బ్రతుకువాడు. కఠిన క్రూరస్వభావుడు, అర్తుడు (రోగములచే కాని మరి యితర విధ ములగు బాధలచే కాని క్లేశపడు వాడు) స్త్రీజితుడు (భార్యకు లోబడి వర్తించువాడు) గ్రామయాజి (ఊరియందలి అందరికీ పౌరోహిత్యము చేయువాడు), తున్నకుడు (బట్టలు కుట్టి జీవించువాడు) తప్పుడుసాక్ష్యములు చెప్పువాడు, దొంగసంతకములు వ్రాతలు వ్రాయువాడు, మోసగాడు, శూద్రులకు పౌరోహిత్యము చేసి జీవించువాడు. దేవతాదులకు అర్పించని వాడు—వీరు పెట్టిన అన్నము తినరాదని పురాణ వచనం.

"ఇందులో ఒక్కొక్కరిని తీసికొని చర్చ చేసికొనిన యెడల కొంతలో కొంత స్వార్థము గోచరించక తప్పదు. శూద్రాదులను దూరముగా నుంచుటయే యిందులో ప్రధాన కారణమగా గోచరించుచున్నది తప్ప వేరు కారణము కానవ

"పతితుడు :- ఇతడు పతనమైన వాడే. ఇటువంటి వానిని దూరముగా నుంచుటమేలే అయిననూ, అతను మారి మంచివాడైనప్పుడు కూడ వెలివేసి యుంచుట పాడిగాదు.

"ఉపనయనాది సంస్కారములు లేనివాడు :- ఉపనయనాది సంస్కారముల కేవలము ఆచారములు. మానవుడుద్భవించిన ఎన్నో సంవత్సరాల అనంతరం నాగరికత పెరిగి ఇటువంటి నిబంధనలు వచ్చినవిగాని, అది మానవుని దృష్టి నిద

కొనిన యివన్నియు లేవుగదా ! దాన ధర్మములు సేయుటకు, అన్నదానాది కార్య క్రమములు నిర్వహించుటకు ఉపనయనాది సంస్కారములు అర్హతలు అనిన దేశమందు దానధర్మములు చేయువారి సంఖ్య బాగుగా పడిపోవునేమో. బహుశా యిటువంటి నిబంధనలు పెట్టకయుండిన, ఉపనయనాది సంస్కారములు నిర్వహించరను వుద్దేశ్యముతో యిట్టివి నాటి సమాజము నిర్ణయించి వుండిననూ ఉండ వచ్చును.

"దుష్టుడు :- ఇతనికి సహజముగ అందరూ దూరముగనే నుంచుదురు. ఇంక పోయిపోయి యితనిచ్చు ఆహారమునకై పరుగులు పెట్టువారెవరుందురు ?

"ముట్టుత :- (బైటచేరిన స్త్రీ) సాధారణముగ బైటచేరిన స్త్రీ తన భర్తకు, బిడ్డలకు కూడ స్నానాదికములు ముగించుకొనకుండ భోజనాదులు వడ్డించదు. ఇంక యితరుల కెట్లు ఆమె అన్నమిడును. అదియునుగాక బ్రాహ్మణాది కొన్ని కులము లందున్న స్త్రీలు ఋతుమతియైన పిదప మూడు దినములు బైటనుందురు. తరువాత స్నానముచేసి యింటిలోని కొత్తురు. కాని శూద్ర స్త్రీల విషయములో అట్లుగాదు. ఋతుమతియైన పిదప శుద్ధముగ శిరఃస్నానముచేసి గృహప్రవేశము చేయవచ్చును. వంటా వార్పులు చేయవచ్చును. భర్తలకు, బిడ్డలకు వడ్డనలు చేయవచ్చును. కాని ఈ పద్ధతి రానురాను సంపూర్తిగా సడలిపోవునదై యున్నది. బ్రాహ్మణ స్త్రీలు సహితము రాబోవు కాలములో శూద్ర స్త్రీల ననుసరింతురు.

"వాపుడు :- (నేతనేసి జీవించెడివాడు) కష్టపడి సంపాదించుకొని, కుటుంబ పోషణ చేసికొనుచు, దైవభక్తి పరాయణుడయిన వాపుని ఆహారమేల స్వీకరించ రాదో తెలియదు. కేవల మతడు శూద్రవంశ సంజాతుడైనందున ఈ నిషిద్ధ మాతని తలపై రుద్దబడి యుండవలయుగాని వేరుకాదు. ఇతడు శ్రామికుడేగానీ, శ్రమను దోపిడీ చేయట లేదు గదా !

"పాషండుడు :- అనగా వేదబాహ్యుడని అర్థము సదాచారము లేక, దురా చారియై, దుస్సాంగత్యముతో సంఘమునకు చీడపురుగువలె తయారైన ఏ మానవు నైననూ దూరముగ నుంచుట మంచిదే.

"వధచేసి జీవించువాడు :- అనగా పక్షులను, మృగములను వేటాడి జీవించెడి వాడుగా మనము అర్థము చేసికొనవలయును. అటవికులు, అరణ్య వాసముచేయు

ప్రజలు క్రూర మృగములతోపాటు యితర జంతువులను, పలువిధ పక్షులను కూడ వేటాడి జీవించుచుందురు. అది వారి వృత్తి. కడుపు నింపుకొనుటకు ఆ ప్రాంత మానవునకు ఆ వృత్తి తప్ప వేరే మార్గము లభ్యమై యుండదు. వృత్తి రీత్యా, లేదా కేవల మాహార నిమిత్తము జంతువధ చేసి జీవించు వాడిచ్చునది స్వీకార యోగ్యము కానినాడు, కేవలము వేట తమకముతో, కాలక్షేపణ కొఱకు వన్య మృగ ముల వేటాడి పట్టినే, నిర్దయగ, నిష్కారణముగ చంపు రాజులిచ్చు ఆహారము ఎటుల యోగ్యమో ?

"వేటాడి జీవించువాడు :- పై విషయములే దీనికి వర్తించును.

"వ్యభిచారిణి :- అంటేనే సంఘానికి చెదపురుగు. కాని బ్రాహ్మణాది అగ్ర జాతులవారు కూడ ఈ వ్యభిచార గృహముల పాలైనయట్లు ఎన్నో కథలను మనము వినుచుంటిమి సానిచేతి కూడు పనికిరాదు....నిజమే! కాని యాసాని దాని దుష్ట సాంగత్యమునకు లోనైన బ్రాహ్మణుడిచ్చు అన్నము మాత్రము స్వీకరించుట కెట్లు యోగ్యమగును. అదియునూ నిషిద్ధమే....గత చరిత్రలు చూచిన వ్యభిచారిణులైన స్త్రీలు ఎన్నో దాన ధర్మములు చేసిన దాఖలా లుండినవి.

"రాజ ద్వేషి :- రాజ ద్వేషిని రాజే సహించడు. అతని నేదో విధము శిక్షించియే తీరును.

"చర్మకార వృత్తితో జీవించువాడు :- ఒకానొక కాలమందు ఈ వృత్తిలో జీవించు వారికి విద్యాగంధములేదు. శుచి శుభ్రతలు ఉండునవికావు. మృత కళేబర ములు సేకరించి వాటి చర్మమును వొలిచి పాదరక్షాది వస్తువులనుత్పత్తి చేసే వారు. జీవన విధానము మొరటుగా మురికిగా నుండెడిది. అందువలన వీరిని దా ధర్మముల కనర్హులుగా చిత్రించి యుండవచ్చు.

"ఆయుధములతో జీవించువాడు :- ఇతని నెందు కవ్విధముగ ముద్ర వేసి తెలియదు. తనను తాను రక్షించుకొనుటకు ఆయుధములను వెంటనిడుకొని తిరు వారనేకు లుండిరి.

"ఆయుధమ్ముల నమ్ముకొని బ్రతుకువాడు :- ఆయుధములనేకులకు అవ రమే ఆయుధములు కేవలము జంతు హింసకేకాదు. వృక్షాగ్రముల నుండి ఫలము

కోయవలయునన్న ఆయుధములుండ వలయునుగదా!- కొబ్బరిచెట్టు నుండి కొబ్బరి కాయలు కోయవలయునన్న అయుధము లుండవలె. పైరు కోయవలయునన్న కొడవలివంటి ఆయుధము లుండవలె. మరి అయుధముల నమ్మువాడు లేకున్న వలయువారి కెట్లు లభ్యమగును.

వస్త్రములుతికి బ్రతుకువాడు :- ఇది చాకలి వృత్తి. ఊరివారి మురికి నంతయు చాకిరేవులో వదలగొట్టు చాకలి వృత్తిని కించపరచుట తప్ప ఇందులో నాకేమియూ కన్పించుటలేదు. కష్టపడి జీవించువాడు. అతను శ్రామికుడు. శ్రామికుని చెమట శ్రీగంధముతో సమానము. వీరిలో కూడ నాటి కాలమందు విద్యా గంధములులేవు. విశాల భవనములులేవు. శుచి శుభ్రాదులు కూడ తక్కువ. వస్త్రములుతుకువారే లేకున్న అప్పుడు మరి ఎవరి వస్త్రములు వారుతుకొనక తప్పదుగదా!

కఠినుడు : క్రూరస్వభావుడు :- అసలెవరూ వీరి జోలికి పోరు.

అర్తుడు :- రోగములచేకాని, మరి యితర విధములగు బాధలచేగాని క్లేశపడు వాడు. అతడే బాధలలో నున్నప్పుడు తానొకరికి సాయపడు స్థితిలో నుండడు. అటువంటివాడు యితరుల కెట్లు సాయము చేయగలడు.

స్త్రీ జితుడు :- భార్యకు లోబడి వర్తించువాడు. భార్యకు లోబడివర్తించువాడు అనిన భార్య చెప్పినట్లు చేయువాడేకదా. గృహ కృత్యములందు భార్యాభర్తలమధ్య అవగాహన వుండవలయునుగదా! భార్య మాటల కేమాత్రము జవదాటని వాడు అసలు అన్నమెట్లు యిడగలడు? అతని దగ్గరకు పోయే అవకాశమేలేదుగదా! మనిషినిచూచి అతడు భార్యా విధేయుడని ఎట్లు చెప్పగలము?

గ్రామ యాజి :- గ్రామమునందలి వారందరికి పురోహితము చేయువాడు ఇతడు పెట్టిన అన్నముకూడ నిషిద్ధమే. పురముకు హితము చేయువాడు పురోహితుడు. అందునా అతడు బ్రాహ్మణుడే అయిుండునుగాని ఇంకొకడు అయియుండడు కదా! మరి పురోహితుని అన్నముగూడ పనికిరాదని నిర్ణయించినది పురాణము.

తున్నకుడు :- బట్టలు కుట్టిజీవించువాడు. ఇతడునూ అన్నదానము చేయుట కనర్హుడే. బట్టలు కుట్టేవాడే లేకున్న. మహారాజులకు, తపస్వియులకు, ఇతర

ధనధాన్య సంపత్తు కలిగిన స్త్రీ పురుషులకు బట్టలెట్లు కుట్టబడును. కష్టపడి జీవిం
వాడేగానీ, దోపిడిచేసి జీవించువాడుకాదే. కష్టపడి సంపాదించువాని అన్నము నే
నిరసించినదో శాస్త్రము,

తప్పుడు సాక్ష్యములు చెప్పువాడు : ఇతడెప్పుడునూ సంఘవిద్రోహియే.

దొంగ సంతకములు చేయువాడు : ఇతడు దుర్మార్గుడు, దుష్టుడు

దొంగవ్రాతలు వ్రాయువాడు : పైవారి కోవకేచేరు మరొక మానవుడు.

మోసగాడు - ఇతడునూ సంఘవిద్రోహియే.

శూద్రులకు పౌరోహిత్యము చేయువాడు :- శూద్రులలో పౌరోహిత్య
చేయించుకొని సత్కారములు నిర్వహించవలయుననెడి కోరిక గల్గియుండుట అ
ష్టము. అటువంటివారు శూద్రులు కానేకారు. ఒకవేళ అటువంటి వారు
సత్క్రియలు చేయుటలో ఉత్సాహవంతులై యుండినపుడు పౌరోహిత్యము తెలి
వారిచేత ఆయా క్రియల చేయించుటలో తప్పులేదు. శూద్రులు అనిన బహు
శూద్రులు అని వారి ఉద్దేశ్యము కావచ్చును అడుగునబడిన వారిని ఉన్న
తీసుకురావలయునుగాని అణగ ద్రొక్క-చూచుట అన్యాయము. ఈ సూత్రమటు
యున్నది. పురోహితము చేయించినవాని అన్నము పనికిరాదని చెప్పుటచే పు
హితము తెలిసినవారిని, ఇతరులకు పురోహితము చేయవలదు అని నిర్బం
చుటయే యిందులో కన్పించుచున్నది:

"దేవతాదులను అర్చించనివాడు :- దేవతలను అర్చించవలయునన్న పూ
కముల నిర్వహింపచేయు బ్రాహ్మణుడు కావలయును. శూద్రులకు పౌరోహిత్య
చేసిన వానిని సంఘము వెలివేయుచున్నది. మరింక దేవతాదుల నెట్లు అర్చించ
ఇవ్విధముగ దేవతాదుల నర్చింపనీయకుండుటకు మార్గమాయిది!- చెప్పజాలను.

"సిద్ధయ్యా ! ఈ విధముగ ఒకదానికొకటి సంబంధములేక పలుసిద్ధాం
లను గతమునందు ప్రవేశపెట్టినారు. అవి ఇప్పుడిప్పుడే పల్చబడుచున్నవి. ఇ
ముందు ముందు ఈ సూత్రములన్నియూ చాలవరకు నశించిపోగలవు."

"స్వామీ ! ఇవిగాక యింకేమైన నుండినవా !

"ఇతరుల నుద్దేశించి ఉంచబడిన అన్నము మరొకరు తీసికొని తినుట అంత మంచిదికాదని శాస్త్రము. తుమ్ముతో, దగ్గుతో ముందున్న పదార్థములు అపవిత్రమగును. ఆనిన, దగ్గుద్వారా అతని నోటినుండి వెలువడు అనేక సూక్ష్మజీవులు, క్రిములు ఆయా ఆహారమందు చేరును. అదే విధముగ తుమ్ములును. అందువలన ఆయాహారమును విసర్జించుట శ్రేయస్కరము.

"పతితులు చూచిన అన్నము, శుష్కము, పాసిపోయినది. ఉచ్ఛిష్టముతో జీవించువాడిచ్చిన ఆహారము, బైటనున్న స్త్రీతాకిన అన్నము, గోవులు, కుక్కలు వాసనచూచి వదలిన ఆహారము, వెంట్రుకలు పడిన ఆహారము, పక్షులుతిని వదలిన ఆహారము, బానిస తిని వదలిన ఆహారము. అన్నము వెలకు అమ్ముకొను వాడు పెట్టిన ఆహారము, సేద్యముచేసి జీవించువాడు పెట్టిన ఆహారము, గోవుల కాచి జీవించువాడిచ్చిన ఆహారము, క్షౌరముచేసి జీవించువాడిచ్చిన ఆహారము, గొఱ్ఱెలపై బ్రతుకు వాడిచ్చిన పదార్థము, శూద్రుడిచ్చిన అన్నము, తనను తాను అమ్ముకొని బ్రతుకు వాడిచ్చిన ఆహారము ఇవికూడ నిషేధములని పురాణోక్తి.

"ఇవిన్నియూ విమర్శలకు గురియగునవే. ఇప్పటికే ప్రపంచములో అనేకమార్పులు సంభవించుచున్నవి. యింక ముందు ముందు ఎన్ని మార్పులు సంభవించునో ఎవ్వరెరుగుదురు."

"ఇంకా ఆ భక్ష్యాభక్ష్య వివరణ ముండిన చెప్పండి స్వామి !"
ఉన్నది" అదియునూ కొంత వైరుధ్యముతోనే కూడియుండును. అయిననూ చెప్పెదను వినుము.

శ్లో॥ అన్నం పర్యుషితం భోజ్యం స్నేహాక్తం రాగషాడవత్॥
వి॥ స్నేహా అపి గోధూమ యవ పౌరాణానిమ్వకా॥

శ్లో॥ అజాగో మహిషీ వర్జం సర్వాణ్యపి పయాంసిచ।
ఆ ఆ నిర్దశాహం తేషాం వైవివత్సా యాశ్చగోస్తథా॥

శ్లో॥ కపింజల స్తిత్తిరశ్చ మయూరో లావక స్తథా।
ఏతేహి పక్షిణోభక్ష్యా నతు శేషాః కథంచన॥

శ్లో॥ శశకః శల్యకోగోధా ఖడ్గః కూర్మ స్తదైవచ ।
భక్ష్యాః పంచనఖే ష్వాహుర భక్ష్యాశ్చా భయాదతః॥

శ్లో॥ సర్వేచైక శపావర్జ్యా స్తథా : జ్ఞాతామృగద్విజాః.
లశునం గృంజనంచైవ పలాణ్డు కమౌనిచ॥

శ్లో॥ లోహితా నృక్షనిర్యాసాశ్చ్చ గ్రుశ్లేషాత్మకం తథా ।
అభక్ష్యాణి ద్విజాతీనాం ఖుర్జత్వాని తదైవచ ॥

శ్లో॥ వృథా కృసర సంయావ పాపసాపూప శష్కులీః
అనుపాకృత మాంసాని దేవాన్నాని హవీంషిచ ॥

శ్లో॥ మాంసాచనం నైపబుధస్తు కుర్యాద్వృథా నరకైస్యహేతుమ్ ।
మాంసంహి యోనాత్తి సయాతినాకం లోకేతథాఽస్మిన్యుఖ సజ్గితిఃసా

'అన్యం పర్యుషితం భోజ్యం'—అని చెప్పబడినది గదా! పర్యుషితం అ చలిది, నూతనము కానిది. చాలకాలము నిలువ చేయబడినది అని అర్థం. చ అనిన చలిదన్నము. నూతనము కానిది అంటే అప్పటికప్పుడు వండినది కాని అర్థము. ఉదాహరణకు పులిహోరవంటి అన్నము నూనెతో తడుపబడియుం అట్టిది తినదగినదే, పాసిన అన్నము దుర్గంధ భూయిష్టమైయుండును, గ అది పనికిరాదు.

మేకల, గేదెలపాలు పనికిరావను చున్నాడు శాస్త్రకారుడు. కాని యందును మానవునకు కావలసిన పోషక పదార్థములు మెండుగా నుండినవి. యునుంగాక మేకపాలు కొన్ని కొన్ని చర్మవ్యాధులకు ఔషధముగా గూడ చేయును. అయితే ఇవి ఈనిన పిదప పది దినములు గడిచిన తర్వాతపాలు రించవచ్చునట. దూడలేని ఆవుపాలు గూడ వినియోగించరాదు. కాని సూత్రములో అజాక్షీరమును గురించి ఏమియుండెనో తెలియునా"

"చెప్పండి బాబా!"

"అజాక్షీరః శోషఘ్న స్తన్యసాత్మ్యః రక్త సాంగ్రాహిక రక్త ప్రశయ నానాం.

మేకపాలు క్షయను నిర్మూలించుటలో రక్తస్రావము నాపుటలో రక్తపిత్త
మును పోగొట్టుటలో శ్రేష్ఠము - అని చెప్పబడినది.

ఇక మాంసాహారమునకు వచ్చిన, కపింజలము (చాతకపక్షి) దీనినే తిత్తిరి పక్షియని గూడ అందురు. తిత్తిరి పక్షిని తీతువు పక్షియని గూడ అందురు. మయూరము, లావుకము—మొదలైనపక్షుల మాంసము తినరాదు. చతుష్పాత్తులలో శశకము శల్యకము, గోధా, కుందేలు, ఏదుపంది, ఉడుము, ఖడ్గమృగము, తాబేలు—ఇవి మాత్రము పంచ నఖములలో తినదగినవట. మిగిలినవి అభక్ష్యములట. ఒకే గిట్ట కలిగిన జంతుమాంసము కూడ నిషిద్ధమట. అనగా రెండు దంత పంక్తులు గలిగిన గుర్రము, గాడిద, యిత్యాది జంతుమాంసము నిషిద్ధమట. ఇవికాక అపరిచితములైన ఏ యితర పశు పక్ష్యాదులను తినరాదని చెబుతూ, అఖరులో ఏమనుచుండెననిన "వివేకవంతు లెవరూ మాంసమును తినరాదు. అది నరక హేతువు అగును. మాంసమును తిననివాడు స్వర్గమును పొందును. ఈ లోకమునందునూ సుఖమందును—అని మరలా ఆ శాస్త్రకారుడే చెబుతున్నాడు."

"ఇవికాక బాబా ! యింకనూ ఉండినవా !"

"వెల్లి ఉల్లి, ఎర్రని చిన్న ఉల్లి, పెద్దఉల్లి, పుట్టగొడుగులు మొదలైన పదార్థములు శాఖాహారములైనను తినరాదని శాసించుచున్నారు. ఇట్లురకరకములుగా వైరుధ్యములుగా నున్నవి. ఏది ఏమైననూ మాంసాహారము బలకరమైనదే యయ్యును దానిని నేనును నిరసించుచున్నాను."-అనిచెప్పి బాబా "ఇక వెళ్దామా!"-అనినాడు,

"అలాగే బాబా"-అనినాడు సిద్దయ్య.

...O...

# సిద్ధయోగి ప్రసిద్ధ భారతం

## —: తొమ్మిదవ భాగం :—

రానురాను సిద్దయ్య ప్రవర్తనలో చాల మార్పు వచ్చుచున్నది. జీవులపై దయగొనుట అతనిలో చెప్పుకోదగ్గ మార్పు. కుక్కలను పిల్లులను దగ్గర చేర్చు కొని వాటికి ఎంతయో ఆనందముగ అన్నము పెట్టును. కాకులకు, పిచ్చుకలకు గింజలను విసరుటలో అవి వాటిని ఏరుకొని తినుటలో అవి పొందు ఆనందమును తానూహించుకొని ఆనందించును. కుక్కపిల్లలకు, పిల్లిపిల్లలకు ఒకే పళ్ళెరము నందు పాలుపోసి త్రాగించుటలో అతని ఉద్దేశ్యము నూహించవచ్చును. అన్నిజీవుల లోనూ ఉన్న పరమాత్మ ఒక్కడే అనునది అతని సిద్ధాంతము. "సబ్ కా మాలిక్ ఏక్"-అని అతను ప్రబోధించును. "అల్లా మాలిక్"-అని గొంతెత్తి అరచును.

దెబ్బ తినిన కుక్కపిల్లలను, పక్షులను తెచ్చి, వాటి కాళ్ళకు బద్దలుకట్టి, నూనె రాసి వాటి నెంతో ఆప్యాయముగ ప్రేమించును. జంతువులకు సిద్దయ్యఅనిన ఎంతో ప్రేమ. సిద్దయ్య దగ్గరకు వచ్చినంత చనువుగా మరి యే యితర వ్యక్తి వద్దకూ అవి వెళ్ళవు. సిద్దయ్య ఒడిలో వాటికి సంపూర్ణ రక్షణ

పరాయి స్త్రీలు కన్పించిన మాత్రమున మాతృభావమున వారికి పాదాభివంద నము సేయును. తాను ఉదయము నిద్రలేచుట తోడనే "మాతృ దేవోభవ"-అని తల్లి పాదములకు "పితృ దేవోభవ"-అని తండ్రి పాదములకు నమస్కరించును. మీరు గూడ ఆవిధముగ సేయుడని తనతోటి బాలురకు బోధ సేయుచుండును.

ఇక సాధువులకు, సన్యాసులకు, ఫకీరులకు, పైగంబరులకు మొదలైన వారికి సేవలు చేసెడివాడు. డబ్బు కెప్పుడూ ఆశ పడెడివాడు కాడు. హితులకు, సన్నిహితులకు, స్నేహితులకు అందరికీ సమాన గౌరవము ప్రదర్శించెడివాడు. గురువుల నెప్పుడూ దైవంబుల బోలె భావించెడివాడు. అబద్ధములాడువాడుకాదు. సత్యమునే బలుకువాడు.

ఇటువంటి ఉత్తమ లక్షణములచేత, గుణములచేత. సిద్దయ్య ప్రసిద్ధుడగు చుండెను. అతని మాటలు, బోధలు, అందర నెంతగానో ఆకట్టుకొనుచున్నవి.

"దేవియే! భాయియో! రాజా హరిశ్చంద్ర ఎన్ని కష్టము లనుభవించినను, అసత్యమాడుట కంగీకరించలేదు. చిట్టచివరకు తనకై తాను గూడ అమ్ముడుపోయి ఆ పైకమును విశ్వామిత్రునకు సమర్పించెనుగాని సత్యవ్రత దీక్షను త్యజించలేదు

"పాండురాజు సుతుడు ధర్మరాజు తప్పని పరిస్థితిలో ఒక్క అబద్ధమాడి నందులకు నరకలోక దర్శనము చేయవలసి వచ్చినది. కనుక సత్యమునే బలుక వలయును. సత్య మార్గమునే అవలంబించవలయును.

శ్లో॥ సత్యం మాతా పితాజ్ఞానం ధర్మో భ్రాతా దయా సఖా।
శాంతిః పత్నీ క్షమాపుత్రః। షడైతే మమబాంధవాః॥

"సత్యమే తల్లి, జ్ఞానమే తండ్రి, ధర్మమే సోదరుడు. దయయే మిత్రుడు, శాంత మే భార్య. క్షమయే పుత్రుడు. ఈ ఆరుగురు నా ఆప్తమిత్రులు. బంధువులు.

శ్లో॥ సత్యాన్నాస్తిపరో ధర్మః। సత్యంజ్ఞాన మనంతం బ్రహ్మ।
సత్యేన వాయురావాతి। సత్యే నాదిత్యో రోచతే॥
దివి సత్యం వాచః ప్రతిష్ఠా। సత్యేసర్వం ప్రతిష్ఠితం
తస్మాత్సత్యం పరమం వదంతి। సత్యం పరం వరం సత్యం
సత్యేనసను వర్గాల్లోకాత్। చ్యవంతే కదాచన
సతాంగ్‌హ హిసత్యం। తస్మాత్సత్యే రమంతే॥

సత్యమును మించిన ధర్మము మరొకటిలేదు సత్యమే జ్ఞానము. సత్యము బ్రహ్మ స్వరూపము బ్రహ్మము అనంతము వాయువు సత్యము వలననే వీచుచుండి నది. సూర్యుడు సత్యము వలనే ప్రకాశించుచున్నాడు, వాక్కు శాశ్వత మెట్లగు చున్నదీ. సత్యము వలననే. వాక్కు అనగా సరస్వతి. సరస్వతియే సత్యము. సత్యమే సరస్వతి. అట్టి సత్యమునందు ఈ యావత్సృష్టి సుప్రతిష్ఠమై యున్నది. కనుక సర్వశ్రేయంబైన ధర్మము సత్యము తప్ప అన్యమేమియూలేదు. అన్నిటి కంటే ఉత్కృష్టమైనదీ, ఉన్నతమైనది సత్య మొక్కటే. శ్రేష్ఠమైనదీ సత్యమే. స్వర్గాది లోకములందున్న మానవులు సత్యమునందుననే స్థానభ్రష్టులు గాకుండ నిల్చి

ు ందురు. శాశ్వతమైనది సత్యము. ఇందువలననే మహాత్ములు, మహనీయులు, త్యమునందే రమించుచుందురు.

శ్లో॥ సత్యం దమ స్తపశ్శౌచం। సంతోషో హ్రీః క్షమార్జవం।
జ్ఞానం శమో దయాధ్యానం। ఏష ధర్మస్సనాతనః॥

—మహాభారతం

సత్యము, ఇంద్రియ నిగ్రహము, తపము, శుచి సంతోషము, లజ్జ, ఓర్పు జుత్వము, జ్ఞానము, మనోనిగ్రహము, దయ, ధ్యానము—వీటిని కలిగియుండ యును ఇదియే సనాతన ధర్మము

శ్లో॥ సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాత్।
నబ్రూయాత్సత్య మప్రియం।
ప్రియంచనాఽనృతం బ్రూయాత్!
ఏషధర్మస్సనాతనః॥ మను 4:138

సత్యమునే పలుకుము. ప్రియమునే మాటాడుము. సత్యమైనను అప్రియ ము కల్గించునట్టి మాటలను పలుకకుము. అనృతము ప్రియముగా నుండినను ని పలుకవద్దు. ఇదే సనాతన ధర్మము.

"ఇతరులకు ఏ కొంచెమైననూ హాని చేయరాదు. హాని గూర్చి మాటలు ాడరాదు. అదియూ సత్యమే తెలిసి తెలిసి అబద్ధము చెప్పరాదు. అబద్ధ చెప్పువాడు తాత్కాలికముగ సంతసించిననూ రానురాను అతని మనసు అత రహించి వేయును. విపరీతమైన బాధలకు గురియగును. సత్య మెప్పుడూ ఠుత్తు.

-అబద్ధము చెప్పక ఎల్లప్పుడూ సత్యమునే పలుకువాడు సకలజనుల హృద లందునూ సుస్థిర స్థానమును సంపాదించుకొనును. అతనినే జనప్రియు రు. మనస్ఫూర్తిగ నిజము చెప్పువాడు మహోదాత కంటే గొప్పవాడని పెద్దలు న్నారు. ఎంత దుఃఖము కలిగిననూ సత్యమునే బల్కువాడు అఖండకీర్తి ను. అది సకల ధర్మములకు దారితీయును.

"స్నానమాచరించుటవలన శరీరము శుద్ధి బొందును. సత్యము చెప్పుట వలన, సత్యధర్మాచరణము వలన అంతశ్శుద్ధి లభించును. బయటంతయు చీకటిగ నున్నప్పుడు దీపము వెలిగించిన చీకటిపోవును. కాని హృదయాంతర్గతమైన అజ్ఞానమను చీకటి నెట్లు పారద్రోలుట? దాని మార్గము సత్యము బల్కుటయే. అదియే సత్యజ్యోతి. సత్యజ్యోతి వలన చీకటి నశించును. కనుక సత్యమును మించిన పదార్థము మరొకటి లేదు.

మం॥. సత్యమేవ జయతేనాఽనృతం । సత్యేన పంథా వితతో దేవయానః
యేనాఽక్రమం త్యృషయో హ్యాప్తకామా। యత్రతత్సత్యస్య పరమం నిధానమ్॥.
ముండకోపనిషత్తు 3 : 1 : 6

సత్యమే జయించును. అసత్యము పరాస్తమగును. దేవతల మార్గము సత్యము వలననే విస్తరించియున్నది. మహర్షులు ఆప్తరాము లెట్లు కాగలగిరి! సత్యము చేతనే....అందువలననే వారు ఈశ్వరుని పొందగలుగుచున్నారు. అసలు ఈశ్వరు డను నెవరు?....ఈశ్వరుడే సత్యస్వరూపుడు.

శ్లో॥ నహి సత్యాత్పరో ధర్మః। నపాప మనృతాత్పరం ।
తస్మాత్ సర్వాత్మనా మర్త్యః । సత్యమేకం సమాశ్రయేత్॥.

"సత్యమును మించిన ధర్మము మరొకటి లేదు. అసత్యమును మించిన మహాపాపమూ లేదు. కనుక మానవు లెప్పుడు సర్వాత్మనా సత్యవంతులై, సత్య ధర్మ పరాయణులై, సత్యవ్రతులై, సంచరించుచుండవలయును."

— ० —

# సిద్ధయోగి ప్రసిద్ధ భారతం

## —: షష్ఠియవ భాగం :—

ఆనాడు సంక్రాంతి పండుగ.

గ్రామమెంత కళకళలాడుచున్నదో చెప్పలేము. ప్రతి గృహాముకు పండు ముత్తయిదువవలె, ఆకు పచ్చని మామిడాకు తోరణాలతో కన్నుల పండువగా నున్నది. ఇండ్ల ముంగిళ్ళు, తెల్లని ముత్యాలవంటి రంగవల్లులతో, పలురకముల ముగ్గులతో నూతన కాంతుల నీనుచున్నది. బాల బాలికలు నూత్న వస్త్రములు ధరించి ఎంతటి ఆనందానుభూతినందుచుండిరో!

పాతాని జియ్యరు తలపై ఎఱ్ఱగా తోమిన రాగి అక్షయపాత్ర నిడుకొని, భుజమున తంబుర మీటుచు భగవన్నామ సంకీర్తన సేయుచు "జైశ్రీమద్ర మారమణ గోవిందోహారి"-అని అక్షయపాత్రలో బియ్యము వేయించుకొనుచు, భజనచక్కలు మ్రోగించుకొనుచు ఇంటింటికీ వచ్చుచున్నాడు

గ్రామమంతయు పరమ పవిత్రముగ నసుపుసారాయలతో పెండ్లి కూతురువలె నుండి ముంగిళ్ళ గొబ్బెమ్మలతో, గుమ్మడి పూలతో, బంతిపూలతో పచ్చటి ప్రకృతి కన్నె అప్పుడె అవతరించినట్లుండ గ్రామమున కత్యంత దూరమున సంపూర్ణమైన భిన్న ప్రకృతి గోచరించుచున్నది.

హాత్య, రక్తపాతము, క్రోధము, పౌరుషము యిత్యాదులతో ఆగ్రామము సంపొత మారుమూల ప్రాంతము, విశృంఖల నాట్యము చేయుచున్నది. కలిసి మెలిసి తిరుగు, నోరులేని అమాయక జీవులలో సైతము కక్షల పెంపొందించి, ఆ జీవులు ఒకదాని నొకటి పొడిచి చంపుకొనుచుండిన, వాటి రక్త మచ్చట మడుగులు కట్టు చుండ, ప్రజలు ఏ మాత్రము జాలి లేక యింకనూ వాటిని రెచ్చగొట్టుచుండిరి. అది కోడి పందెముల దృశ్యము. కడుపులు చీల్చబడిన కోళ్ళు, కంఠములు తెగబడిన కోళ్ళు—అచ్చట పడియున్నవి. అచ్చట జరిగిన రక్తపాతమును జూచి సిద్ధయ్య గుండె ద్రవించి పోయినది. మొండెములు తెగిపడి గిలగిల కొట్టుకొనుచున్న

కోళ్ళను చూచిన సిద్దయ్య గుండె ద్రవించి పోయినది. అతనిలో దుఃఖము పెల్లు బికినది. పెద్దగా యేడ్చినాడు.

అతని యేడ్పునకు ఆశ్చర్య పడినారు "ఎందుకయ్యా సిద్దయ్యా! ఇట్లేల యేడ్చుచుంటివి ? యిప్పుడేమైనదని"-అనినారు.

"ఏమైనదా! ఏమియునూ కాలేదా! ఏమిటి రక్తపాతము ఏమిటీ అమాయక జీవులపై మనము చూపించుచున్న దయ, కరుణ, జాలి మనము మనుషులము అన్నా! మనము మనుష్యులము. జాలి, కరుణ, దయ లేక మనము మనుష్యుల మెట్లగుదుము. రాక్షసులతో సమానము. సోదరులారా! నోరులేని ఈ అమాయక జీవులలో లేనిపోని కక్షలు రగుల్కొల్పి, కాళ్ళకు కత్తులు గట్టి, కడుపులు చీల్చుకొమ్మని, కంఠముల నరుకు కొమ్మని, కలసి మెలసి తిరుగు ఈ అమాయిక జీవుల నిట్లు వట్టి పుణ్యమునకు, నిష్కారణముగ, యిట్లు రక్తపాతమునకు గురి చేయుట, ఎట్లు చేయుట తగునా? అకారణ వైరమునకు చూడుడు ఆజీవు లెవ్విధి కొట్టుకొనుచుండినవో? దీనికి కారణమైన మనమునూ రాబోవు జన్మమున యిట్టి దుస్థితి నెదుర్కొనవలసి వచ్చును అది మనకు సమ్మతమా? మన వినోదము కొఱకు వాటి ప్రాణములను పణముగా పెట్టవలయునా! ఇది మానవత్వమనిపించుకొనునా? ఆలోచింపుడు అని రోదించుచు, చొక్కాతో కంటినీరు తుడ్చుకొనుచు, కంఠములు తెగిపడియున్న ఆ కోళ్ళ చుట్టూ తిరుగుచూ "సోదరులారా! ఈ పోటీల నాపుడు. ఈ పందెముల నాపుడు. అకారణ హత్యల నాపుడు పాపపు మూట గట్టుకొనకుడు. పండుగనాడు మనందర మెట్లు సంతోషముగా నుండుటకు ప్రయత్నించుచుంటిమో!- అట్లనే ఆ జీవులను కూడ సంతోషముగ బ్రతుక నిండు" అని వారిని అభ్యర్థించినాడు.

సిద్దయ్య దుఃఖము జూచి వారి గుండెలు కరిగిపోయినవి. ఆ పసి హృదయము నుండి పొంగి పొరలుచున్న జీవకారుణ్య వాహినికి జనులందరూ ఆశ్చర్యపడినారు. "సిద్దయ్యా! తప్పు జరిగిపోయినది. ఈ కార్యక్రమమందు యింత ఘోరమున్న సంగతి గ్రహింపలేకపోతిమి ఇకముందీ పందెముల నిర్వహింపము"-అని నాటితో పందెములను ముగించినాడు.

"ఒక్క మాట వినుడు. మనుష్యులమైనమనము భూమిపై జీవించుచు, వివాహాదుల జేసికొని భార్యను, బిడ్డలను బడయుచు, ఎట్లు సుఖించుచుంటిమో! అదే విధముగ పశుపక్ష్యాదులును కోరుకొనును. అవియు వాటి వాటి జీవనమును హాయిగా ఆనందముగ గడుపుకొన వలయుననియే తలంచుచుండును. క్రూరమృగములందు సైతము ఈ కాంక్షయుండును. సహజ మరణ మనునది అన్ని జీవులకు తప్పదు గదా! కనుక జంతు వధలను మానుకొనుడు. మాంసాహారమును విసర్జింపుడు. మనతోటి జీవులను వాటి ఆనందము మేఱకు వాటిని బ్రతుకనిండు."-అని ప్రబోధము చేసినాడు.

...o...

# సిద్ధయోగి ప్రసిద్ధ భారతం

## —: పదకొండవ భాగం :—

అనాడు బాగా ప్రొద్దుపోయినది.

సిద్దయ్యకు నిద్రపట్టలేదు. అతని ధ్యాసంతయు జ్ఞాన సముపార్జనమే. పరమాత్మ అన్వేషణమే! అందుకు గురుధ్యానము. గురువెక్కడుండెను? ఎప్పుడు లభించును? హే! గురుదేవా! ఎక్కడనుంటివి? నన్నేల యింకనూ ఒంటరిగా నుంచితివి. నేనీ జీవితమును భరించలేకుండా యుంటిని. త్వరగా నన్నుదరి చేర్చుకో!"- అని కప్పించని తన గురువును మనసులోనే ధ్యానించుట మొదలు పెట్టినాడు.

ఇంతలో ఎక్కడినుండియో యేడ్పులు— కేకలు — తన్నులు — శబ్దములు విన్పడుచున్నవి. సిద్దయ్య తృళ్ళిపడి నిద్రలేచినాడు. తలుపులు తీసికొని బయటకువచ్చి ఆ యేడ్పులు విన్పించు దిక్కుగా బయలుదేరినాడు.

అది యొక సాధారణ గృహము. తలుపులు త్రోసికొని లోనికి ప్రవేశించినాడు.

ఇంటి యజమాని తన భార్యను చావమోదుచుండెను. సారాయము త్రావి ఒడలు తెలియని మైకములో భార్యను మాంసాహారము తెమ్మని బాధించుచుండెను. ఆ దెబ్బలకు తాళజాలక ఆస్త్రీ పెద్దగా రోదించుచున్నది. ప్రక్కన పిల్లలు వెక్కి వెక్కి మనుచు, ఏడ్చుచు తల్లిని చుట్టి పెట్టుకొని కూర్చుండిరి. అతను యింకనూ మూర్ఖత్వమును విడనాడక పిల్లలను గూడా చావబాదుచుండెను. ఇరుగు పొరుగు వారలు చేరిరిగాని, ఎవరునూ సాహసించి లోపలికిపోయి అతనిని వారింప జాలక పోయిరి. పసివాడైననూ సిద్దయ్య లోనికి జొరబడి అతనిని గట్టిగ పట్టుకొని మంచముపై బడవేసినాడు.

"కౌన్"— అరచినాడతడు.

"మైహూం భాయి! సిద్దయ్య!"

"సిద్దయ్య!- కౌన్ సిద్దయ్య!"- మీద మీదకు వచ్చినాడు.

ఇంతలో మరికొందరు కూడ లోనికి ప్రవేశించి బలవంతముగ అతనిచే రెండు, మూడు గ్లాసులు మజ్జిగ త్రాగించినారు.

కొంత సేపటికి అతను నిద్రించినాడు.

ఉదయము నిద్రలేచుచుండగనే

"నమస్తే భయ్యా!"— అనుచూ సిద్దయ్య ప్రవేశించినాడు.

అతను ఆశ్చర్యపడినాడు.

"హాఁ భయ్యా! మై సిద్ధయ్యా !"

"సిద్దయ్యా ! ముఝె సలాం చెబుతున్నావా!"— అని అతను సిద్దయ్యను దగ్గరగా తీసికొనినాడు. "భయ్యా! తుమ్ బడేహో! మై ఛోటాహూఁ! భయ్యా! రాత్రి జరిగిన గడబిడ గుర్తుండెనా? భయ్యా! కాపురము గుట్టు రోగమురట్టు అనుసామెతనీ వెఱుగనిదికాదు. కుటుంబ గౌరవము బజారెక్కిన ప్రజలు మనల నెంత అసహ్యముగ నీచముగ చూచెదరో గమనించితివా! గ్రహించితివా ! స్నేహితుడు గూడ మనల జూచి దూరముగ పోవును.''—అని అక్కడే నిలబడియున్న అతని భార్యను జూచి "భాబీ ! భయ్యాకో కోయీ ఖిలావోనా!" అనినాడు సిద్దయ్య."ముఝె- నై నై! ముఝె కోయీ అవసర్ నహీహై!- బేగం ! సిద్ధయ్యాకో ఖిరావ్" - అనినాడు అతను.

"భయ్యా ! పరమాత్ముడు మనకీ దేహము నెందుల కిచ్చెనో తెలియునా ! మంచి పనులు చేయుటకు, నోరిచ్చినది మంచి మాటల మాటాడుటకు. మంచి ఆహారము తినుటకు ఈ సారాయము త్రావి మత్తెక్కి విచక్షణా రహితముగ, ఏ పాపమెరుగని ఆ యిల్లాలి నెందుల కట్లు హింసించెదవు. సంపాదనా పరుడవు నీవు. సంపాదించి యిచ్చినకదా ఆ తల్లి వంటచేసి పెట్టునది. వచ్చిన విత్త మొచ్చినట్లా సారా అంగడి కందించి, రిక్త హస్తముల నీవు తిరిగివచ్చిన, ఆమె ఎట్లు నీకన్నమిడగలదు. నీ సంతానము నెట్లు సాకగలదు ? భయ్యా ! మద్య పానమున తలవాటు పడిన వ్యక్తులు తమకు కలిగిన కాంతిని, దాంతిని, శాంతిని, కీర్తిని, పరువును, ప్రతిష్టను, మర్యాదను, గౌరవమును సర్వమును కోల్పోవు దురు. అందరూ దూషింతురు. ఛీ! యని సీత్కరింతురు. ఆపత్సమయము లందు ఎవ్వరూ ఆదుకొనరు అవసరమున కెవ్వరూ డబ్బు ఇప్పివ్వరు.

"భయ్యా! ఎందులకీ దురలవాటు పెంచుకొంటివి. దీనివలన నీ ఒల్లుకూడ గుల్లయగుచున్నది గాని మరేమైననూ లాభము పొందగలిగితివా! పైపెచ్చు గృహిణి నీ సహధర్మచారిణి. ఆమెను అట్లు హింసించుట న్యాయమా! కుటుంబ భారమును వహించి ఆమెకు, బిడ్డలను సుఖమును కలిగించ వలసినవాడవు నీవేగాని ఆమెకాదు గదా! పసివారు, ఆ పిల్లలు చూడు. కన్నులలో ప్రాణముల నుంచుకొని నీవనిన ఎంత భయముగ బిక్కు బిక్కు మనుచు తల్లిచాటుకు పోవు చుండిరో! పిల్లలు తండ్రినుండి ప్రేమను, ఆదరణను, అనురాగమును కోరుదురుగాని, హింసా ప్రవృత్తినా!- ఆలోచించుకొనుము

"ప్రస్తుతము నిను కన్నతల్లి నీ దగ్గర లేదుగాని, ఆమెయేయుండి నీ పరిస్థితి చూచిన గుండె పగులునట్లు ఏడ్చుచుండెడిది. కన్నతల్లినట్లు శోకింపచేయుట మహాపాపమును బడయుటేగాని మరింకేమియుండును. నీమీద మమకారముతో నీతల్లి సహించిన సహించవచ్చునుగాని జనులందరు నీదుష్ప్రవర్తనకు ఎంతగాఅసహ్యించు కొందురో ఆలోచించితివా!"— అని చెప్పుచుండ మరియిద్దరు ముగ్గురు స్త్రీలు, పురుషులతోలోని కలుదెంచిరి.

"బైతియ్యే! బైతియ్యే!"— అనినాడు సిద్దయ్య.

"మద్యమన్నది ఆహారముగాదు అది మృత్యువు నిముష నిమిషమునకు మనిషిని కృంగదీసి, కృశింపచేసి, బాధించి, వ్యధబెట్టి నిత్యము చంపుచూ ఒక నాటికి సంపూర్తిగా చంపును.

"అందుకే మాతృమూర్తులైన ఆడవారందరూ ఈ దురలవాటును అనుసరించుచున్న మగవానికి ఏ మాత్రమూ లొంగరాదు ఎదురు తిరిగిన తప్పులేదు. ఒక్కొక్క స్త్రీ ఒక్కొక్క రుద్రమూర్తియై బయలు వేరిన సారా రాక్షసి నశించి పోవుటకెంతో కాలము పట్టదు. కుటుంబాలను పొట్టన పెట్టుకొను ఈ రాక్షసిని విస్మరించరాదు. సారాత్రాగి యింటికి వచ్చిన భర్తను లోపలకు రానీయకండి. భోజనము పెట్టకండి."- అని స్త్రీలకు ఉద్బోధను చేసినాడు.

"భయ్యా! ఇకనుండి సారాకు దాసోహముచేయుట మానుకొనుము. అల్లా మీద ప్రమాణముచేసి చెప్పుము"- అనిసిద్దయ్య అతనిని బ్రతిమిలాడినాడు.

"సిద్దయ్యా! తుమ్ భగవాన్‌హో! భాయ్! నీ మాట వింటాను. అల్లా మీద ప్రమాణంచేసి చెబుతున్నాను. ఇకజన్మలో సారా ముట్టను." - అని భార్యా బిడ్డలను దగ్గరకు తీసికొనినాడు.

## సిద్ధయోగి ప్రసిద్ధ భారతం

### పది రెండవ భాగం

"బావా !"- అని పిల్చినది. అచ్చాంబి

"అచ్చాంబి ! నీవా! యిచ్చటి కెట్లు వచ్చితివి ? నేనిచ్చటనుంటినట్లు నీకెవరు చెప్పిరి"— అనినాడు సిద్దయ్య.

"బావా ! నిన్నుగని అందరూ భయపడుచున్నారు. నీకు మతిస్థిమితము తప్పినట్లు, పిచ్చివాడివై పోదువేమొనని మామయ్య, అత్తయ్య తల్లడిల్లిపోవు చున్నారు."- అని గద్గదస్వరముతో పలికినది.

"నీవునూ అటులనే భయపడుచుంటివా!"

"అవును. భయపడక చేయునదేమున్నది? నీవా వేళకు భోజనమునకు రావు. అడవులపట్టి తిరుగుచుంటివి. ఎప్పుడు చూచిననూ ఏదియో ఆలోచనము సేయు చుందువు. మరి భయపడక ఏమిసేయుమందువు?"

"వారు భయపడితే భయపడనీ. నీవు మాత్రము భయపడకు. అచ్చాంబి! నా కెటువంటి అనారోగ్యమూలేదు. అస్థిమితమూలేదు. నేను ఆరోగ్యముగనే యున్నాను. నాకు కావలసిన పేలౌకిక, ప్రాపంచిక వ్యాసంగములుకావు అచ్చాంబీ ప్రస్తుతము నాకు కావలసినది గురుకటాక్షము. నాకు గురువు కావలయును. ఆగురువెచ్చటనో యుండినాడు. నన్నాకర్షించుచున్నాడు. పిల్చుచున్నాడు. ఆ మార్గ మింకనూ నాకు దృగ్గోచరము కాలేదు ఆ అన్వేషణలో, ఆలోచనలో కొంత ఉన్మత్తునిగా నేను కన్పించవచ్చును కాని నిజముగ ఉన్మత్తుణ్ణి మాత్రముకాదు. నా మాట నమ్ముము అనినాడు సిద్దయ్య.

అచ్చాంబి సిద్దయ్యకు మేనమామ కూతురు. కాశింబీ, అల్లీఖానుల ముద్దుల పట్టి. సిద్దయ్య అనిన ఆమె కెంతయో ప్రీతి, ప్రేమ, అభిమానము. తన బావను గూర్చి పలువురు పలు విధముల మాటలాడుకొనుట ఆమెను మానసికముగ క్షోభకు గురిచేసినది. తన బావకు మనఃస్థిమితము తప్పినదని కొందరు, తన తలి తండ్రులు అనుకొనుట విని, ఆ బాధ తట్టుకొనలేక, నిజ మరయుటకు తనక్షే

తానుగా వచ్చినది నిజము తెలిసికొని, నిజము తన బావ పిచ్చివాడు కాదనీ, తానేదో దివ్యత్వమును పొందుటకు అన్వేషణము సాగించుచుండెనని గ్రహించి శాంతించినది

"అచ్చాంబీ! ఇప్పటికి నీకు నమ్మకము కుదిరినదా! నేను ఆరోగ్యముగనే యుంటిని. యింక నీవు గృహోన్ముఖురాలివిగమ్మా, మామయ్యగానీ, అత్తయ్యగాని చూచిన నిందింతురు.

"బావా! యివిగో ఈ రొట్టెలు తిను బావా! నీ కోసమే తెచ్చితిని. ఎప్పుడు తింటివో యేమొ!—అన్నపానములు మాని ఆలోచించినగాని గురుసాక్షాత్కారము కాదా బావా!"—అని ప్రశ్నించినది రొట్టెలమూట విప్పుచూ.

సిద్దయ్య నవ్వినాడు.
"నవ్వు ఎందులకు ?"

"అచ్చాంబీ! నేననిన నీ కెందుల కింత ప్రేమ. యింత కష్టపడి నన్ను వెదకికొనుచు ఈ రొట్టెలు తెచ్చితివి. ఇంతకన్న మధురాహార మేముండును?"—అని అనుచూ ఆ రొట్టెల నెంతయో ఆనందముగ తినినాడు.

అచ్చాంబికి చెప్పలేని ఆనందము. తాను తెచ్చిన ఆ రొట్టెలనంత ఆనందముగ, అప్యాయముగ, ప్రేమగ తినుట చూచి తానెంత సంబరపడిపోయినదో, సంతోషపడినదో!—ఆమెకే తెలియును.

"అచ్చాంబీ! అన్ని రొట్టెలూ నేనే తినుచుంటిని నీవునూ కొద్దిగా తినరాదా!"—అని ఆమెకు తినిపించినాడు.

ఆ ఆనందపు నిర్వచన మేమిటో ఆ పసి హృదయముల కర్థముకాక పోవచ్చును కాని పవిత్రము, నిర్మలము, నిష్కళంకమైన ఆ హృదయాల మధ్యనున్న ప్రేమ భగవత్స్వరూపము. అందులో స్వార్థములేదు. కుటిలత్వములేదు. ఉన్నదంతా ఉన్నతమైన ప్రేమ తత్త్వమే.

"బావా! మరినే వచ్చెదను" అని బయలుదేరినది.
"అటులనే"—అనినాడు సిద్దయ్య"
చెట్ల చాటులో అచ్చాంబి అదృశ్యమైపోయినది.

9)

## సిద్ధయోగి ప్రసిద్ధ భారతం

### —: పదమూడవ భాగం :—

"హే! గురుదేవా! నీ వెచ్చట నుంటివో! నాకు తెలియుట లేదు. గురుసేవ లేక సాధించునది శూన్యమని బాబా గూడా చెప్పినారు. నాకు నీ దర్శన మెప్పు డగును తండ్రీ! నీ దర్శనము గాకున్న నీవు నన్ను త్వరగా నీ దగ్గరకు చేర్చుకొనక యున్న నా జీవితమే వృథాయగును. నాకీ ప్రపంచ వాసనలపై ఆశ లేదు. నాకు కావలసినది పరమాత్మ సాక్షాత్కారము నాకీ సంసార బాధలు వద్దు. నాకు ఆత్మావ లోకనము కావలయును. ఆత్మ దర్శనము కావలయును. ఆత్మసౌందర్యమును వీక్షించవలయును. గురు సామ్రాట్! నన్నెప్పుడు నీ వద్దకు చేర్చుకొందువు.

గురుమహాదేవా! అడవిలో వేటకాడు చాటుగా మాటుగట్టుకొని కూర్చొని, బోను పెట్టినగదా శార్దూలాది జంతు జాలములందు చిక్కువడును.

కిరాతుడు ఉరులు పెట్టి చాటుమాటున నక్కియుండి పక్షుల పట్టుచుండును. సముద్రమున కావలనున్న వస్తుసముదాయమును పొందవలయునన్న నావికునకు ఓడకావలయునుగదా! అటులే ముముక్షువునకు సంతతాశ్రితరక్షణ శక్తియుక్త మానసోత్ఫుల్ల కంజాతుడైనట్టి సద్గురుడు లభించిన గదా! ముక్తి, మోక్షముకల్గును.

"ఎంత తెలివి గలవానికైనను దాన ధర్మముల నిరత మొనరించిన దాతకైనను, ధార్మికునకైనను, దేశమును పరిపాలించు నేతలకైనను యజ్ఞకర్తకైనను, పండితునకైనను, గురువులేక ముక్తి బడయుట సాధ్యము కాదుగదా!

"గురుదేవా! సాధువు, అభేదవర్తనుడు, శాంత శమదమాదిషడ్గుణ యుక్తుడు, కరుణామయుడు, క్రోధములేనివాడు, భక్తరక్షకుడు, కోవిదసత్తముడు అయినటువంటి గురుదేవుడు బోధకుడై విద్య గఱపును. అతడటువంటి గురువు కాకుండిన శిష్యుల పాలిటి మహాబాధకుడై శిష్యులను నరకగాములసేయును."— అని తనకైతాను గురు సందర్శనముకొఱకై వెక్కి వెక్కియేడ్చుట ప్రారంభము చేసినాడు.

"నాకెప్పుడు గురుదర్శనము లభించును. ఆదేశికుడు నన్నెపుడు చేర్చుకొనును. ఆ సద్గురు దర్శనము నాకెట్లు లంభించును."— అని ఒక్కొకసారి

ారముగా నేడ్చును. మరికొంత కాలమవగానే "అడుగోనా సద్గురు దేవుడు. కు కన్పించుచున్నాడు. నన్ను రమ్మని పిల్చుచున్నాడు. నాకు మోక్షమిత్తునని లిడుచుండినాడు."— అని సంతోషమున గంతులిడును. మరొకసారి అడుగో గురుడు గురుడు"— అని కడుపుబ్బనవ్వును. కొద్దిసేపైన పిదప ార్యునకు మించిన వేల్పు ఎవ్వరూ లేరు"—అని తనకైతానుగా.

"గుర్మహరాజ్!— గుర్మమహరాజ్!
గుర్మహారాజ్! జై! గుర్మమహరాజ్"—

అని భజనలు సేయుచు, పాటలు పాడుచు గంతులు వేయును. ఇంతలో నే ా! స్వామీ!—రా! రా! గురుస్వామీ! నీకొఱకే ఎదురు చూచుచున్నాను. ఇన్నాళ్ళకు ము కలిగినదా స్వామీ! ఇదుగో నా హృత్కమల సింహాసనము. ఇందుపై ష్ఠించి నాకు జ్ఞానమును ప్రసాదింపుము."— అని గురువు తనముందే త్యక్షమైనట్లుగ భావించి ప్రవర్తించును.

ఇదంతయూ చూచి ఆదంబీ పీరుసాహెబులు భీతావహులైరి! వారికి గుండె పట్టుకున్నది. హృదయమందు తీవ్ర భయాందోళనలు ఎక్కువైపోయినవి. ని ప్రవర్తనంతయు ఆశ్చర్యకరముగా నున్నది. ఎదటివారికి అనుమానము, సము గొల్పుచున్నది. ఇతనికేమైనను మతిస్థిమితము తప్పినదాయని పడిరి.

"పిల్లవానికేదో పిచ్చి పట్టినటులున్నది. వెఱ్ఱిచూపులు చూచుచు ఏడ్పు ండినాడు పిచ్చి నవ్వులు నవ్వుచుండినాడు. ఈ పిచ్చి యింక హెచ్చక ర్వమే తగుచికిత్స చేయించ వలయును"—అని తలి తండ్రులు కనపడిన ద్యులందరికి కుమారుని చూపుట మొదలిడినారు. వారు బాలుని ముఖకవళికలు చి, నాడిచూచి, కనురెప్పలు క్రిందకు లాగి చూచి నాల్కజూచి, తల ఊపుచూ వి విరచుచు రకరకములుగా పల్కుచుండిరి.

అబ్బాయికి సీతపైత్య ప్రకోపము వలన మాంద్యమేర్పడినదని ఒకరు, వానికి వాతశ్లేష్మము వెక్కువగుటచే పిచ్చిపుట్టుకొచ్చుచున్నదని మరియొకరు. కుఱ్ఱవానికి గాముసోకి వికారమేర్పడినదని ఇంకొకరు, పగవార లెవరో ఋతని

పైకి గ్రహ ప్రయోగము చేసినారు. అందువలననే మతిచెడినదని— మరి యొకరు ఎవరికి తోచినట్లు వారు చెప్పుట ప్రారంభము చేసినారు.

ఒకరు మందులని మరియొకరు తాయెత్తులని. ఇంకొకరు యంత్రములని మంత్రములని, దయ్యములని తలి తండ్రుల భయపెట్టి డబ్బు గుంజుకొనుచుండిరి.

"అబ్బే! అదేమీ యీగాదు. అతనికి వెంటనే పెండ్లి చేయుడు. పిచ్చి కుదురును."— మరి యొకరి సలహా.

"ఊరుకోవయ్యా! చెవిటివి. పిల్లవానికి పెండ్లీడు వచ్చినదా యేమీ?— పెండ్లిచేయుటకు."—అని మొదటిదానిని ఖండించినాడింకొకడు.

ఈ విధముగ అనేకులనేక విధములగ చెప్ప, తలి తండ్రుల కేమియు తోచక ఒకరి ముఖమొకరు చూచుకొనిరి. చివరకు తండ్రి సిద్దయ్యకు దగ్గరగా కూర్చొని.

"అరే! బేటా! సిద్దా!—ఎందుకురా యిలా అయిపోతివి. నీ పిచ్చికి మందిప్పించినయుపు చేయుదును. అన్నము తిందువుగానిరా! అన్నము తినకుండ యిట్లు గురువు, గురువు అని అరచిన గురువులు వచ్చెదరా! బాబూ!"— అనినాడు.

"బాబా! పిచ్చి నాకు కాదు బాబా! నాకెటు వంటి మతి చాంచల్యము లేదు. నాకు పిచ్చియని చెప్పి అనవసరపు మందులుపోసి నిజముగ నన్ను పిచ్చివాణ్ణి చేయకుడు. నాకు కావలసినది గురుదేవుడు. ఆ గురుదేవుల జాడ తెలియజాలక, తెలియవలెననెడి తపనతో నేనట్లు ప్రవర్తించుచుంటినేగాని వేరుకాదు."— అనినాడు సిద్దయ్య.

"అందరూ యిదేదో భూతమనుచుండిరి. ఫకీరును పిల్చి తాయెత్తు కట్టింతునా!"- తండ్రి.

"అయ్యో! బాబా! నాకే దయ్యమూ పూనలేదు. ఏ భూతమునకు వశుడనుకాను. ఒక్క భూతముకాదు బాబా! ఏ మనిషియైనను పంచభూతములతో నిర్మితమైనవాడే. అయితే వాటిని వదలగొట్ట ఎవరి తరమూ గాదు. పంచభూతములులేక మానవుడే లేడుకదా! అయితే మనిషి వాటి ప్రభావమునుండి తప్పు

కొనుటయూ అంత సులభముకాదు. దుష్టభూత ప్రభావములనుండి తప్పించుకొన వలయునన్నను సద్గురు పాదతీర్థము తప్ప అన్యము లెవ్వియునూలేవు."— సిద్ధయ్య.

"లేదురా !- ఎవరో నీపయి పగబట్టి చేతపడి చేసినారని మా అనుమానము. అందుకని మాంత్రికుని పిలిపించినగాని కుదరదని కొంతమంది అనుచుండిరిరా !"— అనినది తల్లి అడంబి.

"అయ్యో ! మాజీ ! మీకు యితరుల మాటలు బాగుగా తలకెక్కినవి గాని నా మాటలు మీకు అర్థమగుటలేదు. నాకెటువంటి చేతబడులుగానీ, చెడుపులు గానీ చేయబడలేదు. నాకు నా గురుమంత్రమే సర్వోపద్రవ నివారణము. దాని కొఱకే నా అన్వేషణ "- అనినాడు సిద్ధయ్య.

అదే సమయమును ఒక వైద్యుడు అటుగా వచ్చినాడు సిద్ధయ్య తలి తండ్రులు ఆతనిని తోడితెచ్చి సిద్ధయ్యను చూపించినారు. అతను సిద్ధయ్యను పరీ క్షించి- చిరునవ్వు నవ్వుతూ.

"ఇతనికి పిచ్చి, దయ్యము, భూతమని యెవరు చెప్పినారు. అవన్నియూ అసత్యము. మీ కుమారుడు సంపూర్ణ ఆరోగ్యవంతుడు. అంతియేగాదు ఇతడు మీరనుకుంటున్నట్లు సామాన్యుడుగాదు ఇతడు చిదానందమూర్తి. ఎప్పటికీ యితడు వెఱ్ఱివాడుగాదు. కేవలము జ్ఞాన సముపార్జనకై అన్వేషణలో కొంతకాలో న్మత్త పైశాచికుల చందంబున గాన్పించుట సహజము. ఇతరుల మాటలు నమ్మి ఇతనిని అనవసరపు చికిత్సలకుగురిచేసి బాధించవద్దు."— అనిచెప్పి వెళ్ళిపోయినాడు.

"ఉన్మత్తుడుకాడు. పిశాచమూ వహించలేదు. భూతమహిమకాదు. సంతో షము. మరి జ్ఞానియనియు, జ్ఞాన సముపార్జనమనియు పల్కుచుండిరి మరి సన్యాసియగునా!"— అని అనుకొనినప్పుడు వారిని మరో భయమావహించినది.

—o—

## సిద్ధయోగి ప్రసిద్ధ భారతం

### —; పదు నాల్గవ భాగం :—

సిద్దయ్య తన మామూలు అలవాటు ప్రకారము అడవిలోనికి వెళ్ళినాడు. అచ్చట ఎవ్వరికీ కనిపించకుండ ఒక చెట్టునీడలో ఎంతోసేపు కన్నులుమూసి కొని ధ్యానములో కూర్చొనినాడు. చాలసేపటి వరకు కన్నులు తెరువలేదు.

"బేటా !"- అదీ అతనికి పరిచయమైన కంఠమే. కళ్లు తెరచినాడు సిద్దయ్య. "బాబా!"- అనినాడు సంతోషముతో బాబాను కౌగలించుకొనినాడు.

అతను దాడీ వాలాబాబా ! తెల్లటి దుస్తులు - తెల్లటి గడ్డం - తెల్లటి తల గుడ్డ — తెల్లనిజోలె - అతడు శుద్దస్వరూపుడు. విశుద్ధసత్త్వ స్వరూపుడు. అతడు నవ్వినా తెల్లగా నందివర్ధన పుష్పమువలే యుండినది.

"క్యాదేఖ్ తేహో !- బేటా! భూలేగయేముఘే!"- అనినాడు బాబా!

"ఐసీబాత్ మత్ కహో బాబా ! నీ కోసరమే ఎదురు చూచుచుంటిని· నీవు తప్ప నాకు మార్గము చూపువారులేరు. నాకు మనశ్శాంతి కావలయును. నాకు గురుదర్శనము కావలయును గురువు కొఱకు, గురుస్పర్శకొఱకు, మనసు, తనువు తపించిపోవుచున్నవి. గురుస్పర్శతప్ప, గురుకటాక్షముతప్ప, గురుసేవా భాగ్యముతప్ప, నన్నేవియూ శాంతిపరచలేవు. బాబా ! నాకు తరుణోపాయము బోధించుము. నన్ని బాధనుండి విముక్తినిచేయుము. నీకు ఋణపడియుందును." అని బాబాను కౌగలించుకొని బొట బొటా యేడ్చినాడు. అతనిపాదముల పైబడి ప్రణామము లర్పించినాడు అతని గుండెలలో తలదూర్చి పసిపిల్లవానివలే రోదించినాడు.

"గబ్రావో మత్ బేటా ! మేరాబాత్ ధ్యాన్ సే సునో!- నీకు గుర్వాశీర్వాద మైనది. నీ గురువు నీకొఱకు ఎదురు చూచుచున్నాడు· గుర్వానతి అయినది. ఇంక నీవు గుర్వునుచేరుటేగాని అన్యమేమియునూలేదు "-అన్నాడు దాడీవాలా బాబా.

అమితానంద భరితుడైన సిద్దయ్య "బాబా ! ఎక్కడ ? ఎక్కడుండెను. నా గురుడు ? నాకొఱకె దురుచూచు ఆ మహానుభావుడెక్కడ ? ఆనతి అయినదను

చుండిరి. ఎవరు ? ఎవరు నా గురువు బాబా ! ఎవరు ? ఎటులుందురు? నాగురు దేవులెటులుందురు. చెప్పుడు. బాబా ! నేను నిలువలేకయున్నాను. వెంటనే నేను నా స్వామిని దర్శించవలయును. స్పృశించవలయును సంభాషించవలయును నా బాధలుపశమింప వలయునన్న ఆదివ్య తేజస్విపాదముల చెంతవ్రాలుట తప్ప నా కన్యమార్గములేదు. ఆదివ్యపద పారిజాతములను నా శిరస్సుతో తుడువవలె. నా కన్నీటితో ప్రక్షాళనము చేయవలె. నా హస్తద్వయముతో సంవాహనము చేయవలె. చెప్పండి బాబా ! ఎక్కడ నా గురుదేవులు."- అని తొందర చేయ సాగినాడు సిద్దయ్య.

బాబా నవ్వుకున్నాడు సిద్దయ్యలోని భక్తి పారవశ్యమునకు వైరాగ్యమునకు, గురుసేవాకాంక్షకు ఆశ్చర్యపడి. "తొందరపడకు నాయనా! దేనికైననూ సమయము రావలయును. సందర్భము రావలయును. కాలమే సమస్యలను పరిష్కరించును. సన్మార్గమును చూపును. అంత దనుక వేచియుండక తప్పదు. పద!— అటుగాపద! చూడు. అక్కడి వృక్షములు గుబురులై చల్లని ఛాయల పఱచి, మనల నాహ్వానించుచుండినట్లున్నవి. వృక్షచ్ఛాయలలో కూర్చుని చర్చించు కుందము."—అని దాడీ వాలా బాబా సిద్దయ్య భుజముపై చెయి వేసి మెల్లగా నడిపించుకొని, ఆ చెట్లుచాటుకు తీసికొనిపోయి అక్కడ ప్రశాంతముగ నిర్మలముగనున్న తరుచ్ఛాయలతో కూర్చొన బెట్టుకొని.

"బేటా! నీగురు వెవరో చెప్పమందువా!"

"అబ్బా! యింకా ఆలస్యమేల బాబా! గురు సందర్శనార్ధమై నా తనువు, మనసు, సకలేంద్రియము లెవ్విధి తపించిపోవుచున్నవో నీవు గ్రహించలేవా! ఇంకనూ చెప్పమందువాయని నన్ను ప్రశ్నింతువా బాబా! చెప్పుము. త్వరగా చెప్పుము.— సిద్దయ్య.

అతని తలపై చెయ్యిపెట్టి నిమురుతూ బాబా చెప్పుట ప్రారంభముచేసినాడు. "బేటా! నీకు గురువు శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర గురు సార్వభౌముడు నీ మనసెంత గురుచరణ కమలముల చేరవలయునని వేగిర పడుచున్నదో, ఆ గురు హృదయము కూడ నిన్నెప్పుడెప్పుడు తన పరిష్యంగమున చేర్చుకొందునా యనీ, నీరాక కొఱకు వేగిరపడుచున్నది. ఆయన కందిమల్లాయపల్లెలో కొలువై

యుండినాడు ఆయనే నీకు గురువు. నీవు వారికి శరణువేడవలె. సేవించవలె. పూజించవలె ప్రార్థించవలె వారు జగద్గురువు. ఆ మహనీయుని దివ్య చారిత్ర మెంత చెప్పినను తరుగునది కాదు. దివ్యావతారుడు. ఆయనే బ్రహ్మ. ఆయనే విష్ణువు. ఆయనే శివుడు. ఆయన కానిది లేదు. వారి చరిత్ర ఎంత చెప్పినను యింకను మిగిలిపోవును. క్లుప్తముగా చెప్పెదను వినుము

"మన ఆంధ్రరాష్ట్రమున అఖండకీర్తి ప్రతిష్ఠల కాలవాలమై సర్వజనాభీష్ట ప్రదమై యొప్పునది నందికొండ నాగార్జున ప్రాంతము. దానినే శ్రీ పర్వత మనియు, భ్రమర గిరియనియు, విజయపురి యనియు పెందోట జయపురి యనియు పలు విధ నామంబుల పిల్చుచుందురు.

ఈ బ్రహ్మాండ పురమున విశ్వకర్మ వంశ పయఃపారావార రాకాసుధా కరుడును, విశ్వజ్ఞగోత్ర ప్రభాసితుడైన శ్రీశ్రీశ్రీ ధవళేశ్వరపు మార్కండేయ భూపతి పరిపాలనము చేయుచుండెను. ఆయనకు ముగ్గురు భార్యలు వీరాంబ, విస్సాంబ, గుర్వాంబయనువారలు.

"అందు వీరాంబకు బచ్చారాయుడు, చంద్రశేఖరుడు, చంద్రశేఖరాంబయను ముగ్గురు సంతానము కలిగిరి. ఈ చంద్రశేఖరాంబయే రామరాను ప్రకృతాంబగా ప్రసిద్ధి చెందియున్నది.

'పోతులూరి వీరాచార్య బ్రహ్మణ్యమూర్తియను మహనీయుని ఏకైక కుమారుడు పరిపూర్ణ సిద్ధలింగాచార్యుడను నతనికి చంద్రశేఖరాంబ నిచ్చి వివాహము చేసినారు. తదుపరి ఈ నూతన దంపతులు యాత్రార్థము బయలుదేరి కాశీపట్టణము చేరినారు. అక్కడ కాశీవిశ్వేశ్వరుని సేవించి ఒకానొక సత్రము నందు వీరపాపమాంబ వీరభోజయాచార్య దంపతులతో పరిచయమగుటయే గాక, మాటల వశమునవారు పాత బంధువులే యలియు, కాలాంతరమున వీరభోజయాచార్యులు కర్ణాటకమునకు వలసపోయి, కర్ణాటకలోని నందికొండలయందు స్థిర నివాస మేర్పరచుకొని, పాపాఘ్ని పీఠమ్మును స్థాపించి అధ్యక్షస్థాన మలంకరించి, కార్యక్రమములు నిర్వహించుచున్న సమయమున ఒక సాధువు వారిని తీర్థయాత్ర లకు పోవ ప్రోత్సహించి సరస్వతీ నదీప్రాంతమునకు పోయిన అప్పటి సంతానము

* సంపూర్ణ వీరబ్రహ్మేంద్రస్వామిచరిత్ర "శ్రీ వీరబ్రహ్మగురు భాగవత" చదవండి

లభించుననియు చెప్పగ, తత్కార్యార్థమువారు బయలుదేరి వచ్చుట మొదలగు విషయములనన్నియు తెలిసికొని, వారునూ అచ్చటకే పోవుదు అంతయూ దైవేచ్ఛ యని, అందరూ కలసి సరస్వతీనదీ ప్రాంతమునకు పోవునరికి ప్రకృతాంబ పరిపూర్ణ గర్భవతియయినది.

"అచ్చటనున్న అత్రిమున్యాశ్రమమునకు వెడలినారు. అత్రమున్యాశ్రమ వాసులు సేవలందించగా ఆశ్రమమునందు ప్రకృతాంబ కొడుకును గనినది. వెంటనే సిద్ధలింగాచార్యులు యోగసమాధి నిష్ఠయందు ప్రవేశించి దేహమును విసర్జించి, పరమేశ్వర సాన్నిధ్యము చేరినాడు. ఆమాట వినిన ప్రకృతాంబయూ యోగ సమాధి యందు ప్రవేశించి భర్తననుసరించినది.

"బాలుని పెంచు భారము అత్రిమునీశ్వరుపై బడినది. అత్రి ముని ఆ భార మును వీరపాపమ్మ కప్పగించినాడు. బాలుని భారమంతయు వీరపాపమ్మ వహించి నది. ఆరు నెలల తర్వాత వీరపాపమ్మ, వీరభోజయాచార్యులు స్వగ్రామము నకు తిరుగు ప్రయాణమునకై బయలుదేరు సమయమున, అత్రి ఆ బిడ్డను వీర పాపమ్మకిచ్చి పెంచుకొమ్మనినాడు. అతడే వీరబ్రహ్మము.

"ఆ విధముగ వీరబ్రహ్మము కర్ణాటకమునకు చేరినాడు. తండ్రి ఆధ్వర్య ములో శిల్పమును, శాస్త్రములను, వేదములను అభ్యసించినాడు. తాను సంచా రము బయలుదేరుదునని తల్లికి చెప్పగా ఆమె వివశయైనది. ఆ సందర్భమున ఆమెకు పిండోత్పత్తి క్రమమును బోధించినాడు. అశాశ్వతమైన ఈ దేహముపై భ్రమను తొలగింపచేసి, తల్లికి విశ్వరూప సందర్శనము ప్రసాదించినాడు. పిదప హరిహరపురమునకు చేరినాడు.

"అక్కడ రాజకుమారుడొకడు, వేట తమకంబున వ్యాఘ్రమును చంప బోయి, గోహత్య చేయగా, ఆ పాప కారణమునకు పింజారి కులమున పుట్టుదువని వీరగురుడు ఆతనికి చెప్పినాడు."

"పింజారి కులముననా !"- సిద్దయ్య.

"ఔను- అప్పుడా రాకుమారుడు - "అయ్యో ! యిదెక్కడి పాపము — నన్ను రక్షింపుము."— అని అతని పాదములపై బడినాడు.

"అంత వీరగురుడు" "రాజకుమారా! నీవు పింజారి కులమున చిన్నవాడవై పుట్టక తప్పదు. ఇదంతయూ దైవ నిర్ణయము పుట్టినన్ను చేరగలవు. అప్పుడు గాని నీకు మోక్షప్రాప్తి లభించదు."- అని చెప్పతాను అచటనుండి బనగానపల్లెకు తరలినాడు.

"అచ్చట బనగానపల్లెలో గరిమిరెడ్డి అచ్చమ్మగారింటి కింజని ఆ యింట నాశ్రయము బొంది, గరిమిరెడ్డి అచ్చమ్మగారి ఆలమందలగాయుడు, రవ్వలకొండ కజిగి అచ్చటి గుహాలలో నుండి కాలజ్ఞానమను మహాప్రబంధమును రచించినాడు. ఆచ్చమ్మకు పరిపూర్ణ బోధ గావించినాడు. ఆమెను శిష్యురాలిగా స్వీకరించినాడు. ఆమెకు ఒక్కగానొక్క కుమారునకు అంధత్వముబాపి దృష్టి ప్రసాదించినాడు. నాటినుండి అతడు బ్రహ్మానందరెడ్డిగా వాసికెక్కినాడు.

"అటనుండి కంది మల్లాయ పల్లెకుంజని గ్రామసేవయే రామసేవయని అచ్చటి రైతుజనంబులకు ఇండ్లు నిర్మించుట, వ్యవసాయ పరికరముల నిర్మించి యిచ్చుచూ గ్రామ ప్రజల ఆదరాభిమానముల పొందినాడు.

"ఆటనుండి పెదకామెర్ల గ్రామమునకుంజని, శివకోట యాచార్య కుమార్తె గోవిందమ్మను వివాహమాడి, అచట ఒకానొక అవ్వభక్తితో తెచ్చిన రాగి సంకటి ముద్దను పరమాన్నముగా మార్చి భక్తులందరకూ పంచినారు.

"పోలేరమ్మ కొలుపులలో పోలేరమ్మచే నిప్పుతెప్పించి తన ధీశక్తిని మహాత్మ్యమును ప్రకటించినాడు. కరుణామయుడు ఆశ్రితావనుడు, నిష్కాముడు సర్వజ్ఞుడు, నిర్వికారుడు, నిరుపమానంద స్వరూపుడు, మహాశాంత స్వభావుడు, విస్తారోదారుడు, సద్విచారుడు శాంతమూర్తి, తపస్సంపన్నుడు. మొదలైన దైవగుణ స్వభావుడు. మహానుభావుడు - ఆ వీరబ్రహ్మగురుడు. అతని ఎన్నదరమా ? నాయనా !

"తలపై జటాజూటముతో, గంధాక్షతలు ధరించిన శిరస్సు గలవాడు. ఎల్లప్పుడు మందస్మిత ముఖారవిందము గలవాడు నిడుపుగడ్డంబుతో రవణిల్లువాడు.

రుదురాక సరములతో ప్రకాశించువక్షము గలవాడు. దండకమండలు ధారి. క్షితి ధరించి సాక్షాత్తు పరమశివునివలె ప్రకాశించువాడు. కాషాయాంబరధారుడై, పరమ గురుమూర్తియై సాక్షాత్తు అత్రిసుతుడు దత్తాత్రేయునివలె దర్శన మొసంగుదయా మయుడు. మకరకుండల, మంజీర మకుట కంకణాది భూషలు ధరించిగల శక్తి గలవాడు. పటిమగలవాడు. పండితుడు. ఛత్రచామరాందోళికలచే సేవింపబడు వాడు. అతడే వీరనారాయణుడు. విశ్వగురుడు, విజ్ఞానగురుడు జగద్గురుడు.

"అతనిని దర్శించినంత మాత్రముననే అరిషడ్వర్గములు సహితములయమై పోవును. వాసనాత్రయములు నశించును. తాపత్రయ మడంగును. మనస్సుకు శాంతి లభించును. ఆందోళన అదృశ్యమగును. ప్రశాంతత చేకూరును. పరమ పదము అప్పటి కప్పుడే లభించినంత సంతోషము దొరకును."- అని చెప్పిదాడే వాలా బాబా అక్కడినుండి నిష్క్రమించినారు

అప్పటికే వీరగురుని దివ్య స్వరూపమునకు రూపకల్పన మేర్పరచుకొనిన సిద్దయ్య ఆ దివ్య స్వరూపమునే చింతించుచూ, మన్మదబాణంబుల తాకిడికి వ్యథ నొంది, ప్రేమికునకై విరహమంది వివశయైపడిన మదవతివలే, సిద్దుడు గురుభక్తి ప్రాదవశ్యంబున మూర్ఛచెందినాడు — ఒకింత సమయానంతరములేచి ఆలోచనము ప్రారంభినాడు.

"అహా ! ఏమా దివ్యసుందర విగ్రహము. నాయూహలలో నిల్చి యున్నది శ్రీరమాకాంతుడైన ఆ మహనీయుని కన్నులార గాంచకయున్న ఈ చర్మచక్షువులు కలిగియుండి నందులకు ఫలిత మేమి ?

"మహేశ్వరా ! మహానుభావా ! భూభారమును మాన్పుటకు ప్రభవించిన ప్రభువు, అట్టి నీదివ్యపాదరజోలేశము శీర్షమున దాల్చకయున్న ఈ శిరః ప్రయో జనమేమి ?

"మహామా సమంచితుడవైన నిన్ను పూజించి నీపాద సంవాహనము చేయని ఈ కరములుండిన ఫలితమేమి ? నీదివ్యనామా మృత సుధారసధారల గ్రోలక యున్న ఈ నాలుక ప్రయోజనమేమి ? నీ జిహ్వాగ్రామునుండి వెలువడు దివ్య హక్కుల నాలకింపకయుండిన ఈ కర్ణ రంధ్రముల కలిమియేల భగవాన్ !

"తండ్రీ! వీరగురుదేవా! ఆలోచించగా ఆలోచించగ నాకొక అనుమానము గల్గుచుండినది. బాబా ఏమి చెప్పినాడు. గోహత్యాపాతకమునకు పింజారి కుల సంభవుడవై పుట్టుదువని స్వామి చెప్పినట్లునుడివెను కదా! మరి నేనా రాజకుమారుడనై యుండవచ్చునేమో! ప్రస్తుతము నేను పింజారి కుల సంభవుడనేగదా! నాలో వీరగురుపై భక్తి వెల్లుబుకు చున్నది గదా! ఏమో! ఎవరు చెప్పగలరు? దైవ సంకల్పము లూహించుట మానవ మాత్రులకు సాధ్యము గాదుగదా!

"సరియే కానిమ్ము. నేనా రాజకుమారుడనైననూగాకున్ననూ నాకా దివ్య గురురాట్చక్రవర్తి పదపారిజాతములు తప్ప అన్య మేమియూ అవసరములేదు. ఆదివ్య పురుషుని పదపంకజముల చెంత చేరి మోక్షపథము పొందుటయే నా ప్రథమ కర్తవ్యము. అది లభించకున్న యింక యీ జన్మము వృథాయని యే తలంతును. జై! శ్రీవీరగురు రాట్చంద్రమౌళీ! జై! యిదే నీ సన్నిధికి వచ్చుచున్నాను"— అని బయలుదేరినాడు. కాని అతనిలో ఆలోచనలు, అనుమానములు తలలెత్తినవి. "నేనిప్పుడు ఇంటికేగి వీరబ్రహ్మగురు పదసేవ కేగుచుంటినని చెప్పిన తల్లి తండ్రులు సమ్మంతించరు. ఏవేవియో కథలు చెప్ప బూనెదరు. నీతులు బోధింప ప్రారంభింతురు. నా ప్రయత్నమును విరమింప చేయుటకు సకలోపాయములనూ ప్రయోగింతురు. పది మందిని చేర్చినా మనసు మార్చుటకు ప్రయత్నములు చేయుదురు. గురుపాద పద్మ సేవలభించనున్న సమయమున, నేనీ లౌకిక మోహావేశ బద్ధుడనైతినేని, నేను సాధించ దలచుకున్న దివ్యమార్గమునకు అవరోధములై నిల్చును. కనుక వాటి నిప్పట్టున దరిచేర నీయకుండుటయే మంచి మార్గము. కనుక తలితండ్రుల యాజ్ఞకై పరితపించి ప్రయత్నము మాను కొనుట సమంజసము కాదు కనుక ముందుకు సాగుటయే ప్రథమకర్తవ్యము."—అని "జై! గురుదేవా!" అని ఎలుగెత్తి జయ జయధ్వానములు చేసినాడు. దూరా భారమును లెక్కగొనక పాదచారియై పట్టుదలతో, భక్తితో స్థిరమైన చిత్తముతో సిద్ధయ్య బయలుదేరినాడు.

## సిద్ధయోగి ప్రసిద్ధ భారతం

—: పదునైదవ భాగం :—

నాడు బ్రహ్మముహూర్త కాలముననే మేల్కాంచి, యోగభ్యాసాది కార్య క్రమములన్నియు ముగించుకొని, వీరబ్రహ్మగురుడు మఠప్రాంగణమున విశాల ప్రదేశమునందు ఉన్నతా సీనుడై యుండగా పుత్రులందరు సేవలు సేయుచుండ, గోవిందమాంబస్వామివారి వామపార్శ్వమందు అలంకృతురాలై ఆశీనయై యుండి నది. అంతలో కొంతమంది ఏబది సంవత్సరముల వయసు దాటిన వృద్ధునొకని తెచ్చి "స్వామీ! యితడు సన్నిపాత జ్వర పీడితుడు. పది దినములుగా బాధ పడు చుండి నాడు. ఎన్నిమందులు వేసిననూ తగ్గలేదు. బ్రతికింపుడు"— అని వేడి కొనినారు.

"ఇంత మాత్రమునకే యిట్లేల చింతిల్లెదరు. వెంటనే గృహమునకు గొంపోయి పరమాన్నము తినిపింపుడు. క్షణకాలములో జ్వరము తగ్గి సుఖము నుండును. అని స్వామి చెప్పినారు. అందరూ ఆశ్చర్యపడిరి సన్నిపాత జ్వరరోగికి పర మాన్నము పెట్టిన బ్రతుకునా యని కాని వీరబ్రహ్మము మాట రామబాణము గదా!....అది జరిగియే తీరును. —అనుకొని అ బందుగు లట్టులే అ వృద్ధుని గృహము నకు తీసికొని పోయి పరమాన్నము తినిపించిరి ఆతని రోగము నివారణమయ్యెను.

ఆనాడు అనేక మంది భక్తులు స్వామిని పరివేష్ఠించి యుండిరి. కొందరు కానుకలను దక్షిణలను సమర్పించుచుండిరి. మఱికొందరు వారి వారి పంటలనుండి కొంత భాగమును తెచ్చి స్వామికి సమర్పించుచుండిరి ఇంకొందరు వారివారి పొలముల లోను, పెరళ్ళలోను పండిన కూరగాయలను ఎంతయో భక్తితో, ప్రేమతో సమ ర్పించుచుండిరి. స్వామి అందర్నీ చిర్నగవులతో పలుకరించుచు, ఆశీర్వాదముల నొసంగుచు, ప్రశాంత వదనార విందుడై భాసించుచుండినాడు

స్వామి అచట చేరిన భక్తకోటిని చూచి ఆధ్యాత్మికోపన్యాసముచేసె "కనుక పవిత్రాత్మ స్వరూపులారా! మన ఆత్మలకు బుద్ధులకు, అంతర్యామి యగుటచే మనలను దుష్టాచారముల నుండి అధర్మమార్గములనుండి విముక్తి కల్గించి శ్రేష్ఠమైన ఆచారములందు సత్యమార్గములందు ప్రవర్తింపచేయుటకు అతిసమర్థుడు, సచ్చిదా

నంద స్వరూపుడు, క్లేశరహితుడు, శుద్ధచైతన్య స్వరూపుడు, న్యాయనిర్ణేత, కృపా సింధువు, అయినటు వంటి పరమాత్మను మనసము ధరింతుము గాక! అతనికంటె సమానుడు, అధికుడు వేరొకడు లేడు. కనుక అతడే తండ్రి, తల్లి, రాజు, న్యాయాధీశుడు, గురువు. సర్వమును అతడే. అటువంటి విశ్వనిర్మాణ కర్తయైన విశ్వ బ్రహ్మము నొదలి యితర వస్తువుల ధ్యానింపనేల?"—అని బోధలుచేసి, సభ ముగించ బోవు సమయమున జనమును చీల్చుకొని వచ్చిన సిద్ధుని శ్రీ గురుడు అమితాశ్చర్య ముతో, కన్నార్పకుండచూచి "సిద్ధా! వచ్చితివా! ఎన్నాళ్ళకెళ్ళకు? నీ కొఱకే ఎదురు చూచుచుంటిని. —అని రెండు చేతులూ ముందుకు చాచినాడు.

సిద్ధుడు శ్రీవీరగురుని దివ్య వర్చస్సును, ప్రకాశవంతమైన పాద యుగళిని చూచి తన సంతోషమును ఆనందమును, గురుదేవుని ఆహ్వానమును చూచి, ఆపుకొనలేక, పరవశించి నేరుగా గురుదేవుని పాదములపైబడి.

శ్లో॥ వందేగురు పదద్వంద్వం వాఙ్మనోతీత గోచరం,
శ్వేతరక్త ప్రభాయుక్తం శివయోగాత్మకం పరమ్॥.

గురుగీత

"ఓ! గురుసార్వభౌమా! నీ పాదద్వయమునకు వందన శతంబులు. నీ పాద పద్మముల శోభను ఏమని వర్ణింతును ప్రభూ ! నీ యొక్క ఔన్నత్యము వర్ణింప నలవి గానిది మనోవాక్కాయకర్మల కతీతమైనది. అందనిది. అపరూపమైనది. శ్వేతరక్త ప్రభాయుక్తమైనది నీపాద పంకజద్వయము. ఆత్మపరమాత్మల సంయోగ మున కది చిహ్నము. నీవు పరశివరూపుడవు పరమాత్మవు. పరబ్రహ్మ స్వరూపుడవు. సచ్చిదానందుడవు. సర్వాంతర్యామివి. నీ కివే నా వందనములు

శ్లో॥ యదంఘ్రికమల ద్వంద్వం ద్వంద్వతాప నివారకం.
తారకం భవసింధోశ్చ శ్రీ గురుం ప్రణమామ్యహమ్॥

గురు గీత 14.

గురుదేవా! పవిత్రమైన నీ దివ్య చరణములకు వందనము లర్పించుచుంటిని ఈ లోకము నందున్న శీతోష్ణాది సుఖదుఃఖాది ద్వంద్వముల కతీతుడనుగా నన్నుద్ధ రించి కాపాడుము. పలువిధ జన్మములెత్తకుండ మోక్షమును ప్రసాదించి జన్మ

౦హిత్యే మొసగును. ఈ విషయ వాసనలనుండి భవసాగరము యొక్క అటు ౦టుల నుండి కడతేర్చుము.

శ్లో॥. అయం మయాంజలిః బద్ధో దయాసాగర వృద్ధయే
భవచ్ఛానుగ్రహో భూయాత్ ఘోర సంసారము క్తయే॥.
గురుగత

"హే! మహరాజ్! దయాసముద్రా! అంజలి ఘటించుచుంటిని అల్పుడను. ౦బుడను. జ్ఞానసముపార్జనాయత్త చిత్తుడనై నిన్ను వెదకికొనుచూ వచ్చితిని. న్ననుగ్రహించి ఈ భవసాగరమును దాటించి ఆధ్యాత్మికొన్నతి ప్రసాదించి నన్ను పాడుము.

"అఖండ మండలాకారా! ఆనంద రసస్వరూపా! ప్రేమ ప్రదాతా! పరంజ్యోతి ;రూపా! ప్రణవానందస్వామీ! సద్గురు శేఖరా! సకల పాప విధ్వంసకా! సచ్చిదా ౦దరూపా! సర్వేశ్వరా! అనందమయా అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకా! పదోద్ధారా! అవాఙ్మనసగోచరా! ఆర్తత్రాణ పరాయణా! ఆదినారాయణా! క్తవరదా! బ్రహ్మాండ స్వరూపా! నమోనమః —గురుదేవా! ఎక్కడెక్కడో దకి, ఎన్నెన్నో ప్రదేశముల తిరిగి తిరిగి, వేసారిన నాకు దాడీబాబావారు దారి ౦పించగా నీపదపంకజ సాన్నిధ్యమునకు వచ్చిచేరితిని. ఎడారిలో కుంభవృష్టివలె. కలిగొన్నవారి కమృతాహారమువలే. గ్రీష్మఋతువు సందు పన్నీటి జల్లులవలె నలభించితివి. దేవా! నన్ను శిష్యునిగా స్వీకరించి నాకు భక్తిజ్ఞాన వైరాగ్య ౦ల ప్రబోధము చేసి ప్రసాదించి, నా జీవితమును ధన్యముసేయుము."— అని గురుని రెండు పాదములబట్టి వదలడాయె.

౨ :

సేవచేయవచ్చినాడ! శ్రీ పీరగురు బ్రహ్మము
గురుపాదము పూజచేసి! గుర్తు తెలియ నరుదెంచితినీ ॥సేవ॥

ఏడుమెట్లు నెగబ్రాకియు! వెలుగుపూజలు చేతబట్టి.
ఆపద్బాంధవుడు గురునీ! ఆత్మపూజ చేయదలచి ॥సేవ॥

జగత్తంతా జ్ఞానజ్యోతి! వెలుగులతో నింపనున్న.
బోతూలూరి పీరగురునీ! పూజచేసి తరియించుటకు ॥సేవ॥

అని తన సహజమైన మాటలనే పాటలుగా మార్చుకొని, చిందులు త్రొక్కుచూ, శ్రీగురుని చుట్టూ ప్రదక్షిణలు సేయుచు, ఆనందోద్రేకమున నాటి సాంబశివుని సభలో భృంగి నాట్యమాడినట్లు ఈ శ్రీగురుని సభలో సిద్దయ్య నాట్యము చేసినాడు.

ప్రేమస్వరూపుడు, సంతృప్తమానసుడు; పరమానంద సంశోభితుడైన శ్రీ గురుడు అతని శీర్షముపై చేయునుంచి 'కుమారా! స్వస్థుడవుగమ్ము. శ్రీఘ్రమే ఆనంద ప్రాప్తిరస్తు! అభీష్ట సిద్ధిరస్తు! - లే! నాయనాలే"—అని రెండు భుజములు పట్టుకుని పైకి లేపి, గుండెలకత్తుకొని-ఇవతల కూర్చుండబెట్టినాడు

ఎప్పుడైతే వీరబ్రహ్మగురుని దివ్యహస్తము అతని మస్తకముపైబడెనో అప్పటికప్పుడే అతనిలోని ప్రకంనములన్నియు తగ్గినవి ఉద్రేకముతగ్గినది. చిత్తము ప్రశాంతమైనది సిద్ధయ్య దేహమంతయు తేలికమైనది. అనిర్వచనీయమైన ఆనందము తేలియాడుతూ తన్మయత్వమున కనుల వెంట ఆనందాశ్రువులు అవిరళముగ కారజొచ్చినవి. అతని కంఠము పూడిపోయినది.

ఒక్కక్షణము నిశ్శబ్దమావరించినది.

"తండ్రీ! యితడెవరో ఎఱుగము. ఇతని వాలకముచూడ మహమ్మదీయ వంశ సంభవుడుగా దోచుచుండెను. హిందూమత జన్ముడుగా తోచుటలేదు. స్వమతమును వీడి పరమతము నవలంభించుటకు గల కారణము లెవ్వియో ఎఱుంగము. ఇతని నాదరించినందువలన అనవసరపు మత కలహములగు గరియగుదుమేమో! ఆలోచింపుడు అనినాడు కుమారగోవిందుడు.

ఆ మాటలకు సిద్దయ్య ప్రతిస్పందించినాడు.

"అన్నా ! ఏమంటిరి ? సర్వచరాచర జగత్తుకు ప్రభువొక్కడేగదా! మతము వేరైనంత మాత్రమున మహిమోపేతుడైన సృష్టికర్త వేరుగాడుగదు ! జగత్తును సృష్టించినది పలువిధ దైవములు కాదుకదా ! సర్వజీవులకూ ప్రభువొక్కడేగదా స్వామీ! ఆకాశమునుండి వెలుగు సూర్యుడు అన్నిమతముల వారికి అవసరమేగాని ఏ ఒక్కరికోకాదుగదా ! సర్వాంతర్యామియైన ప్రభువొక్కడేగదా !

"ఆయన అల్లాహ్. అద్వితీయుడు. అల్లాహ్ నిరపేక్షాపరుడు. ఎవరి ఆధారమూ అక్కరలేనివాడు. అందరూ ఆయనపై ఆధారపడేవారే. ఆయన ఎవరి సంతానమూకాదు. ఆయనకు సరిసమానులు ఎవరూలేరు — అని ఖురానుసూక్తి.

"నన్ను కాదనకుడు. నన్నను గ్రహింపుడు — నా మనోభృంగము గురుసేవాజ్జనిత మాధుర్యమును గ్రోల నువ్విళూరుచున్నది. గురుసేవ లేక జీవితమే వ్యర్థము. ఇంతకాలము నీ కొఱకే అన్వేషణ సేయుచు, నేటికి కనుగొనగలిగితిని. అదియూ నీ కృపయేగాదా స్వామీ. నాలో తీవ్ర మోక్షేచ్ఛ రగిలించి గురువుకై జిజ్ఞాసరేకెత్తించి, నన్ను నీవైపున కాకర్షించుకొనినదీ నీవేగదా స్వామీ! ఇన్ని నాళ్ళకు నీ సందర్శన, స్పర్శన, భాషణ భాగ్యములు నాకు లభించినవి. నన్ను కాదనకుడు. నన్ను అనుగ్రహింపుడు" — అని మరొక్కమారు గురుపాదములబట్టి వదలడాయె.

"చిరంజీవి ! భయంబుడుగుము. నీవు కోరునదేదియైననూ, ముమ్ముందు నీ వివరములు ప్రజలకు తెలియవలయునుగదా ! వీరెల్లరూ నిన్నుగూర్చి తెలిసికొనవలయునని ఉవ్విళ్ళూరుచున్నారు. నీ ఊరు, పేరు, కులము, తలిదండ్రులు — వగైరా వగైరా విషయములన్నియూ తెలియవలయునని ఆకుతూహల్య గోరుచున్నారు. నన్ను నీవు తెలిసికొనుటకు అవసరము. కుల మతములు ప్రధానములు గావు. అవి మనుష్యులు సృష్టించుకొనిన పిశాచములు. ఆ పిశాచములకు బానిసలై తోటివారినే అసహ్యించుకొనుటకు, చివరకు ప్రాణములతీయుటకు కూడా సిద్ధపడుదురు. వారు మానవులెటులగుదురు." వీరబ్రహ్మం

"గురుదేవా ! భవద్దర్శనంబు చేతనే నేను ధన్యుడనైతిని. నాలో ధైర్యము ద్విగుణీకృతమైనది. నా స్థితిని గమనింపుము. నా పరిస్థితి నర్థముచేసికొనుము. నా మానసిక, శారీరక పరిస్థితులు మీకిప్పటికే అవగతమైయుండును.

"గురుదేవా మనిషి మదినుండి యుద్భవించిన యీ మతము అదియే. 'మదము'- అని నేనందును. దానికి బానిస కాకూడదు. అదే నా మతము.'

"భళా సిద్దయ్యా ! - నీవెవరో నాకు తెలుసు. కాని వీర్లకు తెలియదు. నీవు ముడుమాల గ్రామ నివాసుడవు. అదంబీ. పీరుసాహెబుల కనుంగు పుత్రు

డవు. పింజారి కులసంజాతుడవు. పవిత్రుడవు "- అనినాడు శ్రీగురుడు.

"గురుదేవా ! నేను మీకొఱకే జీవించియున్నాను. మీ సేవచేసి నాజన్మము ధన్యము చేసికొనవలయునని పట్టుదలతో, దీక్షతో ఇన్నినాళ్ళు అలమటించి, అలమటించి, ఆవేదనచెంది, నేటికి నిన్ను కలుసుకొనగలిగిన ధన్యుడను. నన్ను తిరస్కరించవద్దు. నీ ఉపదేశములతో, నాకు సుస్థిరగతి లభించునన్న నమ్మకము నాకు కల్గినది ఈభవాబ్ధిని దాటుట నా లక్ష్యము అందులకు నీ పాదసేవయే నాకు శరణ్యము. భవత్కరుణ నాపై ప్రసరింపచేసి, నాకు కారణ మిచ్చి దయగనుము."- అంచు మ్రొక్కినాడు.

"బిడ్డా ! సిద్ధయ్యా ! అతిగుహ్యమైన మార్గము నెన్నుకొంటివయ్యా ! బహుప్రయాసతో కూడిన మార్గము నెన్నుకొంటివి. అది నీవనుకున్నంత సులభసాధ్యముగాదు. మోక్షసాధన, భవాబ్ధి దాటుట యిత్యాది కార్యక్రమములు చాల దుర్లభమైనవి. నీవనుకొనినంత సాధారణ విషయములుగావు. సిద్ధయ్యా ! నీవు పసివాడవు. నీకీ బోధ ఎవరు చేసిరోకాని, బహుదుస్తరమైన విషయము నాయనా ! ఇంటికి వెళ్ళి చక్కగా చదువుకొని తల్లితండ్రుల సేవించి వారిని సుఖపెట్టివారి ఋణమును తీర్చుకొనుము. వెడలుము."- అనినాడు శ్రీ గురుడు.

"లేదుస్వామీ ! ఈ నిర్ణయము మారదు. నేనెంచుకొనిన మార్గములు కడుంగడు దుష్కరమనియు, దుస్తరమనియు నాకు తెలియును. సులభసాధ్యము కాదనియూ నేనెఱుంగుదును. అందులకే గురుసేవలకై పదువులెత్తితిని. భూమ్యాకాశము లేకమైనను నా నిర్ణయము మారదు. మీరు నాకుపదేశమీయ వలయును నేను సాధించి తీరవలయును. పట్టుదల, ఓర్పు, సాధన ఉండవలయునే గాని సాధించలేనిదుండునా స్వామీ ! నేను గురుస్వరూపమును పొందవలయును. ఇది తప్పదు. ఈ కఠోర విశ్వాసము మారదు. నా నిర్ణయమును నీరుగార్చి నాకు పిరికి మాటలు చెప్పి నన్ను త్రిప్పిపంపించు ప్రయత్నము మాత్రము చేయకుడు. ఆ ప్రయత్నము విఫలమగునే కాని సఫలముగాదు."- అనినాడు సిద్ధయ్య.

వీర గురుడు నవ్వుకొనినాడు.

"ఏమీ బాలుని కఠోర నిశ్చయము."- తనకై తాను ఆశ్చర్యపోయి మరి కొంత పరీక్షింపనెంచి.

"నాయనా ! సిద్దయ్యా ! ప్రశాంతముగ నాలోచించుకొనుము. తొందర పాటు నిర్ణయము మంచిదిగాదు. అయినను ఇటువంటియోగ సంబంధ ప్రక్రియలు, సాధన బహుకఠినతరమైన నియమములతో కూడియున్నవి. నీవయసాచిన్నది. అట్టి నియమములు పాటించుటకు కావలసిన వయసు కాదిది. నీవు మరికొంచెము ఆలోచించుకొనుము. తాపీగా, నిదానముగ, ఆలోచించుకొని ఒక నిర్ణయము తీసికొనుము. అంతియేగాని ఎవరో, ఏదియో చెప్పిరని తొందరపడి ఒక నిర్ణ యమునకు రాకుము.

"మోక్షమనిన సామాన్యమా నాయనా! అంతరేంద్రియముల మదమడగించి గురు మంత్రము నేమారక, నిరంతరము తైలధారవలె జపించుచుండవలయును. మరి నీవది చేయగలవా? ఇంద్రియముల నీ అధీనమున నుంచుకొనగలవా!

"కర్మేంద్రియములను లొంగదీసికొని, పలువిధ యోగాసనములను అభ్య సించ గలవా? కర్మాయవములైన వాక్కు, పాణి, పాదము, గుదము, గుహ్యము, జ్ఞానేంద్రియములైన కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మముల పోకడ మట్టు పరచి పంచ ముద్రల నభ్యసించగలవా? అటులనే ప్రాణేంద్రియములను బంధించి అష్టాంగ యోగములను నేర్వగలవా? పంచభూత సమత్ర్పపంచకమును మిథ్యయని భావించి నిరపేక్షతో నుండగలవా? అర్భకుడవు కష్టసాధ్యమగునట్టి పరమపద మేవిధముగ లభించునయ్యా సిద్దయ్యా!"—అనినాడు శ్రీ గురుడు.

"గురుదేవా! మీరిప్పుడుచ్చరించిన పదములు నా కర్థముగానివే. కాదనను కాని తెలిసికొనవలయుననెడి తీవ్రమైన యిచ్ఛతోగదా నేనిచ్చట కరుదెంచితిని. అభ్యసించినగదా అర్థములు తెలియునది సాధనమునగదా పనులు సమకూరునది. మీచెంతనుండి ఎంతటి కష్టసాధ్యమైన పనులనైనను సాధించగలను. గురుదేవుల కరుణ యుండవలయునేగాని శిష్యులకు సాధించలేనిదుండునా స్వామీ! సంపూర్ణమైన నీకరుణ కలగవలయునేగాని సర్వేంద్రియములను లొంగదీయగలను. స్వామీ! ఏకలవ్యుడు శరసంధానమునందెట్లు తిరుగులేనిమేటి విలుకాడయ్యెను స్వామీ!"—అనినాడు సిద్దయ్య.

"మరియొక విశేషము సిద్దా ఈ సాధనకు మాంసాహారము పనికిరాదు. శుద్ధ సాత్వికాహారము మాత్రమే చేయవలసియుండును. నీవు మహ్మదీయ వంశా

తర్గత పింజారీకుల సంభవుడవు. మాంసాహారము నీకభ్యాసమై యుండునుగదా!" అనినాడు శ్రీ గురుడు.

"అయ్యో! గురుదేవ! నేను మహమ్మదీయ వంశజుడనైనప్పటికీ మాంసాహారము నేనేనాడో విసర్జించితిని. అంతియేగదు నా తలితండ్రులచేత కూడ విసర్జింపచేయ గలిగితిని. నా ఆహార విషయములగూర్చి నన్ను అనుమానింప వలదు. నేను శుద్ధశాఖాహారిని."—అనినాడు సిద్దయ్య.

"నీప్రాయమా బహుచిన్నది. నీ ప్రయత్నమా బహుపెద్దది. కొండను త్రి కొనుచుంటివి. ఇంతటి చిరుత ప్రాయమున కైవల్యమెట్లు కలుగునయ్యా!"—శ్రీ గురుడు.

"గురుమహారాజ్! నాచేత చెప్పించవలయుననిగాని, లేక మీకు తెలియదా! ప్రహ్లాదుడు పసివాడుకాదా! నారదమంత్రోప్రదేశమున అతిపిన్న వయస్సుననే శ్రీహరి కటాక్షమునకు అతడు పాత్రుడు కాలేదా! ఉత్తానపాదచక్రవర్తి తనయుడు ధ్రువకుమారుడు పసివాడుకాదా! శ్రీమహావిష్ణువును ప్రసన్నము చేసికొని పరమ తపస్వి కాగలిగెనుగద! స్వామీ! మార్కండేయుడు బాల్యముననే కదా పరమ శివుని ప్రత్యక్షము చేసికొని పూర్ణాయుష్షను బడయ కలిగినాడు. దీక్ష, పట్టుదల, గురుకృప ఉండవలయునేగాని మానవునకు సాధ్యముకానిదేమున్నది ప్రభూ!

"ప్రభూ ! కఠోపనిషత్తాంతర్గత నచికేతసుని కథ నన్ను అమితముగ నాకర్షించినది. స్వామీ ! నచికేతసుడు బాలుడేకదా ! యమధర్మరాజును సహితము మెప్పించి "భక్తి, జ్ఞాన, వైరాగ్య సిద్ధిరస్తు, అని దీవెనల బొందెనుగదా !- గురు దేవా !"— అనివాడు సిద్దయ్య.

"సిద్దయ్యా!- నీవు మంచి పట్టుదలతో నుండుటయేగాక, ఎవరి సాంగత్యము నీ కబ్బెనోగాని, చదువుకున్నది తక్కువైననూ సమాచారమును బాగుగనే జీర్ణించుకొంటివి. చాల సంతోషముగనున్నది. నేనిప్పుడు ఏవియో రెండు, మూడు విషయములను మాత్రమే ప్రస్తావన చేసితిని. ఇంకెన్నియో కష్టతరములైన నియమములున్నవి. అవి నీబోటి పాలుగారు పసివాని కభ్యసింప సాధ్యముకాదు. మధ్యలో మానుకొనిన జీవితమే పతనమగును. హాయిగ ఆటపాటలయందు కాల మెళ్ళబుచ్చవలసిన వయసు. భక్తికల్గియుండుట మంచిదే. కాదని చెప్పను. ఇంతటి తీవ్ర వైరాగ్యముగోబడుట కింకనూ సమయముండినది కనుక తొందర

పడి మార్గమధ్యమున పతనమగుట మంచిదిగాదు. నిద్రాహారములు మానవలసిన సమయము గూడ రావచ్చును. ఆకలిని గూర్చి ఆలోచించు సమయము గూడ నుండదు. నీరసము వచ్చును. విషయలో ఏ మాత్ర మలసత్వ మొచ్చెనా మొదటికే మోసము ఘటిల్లగలదు. ముద్రాసనములు అభ్యసించునపుడు శారీరక బాధలునూ కల్గును."- అనినాడు శ్రీ గురువు.

"గురుదేవా ! మీరునన్ను పరీక్షించుట కివన్నియూ చెప్పుచుంటిరి గాని నిజముగ నామీద దయలేకకాదు. నామీద మీకు కరుణోదయమగుచున్నది. నేనెవరో!- నా పూర్వజన్మమేమిటో అన్నియూ మీకు తెలుసును. అందులకే ఈ ప్రబోధము సేయుచున్నారు. నిజముగ నేను మీమాటలు విని వెడలిన మరల మీరలే నాకొఱకు వెదకుదురు. యిది సత్యము. లేకున్న నన్ను చూడగనే "సిద్ధా ! వచ్చితివా ! నీకొఱకే ఎదురు చూచుచుంటినని"- బల్కి-తిరిగదా ! గురుదేవా ! ఆలోచనము సేయుడు. నేనే నాగురువు నన్వేషించుచూ వచ్చితిని. లభించితిరి నేనిక ఎట్టి పరిస్థితులలోనూ గురువునొదలి వెడలను నా కన్నియు సుసాధ్యమే! నాశక్తి సంపద యంతయు మీరే !- అనుగ్రహింపుడు. ఇంక నన్ను పొమ్మనకుడు స్వామీ !"- అనినాడు సిద్దయ్య.

"అయిననూ నీకొక్క-దినము గడువిచ్చుచున్నాను. బాగుగా ఆలోచించుకొని ఒక నిర్ణయమునకు రమ్ము."- అని అచటనుండి లేచినాడు శ్రీగురుడు. అందరునూ లోనికి వెడలినారు. సిద్దయ్య ఒంటరియైనాడు. అతని భోజనమును గురించి ఎవరూ ఆలోచించలేదు. తనకై తనకే తన భోజనమును గూర్చి ఆలోచనలేదు. ఇంక ఇతరు లెవరు ఆలోచింతురు. ఆ దినమంతయూ శ్రీ వీరగురుబ్రహ్మ నామమునే జపించుచూ సర్వమూ మరచి అచ్చటనే కాలక్షేపము చేసినాడు.

తెల్లవారినది....

స్నానాదికముల ముగించుకొని అందరికంటె ముందుగనే తానక్కడికి చేరినాడు. శ్రీ గురుడు తన సింహాసనమధిష్టించు సమయమునకు ముందే అచ్చటచేరి శ్రీ గురుని, గురుపత్నిని సింహాసన మధిష్టించ నాహ్వానించినాడు.

"భళా! సిద్ధా! భళా! రాతిరంతయు నన్ను నిద్దుర పోనీక పోతివి."— అనినాడు శ్రీ గురుడు.

"అదేమిస్వామీ!"—సిద్దయ్య.

"రాత్రిరంతయూ నన్నే జపించుచు, స్మరించుచూ నా పర్యంకము చుట్టూ ప్రదక్షిణముల చేయుచునే యుంటివి. ఇంక నాకు నిదురెట్లు వచ్చును."— అని నాడు శ్రీ గురుడు.

"నే నిచ్చటనే పరుంటిని. ఎక్కడకునూ వెళ్ళలేదుస్వామీ!"—అనినాడు అమాయకముగ సిద్దయ్య.

"మరేమి నిర్ణయించుకొంటివి"—అనినాడు శ్రీ గురుడు.

"ప్రత్యేకించి యిప్పుడు నిర్ణయించుకోవలసిన దేదియూ లేదుస్వామీ. నిర్ణయమేదో గతముననే తీసికొంటిని. ఆ నిర్ణయమునకే కట్టుబడియుంటిని! ఆ నిర్ణయము మారుట అసంభవముస్వామీ! గురుదేవా! యోగమో! తపమో! ఆసనమో! జపమో!—మీరేది చెప్పదలచితిరో అది తెలపీయుడు దాని నాచరించి చూపుదును. అప్పటికినీ మీరు కరుణించి, నన్ను స్వీకరించకయున్న నేనేగోపుర శిఖరాగ్రమునెక్కి క్రిందకు దూకి మరణింతును.

"గురుబ్రహ్మ! ఇన్నిమాటలేలస్వామీ! ఉపదేశమిచ్చిన మీరే ఈయవలయును. మోక్షమును నేను మీవద్దనుండే పొందవలయును. అంతియేస్వామీ! ఇది నా దృఢ నిశ్చయము. నన్ను కరుణింతురా! లేక ఆత్మార్పణము చేసి కొమ్మందురా! తెలపీయుడు."— అని కఠోర నిర్ణయమును తెల్పినాడు సిద్దయ్య.

శ్రీ గురుడు లోలోన ఎంతయో సంతోషించినాడు శ్రీ గురుడు అమితానందభరితుడై సిద్దయ్యను దగ్గరగా తీసికొని కౌగలించుకొనినాడు. "సిద్దా! మెచ్చుకొంటినిరా! మన యిద్దరి బంధ మీనాటిది కాదు నిజముగ నేను నీకొఱకే ఎదురు చూచుచుంటిని. నీదాడీవాలా బాబా ఎవరోగాదు సర్వమూ గురుమయమే! ఒక్కసారి కళ్ళుమూసికొని చూడు"-అనినాడు శ్రీ గురుడు.

సిద్దయ్య ఒక్కసారి కళ్ళుమూసికొని తెరచి చూచుసరికి శ్రీ గురుని స్థానంలో దాడీవాలా బాబా ప్రత్యక్షమగుసరికి సిద్దయ్య ఆశ్చర్యమందు మునిగి పోయినాడు. ఒక్క లిప్తకాలం తర్వాత శ్రీ గురుడే మళ్ళీ అక్కడ కన్పించినాడు.

సిద్దయ్య ఆనందపారవశ్యంలో శ్రీ గురుని పాదములపై వ్రాలి అనేక స్తోత్రములతో శ్రీ గురిని కీర్తించినాడు.

## సిద్ధయోగి ప్రసిద్ధ భారతం

### పదునారవ భాగం

సిద్ధయ్య ఇంటికిరాలేదు. పీరుసాహెబు కంగారు పడిపోయినాడు. "బిడ్డ ఎటుపెడలెనో యేమో! అసలే అతని ప్రవర్తనలో మార్పు కన్పించుచున్నది ఎంత సేపటికీ భగవంతుడనియు, భక్తియనియు, గురుదేవులనియు—తన సమయము నంతయు గురువును ఎలుగెత్తి పిల్చుచూ, ఆ గురుధ్యాన తత్పరతతో ఐక్యమై యేడ్చు చుండినాడు.

"ఇపుడెచటి కేగినో యేమో! దెలియరాకున్నది. దినములు గడచుచున్నవి. బిడ్డ తిరిగిరాలేదు. అగురు దర్శనమైనదా! ఆ గురువు నన్వేషించుచూ వెడలెనా? లేక మతితప్పి దారి తెలియక పిచ్చివాడై వీధులపాలై పోయెనా! అయ్యో! భగవాన్! నాకు లేక లేక కలిగిన బిడ్డడు. ఒక్కగానొక్కడు. ఎటు వెడలెనోయేమొ! యిప్పుడెక్కడని వెదకుట? ఎక్కడుండెనని వెదకుట?—ఏ సన్యాసుల వెంబడి పోయెనో!—ఏ పైగంబరుల ననుసరించి వెడలినో! అరే ఖాసింభాయ్! బచ్చా నైమిలారే! నైమిలా!-క్యాకరూఁ!"— అని యేడ్వడం మొదలు పెట్టినాడు పీరు సాహెబు.

"మత్ రోభయ్యా! బేటా మిలేంగే! గబ్రావోమత్! అల్లా దయ ఉండాలి. ధైర్యంగా ఉండు!"—అని ఖాసిం ధైర్యం చెప్పినాడు.

విషయం తెలుసుకొన్న ఖాశింబి, ఆమెభర్త అల్లీఖాను వచ్చి ఓదార్చినారు. వీరిద్దరి పుత్రికారత్నం 'అచ్చాంబి' కూడ వీరి వెంటనే ఉన్నది. పీరుసాహెబు దంపతులు దుఃఖాబ్ధిలోనుండి భోజనములు కూడ సేయకున్నందున, కాశింబి యే వంటచేసి బలవంతమున వారిచే తినిపించినది.

"దిగులు పడకండత్తా! బావ ఎక్కడికీ పోడు. మళ్ళీ తిరిగి వచ్చును. తన గురువును దర్శనం చేసికొని మన దగ్గరకు మరలా వచ్చును."— అని అచ్చాంబి తన ముద్దు మాటలతో అత్తను ఓదార్చినది.

ఆదంబి అచ్చాంబిని కౌగలించుకొని యేడ్చినది.

ఇల్లు ఇల్లు వెదకినారు. సాధారణముగ అతను వెడలు అడవి ప్రాంత మంతయూ గాలించినారు. ఎక్కడ యే చెట్టు చాటుననైనా ధ్యానమందు కూర్చుండి యుండెనాయని చెట్టు పుట్టలన్నియూ వెదకినారు గుళ్ళు, గోపురములు గాలించినారు. బావులు, చెఱువులు గూడ గాలించినారు. ఎచట వెదకినా సిద్దయ్య జాడ కానరాలేదు.

సిద్దయ్య అనిన ఆచ్చాంబికి చాల యిష్టము. ప్రేమ. "బావ ఎక్కడా దొరకలేదు"—అనుకున్నప్పుడు ఆమెకూ దుఃఖ మాగలేదు తలి తండ్రులకు తెలియకుండా ఆమెయూ లోలోన రోదించినది.

పీరు సాహెబుబాగా దస్సిపోయినాడు. బిడ్డ కన్పించడని ఒక నిర్ణయమునకు వచ్చి కాళ్ళీడ్చుకొనుచు, కొండంత దుఃఖమును భుజమున వైచికొని యింటికి వచ్చినాడు. అతని నిస్సహాయత చూచి ఆదంబియు ఘోరముగ విలపించినది.

"అరే, సుభాన్‌బేటా ! నీవు నలుగురు మనుష్యులను తీసికొని ప్రక్క గ్రామములన్నియూ వెదికిరా ! సిద్దయ్య దొరకకపోతే మా జీవితాలుండవు. మేమిలా దుఃఖార్తులమై నశించి పోవలసిందేనా !"- అని పీరు సాహెబు సుభాన్ సాహెబును బ్రతిమిలాడినాడు.

"అలాగే వెళ్తాను. నీవు ఊరకా పరేశాన్ పడబోకు "— అని వారికి సుభాన్ ధైర్యముచెప్పి నలుగురు స్నేహితులను తోడుతీసికొని ప్రక్క గ్రామములలో గాలించుటకు వెడలినారు.

"లేక లేక కలిగిన ఒక్కగా నొక్కబిడ్డవు. సిద్దా ! ప్రేమతో నిను పెంచు కొంటిమి. ఈ విధముగ మమ్ముల నన్యాయముచేసి వెడలుట న్యాయమని ఎట్లు తోచెనురా ! నాయనా ! సిద్దాంబేటా !

"ఎచ్చటి కేగితివో ! ఎచటనుంటివో ! ఏ మైననూ తింటివో ! లేదో!— ఆకలితో అటుమటించుచుంటివో ! ఏమో ! అయ్యోబిడ్డా ! నీవసలు ఎందుకు వెడల వలెనయ్యా !— మనకేమి తక్కువైనదని యిట్లు యిల్లువిడిచి వెళ్ళిపోతివి తండ్రీ!- అని ఆదంబి ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లి పడిపోయినది.

ఇంతలో "సోదోయమ్మ ! సోదె ! సోదెచెబుతాము తల్లి"— అని కేకలు వినబడగనే "ఆదంబి ! అదుగో సోదెసాని వచ్చినది. సోదె అడుగుదమా!"- అని ఒక మహిళ సూచింపగా "సరియే"నని ఆదంబి చెప్పగా సోదెకు యేర్పాట్లు చేసినారు.

ఎఱుకలసాని వచ్చినది.

వివరములు చెప్పి, ఎఱుకలసానికి ఎఱుక చెప్పమని అడిగినారు. ఎఱుకలసాని ఆ గ్రామమునకు క్రొత్తదిగాదు. కాకుండిన ఆ ఎఱుకలసాని వీరికి క్రొత్తగా గోచరించి యుండవచ్చును. గతములో ఎప్పుడునూ ఎఱుకలసాని యవసరము వీరికి రాలేదు. ఎఱుకలసాని మనసులో సిద్దయ్య రూపము చూచాయగా మెఱసినది. ఎన్నియో సార్లు సిద్దయ్యను ఎఱుకలసాని చూచిన జ్ఞాపకము ఆమెకున్నది.

ఎఱుకలసాని యిప్పుడు కంది మల్లాయపల్లి నుండియే వచ్చుచున్నది. అచ్చట సిద్ధయ్యను తాను చూచినది. కనుక యిప్పుడా మాట చెప్పినతనకు రావలసిన దక్షిణలురావు. అందువలన తానా విషయమును బయటపెట్టక "రెండు విధములుగాచెప్పి నా సంపాదన నేను చూచుకొనెదను. కోటి విద్యలు కూటికొఱకు గదా !"— అని తనను తాను సమర్థించుకొని, కొల్లా పురమ్మను ధూపదీప నైవేద్యములతో పూజించి, దక్షిణ తాంబూలముల స్వీకరించి, ఆదంబి చేత నొత చిటికోల పట్టించి, తన చేతిలో పట్టుకొని, గద్దెను మున్మారు మ్రొక్కించి, సోదె చెప్పుట ప్రారంభము చేసినది.

"అంబ పలుకు ! జగదాంబా పలుకు. శ్రీశైలభ్రమరాంబా పలుకు ! కాశీ విశాలాక్షి పలుకు ! కంచి కామాక్షమ్మ పలుకు ! మధుర మీనాక్షి పలుకు ! మహాకాళిమాతా పలుకు ! తిరుపతి వేంకన్న పలుకు ! సింహాచలం అప్పన్న పలుకు ! అలివేలు మంగమ్మ పలుకు !— బెజవాడ కనకదుర్గమ్మ పలుకు. అని దేవతలందర నాహ్వానించి యింక చెప్పుట ప్రారంభించినది.

"ఆదంబి నీ పేరు అమ్మరో వినవె ! సోదడుగుతుంటావు సుతుని కోసరము

గదా ! అమ్మ అబ్బాయి యిప్పుడిచ్చోటలేడు. పరుగెత్తి బ్రహ్మమును చేరిపోయి నాడు ''– అని చెప్పి తన డబ్బులు తాను తీసికొని మెల్లగా అటునుండి తప్పుకొని పోయినది.

బ్రహ్మమును చేరిపోయినాడనగనే, తన కుమారుడు చనిపోయెనేమోయని ఆదంబి "అయ్యో ! కుమారా ! వార్ధక్యదశలో మమ్మిట్లు చేసి వెళ్ళిపోతివా! నాయనా ! నీ వెంతటి చక్కని సుకుమారుడవో ! సుందరుడవో ! నీ అందచంద ముల నేమని వర్ణింతును తండ్రీ ! ఎన్ని నోములు నోచితినో !- ఎందరి పాద పద్మములకు పూజల నొనరించితినో ! అప్పుడుగాని నీవు పుట్టకపోతివి. పుట్టి మమ్ముల నిట్లు సేయతగునా !

– నీదు చక్కదనము. నీ ముద్దు మాటలు. నీ ప్రవర్తన నీ భక్తి నీప్రేమ- ఎవ్విధి మరువగలము. ఎవ్విధి మేము జీవించగలము,

"ఈ ముదిమిలో మమ్ముసాకి, మమ్ముల మన్నుచేసి, మా సమాధిపై నాలుగు పూలుంచి, సాంబ్రాణి ధూపముల నింక వేయువరెవరు ? ఇట్లుసేతువని ఏనాడూ తలంచలేదుగదా !

"తోటి పిల్లలతో ఆడుకొనివచ్చి" మాఁ! ఖానాదో। బహుత్ భూక్‌లగ్గాహై'- అని యింకెవరు అడుగుదురు. నీకు పెండిలిచేసి, నీవు ఆనందముగా కోడలితో కాపురముసేయ, మనుమలను, మనుమరాండ్రను నెత్తుకొని ముద్దాడి ఆడించుకొన వలయుననెడి ఆశలు అడియాసలైనవిగదా ! తండ్రీ !

"జ్ఞానబోధలు చేసినావు. మాంసాహారము మంచిది కాదని వాదించి మాచేత మాన్పించినావు. పదిమందికి చేప్పినావు. యిప్పుడెక్కడున్నావు తండ్రీ!- అని విలపించి, విలపించి శోషిల్లిపడిపోయినది ఆదంబి.

అత్త దుఃఖము చూచి భరించలేక అచ్చాంబియు రోదించినది.

---

## సిద్ధయోగి ప్రసిద్ధ భారతం

### —: పదునేడవ భాగం :—

నాల్గురోజులు దాటిపోయినవి.

నలుగురు మనుష్యుల వెంట తీసికొని సిద్ధయ్యను వెదకుటకు వెళ్ళిన సుభాన్ పరుగు పరుగున వచ్చి "భాభీజీ! భాభీజీ! సిద్ధయ్యా మిల్‌గయా భాభీజీ!.... హాఁ భయ్యా! సిద్ధయ్యా మిల్‌గయా!"—అని ఆనందముతో చెప్పినాడు. ఆనందం పట్టలేని ఆ దంపతులకు ఆనంద భాష్పాలు ధారగా కారుతుంటే ఒక ప్రక్క వాటిని తుడుచుకుంటూ "సిద్ధయ్య దొరికినాడా! ఎక్కడున్నాడు? ఎలా ఉన్నాడు. బోలో సుభాన్! బోల్!"-అని ఆదంబి సుభాను చొక్కాపట్టుకొని ఊపి వేయుట ప్రారంభించింది.

"హాఁ భాభీ....సిద్ధయ్యను చూచితిని. అబద్ధంగాదు. నిజముగ సిద్ధయ్యను చూచితిని. కందిమల్లాయపల్లెలో హిందూ గురువు బ్రహ్మంగారి వద్దనున్నాడు."—అనినాడు సుభాన్.

"సుభానల్లా! భగవాన్ క్యా హై తుమారాలీలా!" అని పీరుసాహెబు సుభాన్! సిద్ధయ్య ఎట్లుండినాడు"-అనినాడు.

"భయ్యా! సిద్ధయ్య చాల బాగుండినాడు. చాల సంతోషముగ నుండినాడు. ఎంతో అందముగ, ఆనందముగ, బలముగ నుండినాడు. ముఖమున బొట్టు పెట్టుకొనినాడు. భయ్యా! మనము దిగులు పడవలసిన పనిలేదు. భయపడ వలసిన దంతకంటెనూ లేదు. క్షేమముగానుండెను. సురక్షితముగా నుండెను."-అనినాడు సుభాన్.

"అచ్ఛా! సుభాన్‌భాయ్! నీవు చాల గొప్పవాడివి. పుణ్యపురుషుడివి. సిద్ధయ్య శుభవార్త చెప్పి మమ్ముల బ్రతికించితివి. ఆనందాబ్ధిలో ముంచెత్తితివి. ఈ వార్త నీవు తెలుపకుండిన మేమిద్దరము ఏమై పోయియుండెడివారమో! నీమేలు ఎవ్విధముగా తీర్చుకొనవలయును. అయినా సుభాన్! సిద్ధయ్యతో మాట్లాడితివా!" అనినాడు పీరుసాహెబ్.

"అయ్యో! భయ్యా! మాటలాండితిని"

"ఏమనినాడు. నన్ను అడిగెనా! ఆదంబిని అడిగెనా!"

"అందరినీ అడిగినాడు. నిన్ను అడిగినాడు. ఖాదీని అడిగినాడు. అందరకూ సలాములు చెప్పినాడు. చెప్పకుండ వచ్చినందుకు క్షమాపణలు చెప్పినాడు." అనినాడు సుభాన్.

"అయిన యిక ఆలస్యమేల? వెంటనే కందిమల్లాయపల్లెకుబోయిసిద్దయ్యను తెచ్చుకొందము. ఆదంబీ! ప్రయాణమునకు సిద్ధము చేయుము"-అనినాడు పీరు సాహబ్.

"అతను రాడేమొ భయ్యా!"

"ఏం! ఎందుకని?"

"మతము మార్చుకుండెనా యని నా యనుమానము"

"మతము మార్చుకున్నాడా!"

"ఏమో! నాకటుల అనిపించినది. అతని వేషమునుబట్టి అనుచుంటిని "మతము మార్చు కున్నట్లు సిద్దయ్య నాకు చెప్పలేదు."

"నీవు సిద్దయ్యను రమ్మనమని చెప్పలేదా!"

చెప్పకేం! చెప్పినాను. కాని అతనికో ఆ ఉద్దేశ్యమున్నట్లు కన్పించలేదు. కావలయునని వెళ్ళినవ్యక్తి ఎట్లు తిరిగి వత్తునని చెప్పను"

"అయిన నీవిప్పుడేమందువు సుభాన్ భాయ్."

"సిద్దయ్య ఎంతో ఆరోగ్యముగనున్నాడు-అతనితో తలితండ్రుల వదలి వచ్చితినేయను దుఃఖముగానీ, విచారముగాని కనబడలేదు. తానిన్నినాళ్ళగా ఆశించిన దేదియో తనకు దొరికినట్లు పరమానందము చెందుచుండెను."

"అటులనా!.... సరియే మేమేవెళ్ళి ప్రయత్నము చేయుదము. రాకుండ ఎక్కడికి పోవును....తప్పక వచ్చును."-అని పీరుసాహెబు ఆదంబితోసహా కంది మల్లాయపల్లెకు బయలుదేరినాడు.

## సిద్ధయోగి ప్రసిద్ధ భారతం

### పదునెనమిదవ భాగం

శ్రీ గురుడు మామూలుగా తనస్థానమునందు కూర్చొని వేదాంత విషయము లను ప్రబోధము చేయుచున్నాడు. వెంట సిద్ధయ్య కూర్చొని కడుంగడు జాగరూ కతతో శ్రద్ధతో శ్రీగురుడు చెప్పు ప్రతివిషయముహూ వినుచుండినాడు.

"సిద్ధా ! మానవుడు తెలివిహీనుడుకారాదు నాయనా! ధనహీనుడు కావచ్చును ధాన్యహీనుడు కావచ్చును. కాని వాటన్నికన్ననూ, తెలివిలేమి చాల ప్రమాదకరము.

"జ్ఞానహీనుడు ఒకరికింత దానము నిచ్చినాడనుకొనుము. అది తనకు తెలివి గలిగి చేసినాడని గ్రహించరాదు. దానగ్రహీత అదృష్టముగా భావించ వల యునే గాని వేరుగాదు.

"అవివేకులు, మూర్ఖులు, వారికై వారుగా కొన్నిరకముల బాధలు కొనితెచ్చు కొందురు. కాని వారు బాధలను కొనితెచ్చుకొన్నంత సులభముగ ఇతరులకు వారు బాధలు కల్పించలేరు.

"మేమే జ్ఞాన సంపన్నులము. మమ్ముమించిన వారొకరు లేరు. అను అహంకారము మానవ పతనమునకు దారితీయును. అహంకారము మానవుని అలవి గాని పాప పంకిలమునకు ఈడ్చుకొని పోవును. అహంకారిని ఆ పాప భయం నుండి తప్పించుట సాధ్యము గాదు. కనుక మానవుడు ఎప్పుడూ నిరహం కారిగానే ఉండవలయును గాని అహంకార మద మాత్సర్యములతో విఱ్ఱవీగరాదు.

కొంతమంది తాము చదవని గ్రంథములను చదివినట్లు నటించుచుందురు. అది నిజముగ అవివేకమే. ఎప్పుడైతే వారి అవివేకమును, తెలివిలేని తనమును గుర్తించి, గమనింతురో, అప్పుడు నిజముగ నతడు చదివి జీర్ణించుకొన్న విషయము లను చెప్పిననూ ఇతరులకు సందేహము కలుగును. ఇట్టి వారిలో అనగా అవివే కులలో కొంతమంది 'బ్రహ్మవిద్వరా' 'బ్రహ్మవిద్యానిధి' యిత్యాది బిరుదముల తగి లించుకొని తిరుగుచుందురు. దానము యిచ్చినట్లుగనే యిచ్చి వారి నామాంతమున బిరుదులు తగిలించ లేదనియో, లేక వారి కీర్తిని విస్తారముగ చాటలేదనియో నెప

ముపై వారిచ్చిన దానమును తిరిగి గ్రహించు వారలూ యుండిరి. ఒకసారి దానమిచ్చి దానిని తిరిగి పరిగ్రహించుట వ్యక్తిని నరకగామిగా చేయునే గాని ఫలితము శూన్యము. అదియునూ అహంకారమే. బిరుదులు శాశ్వతమా ప్రపంచమందు. శిబిచక్రవర్త్యాదుల కంటెనూ వీరుదారులా! ....వారేమైనను పోవునపుడు బిరుదుల పట్టుకొని పోయిరా!

"తనలోని దోషమును గ్రహించియు, దానిని తొలగించుకొనక కృశించిన అవయవముపై వస్త్రమును కప్పిన ఫలితమేమి ? దుర్గంధమును బాప ఎవరితరము. ముందు తన దృష్టి బాగుండినకదా ఎదటివారి దృష్టికి వైద్యముసేయుట.

"రహస్యమెప్పుడునూ దాచి ఉంచవలసినదే. అది మనసునందే యుండవలయును. అటువంటి దానిని రచ్చకీడ్చి అవివేకి తనను తానుగా అపాయము కొని తెచ్చుకొనును.

"ఇతరులు చెప్పినవి గ్రహింపలేక, తనకై తాను తెలిసికొనలేక చెడు మార్గముల పయనించు మూర్ఖుడు భూమికి భారముగాక మరేమగును.

"అవివేకికి తెలియ చెప్పుటంత సులభముగాదు. అవివేకికి వివేకము బోధ సేయబోయి ఒక్కొక్కతరి, వివేకియూ అవివేకియగును. అవివేకి మాత్రము వివేకిగా ప్రవర్తించును. ప్రదర్శించుకొనును. నటించును. ఇది ఎంతటి హాస్యాస్పదమో యోచింపుము. అనగా మూర్ఖుల మనసు రంజింపలేము. కనుక సిద్ధా! అహంకారమును జయించి మానవుడు మాధవునకు దగ్గర కావలయును నాయనా!

"శ్లో॥ అహఙ్కారం బలందర్పం కామం క్రోధంచ సంశ్రితాః
మామాత్మపర దేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః॥

గీత : 16: 18.

"మరహంకారము, బలము, దర్పము, గర్వము, కోపము, అవలంభించిన వారు తనకంటె యితర దేహము లందుండెడు నన్ను అసూయాపరులై ద్వేషించుచున్నారని శ్రీకృష్ణ పరమాత్మ తన గీతా సందేశమందు విస్పష్టముగ ప్రకటించియుండిరి.

"శ్లో॥ తానహం ద్విషతః క్రూరాన్ । సంసారేషు నరాధమాన్
క్షిపామ్యజస్రమ శుభానా । సురీష్వేద యోనిషు॥

గీత: 16 : 19.

"సమస్త ప్రాణులలో అంతరాత్మ స్వరూపుడనైయున్న సర్వేశ్వరుడనగు నన్ను ద్వేషించుచున్న క్రూరులను అనాచారపరులను నేను ఎల్లప్పుడు జనన మరణ ప్రవాహ రూపముగు సంసారమునందు అసురయోనులయందే త్రోసివేయుచున్నాను.

శ్రీ గురుడు చెప్పిన భగవద్గీతలో ఈ క్రింద చెప్పబోవు మూడు శ్లోకములు అత్యంత ప్రాధాన్యమును సంతరించుకొనినవి. భగవద్గీతయొక్క సారభూతములీ త్రిశ్లోకములని చెప్పవచ్చును.

"శ్లో॥ బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాఽఽత్మానం నియమ్యచ,
శబ్దాదీన్ విషయాం స్త్యక్త్వా । రాగద్వేషౌ వ్యుదస్యచ॥

గీత. 18:51.

"శ్లో॥ వివక్తసేవీలఘ్వాశీ । యతవాక్కాయ మానసః
ధ్యాన యోగపరో నిత్యం । వైరాగ్యం సముపాశ్రితః॥

గీత : 18 : 52.

"శ్లో॥ అహఙ్కారం బలందర్పం । కామం క్రోధం పరిగ్రహం,
విముచ్య నిర్మమశ్శాన్తో । బ్రహ్మ భూయాయ కల్పతే॥

గీత 18 : 53

"నిర్మలమైన బుద్ధిగలవాడై, ధైర్యముతో మనస్సును నిగ్రహించి అనగా దృఢమైన మనస్సు గల్గినవాడై, శబ్దాది పంచేంద్రియ విషయములందు ఆసక్తిని విడచి, ఇష్టానిష్టములకు ద్వంద్వములను వదలువాడునునై, ఏకాంత స్థలవాసియు, (ప్రతిబంధ రహిత ప్రదేశమున నుండువాడును) మితాహారుడును, స్వాధీనముచేసికొబడిన వాక్కు, కాయము, మనస్సుగలవాడును, సదాధ్యానమందాసక్తిగలవాడును, ఇహపరభోగములయందు లేస్సగా వైరాగ్యముగలవాడును, అహంకార బలదర్ప

ములను, కామక్రోధముల విడచి, మమకార రహితుడుగను, శాంతచిత్తుడైనవాడును, బ్రహ్మైక్యమును బొందుటకు అర్హుడగుచున్నాడు.

“నిజము చెప్పవలయునన్న ఇవి కేవలము బ్రహ్మనిష్ఠులకు సంబంధించిన వరములు. వీనియందు భవరోగ నివారణకు ఔషధము దానికి వలయుపథ్యము గూడ వివరించబడినది. ఆఖరున చెప్పిన అహంకారము మొదలగు ఆరు దుష్ట గుణములుండరాదనుటయే పథ్యము. దానియందున్న ‘పరిగ్రహం’ అను శబ్దమును గ్రహింపుము. ఇది గూడ దుష్టగుణములు వరుసలోనే చేర్చబడియున్నది. పరిగ్రహమనగా పరవస్తువును గ్రహించుటయని యర్థము. లేక యే వస్తువులను చూచినను అది కావలయునను కోరిక, లేక దాన స్వీకరణముగూడ పరిగ్రహ శబ్దమునకు పర్యాయశబ్దములు. కేవలము బ్రహ్మనిష్ఠచేయువాడుగానీ, ధర్మబోధకుడై యుండువాడుగానీ బ్రహ్మచర్యవ్రతము పూని యధ్యయనము సేయువాడుగానీ, అగుచో తగిన ధనములేనిచో, దేహసంరక్షణకొఱకు మాత్రము అన్నమును, దేహాచ్ఛాదనకొఱకు మాత్రము వస్త్రములను యితరులనుండి స్వీకరింపవచ్చును. అంతియే గాని భోగవిలాసములకై వస్త్రాలంకారము లేమాత్రము గ్రహింపకూడదు.

“అంతేగాక జీవన్ముక్తుడై (అనగా బ్రహ్మైక్య స్థితిగలవాడై) పొందబడిన ఆధ్యాత్మ ప్రసాద ప్రకాశముగలవాడు దేనికినీ దుఃఖింపడు. దేనినీ కోరడు. సమస్త ప్రాణులయందునూ సమభావముకలవాడై నాయందలి శ్రేష్ఠమైన భక్తిని పొంది అంతయూ పరమాత్మమయమను బ్రహ్మవిద్వరిష్టమును బొందుచున్నాడు — అని గూడ శ్రీకృష్ణగురుడు గీతోపన్యాసమున ప్రవచించియున్నాడు.

“అనగా బ్రహ్మసాక్షాత్కార జ్ఞానముగలవాడు ఏవిధముగ నుండునో దీయిచ్చుట శ్రీకృష్ణస్వామి నిరూపించినాడు.

“సిద్ధా! ఇప్పటి నీకొక కథ చెప్పెదను. అహంకారు లేవిధముగ పతనమగుదురో సవిస్తరముగ తెలిపెదను శ్రద్ధతో వినుము.

“ఇప్పటికి రెండు మూడు వందల యేండ్ల క్రితము నృసింహసరస్వతీ యను యతి స్వారభౌముడొకరుండినారు. ఆయన సాక్షాత్తు నృసింహమూర్తియే.

మహానుభావుడు, సాక్షాత్తు పరమేశ్వరావతారము. ఎందరినో ముక్తులను చేసినాడు. ఆదివ్యపురుషుని కాలమందు ఈ సంఘటన జరిగినది.

"అప్పుడు వైఢూర్యమనే నగరమును ఒక ముస్లిము చక్రవర్తి పరిపాలన చేయుచుండెను. అతడు దేశమందు నలుమూలలనున్న బ్రాహ్మణ పండితులను రప్పించుకొని తన యెదుట వేదమంత్రోచ్చారణ జరిపించుకొని, వాటి అర్థములను తెలిసికొని వారికి భూరి బహుమానముల నిచ్చి పంపుచుండెడివాడు. కాని కొంత మంది శ్రోత్రియ బ్రాహ్మణులు తురుష్కుని ముందు వేదముల వల్లించుట కియ్య కొనెడివారుకారు. కాని ధనాశాపరులైన బ్రాహ్మణులు అందుల కంగీకరించి అతనిని సంతుష్టిపరచి రాజు వారికిచ్చిన సంభావనలను అందుకొని వెడలుచుండువారు.

రాజు యజ్ఞకాండ మందలి అంశములను విని బ్రాహ్మణులైన మీరలే యజ్ఞముల పేరుతో పశుహింసలు సేయుచుండ ఇతరులు చేసే జీవహింసనేల నిరసింతురు? హింసయనిన ఏదైననూ హింసయే అని వ్యంగ్యముగా మాటలాడి అవహేళనము చేయుచుండెడివాడు

"ఒకసారి ఉత్తరదేశమునుండి యిద్దరు బ్రాహ్మణులు వేదపండితులు చక్ర వర్తిని దర్శించి సకల విద్యలలోనూ మాకు మేమేసాటి. మేము పలుదేశముల సంచరించి పండితుల నెందరినో శాస్త్ర వాదమున నెదుర్కొని ఓడించినాము. మా ప్రతిభ నిరూపించగలము. మీ రాజ్యమందు మాతో వాదించి జయించగలవారుండిన సవాలు చేయుచున్నాము. రమ్మనుడు"—అని నుడివినారు.

రాజు బ్రాహ్మణ్యము నపహాస్యము చేయుటకు, వారలచే వారినే అవమానింప చేయుటకు సరియైన సమయమని తలచి, రాజ్యమందంతటనూ దండోరా వేయించి పండితుల నాహ్వానించినాడు. తురుష్కుని యెదుట వేదముల వల్లించుట కిష్టపడని భూసుర వర్గము తప్పక ఆయిద్దరి పండితులకు జయ పత్రములనిచ్చి ఓటమి నంగీకరించినారు. అప్పుడా రాజు ఆ బ్రాహ్మణుల కిద్దరికి వస్త్రములు, ఆభరణములు భారీ ఎత్తున కానుకల నిచ్చి గజోత్సవము చేయించి ఊరేగించి అగ్రహారమును కూడ యిచ్చినాడు. సాటి పండితుల కిదంతయూ తలవంపులేయైనను. వారితో తర్క-

మనకు శక్తిలేనివారు కొందరు...ఇష్టములేనివారు కొందరు కాగా, వారికి విజయ ప్రాప్తితప్పలేదు.

వైఢూర్యనగరము రానురాను విదర్భగా మారినది.

"దానితో మరీ గర్వపోతులై అహంకారము వారిని బందీని చేసినది. వారు రాజ్యమంతటా సంచరించి ఒకరోజు 'కుమసీ' అనే గ్రామమునకు వచ్చినారు. అచ్చటి త్రివిక్రమభారతి, యను బ్రాహ్మణుడు వేదవేదాంగ పారంగతుడని విని, అయనను దర్శించి వారితో వాదన కుపక్రమించుమని కోరినారు. లేదా ఓడిపోతినని అంగీకరించి మాకు జయపత్రమిమ్మని అతనిని నిర్బంధించ ప్రారంభించినారు.

"త్రివిక్రమభారతి సౌమ్యుడు, నిగర్వి, నిరహంకారుడు, నృసింహా సరస్వతీ స్వామివారికి కూర్చు భక్తుడు. అతను తనకు వేదమురాదని, ఎదుర్కొనే శక్తి చాలని వానినని, అటువంటివానివద్ద జయపత్రము తీసికొని మాత్రము ప్రయోజన మేమియని— ఎన్ని విధములుగనో చెప్పిచూచినాడు.

"కాని వారి అహంకారము క్షణక్షణమునకు వృద్ధినొందుచున్నదేగాని, ఏ మాత్రము తగ్గుటలేదు, జయపత్ర మివ్వవలసినదేనని పట్టుబట్టినారు.

"త్రివిక్రమ భారతి మనసున తలంచినాడు. వీరికి గర్వాంధత మిక్కుటముగ నున్నది. వీరికి బుద్ధి చెప్పుటకు గురుదేవులే సమర్థులు—అని తలచి, పండితోత్తము లారా! నేను అల్పజ్ఞుడను. అయిననూ స్వతంత్రుడనుగాను. గంధర్వపురమందు మా గురుదేవులుండిరి. వారి యొద్దకు పోవుదమురండు. వారి యాజ్ఞ ఎటులుండిన అటుల నిర్వర్తించగలవాడను"—అని చెప్పి వారల నిద్దరిని శ్రీ నృసింహా సరస్వతుల స్వాములవారి కడకు తీసికొని వెళ్ళి విషయమంతయూ వివరించినాడు.

"శ్రీ నృసింహా సరస్వతీస్వాములు వారికి కెన్నియో అనునయ వాక్యముల తెల్పినాడు. వేదములు-వాటి అధిదేవతలు, పూర్వము భరద్వాజమహర్షి వేదమును సంపూర్ణముగా అధ్యయనము చేయదలించి బ్రహ్మదేవుని వరంతో ఏ విధముగ మూడుసార్లు దీర్ఘాయువు పొందెనో మొదలైన విషయములన్నియు పూసగృచ్చినట్లు చెప్పిననూ వారు వినరయ్యె!

---

భరద్వాజ మహర్షి కథతెలియవలెనన్న "శ్రీ వీరబ్రహ్మ గురుభారతం" చదవండి

ఇంక నీ మూర్ఖులతో సంవాదమనవసరమని తలంచి శ్రీ నృసింహ సరస్వతీస్వాములు "అటులైన యిప్పుడే మీ కోరిక తీర్తును"—అని చెప్పి అప్పుడే అటు ప్రక్కగా పోవుచున్న ఒకనిని పిలిచి.

"ఎవరయ్యా నీవు"—అని అడిగారు స్వామి.

"అయ్యా నేను కడజాతివాణ్ణి"

"నీ కులమేది!"

"నన్ను మాతంగుడంటారు.

"నీ దేవూరు"

"నేనీ ఊరిబయట ఉంటాను"—అని అతను స్వాములకు సాష్టాంగపడి నమస్కరించినాడు.

"అప్పుడు శ్రీ నృసింహ సరస్వతీస్వామి తన కృపాదృష్టి అతనిపై పారించి, శిష్యునికి దండమిచ్చి నేలమీద ఏడుగీతలు గీయించినాడు. అప్పుడా మాతంగునిపై విభూతి చల్లి వానిని ఒక్కొక్క గీతా దాటమని చెప్పినాడు.

"మొదటి గీత దాటగనే స్వామి, మాతంగు నుద్దేశించి ఇప్పుడు చెప్పు నీవెవరు ?"— అని అడిగారు.

"నేను నరభక్షకుడనైన భిల్లుడను"
రెండవ గీత దాటగనే

"నేను రావణుడను కిరాతకుడను." మూడవ గీతదాటగనే "నేను గాంగేయుడనే జాలరిని." నాల్గవ గీత దాటగనే "నేను శూద్రుడనైన రైతును," అయిదవ గీతదాటగనే "నేను సోమదత్తుడనే వైశ్యుడను" ఆరవ గీటు దాటగనే "నేను గోవర్ధన వర్మయను క్షత్రియుడను." ఏడవగీటు దాటగనే "నేను వేద విదుడను అధ్యాపకుడను. బ్రాహ్మణుడను"— అని చెప్పినాడు.

"నీవు వేదవిజ్ఞుడవయినచో ఈ విప్రులను జయించు"- అని శ్రీనృసింహ సరస్వతీస్వామి ఆదేశించగా, అతడు బహుశ్రావ్యముగ వేదగానముచేసి వాళ్లతో చర్చకు దిగినాడు.

"అహంకారంతో మదించి పోయిన ఆ పండితులకు నోటమాటరాక, శ్రీనృసింహ సరస్వతీయతీంద్రుల పాదములపైబడి క్షమాపణ చెప్పుకొనినారు.

"కాని స్వామి వారిని శిక్షించక తప్పలేదు. బ్రాహ్మణ గర్వంతో తోటి బ్రాహణులనే దూషించినారు. ధర్మవిరుద్ధమైన కార్యములు నెరవేర్చినారు. కనుక మీరు రాబోవుజన్మలో రాక్షసజాతి మనుషులుగా నుద్భవింతురు. చేసినకర్మ అనుభవింపక తప్పదు"— అని తీవ్ర స్వరముతో హెచ్చరించినారు.

"బ్రాహ్మణులకు గర్వమడంగినది. తరుణోపాయం చెప్పమని ప్రార్థించినారు. అంత దయగలిగిన స్వామి, రాక్షసజాతి మనుష్యులుగా పది రెండువత్సరములు జీవించి, తరువాత ఒక బ్రాహ్మణుని ద్వారా వేదమందలి నారాయణానువాకం వినిన తర్వాత మీకీదుర్భరజీవితం తొలగి, సద్గతి పొందగలరని"— చెప్పగా, వారు స్వామివద్ద శలవుతీసికొని గ్రామ పొలిమేరకు చేరుసరికి గుండె నొప్పివచ్చి, అక్కడికక్కడే పరమపదించినారు."— కనుక సిద్దా అహంకారం, గర్వం, బిబోన్మత్తత ఇవి చాల ప్రమాదమైనవి నాయనా! కులదురహంకారం, మతదురహంకారం, మానవులను రాక్షసులుగా మార్చునేగాని వేరుగాదు."— అనిచెప్పి తల పైకెత్తి చూచుసరికి, ఎదురుగా, దూరముగనుండి ఎంతయో శ్రద్ధతో వినుచున్న అదంబీ పీరుసాహెబులను చూచి, "ఓ!- రండి! రండి!- పీరుసాహెబ్! అటుల దూరముగ నిలబడియుండిరేల!- మీ కుమారుడున్న ప్రదేశము మీ ప్రదేశము గూడా! అదంబీ!— యిదుగో మీ కుమారుడు. సిద్దయ్య యిచ్చటనే యున్నాడు. మీరతనిని గురించి భయపడి, బెంబేలుపడి, మనుషులచే వెదకించి, చివర కిచ్చటనుండెనని, మీ సుభాను సాహెబు చెప్పగా వెదకికొనుచు వచ్చిరి. మీ కుమారున కెట్టి భయములేదు. సిద్దా! తలితండ్రులకు నమస్కరించు నాయనా!'— అనినారు బ్రహ్మముగారు.

సిద్దయ్య శ్రీగురుని పాదములకు ప్రణమిల్లి, లేచి, ఎదురేగి తలితండ్రుల ముందు ఒంగి పాదములు తాకి నమస్కరించినాడు.

"బాబా! మాజీ! శుకరియా!"- అనినాడు సిద్దయ్య.

"శుకరియా! బేటా! శుకరియా!"- అన్నాడు పీరు.

"మాజీ !"— అని ఆమె దగ్గరకు వెళ్ళినాడు సిద్దయ్య. ఆమె సిద్దయ్యను అమాంతము గుండెల కద్దుకొని, ఆతని శిరస్సమంతయూ కన్నీటితో తడిపివేసినది. "బేటా ! ఎందుల కిట్లుసేసితివి ? ఇప్పుడేమైనదని ఈ సన్యాసివేషము. అంతటి విరక్తుడవైతివా ? పనిచేసి సంపాదించమని ఏనాడైననూ ఆదేశించితిమా. నిన్నెప్పుడైననూ, కోపగించితిమా ! మమ్ముల నీ వయసున యీ విధముగ వదలి వచ్చుట నీకెట్లు న్యాయముగ తోచెనురా కుమారా!"— అదంబి.

పీరుసాహెబు కుమారుని పొదవిపట్టుకొని, గుండెల కత్తుకొని తల నిమురుతూ, ఆనందోత్సాహమున వెలువడుకంటి నీరముల తుడుచుకొనుచు, నీవులేని ఒక్కొక్క నిముషము, ఒక్కొక్క యుగముగ తోచినది. మా బ్రతుకులేభారములైనవి. బేటా! నీవులేక మీ అమ్మ ఒక్కమెతుకైననూ తినుటలేదు. చూడు ఎటుల కృశించిపోయినదో." అనినాడు పీరు సాహెబు.

"బాబా! నేను స్థిరముగ నాలోచించుకొనియే నిర్ణయించుకొని యిటకే తెంచితిని. అమ్మా ! తల్లి, బిడ్డ, భార్య, భర్త యివన్నియూ ఋణానుబంధము. ఇవి మీకు తెలియని విషయములుగావు. కేవలము మీ కడుపున పుట్టినందున, పుత్రుడనను వ్యామోహముతో మీరట్లు బాధపడుచుంటిరిగాని, లేకున్న మీకూ నాకూ సంబంధమేమున్నది. గత జన్మమున నేనెవరి బిడ్డనో! మీరెవరి బిడ్డలో ! ఎవరికి తలితండ్రులో! ఆ విధముగ లెక్కజూచికొనిన ఎంతమంది తలితండ్రులో, ఎంతమంది భార్యలో, ఎంతమంది భర్తలో, ఎవరు లెక్కపెట్టగలరు ? ఎవరు లెక్కగట్టగలరు? అవన్నియూ మనకు గుర్తుండిన వారిని కలసి నాటి బంధమును చెప్పి బంధుత్వమును కలుపుగొనగలమా ? సాధ్యమా? అమ్మా ! ఈ వ్యామోహబంధనమే మానవునికి - ఆధ్యాత్మిక ప్రగతి మార్గమున కవరోధము కల్గించుచున్నది. అందునుండియే ఆ మోహనగరుకు దూరమై, ప్రేమనగరమైన గురుపాద సన్నిధికేతెంచినాను. నా మాటలు మీకర్ణపుటముల కొకింత కఠినముగ విన్పించవచ్చును. అప్రియముగా తోచవచ్చును కాని ఆలోచింపుడు. నేనొక ప్రత్యేక కార్యార్థినై యిటకు చేరితినిగాని సుఖసుఖాకాంక్షకుకాదు. కడుపునింపుటకుకాదు. మిమ్ముల నిబ్బందిపెట్టి ఏడ్పించుట కంతకంటెనూ కాదు.

"బహుశా మీరు నన్ను ఒప్పించియో, బ్రతిమిలాడియో, భంగపడియో మరల ముడుమాలకు తీసికొనిపోవవచ్చి యుందురు. కాని ఆ ఆశయము మాత్రము వీడుడు. నేను నా కార్యక్రమమునందు విజయము సాధించినగాని గురుపాద సన్నిధినుండి కదలను.

"గురుసేవ దీక్షాకంకణ బద్ధుడనైన నేను. గురుసేవలో తరించి పరమ పదమును బొందవలయుననెడి తీవ్ర మోక్షాసక్తితో యిక్కడకు వచ్చితినిగాని-కేవలము గురుని దర్శించి వెళ్ళుటకు మాత్రముగాదు కనుక మీరు మీ ప్రయత్నముల విరమించుకొని నన్నాశీర్వాదింపుడు."

"బేటా!"- ఆశలుడిగిన వాని కంఠస్వరము కొట్టొచ్చినట్లు విన్పించినది పీరుసాహెబులో.

"బాబా! దుస్తరమైన ఈ సంసార మహాసముద్రమును దాటుటకు కొమరునిపై అవ్యాజమైన ప్రేమకంటే గురుసేవ అత్యంతావశ్యకము అదియే సరియైన మార్గము. రమణీయమై రాజిల్లు మోక్షసామ్రాజ్య సింహాసన మధిష్ఠించ వలయునన్న గురుసార్వభౌముని చరణసేవయే నిష్కంటకమైన రహదారి. అజ్ఞాన వనద గాఢాంధకారము నడంగించి జ్ఞానకాంతుల మెఱపించు కంచుకాగడా గురుచరణ సేవ. క్షుద్రమౌ తాపత్రయముల నడంగించి. క్షుద్బాధల నివారించు కమ్మని పాయసాన్నమే గురుసేవ. పరమ భక్తునకు కావలసినది కేవలము కడుపున కింత తిండీ కంటికింత నిద్రయేగాదు. గురుపాద సేవ అత్యంతావశ్యకము. తపోనిష్ఠులకు సహితము దేవగురుని సేవ. దురితములగు రోగములకు ఔషధము గురుసేవ. అట్టి పరమ పవిత్రము, అత్యంతోపయోగము, ఆనంద మార్గమునయిన గురుసేవ త్యజించి మరల మోహాల శోకాలకు రమ్మందురా బాబా."—అనినాడు సిద్దయ్య ఆర్తితో, అర్ధ్రితతో.

"బేటా! జరాసోచ్ కరోరే. మన మతము వేరు. కులము వేరు. మన మత మందునూ అసామాన్యులైన గురువులున్నారు. ఫకీరులున్నారు. పైగంబరు లున్నారు. వారి చరణ సేవచేసికొనవచ్చుగదా! మోక్షమార్గమును వారు చూపించ లేరా? ఇతర మతగురుల పదముల నాశ్రయించనేల తండ్రీ!"— పీరుసాహెబు.

అబ్బాజాన్! మీరు గూడా మతమును గూర్చి మాటాడుచుంటిరా! అందరిలో నున్నది అల్లాయేనని చెప్పిన మీరు యిపుడు మన మతము, పరమతమని పల్కుచుండుట న్యాయమా!

"వ-ఇలా-హుకుమ్-ఇలాహున్-లా-ఇలాహ-ఇల్లా- హు-వర్ - రహ్మాను్-రహీమ్" ఖుర్-అన్ : 2 : 63.

"పూజ్యుడగు దేవుడొక్కడే. అతడుతప్ప దేవుడు లేడు. అతడు అమిత దయగలవాడు. ప్రేమించువాడు"—అని మీరే గదా బాబా దివ్యఖురాన్ వాక్యమును గూర్చి చెబితిరి.

"దేవుడు అద్వితీయుడు. అతడు శాశ్వితుడు. అతనికి సాటిలేదు. అతడు సర్వమును సృష్టించి కాపాడుచూ సర్వమునకు ఆధారమైయున్నాడు. అతడు ఎట్టి కళంకమును లోపమును లేని పరమ పవిత్రుడు. అతనికి తూగుగాని నిద్రగాని పట్టదు. ఘనత గలవాడు. సర్వమూ అతనిదే, భూమ్యాకాశములు అతనివే. అతడు సర్వజ్ఞుడు. సర్వశక్తిమంతుడు, సర్వాధికుడు. అతని సెలవులేక ఎవరునూ సిఫారసు చేయజాలరు. ఎట్టి పనియైనను అతనికి కష్టమైనదికాదు. భూమ్యాకాశములను వాని మధ్యనున్న సమస్తమును కాపాడుట అతనికేమియూ కష్టముగాని, భారముగాని కాదు. సర్వమునకూ సర్వజనుల యూహలకు మించినవాడు. అతని మహిమ కొనియాడ వీలుకానిది అట్టి దేవుని యాజ్ఞలను మానవులు తప్పక ఆచరింపవలసినది. అతనియందు విశ్వాసము, భయభక్తులు గలిగి మానవులు తమ లోపములను గుర్తెరిగి అమిత దయాళువగు దేవుని ప్రార్థించుచుండవలయును. మత విషయమున బలాత్కారములేదని కూడ దివ్య ఖుర్ ఆగుననుండెగదా!

(ఖుర్ ఆను. 3 : 255, 3 : 56)

"అని నీవేగదా బాబా ఖురాను వాక్యమును వివరించి బోధించితివి. ఇపుడు మతమందువేల ?

"అబ్బాజాన్ ! పరసీరుహ మకరంద సారంబు గ్రోలుట కలవడిన తేటి ఉమ్మెత్తపూవునుండి తేనె గ్రహించునా ! మానస సరోవర ప్రాంతములయందు విహరించు కలహంస మామూలు నీటిమడుగులవైపు వచ్చునా ! ఎల్లప్పుడు విధుకిర

ౕవే సంతోషానంద తరంగములం దేలియాడు చకోరము 'కేవలనీహార వైభవము
ం సంతృప్తము చెందునా! ఎలమావి కావిమోవుల మెక్కు పికరాజు ఈత లేత
్ర నాశించునా !

"బాబా ! శ్రీమద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర కేంద్రు పదాంభోజ తీర్థ
సంతతాభీష్ట సంయుతమైన నా మానసము యితర గురు పదముల నాశ్ర
దు. నా మనసిచ్చట లగ్నమైనది. స్థిరమైనది. దీనికింక చలనములేదు."—
డు సిద్దయ్య."

"సిద్దా ! తలిదండ్రుల మాట జవదాటవనీ, తప్పక యింటి కరుదెంచి మాకు
రోత్తేజముల కల్పింతువనీ, ఆశించి వచ్చితిమిరా! మమ్ముల నిరాశపరచి....
ిటి కఠిన చిత్తుడ వెట్లయితివిరా!"— పీరు సాహెబు.

"కఠిన చిత్తమా ! పొరబాటు తండ్రీ ! చిత్తమే కఠినమైన యింత సాహ
చేయకపోదును. చిత్తము గురుసేవానంద మరంద మాధుర్యముల గ్రోల
ంచినది. రంజితమైనది. కనుకనే స్థిరచిత్త మేర్పడినది. మనసు పటిష్ఠ
ు. సంకల్పము దృఢమైనది. అంతియేగాని కాఠిన్యముగాదు."— అనినాడు
య్య.

"సిద్దా ! తలిదండ్రులకు ముందు భోజనానికి వసతుల నేర్పాటు చేయుము.
ిత ప్రశాంతముగ మాటలాడుకొనవచ్చును. ఎంతయో దూరమునుండి
ిడ్చి వచ్చినారు. ముందు వారికి విశ్రాంతిని కలుగసేయుము. చిత్తము
ంతమైనగాని పరిస్థితులు ప్రశాంతముగావు ప్రశాంతచిత్తమే పరమాత్మను వెదకి
ినగలదు."— అని పీరు సాహెబు దంపతులవైపు చూచి" చూడండి నాయనా!
ప మీరు హాయిగా స్నానముసేయుడు. తదుపరి భోజనము పూర్తిచేసికొని
తిని బొందుడు. ఆ పిదప మాటలాడు కొనవచ్చును."— అనినాడు
పడు.

# సిద్ధయోగి ప్రసిద్ధ భారతం

## —: పదితొమ్మిదవ భాగం :—

శ్రీ గురుని అతిథ్యమునకు పీరుసాహెబు దంపతులు పరవసించి పోయినారు. ఒక హిందూ గురువు తమను భోజనమున కాహ్వానించుట వారిదృష్టిలో ఎంతో గొప్పగా అనిపించినది. అంతదయగా అన్నపానాదుల నేర్పాటు చేసిరి గనుక సిద్దయ్యను గూడ వారితో త్రిప్పి పంపగలరనే నమ్మకం వారిలో యేర్పడినదీ.

"మహారాజ్! ప్రణామ్! ప్రేమతో అభిమానముతో మీరు మమ్ముల నెంత గానో ఆదరించినారు. గౌరవించినారు. సలాములు. భగవాన్ సలాములు. మీరై ననూ మా బాధనర్థము చేసికొనుడు. సిద్దయ్యను యింటికి వెళ్ళమని హితవచనముల పల్కుడు వాడు మీమాటల తప్పక పాటించును. మీ మేలు ఈ జన్మమున మరువము."— అనినాడు పీరుసాహెబు తన సహజమైన పితృ వాత్సల్యముతో — శ్రీ గురునికి దగ్గరగా చేరి.

శ్రీ గురుదేమియూ మాటాడలేదు. అతనిని చూసి ఒక చిన్ననవ్వు నవ్వి ఊరకుండినాడు.

"భగవాన్! లేక లేక మాకీ కొడుకు కలిగినాడు. వీని నెడబాసి యుండ జాలము. కాన మీరలే చెప్పవలయును. మీరు చెప్పనగాని వాడు యింటికిరాడు. మాతో మా బిడ్డను పంపి పుణ్యము కట్టుకొనుడు."— అని ప్రాధేయ పడుచున్న పీరుసాహెబును చూచి శ్రీ గురుడు.

"సిద్దా!" అని సిద్దునివైపు తిరిగి. చూచితివిగా నీ తండ్రి స్థితి. తండ్రి మాటలు మన్నించుట ధర్మము నాయనా! నీ తల్లియూ నీకై దుఃఖితమతియైయున్నది వారి మాటల మన్నించి ముడుమూలకజుగుము. జనకునాజ్ఞ మీరి జనదగదని గదా శ్రీరామ చంద్రమూర్తి అడవులకేగినాడు. జనకుని కొఱకేగదా భీష్ముడు జీవితాంతము బ్రహ్మచారిగా నుండిపోయెను. పితృ వాక్య పరిపాలనము కన్న వేరొండు పాడిగలదా!"- అని గురుదేవుడు సిద్దునకు హితవాక్యముల బోధించినాడు.

"గురు మహారాజ్! ముక్తిచేకూర్చగల జగదీశుని భక్తితో ప్రహ్లాదుడు తన ఆత్మేచ్ఛను చెఱుప బూనిన తండ్రి హిరణ్యకశిపునాజ్ఞ పరిపాలించ లేదు గదా! మీకు తెలియని విషయములా గురుదేవా!"-అనినాడు సిద్దయ్య.

'ఒరే!-సిద్దిగా!'- పీరుసాహెబు కంఠమునందు విసుగు, కోపము జనించినవి. ధ్వనించినవి. "ఎన్నిమాటలు నేర్చితివిరా! మాటలు నేర్చినవానికి సరిపోవు కథలు భూమండలమందున బోలెడుండినవి. పలుమాటలేటికి! కొంపకఱుదెంచె దవా? లేదా? ఒక్కమాటలో తేల్చి చెప్పుము."

"వీర సద్గురుడు కరుణతో నన్ను బిల్చి, కరమందించి, కారణం బిచ్చి, మోక్షమార్గము జూపి సెలవొసంగనంత వరకూ ఆడుగు కదపను. ఇది నా నిశ్చ యము. బ్రహ్మరుద్రాదులేకమై వచ్చినను, చలింపను."- అని సిద్దయ్య తన నిశ్చయమును కుండ బ్రద్దలు కొట్టినట్లు చెప్పినాడు

"చూచితివా! ఆదంబీ! నీకుమారుడెంత కాఠిన్యము వహించినాడో! అసలతని వేషము చూచితివా! లాగులూనిన లాగు బాగులేదని మార్చి కాషాయవస్త్రము గట్టి నాడు. నల్లచొక్కా పనికిరాదని తీసి దూరముగ విసరి కావిరంగు గౌను ధరించి నాడు. ఫకీరు పూసల దండనుతీసి రుద్రాక్షమాలికల దాల్చినాడు. కుచ్చుటోపీ తీసి రొచ్చున బడవేసి, కావి వస్త్రము తలదాల్చినాడు నొసటన భూతి గంధాక్షతల దాల్చినాడు. ఆహా! గురుని చేరి అంతయూ కొన్ని నెలలైననూ కాలేదు - అప్పుడే ఎంతలో ఎంత మార్పు"-అనినాడు పీరు.

"నాయనా మీతండ్రి చెప్పిన వన్నియూ వింటివిగదా! అంతకన్న నేను మాత్రము చెప్పగలుగునదేమున్నది. ఇంటికిరా! లేకున్న మన కులమువారు వెలి వేయుదురు."-అనినది తల్లి ఆదంబి.

"అమ్మీజాన్! ఒక్క మన కులమేమిటమ్మా! సకలదృశ్య ప్రపంచము నన్ను వెలివేసిననూ భయపడను. నేనన్నిటికీ సిద్ధపడియే వచ్చితిని. ముక్తి కాంతను పరిణయమాడ సిద్ధ పడివచ్చిన నాకు రిక్తకాంతను కట్టబెడుదురా! అందులకు నామన సొగ్గునా! మారునా! కలుగునా! పంచభక్ష్య పరమాన్నములు భుజింప సిద్ధముగ నుండ గంజిహాటికేల నన్నాహ్వానింతురు. అమ్మా! వీరగురుసేవ ప్రాప్తించబడినట్టి

నన్ను పరులెవ్వరూ యేమియూ చేయజాలరు. వారణము నెక్కి యున్నట్టి వానికి శునకములవల్ల భీతి కల్గునా! పీరగురునకు నా సర్వస్వము సమర్పించితిని. సంపూర్ణ శరణాగతి చేసికొంటిని. అప్పుడే నిటలమున బొట్టు పెట్టగలిగితిని. ఇప్పుడెటుల ఆద్దానిని తుడువగలను?

"గురుని వేషమొక తీరునా! శిష్యుని వేషమింకొక తీరున యుండునా! గురు ననుసరించుటయే నాధ్యేయము. కనుకనే దుస్తులు, రూపము మార్చుకొంటిని. గుణములను కూడ ఆటులనే మార్చుకొందును.

"అమ్మా! లోకమున గృహమనెడి లోతగు చీకటి నూతిలోపల మోహభవ పాశంబున గాఢ బద్ధులై, పైకరుదెంచలేక, అవజ్ఞతతో గాసిలుచుండి, నీల్గువారలు మోక్షము నేకరణిని గ్రహింతురమ్మా! ఏకరణిన రహింతురు?

"అస్థిరమైన దార, పుత్ర, కనకాదులపైనుండు తీవ్రమైన కాంక్షతో, ఏ విధమైన స్థిమితములేక, దారుల బట్టి తిరుగుచు, జన్మ నిరర్థకము చేసికొనుచు, భూస్థలిపై మాటి మాటికి పుట్టుచు, గిట్టుచు నుండు మానవులకు మోక్షమార్గమే స్థితి లభించును.

"అమ్మా! ననుగాంచిని ఫలితముగ నన్నొకసారి కనులార జూసికొని ఇంటికి వెళ్ళుడు. అంతియేగాని నన్ను రమ్మని బోధించవలదు. నన్నర్థము చేసికొనుడు. నా ప్రార్థన మన్నింపుడు. లౌకిక విషయములపై నాకాసక్తిలేదు. నేను రాను. నా జీవిత ధ్యేయమును సాధించవలయును. అందుకు గుర్వనుగ్రహముకన్న వేరు మార్గములేదు."-అని చెప్పగా పీరుసాహెబులో ఓర్పు సంపూర్తిగా నశించినది. ఆగ్రహోదగ్రుడై సిద్దయ్యను చూచి లెంపకాయ కొట్టినాడు. అంతియేగాదు జుట్టుపట్టుకొని బయట కీడ్చుకొచ్చినాడు.

"ఓ!-తండ్రీ! నన్నేల యిట్లు హింసించుచుంటివి. నే చేయని నేరమునకు, కేవలము మీలో పెరిగిన వ్యామోహ ప్రభావ సంజనిత క్రోధాగ్ని ప్రకోపము ననన్నట్లు కొట్టుచుంటివి. నేను నిజముగ నెదిరించిన నీవు క్రింద బడుదువు. నా శారీరక బలము ముందు నీ శారీరక బలము నిలువజాలదు కాని కన్న తండ్రి నెదిరించుట

మహాపాపము. కాని ఈ గోల సద్గురు మ్రోల పనికిరాదు."- అని మనమున తలచి ఒక్క మాటయును బయటకు చెప్పక, పెదవి విప్పక తండ్రి కొట్టుదెబ్బలనన్నిటినీ భరించినాడు.

"దుష్టా! నీవు క్షీరపయోధిలో విషము ప్రాదుర్భవమైనట్లు, నిర్దిష్టమైన మా మతమునందు బుట్టి యువ్విధముగ మత భ్రష్టత్వమును వహింప బూనితివి. ఎందులకు మమ్మిట్లు బాధింతువు-సాధింతువు. మేము నీకు చేసిన యపకారమేమి?- అని మరల తనకై తాను తగ్గి "రారా! మూర్ఖత్వము వీడరా! ఇంటికి పోదమురారా!" అని బ్రతిమిలాడుట ప్రారంభించినాడు.

"అబ్బాజాన్! నీవు నన్ను కొట్టిననూ చివరకు నా ప్రాణముల దీసిననూ నేను యింటికిరాను. నీవు నన్ను కొట్టు ప్రతి దెబ్బయూ నాలోని పట్టుదల నెక్కువ సేయుచున్నదేగాని, లొంగనీయుటలేదు. కనుక నాపై ఆశలు మాని గృహంబున కేగుడు."- అనినాడు సిద్దయ్య.

అప్పటికే అచ్చటి ఇతర శిష్యజనంబులు, గ్రామస్తులు చేరినారు. వీరగురుదంతయూ సాక్షీరూపమున చూచుచుదెంనేగాని యిసుమంతైననూ చలించలేదు. మారు మాటాడలేదు. అపుడు పీరుసాహెబు అచట చేరిన జనంబులజూచి అయ్యా! చూచితిరా! ఇతని మొండితనము. ఎంత బ్రతిమిలాడినను తన మొండి పట్టు వీడకున్నాడు. ఇతనిని గట్టిగా పట్టుకొనుడు. పారిపోయిననూ పారిపోగలడు. త్రాళ్ళతో బంధించి గృహమున కీడ్చుకొనిపోయెదను."- అని పీరుసాహెబు అందరనీ బ్రతిమిలాడుట ప్రారంభించినాడు.

కాని సిద్దుడు పారిపోలేదు. పారిపోవలసిన అగత్యమతనికి లేదు శ్రీరామ రక్షయై గురుకటాక్షమతని నలముకొని యుండ పరువెత్తుటెందులకు. ఆశ్రితజన వత్సలుడైన ఆ వీరగురుని చరణ పంకజములకన్న వేరు ప్రదేశమేమున్నది.... అదియే భయరహితమైనది. అభయం బొసగునది అందువలననే అతడు కదల లేదు. మెదలలేదు. కదలని వాని బట్టి కొట్టుచూ, పీరుసాహెబు తనపైనున్న పొదవాటి అంకుకంబుతో పెదరెక్కలు విరిచి గట్టిగా కట్టివేసినాడు. ఎన్నియో దుర్భాషలాడినాడు. కొట్టినాడు

"అయ్యలారా! అన్యథా భావింపకుడు. ఒక్కగానొక్క కొడుకు. ఇతనిని బాసి యుండలేము. అదియునుగాక సన్యాసిగా నుండుట మేము భరించలేము. కనుక ఖట్వాకపై గట్టుకొని మోసుకొచ్చి మాయింటి ముందుంచుడు. అందుకు తగిన పారితోషికమిత్తును"-అని చెప్పగనే అందలి జనులలో నల్వురు పారితోషికమున కాశపడి "మేమడిగినంత కూలియిచ్చిన అటులనే తప్పక అతనిని మీ యింటికి చేర్తుము"-అని చెప్పినారు.

"అటులనే!-సందేహించ నవసరములేదు."- పీరుసాహెబు

"అటులైన మా మందిరంబులకేగి కుజ్జివానిని మోసికొని పోవుటకు వలయు ఖట్వాంగములతో తగిన సాధనములతో వత్తుము. అంతవరకూ వేచి యుండుడు."-అని వారు నల్వురు వెడలిరి.

అపుడు పీరు సాహెబు కుమారుని ముఖముననున్న విభూది కుంకుమాక్షతలు చెఱుపుటకు, రుద్రాక్షలు త్రెంపి పారవేయుటకు, కాషాయముల చింపి ప్రోగులుపెట్టుటకు ముందు కుఱికినాడు.

"ఆగండి"— అదంబి ఆరచినది.

"అదంబీ !"- ఆశ్చర్యము వ్యక్తముచేసినాడు పీరుసాహెబు.

"నాది కన్న కడుపు వాని వీపుమీదపడు ప్రతి దెబ్బయూ నా కడుపుమీద పడుచున్నది. అతని శరీర మాదెబ్బలను భరించవచ్చు. కాని నాకడుపు భరించలేదు. నీవు నిర్దాక్షిణ్యముగ ప్రవర్తించుచుంటివి. ఇంక అతనిని కొట్టిన అవమానపరచిన నేను సహింపజాలను. బిడ్డ క్షేమము కోరియేగదా!— మన మింతదూర మరుదెంచినది. బిడ్డనిట్లు బాధించుటకు కాదు గదా ! పదిమంది ముందు ఆపసి మనసు నా విధిహింసించుట నేనింకెంత మాత్రము సహించను. ఎక్కడున్నను బిడ్డక్షేమముగ నుండుటయే మనముకోరు నది. ఇంత శ్రమపెట్టి, బాధపెట్టి, హింసించి తీసికొని వెళ్ళినను ఆతనుండునను నమ్మక మేమున్నది. ఇంక మీ ప్రయత్నముల నాపుడు."— అని అదంబి తీవ్ర స్వరముతో బలికినది.

పీరు సాహెబులోని పట్టుదల సడలిపోయినది.

ఇంతలో కూలివాండ్రు ఇండ్లకరుగుదెంచి, మంచము, దుప్పటి త్రాళ్ళు, గడలను, ఈత కోలలు గొనివచ్చుచుండిరి. సిద్దయ్య అదిచూచి "భగవాన్ ! కూలివారు దండపాణులై, పాశధరులై వచ్చుచుండిరి. యమదూతలవలె కన్పించుచుండిరి. వీరు నన్ను బ్రతుకనిత్తురా !"—అని ఎలుగెత్తి "నిజముగ వీరసద్గురుడు ఆశ్రితజన రక్షకుడైన, అమ్మహాత్ముని పద్మముల నాశ్రయించినట్టి నిజభక్తి పరుడగనుకనైతే !— జై వీరబ్రహ్మగురుదేవా ! నన్ను బంధించిన ఈ అంశుకము తుత్తునియలవదా !"- అని వీరగురు నామమును స్మరించినంత అతనిచేతులకు కట్టబడిన అంశుకము పెద్ద ధ్వనితో ముక్కలు ముక్కలై క్రిందబడినది.

అందరా దృశ్యమును చూచి ఆశ్చర్యచకితులైరి. కొందరు భయభ్రాంతులై పర్వులెత్తిరి. అంత సిద్ధయ్య నేరుగ శ్రీగురువుని వెనుకకుచేరి ముకుళిత కరకమలుండై నిలువబడి "అన్యథా శరణంనాస్తి ! త్వమేవ శరణంమమ"- అని నిలువబడినాడు.

"వీరగురుడు తలపంకించి-చిర్నగులు వెలయింపుచూ"భయంలేదు. ధైర్యమునుండుము. నేనుంటినిగదా !"— అనినాడు.

అంత కూలివారు సిద్దయ్యను పట్టుకొనుటకు గడపదాటి లోనికి పోవయత్నించి, కండ్లుగానక క్రిందబడి గిల గిల కొట్టుకొనిరి. ఆదృశ్యమును చూచి పీరుసాహెబు భయకంపితుడైనాడు. కూలివాండ్లు బ్రహ్మమునకు దణ్ణములిడి అటునుండి వెడలిపోయినారు.

"సరసిజలోచనా ! సాధుజనావనా ! అద్వితీయ! శ్రీకరా ! కరుణాపయోనిధీ ! అవికార ! నిరామయా ! చిద్విలాసా ! భాసుర ! నిగమాంతవేద్య గుణశోభితా ! ఆశ్రితలోలా ! వీరసద్గురు పరమేశ్వరా ! దురితదూరా!"- అని వీరగురుని సిద్దయ్య అనేక విధముల స్తోత్రము చేసినాడు.

"సిద్దయ్యా !"- ఎంతో గంభీరముగానూ, శాంతముగానూ పిల్చినాడు వీరగురుడు. అతని కంఠమునందు ఆనందమూ, ఉత్సాహము, ప్రస్ఫుటీకరించబడుచున్నవి.

"ఏమి స్వామీ!"- అనినాడు సిద్ధయ్య.

"భళా ! సిద్ధా ! నీవు నావాడవురా ! నిన్ను విడువను. ఇప్పుడేకాదు ఎప్పటికీ విడువను. నీవు నా కొఱకు, నేను నీ కొఱకు ఉద్భవించినవారము. మన మిద్దరము సమాగమమునకై యిన్నినాళ్ళు వేచియుంటిమి. ఆ నిరీక్షణ నేటికి ఫలించినది గురుశిష్య సమాగమమైనది ఆనందభైరవయోగీ !"- అనినాడు శ్రీగురుడు.

"ఆయనెవరు స్వామీ !"- అని అడిగినాడు సిద్ధుడు.

"చెప్పెదను. ఇంకొంచెము సమయమున్నది. అంతయూ నెఱింగింతును. అని "పీరుసాహెబ్ ! భయముతో శరణుజొచ్చిన శాత్రువునైనను కోవిదులు వీడరు. ఈ విషయము నీకునూ తెలుసును. నేనిపుడు నిర్దయగా నీ కొమరుని విడచిపుచ్చిన లోకులు మెచ్చెదురా ! నీవిట్లు తీవ్రత చెందుటయూ పాడిగాదు. పుత్రుని ప్రేమించవలయును గాని యిట్లు బాధింతురా ! పదిమంది పరాయిజనము ముందర అపహాస్యముచేసి అవమానింతువా ! అతని మనసు నెఱుగక మూర్ఖముగా ప్రవర్తించి అతని ఆత్మాభిమానమును దెబ్బతీతువా ! యిదియేనా నీవు కన్నతండ్రిగా నిర్వహించవలసిన బాధ్యత. బాలుడిప్పుడు భయకంపితుడై యున్నాడు. నేచెప్పినను వినడు. నీవతనిని అంతగా భయపెట్టితివి. కనుక నీపుత్రుడిప్పుడు నా పుత్రుడు. కనుక భయవిహ్వలుడై నా శరణు జొచ్చినాడు. ప్రస్తుతము నేనతనిని నీతో పంప సాధ్యముకాదు. ఏదో ఒకనాడు నేనే అతనిని నీ యింటికి పంపెదను. అంతవరకూ ఓపిక వహించి యుండవలసినదే. గాని తొందరపడి ప్రయోజనములేదు. ఇక నీవు వెళ్ళవచ్చు."- అనినాడు శ్రీ గురుడు.

పీరు సాహెబు కోపోద్దీపిత మానసుడైనాడు. విచక్షణ కోల్పోయినాడు తానేమి మాటలాడుచుండెనో గూడ ఆలోచించలేని అజ్ఞానపు స్థితికి దిగజారి పోయినాడు.

"తనయుని పెంచి పెద్దగ జేసితిని"

"అవును పీరుసాహెబు ! నీవేగాదు పశుపక్ష్యాదులును తమ బిడ్డలను పెంచి పెద్దచేయుచున్నవి."

"విద్యాబుద్ధుల నేర్పించితిని. అట్టి కన్న తండ్రిని నేనే నాబిడ్డను తోడ్కొని పోవననర్హుడనా ! నాల్గు రోజులు తిండి తిప్పలు ప్రసాదించి నంత మాత్రమున వానిపై మీకు స్వాతంత్ర్యంబు యింత ధాయత్యంబుగా కలిగినదా !

"మొట్టమొదట సిద్దునితో బొమ్మని చెబితివి. యిప్పుడు పంపనని నీవె సెబుతుంటివే. మదినొకటియూ, నోట చెప్పునదింకొకటియునా ! నీవు మోస గాడివి. నిన్ను నమ్మరాదు తలితండ్రులకు బిడ్డలకు నెడబాటు కలుగసేతువా ! పైగా తాపసివి. నీకదే ధర్మమా ! న్యాయమా ! నీ హిందూ మతములో యిటుల వ్యవహరించుట ధర్మమని ఎచటనైననూ తెల్పియుండెనా! నీవు గోముఖవ్యాఘ్రమవు.

"ఇదుగో బ్రహ్మం ! ఇంతటితో నిన్ను బోనిత్తునని తలపకు. నా సుతుని దగ్గరకుతీసి, మోసగించి, వేషము, దుస్తులు మార్చి, చిత్తము చెఱచి, మతి భ్రష్టుని చేసితివి. నేను వానిని తోడ్కొని బోవ ప్రయత్నింప అడ్డుపడితివి. నీ దుండగములనన్నియు కడపనవాబునకు ఫిర్యాదుచేసి నీ అంతుచూచెదనుగాక ! అప్పుడైన నా కుమారుని నా కప్పగింపకెచ్చటికి పోయెదవు. ఆదంబీ !— పద !"— కోపముతో ఊగిపోవుచూ ఆదంబితో అచటనుండి వెడలిపోయినాడు పీరుసాహెబు.

# సిద్ధయోగి ప్రసిద్ధ భారతం

## —: ఇరువదవ భాగం :—

"పేరూ!" — ఆ పిలుపు ఉలికిపడి లేచినాడు పీరుసాహెబ్.

"కోన్" — అనినాడు.

"పిచ్చివాడా! కల్ప వృక్షం ఆశ్రయమిచ్చిన కొలదన్నుకుని వచ్చితివా. సూర్య ప్రకాశమును గుడ్లగూబలు చూడలేనట్లు మహానుభావుడైన వీరబ్రహ్మగురుని నానా దుర్భాషముల నాడి, పైన నవాబునకు పిర్యాదు చేయుదునని భయపెట్టి వచ్చితివా! నీవు భయపెట్టినంత మాత్రమున భయపడువాడా! వీరబ్రహ్మము. పాగల్! వీరబ్రహ్మము ఎవరనుకుంటివి. సాక్షాత్తు పరమేశ్వరుడు.

"నీ కుమారుడు జన్మించినపుడే పండితులు జోస్యము చెప్పిరి. గుర్తుండినది గదా! అయిన నతడు మహాభోగియగును లేదా మహాయోగి యగునని. అతని శిక్షణలో నీ కుమారుడు మహాయోగి యగును. మీ వంశమంతయు పావనమగును ప్రపంచఖ్యాతి గల్గి నీ కుమారుడు ప్రజలచే పూజలందుకొనును.

"ఊరక అజ్ఞానమునబడి, పుత్రవ్యామోహమున తగుదగని, ఉచ్చనీచముల విస్మరించి, వీరబ్రహ్మమంతటి మహాత్ముని దూషించిన నీ పాపమూరక పోవునా! వెళ్ళు.... వెళ్ళు.... వెళ్ళి ఆ శ్రీ గురుని పాదము లాశ్రయించి క్షమాభిక్ష నర్థించి, పాపప్రక్షాళనము చేసికొనుము. శ్రీ గురుడు క్షమాశక్తి సంపన్నుడు. మిమ్ములను క్షమించునేగాని శపింపడు. అతడు ప్రేమస్వరూపుడు. ప్రేమవద్ద పగకు నిలువలేదు అది అచట నిలువలేదు. నీ వంత రాద్ధాంతము చేసినను అతను నిన్ను క్షమించి, ప్రేమించునేగాని ద్వేషింపడు. వెళ్ళండి.

"ఒకనాడు దైవప్రవక్త (సలల్లాహు అలైహివసల్లం) ఏమని బోధించి నారో తెలుసునా!

"దాసుడు తప్పుచేసిన పిదప పశ్చాత్తాపముతో క్షమార్పణ కొఱకు అల్లాహ వైపుకు మరలినప్పుడు అల్లాహ్‌కు కలిగే సంతోషము ఎటువంటిదో తెలుసునా!

"ఒకఒంటెపై ఆధారపడి జీవించే వ్యక్తి, ఆ ఒంటెను/కోల్పోయితిరిగిదాన్ని అకస్మాత్తుగా పొందినప్పుడు పొందే సంతోషముకంటె ఎంతో అధికముగా నుండును.

-(బుఖారి — ముస్లిం)

"దాసుని ఊపిరి చెదరి పోయేవరకు అల్లాహ్ అతని పశ్చాత్తాపమును స్వీకరించును. —అని మహాప్రవక్త వచించినాడు"

— తిర్మిజి - అబ్దుల్లా బిన్ ఉమర్.

"ఇంకొక్క విషయము చెప్పుచుంటిని జాగ్రత్తగా వినుము. ఏ వ్యక్తి అంతర్యంలో మార్గదర్శక జ్యోతి విచ్చుకుంటుందో అతని మనస్సు ప్రపంచ వ్యామోహాలకు లోనవదు. అతడు ప్రపంచంలో జీవించినా ప్రపంచం కొరకు జీవించడు. ప్రపంచంపట్ల నిర్లిప్తభావం కలుగుతుంది. శాశ్వతమైన పరలోకంపట్ల ప్రేమపుట్టుక కుతూహలం పుట్టుకవచ్చును. అతడు అవతరణకు పూర్వమే దానికొరకు సమాయత్తమవుతూ యుండును.

— మిష్కాత్.

"ప్రస్తుతము సిద్ధయ్య స్థితి గూడ అదే. సలల్లాహు అలైహి వసల్లం ఏమని బోధించారో తెలుసునా ! ఏ వ్యక్తి అయితే ప్రపంచాన్ని ప్రేమిస్తాడో అతడు పరలోక సాఫల్యాన్ని కోల్పోతాడు. ఎవరు తన పరలోక సఫలతను వాంఛించునో అతడు తన ప్రాపంచిక స్వలాభాలను త్యజించును కనుక మీరు శాశ్వత జీవితానికి అశాశ్విత జీవితంపై ప్రాధాన్యమివ్వండి.

—మిష్కాత్ — అబూమూసా

"కనుక వెంటనే బయలుదేరి వెళ్ళండి"- అని ఎచ్చటినుండియో దివ్యవాక్కులు, అద్భుత వచనములు విన్పించుచుండినవి. ఆశక్తి పీరు సాహెబును స్థిరముగ కూర్చుండనీయలేదు. తాను తీరని ద్రోహముచేసినట్లు, తప్పుచేసినట్లు తెగ బాధపడిపోవుచుండెను. అతనికి బహుశా యిదే జ్ఞానోదయమేమో! హృదయ మందేదియో గందరగోళము.

అదంబి మాట్లాడలేదు. భర్తపై ఆమెకు చాల కోపముగ నున్నది భర్త ప్రవర్తన చాల నింద్యము. అతని ప్రవర్తనపట్ల అదంబి చాల విముఖురాలై యున్నది. చాల కలత చెందియున్నది. విచక్షణా రహితముగ ప్రవర్తించిన విభునిపట్ల ఆమె చాల కృద్ధురాలై యున్నది.

"అదంబీ!"- పిల్చినాడు పీరు సాహెబు.

ఆమె పెడమొగమువైచి పరుండినది మాట్లాడలేదు.

"పొరబాటై పోయినది. స్వామిపట్ల చాల అనుచిత రీతిలో ప్రవర్తించితిని. పెద్దల పట్ల ఎట్లు ప్రవర్తించవలయునో తెలిసిగూడ నేను అజ్ఞానమునబడి తీవ్ర అపచారము చేసితిని ద్రోహముచేసితిని. ఆత్మాభిమానము అందరికీయుండునని తెలిసియు, కుమార సిద్దుని తీవ్ర అవమానమునకు గురిచేసితిని. అతని ఆత్మాభిమానముపై గట్టిదెబ్బతీసితిని. నాకు తరుణోపాయములేదు.

"గురుదేవుడు మన డబ్బు కోరలేదు. మన ఆస్తిపాస్తులు కోరలేదు. ముస్లిం మతానుచరుడనని తెలిసియూ, కులమత విద్వేషములను దరికి రానీయక, ప్రేమ స్వరూపుడై కుమారుని జ్ఞాన పూర్ణుని చేయనుంకించిన ఆ సద్గురుపై కక్ష కట్టినాను. ఇంకనా జన్మమువృథా! భగవంతుడు కూడా నన్ను క్షమించడు"— తన చేతులను, తలను గోడకేసికొట్టుకొని యేడ్చినాడు.

"ఆగండి! ఏమిటా మూర్ఖత్వము. చేసినది చాలక, యిదియునూ చేయవలయునా! ఇతరులకు చెప్పుటయేగాదు ధర్మసూత్రము. మనమునూ ఆచరించవలయును. మీరింత రగడచేసిననూ, రచ్చచేసిననూ శ్రీగురుడు ఒక్క మాటయిననూ అనలేదు. ఆయన దయామయుడు ప్రేమమూర్తి. ఆతడే అనుగ్రహించిన మన బ్రతుకు లేమైపోయి యుండెడివి?

"చూడండి!- స్వామి నామముచ్చరించి నంతమాత్రమున సిద్దయ్యకు మీరు కట్టినకట్లు తుత్తునియలై క్రిందపడినవి సిద్దయ్యను పట్టుకొనబోయిన కూలీలకు కళ్ళు బైర్లు కమ్మి ఏమీతెలియని స్థితిలో క్రిందపడి గిజగిజ కొట్టుకొనిరి అప్పటికైననూ మీ కళ్ళు తెరపడి పడలేదు సరిగదా ...., యింకనూ "- ఏదో అనబోయినది అదంబి.

"ఔను అదంబీ ! నాది చాల పొరబాటు. చేయకాని తప్పుచేసినాను.

"ఎవరు తన నోటిని అదుపులో ఉంచుకుందురో! అల్లాహ్ వారి లోటు పాట్లను కప్పివుచ్చును. ఎవడు తన కోపాగ్నిని నిగ్రహించుకొనగలడో, అల్లాహ్ ప్రళయ దినాన అతనిపైనుండి బాధను తొలగించునని దైవ సందేశహరులు ప్రవచించినట్లు పెద్దలు చెప్పియున్నారు.

-మిష్కాత్- అనస్

"నేను చాలా తప్పుచేసితిని. ఇంక శ్రీగురుని శరణువేడుట తప్ప అన్యము లేదు. పద!– వెంటనే వెళ్ళి ఆయన పాదములపైబడి క్షమాపణ వేడుకొని మనశ్శాంతి పొందవలయును."- అని భార్యాభర్త లిద్దరూ తెల్లతెల్లవారుచుండగనే కందిమల్లాయపల్లెకు బయలుదేరినారు.

o—o

# సిద్ధయోగి ప్రసిద్ధ భారతం

## —: ఇరువది ఒకటవ భాగం :—

"రండు! రండు! మీరు వత్తురని నాకు తెలియును. పశ్చాత్తాపమును మించిన పరమావధి వేరొండులేదు. అదంబీ! పీరుసాహెబులారా! ఇప్పుడు మీ మనసులు కొంచెము ప్రశాంతమైనట్లు తోచెడిని. కోపములో మానవుడు వివేకము కోల్పోయి ఉన్మత్తుడగును. ఆ సమయమున అతనికేమి చెప్పిననూ అర్ధముగాదు. వ్యర్థమేయగును. అందులకే నేను ఎక్కువ మాటాడలేదు. కాలమే ఎన్నో సమస్యలకు పరిష్కారము చూపును

"ఆగ్రహమెప్పుడూ అపదనే చేకూర్చును. శాంతిని కాంతిని క్రాంతిని చేకూర్చును. ఆత్మ నిగ్రహమెంతయో మేలు చేయును. అది ఆనంద నిలయము. సత్యము, శాంతి,— వీటికన్న సంపద లేముండినవి పీరూభాయ్! ధర్మమార్గావలంబుల కెప్పుడూ చిత్తము నిర్మలముగానే యుండును. ప్రేమస్వరూపుడు దేవుడు ప్రేమించుటయనిన దైవము నారాధించుట. నీ ఇరుగు పొరుగుల నెప్పుడూ ప్రేమించు చుండవలయును, నీపై నీకెంత ప్రేమ యుండునో, అటులనే యితరులను ప్రేమించుట భగవానున కెంతయో ప్రీతికరము. తరువాత ఓర్పు, నిగ్రహము— ఈ రెండూ మానవుని మాధవునిగా చేయగలవు. పీరూభాయ్! శాంతము చేకూరినిదా!

"అనినట్లు నీకు గతరాత్రమున నిదుర సరిగా పట్టలేదుగదూ! దివ్యవాణి విన్పించి నిన్ను దిగ్భ్రాంతుణ్ణి చేసినది గదూ! మొహమ్మదు ప్రవక్త (సల్లెలాహు అలైహివసల్లం) చెప్పిన అమృతవాక్కులు నిన్ను అలరించినాయిగదూ!— ఎంత అదృష్టవంతుడవు పీరూ! దివ్యవాక్కుల వినగలిగిన అమృతహృదయుడవు.— అనినాడు శ్రీ గురుడు

"గురుదేవా! మీకెట్లు తెలియును."—అనినాడు ఆందోళనగా.

"ఆందోళన పడకు. నాకు అంతయూ తెలియును,"—అని అతని భుజముపై చేయివేసి దగ్గరగా తీసికొనినాడు

శ్రీ గురుని స్పర్శ మాత్రమున పీరుసాహెబు శరీరమంతయు ప్రశాంతి చేకూరినది. అతనిలోని ఆవేదన అణగారి పోయినది. చిత్తము నిర్మలమైనది. బరువుతగ్గి తేలిక పడినట్లు అనుభూతి చెందినాడు. అతని కండ్ల వెంట కన్నీరు ధారాపాతముగ కారుచున్నది

"ఇంకొక్క విషయము చెప్పమందువా!"—అనినాడు శ్రీ గురుడు

పీరుసాహెబుకు గొంతులోనుండి మాటరావడంలేదు.

తల ఊపినాడు.

"యోగసాధనకల వాడు సమస్తములైన ఇంద్రియములను చక్కగా వశపరచుకొని నాయందు ఆసక్తముగల చిత్తము గలవాడై ఉండవలయును. ఎందువలనననిన, ఎవని యొక్క ఇంద్రియములు స్వాధీనమందున్నవో వానియొక్క జ్ఞానము సుస్థిరమైనది. అతడేస్థితప్రజ్ఞుడు. అని శ్రీ కృష్ణపరమాత్మ అర్జునునకు తెలియపరచినాడు.

"ఎల్లప్పుడూ యిందియ విషయములనే చింతించుచున్న మనుష్యునకు ఆ యింద్రియ విషయములందే ఆసక్తి పుట్టుచున్నది. అట్టి ఆసక్తివలన కామము, అనగా కోరికలుద్భవించుచున్నవి. ఆ కోరికలు తీరక కోపము జనించుచున్నది. చూచితివా?-ఎక్కడకెక్కడ బంధమున్నదో.

"శ్లో॥ క్రోధాద్భవతి సమ్మోహస్సమ్మోహాత్స్మృతి విభ్రమః
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి"

గీత : 2 : 63

"కోపమువలన అవివేకము, అవివేకమువలన మతిభ్రమయు గలుగుచున్నది. దానివలన బుద్ధి నాశనం యేర్పడుచున్నది. తద్వారా తానూ నశించిపోవుచున్నాడు! అందువలన కోపం ఎంతటి అనర్థమునకు దారి తీయుచున్నదో చూచితివా ఈ విషయములు నీకు తెలియవని కాదు. ఊరక గుర్తు చేయుచుంటిని.

"ఒకవ్యక్తి మహాప్రవక్త (సల్లల్లాహు అలైహి వసల్లం) వద్దకువచ్చి 'నాకు ఏదైనా ఉపదేశమివ్వండి'-అని అర్థించినాడు. అందుకు ఆయన చెప్పినమాట

ఏమిటో తెలుసునా. 'కోపగించుకోకు'--అని. ఆవ్యక్తి అంతటితో ఊరుకోనక మళ్ళీ మళ్ళీ ఏదైనా' ఉపదేశమివ్వండి'-అని అర్థించ సాగినాడు. ప్రవక్త ప్రతిసారీ 'కోపగించుకొనవద్దు'-అని మాత్రమే బోధచేసినాడు.

—(బుఖారి-అబూ హూరైరా)

"కనుక ఎవరు చెప్పినా, ఏ మహాత్ముడు చెప్పినా మంచినే చెప్పును, మంచినే బోధించునుగానీ చెడుచెప్పడుగదా!— సరియే రాగనే మీకు బోధచేయ ప్రారంభించితిని. తరువాత స్థాయిగా, ప్రశాంతముగా మాటాడుకొన వచ్చును.నాయనా! సిద్దా! నీ మాతా పితరులు మనసు మార్చుకొని వచ్చి యున్నారు. వారికి తగిన వసతులు, భోజనాది వ్యవహారములు చూడు"— అని "గోవిందా! ఇదుగోచూడూ మన సిద్ధయ్య తలి తండ్రులు మనసు మార్చుకొని, మనతో సఖ్యమునకై వచ్చి నారు. వారికి భోజనాధి యేర్పాట్లును చూడుము అభ్యాగతి విష్ణు స్వరూపుడని గదా శాస్త్రము."అని చెప్పి బ్రహ్మాగురుడు లోనికి వెళ్ళినాడు.

"అయియ్యే! అయియ్యే! పీరూ భయ్యా! అయియ్యే! అరంబీబహెన్! అయియ్యేనా!"-అని "మనసులో ఏ విధమైన శంకలుంచుకొనవద్దు."— అన్నది గోవిందమాంబ లోపల్నుండి వచ్చి

"మాతాజీ!"-పీరుసాహెబు కనుల వెంట ధారాపాతముగా నీరు కారజొచ్చినది. "మాతాజీ! మీరుకూడా నన్ను భయ్యాయని పిల్చుచుండిరా! స్వామీజీ నన్ను భాయీ! అని సంబోధించినారు. మీరు నన్ను భయ్యాయని ఆహ్వానించుచుడిరి అమ్మా!-మీరు చూపించేదయ, ప్రేమ, మంచి తనమునకు మాకు ఆకలి దప్పులేనాడో నశించినవి. మాతాజీ! మమ్మల్ని క్షమించండి. మేము మీపట్ల తీరని అపచారము చేసితిమి."-అని ఆమెపాదములపై వ్రాలిపోయినాడు పీరుసాహెబు.

"అరే ! పాగల్ భయ్యా ! సబ్ కా మాలిక్ యేక్ ! మనందరికీ భగవంతుడు ఒక్కడే !— అతడే అల్లా ! అతడే సృష్టికర్త. మతములు కులములు అన్నియూ మనము యేర్పరచుకున్నవేగాని వేరుగాదు. అచ్ఛా !- ముందు భోజనములు సేయుడు— అరంబీ బహెన్। క్యా సోచ్ రహేహో !— ఆలోచనలుమాని అన్నము

తీనుడు ”- అని ఆమె స్వయముగ వారి విస్తళ్ళలో ఆహార పదార్థములు వడ్డించ సాగినది

పీరు సాహెబు దంపతుల హృదయములు ఆనందతుందిలములైనవి. గురు దంపతులు జూపించు ప్రేమ, క్షమ వాత్సల్యములకు వారి మనసులు కరిగిపోయినవి. వారి అనుమానములన్నియు పటా పంచలైపోయినవి. వారు అన్నమే తినుచుండిరో, అమృతమే పానము చేయుచుండిరో వారి కర్థముగాని స్థితికి వెళ్ళిపోయినారు.

సిద్దయ్య గబగబా వచ్చి తలితండ్రులు తినిన ఎంగలి విస్తళ్ళను ఎత్తివేయు టకు ప్రక్రమించినాడు. “అరే బేటా ! తుమ్‌కో(ంబేటా ! మాఁహైనా !”- అన్నాడు పీరు.

“పరావానై అబ్బాజాన్ ! మై కరూంగా !”- అని తల్లిని గూడ వారించి వారి ఇస్తళ్ళను తీసివేసి అచ్చట మరలా నీరము చల్లి శుద్ధిచేసినాడు వారుకూర్చున్న పీటలను ఎత్తి ప్రక్కనుంచినాడు.

ఇంతలో గోవిందమ్మ మరలా అచ్చట కేతెంచి “అరే ! అప్పుడే ముగించి తిరా ! సిద్దా నన్ను పిలువకుంటివేమి”- అనినది.

“మాతాజీ ! మేము ఎప్పుడూ యింత ఆనందముగ హాయిగా భోజనము చేయలేదు అమ్మా మీచేతి భోజనము అమృతోపమానమై మా మనస్సులను జీవితములను పవిత్రవంతము చేసినవి. తల్లీ ! శలవు!”— అనినాడు పీరు సాహెబు

ఇంతలో శ్రీ గురుడునూ అచ్చటికేతెంచినాడు

“భోజనములు పూర్తిచేసినారా ! మీకు అల్లా శుభములు చేకూర్చుగాక! రండి, అవతల కూర్చొని మాటాడుకుందము ”- అని ఆ దంపతుల నిద్దర అవత లకు తీసికొనిపోయి, వార్ని ఎదురుగా కూర్చుండబెట్టుకొనినాడు శ్రీ గురుడు. సిద్దయ్య, గోవిందాసతియు వారిని అనుసరించినారు.

“పీరూభాయ్ ? సునో ! నీ కొమరుని నేను తీసికొని ఏమి సాధించదలచితి నందువు. నాకు కొడుకులు లేకనా లేక నీ ఆస్తిపాస్తులు కాజేయుటకు నేను నీ కొమరుని చేరదీసితినా ! నాకు ధన ధాన్యములు లేకనా ! జరాధ్యాన్‌సే సోచో

దోస్త్ ! జ్ఞానమనే ధనము ఒకరిచ్చినదిగాదు. అది గురువు ద్వారానే బడయ గలరు నీ కుమారుడు జ్ఞానవంతుడు కావలచి నన్ను చేరినాడు. అంతియేగాని అతనివలన నాకు సమకూరు ప్రయోజనమేమియూలేదు. అతనికే ప్రయోజనం. సమాజమునకు ఆతని ద్వారా గొప్పమేలు చేకూరనున్నది. అంతటి భక్తుని· దృఢదీక్ష సంకల్పుని, ఉత్తముని, జ్ఞానపిపాసిని కన్న అదృష్టము మీది. అందుకు మీరెంతో గర్వపడవలసియున్నది పొంగిపోవలసియున్నది. ఈ మాత్రమూలో చింపక, నాడు ఈ ప్రాంతమంతయు గగ్గోలొనరించితివి. రచ్చచేసితివి. గంద్ర గోళముచేసితి· పవిత్రమైన మత ప్రాంగణమును మలిన పరచితివి. పసివానిని బాధపెడితివి."— శ్రీ గురుడు.

"మాఫ్‌కీజియ్యే మహరాజ్! మైబడా అపరాధీహూఁ. స్వామీ! ముఝె మాఫ్ కీజియ్యే! " అని విలపించినాడు పీరు.

"అచ్ఛా! అచ్ఛా ! మత్‌రో ! మత్‌రో! మేరాదోస్త్ ! మేరాభాయ్! బాత్‌సునో ! మతమనునది ఒకమత్తుమందు. ఏ మతమునందైనను పరమాత్మ ఒక్కడే· అన్ని మతములు మానవకోటికి మంచిచేయమనే చెప్పును· అందరినీ జ్ఞానులు గమ్మనే చెప్పును· కాని దుర్వ్యాపారముల చేయమని ఏమతామూ చెప్పదు. భగవంతుడు అందరికీ ఒక్కడే ! సబ్‌కా మాలిక్ ఏక్ ! అల్లా ప్రపంచ మందంతటయూ నిండి యున్నాడు. నీలోనూ, నాలోనూ ఈ సర్వచరాచర జీవకోటి అంతయూ అల్లా దయ వలన కలిగినదే.

"బదీ - ఉస్ - సమావాతి— వల్- అర్‌జి— అన్నా- యకూను-
లహూ- వలదున్ - వలమ్- తకుల్- లహూ - సాహి-
బతున్ - వఖలఖ- కుల్ల - షైఇన్ - వహువ- బికుల్లి— షైఇన్- ఆలీమ్"

- ఖురానెషరీఫ్ : 7 : 102:

"జ్జాలికు ముల్లాహు- రబ్బుకుమ్ - లాఇలాహ— ఇల్లా - హువ-
ఖాలిఖు - కుల్లి - షైఇన్ - ఫఅ - బుదూహు- వహువ - అలా—
కుల్లీ - షైఇన్ - వకీల్.

-ఖురానెషరీఫ్ : 17 : 103.

— అతడు ఆకాశములకును భూమికిని సృష్టికర్త. అతనికి భార్యయేలేదు. కుమారుడెట్లు పుట్టును. అతడే సర్వమునూ సృష్టించెను. అతడు ప్రతి విషయమూ తెలిసినవాడు.

"అతడే మీ ప్రభువగు దేవుడు. అతడు తప్ప వేరు దేవుడు లేడు. అతడు సర్వమునకూ సృష్టికర్త. కావున అతనినే మీరు పూజింపుడు. అతడే సర్వమునకూ రక్షకుడు

"లా తుద్-రికుహుల్—అబ్-సావు-వహువ-యద్-రీకుల్
అబ్-సార-వహువల్-లతీపుల్-ఖబర్."

—ఖురానె షరీఫ్ : 7 : 104

"అతనిని కన్నులు పొందజాలవు. కాని అతడు కన్నులను ఆవరించి యున్నాడు. మఱియు అతడు అతిసూక్ష్ముడు. సర్వజ్ఞుడు.

"నీకీవిషయములన్నియూ తెలియునని కాదు. తెలుసును. తెలిసియు అజ్ఞానమున బడితివి. హిందూమత విషయములు నీకు తెలియునా! పీరూభాయ్! తెలిసి తెలిసి ఎందుకట్లు హీనునివలె ప్రవర్తించితివో!

"పవిత్ర గ్రంథమైన దివ్య ఖురానెషరీఫ్‌లోని మరికొన్ని విషయముల వివరింతును. జాగ్రత్తగా వినుడు. అదంవీ!—వినుచుంటివా?"—శ్రీగురుడు.

"ఏడవ కాండమునందే నూఅవ ఆయత్‌ను పరికించిన మీకు తెలియగలదు. దేవుడే ఆకాశమునుండి వర్షము కురియించి దాని మూలమున ఖర్జూరము, ధాన్యము, ద్రాక్ష, జైతూను, దానిమ్మ మొదలగు ఫలములను ప్రజల ఆహారము కొఱకై పుట్టించుచున్నాడు. కొన్ని ఫలములు రూపములో పోలిక కలిగియున్నవి. వాని రుచి వేఱు వేఱుగ నుండును. ఫలములు, పిందెలుగానూ, కాయలుగానూ ఉన్నప్పుడు వాని రుచి వేరుగా నుండును. అవి పక్వమునకు వచ్చినపుడు వాని రుచులు భక్షించువానికి సంతోషము కలిగించును. విశ్వాసులకు అందు దేవుని మహిమలు తెలుపు సూచనలు గావు. పై వాక్యములలో వివరింపబడిన దేవుని క్రియలవలన అతని యేకత్వము ఋజువగుచున్నది. దేవుడు ఒక్కడే. అతడే

సర్వజగత్తునకు పోషకుడు. మానవులకును, ఇతర ప్రాణులకును, జీవనాధారముల నేర్పరచుచున్నాడు. ఎట్లు దేవుడు మానవులకు దేహ పోషణ కొఱకు ఏర్పాటు చేసెనో అట్లు ఆత్మపోషణ కొఱకు ఆకాశమునుండి తన సందేశము తన భక్తులకు ప్రవక్తలకు పంపి వారి మూలమున మానవులకు అజ్ఞానాంధ కారమునుండి గట్టె క్కుటకు ధర్మమనెడి జ్యోతిని జూపెను. దాని ఫలితముగ మానవుల హృదయ ములలో విశ్వాస బీజము మొలకెత్తి సత్ప్రవర్తకులైరి. ఎట్లు దేవుని క్రియల వంటివి మానవులు చేయలేరో అటులే అతని వాక్యములవంటివి మానవులు కల్పింప జాలరు-అనియు తెలియవలెను.

"కనుక పీరూఖాయ్! మనసులో సందేహం పెట్టుకొనకు."

"ఇప్పుడింకే సందేహమూలేదు మహారాజ్"

"నీ కుమారుని బోధవలన గదా! మీరు మాంసాహారమును విసర్జించితిరి. మీ కుమారుడు అనేక మందికి అనేక విషయములు బోధించినపుడు మీరు ఆదరించితిరి. అతని శక్తికి, జ్ఞానమునకు ఆశ్చర్యపడితిరి. కాని అతనిని అవమానించలేదు. అనుమానించలేదు. అడ్డుపెట్టలేదు.

"ఇప్పుడెందులకు మీకా ఆయాసము కలిగినదో అనూహ్యము. అచ్చా! జగిరినదేదో జరిగినది. మీకొక ముఖ్య విషయము తెలియ జేసెదను. వైషమ్య మును, మత దురహంకారమును పారద్రోలి పరమాత్ముడు ప్రేమ స్వరూపియని సత్యస్వరూపుడని, మనఃపూర్వకముగా నమ్మి, నాయందు నమ్మకముంచి నేచెప్పినదె వినుడు.

"నీ కుమారుడు సామాన్యుడుగాడు. గొప్ప శాంతమూర్తి. ప్రజ్ఞానిధి. అతనికి మతముతో పనిలేదు. మనుష్యుల అజ్ఞానమును పారద్రోలి జ్ఞానజ్యోతిని వెలిగించుట కుద్భవించిన జ్ఞానమూర్తి.

"ఇతని గత జన్మవృత్తాంతము తెలిపెదను. వినుడు. అపోహలు తొలగించు కొనుడు. అభిమానము, ఆదరము పెంచుకొనుడు.

"అది కాశ్మీరదేశము" — శ్రీగురుడు చెప్పుట ప్రారంభించినాడు. వారి మనో నేత్రములందు ఛాయాచిత్రమాల తిరుగుచున్నటు ఆ హృదృశ్యములు, సుందరముగ,

స్పష్టముగ, పలువిధరంగులతో దృగ్గోచరమగుచున్నవి.

—కాశ్మీరదేశ రాజకుమారుడు ఆనంద భైరవయోగి. ఎంతయో అందగాడు. సుపరద్రూపి. బలవంతుడు. తెలివితేటలు కలిగినవాడు. ఒకనాడు వేట తమకమున మిత్ర బృందముతో కలసి మహారణ్య మధ్యమునకు వెడలినాడు. ఎన్నియో జంతువులను వేటాడినాడు.

"వనాంతరమందున నున్న పలువిధ పుష్పములను, పుష్పతరువులను, ప్రవహించుచున్న సెలయేళ్ళను, నర్తించుమయూర సంఘంబులను, ఎత్తైయిన కొండలను కొండలపైనున్న బండలను, బండలపై పడుచున్న ఎండ పొదలను, చూచి యానందించుచు, విశాలముగ ప్రవహించుచున్న ఒక సెలయేటి ప్రక్కన, విశాలముగ విస్తరించియున్న వృక్షచ్ఛాయలలో వేటకు వెంట తెచ్చుకొనిన ఆయుధములనుంచి, ఆ సెలయేటిలో స్నానము లాచరించి, వేటాడిన జంతువులలో కొన్నిటిని పచన మొనర్చుకొని తిని, తన వెంట తెచ్చుకొనిన ఆహారపదార్థ ములతో కలసి తృప్తిగా భుజించి సెలయేటి నీరముల్గ్రోలి ఆ వృక్షచ్ఛాయలలో విశ్రమించిరి.

"ఆనంద భైరవయోగియు విశ్రమించ నుంకించి, పరుండబోవునంతలో ఒకానొక భయంకర దృశ్యము గోచరించినది. సెలయేటి కావలివైపున స్నిగ్ధ వర్ణసంశోభితమై ఒకధేనువు తల మెడను క్రిందకు చాచి సెలయేటి నీటిని త్రాగు చున్నది. దాని కవతల రవ్వంత దూరమున ఒక శార్దూలము ఆకలి గొన్న కన్నులతో వీక్షణమున నా గోవుపై దూకి చంపి తిందునాయని ఎదురుచూచుచున్నది.

ఇంతలో మిత్ర బృందములోని కొందరు అలికిడి చేసిరి.

ఆ అలికిడికి వ్యాఘ్రము పొదలచాటుకు పోయినది.

"ఆ వ్యాఘ్రము అచ్చటనే తప్పక దాగియుండును. ఈనాడది ఈగోమాతను తప్పక తన పొట్టన పెట్టుకొనును. కాన గోవు నెటులైన రక్షించక తప్పదు."- అని విల్లు ధరించి ఆనందభైరవ యోగి శరము సంధించి చెట్టుచాటుకుపోయి నిలువ బడియున్నాడు.

"గోవు కడుపార శీతల జలముల్ంద్రావి వెనుదిరిగినది.

"ఆదే సమయమనుకొని, తలచిన వ్యాఘ్రము పొదలచాటునుండి ఆవువైపుకు లంఘించినది. అనందభైరవయోగి విల్లుపుచ్చి శరము అత్యంత వేగముతో దూసుకొని పోయినది.

"కాని, అతని ధ్యేయము వేరు. జరిగినది వేరు.

"ఆశ్చర్యము. శరము వ్యాఘ్రమును తాకలేదు. గోవుకు తగిలినది. అంబా యని యఱచుచు, గోవు క్రిందపడి విలవిల తన్నుకొనుచు ప్రాణములు విడచినది.

"శార్దూలమెటు పోయెనో జాడలేదు.

"మృతిచెందిన గోవునుచూచి ఆనందభైరవయోగి దుఃఖార్తుడైనాడు. గోడు గోడున విలపించినాడు. తనుచేసిన పాపమునకు నిష్కృతిలేదని తలచి, తన పాపమునకు పరిష్కారము తెలియగోరి, ధనుర్బాణముల నచ్చటనే విసర్జించి, మిత్రబృందమును విడచి అడవులబడి మహర్షుల దర్శనము కొఱకు సాధు సత్పురుషుల సందర్శనము కొఱకు తెగతిరిగినాడు. ఎందరెందరినో దర్శించినాడు. పూజించినాడు. అర్చించినాడు. అర్థించినాడు. కాని ఎవరునూ తరుణోపాయమును చెప్పరైరి."- అని చెప్పి ఊరకుండినాడు శ్రీ గురుడు.

ఈ కథ అంతయు అదంబీ పీరుసాహెబులకు కన్నులకు గట్టినట్లైనది. సిద్ధయ్యయూ వినుచునే యుండెను.

స్వామి మరల చెప్పుట ప్రారంభముచేసినాడు.

"నేను అదేసమయమున ఆ ప్రాంతమునందుననే సంచారము చేయుచు, సాధుసత్పురుషుల సందర్శనము చేయుచు, సూర్యోపాసనతో కూడిన తపోనిష్ఠలో యున్నాను. అప్పటికి నేను వయసులో నున్నాను. ఇంకనూ వివాహముకాలేదు. అతను దీనాతిదీనుడై నన్ను సమీపించినాడు.

"-'భగవాన్ మీరెవరో తెలియదు. మీ ముఖావలోకన మాత్రమున నాకు ప్రశాంతి చేకూరినది. నా ఆవేదన అడంగినది. నా శరీరము కుదుటబడినది"- అని తన చరిత్ర నంతయూ సావధానముగ విన్పించినాడు."

"మానవుడు కర్మజీవి. కర్మబద్ధుడుగాక తప్పదు. కర్మను దాటిపోవ ఎవ

సిన ఘడియ దగ్గరపడినది. అతని జన్మములను పరమేశ్వరుడు ముందుగనే నిర్ణయించినాడు.

"అప్పుడు నేను అతని జీవితమును జ్ఞాననేత్రమున దర్శించి చెప్పినాను. 'ఆనందా! తెలిసిచేసిననూ తెలియకచేసిననూ, పాపము పాపమే! దాని ఫలితమనుభవించక తప్పదు. గోహత్య మహాపాతకము అంతియేగాదు వేటరూపమున హాయిగా ఎగురుతూ, ఆనందముగ గంతులువేయుచు, తిరుగు అమాయికజీవుల నెన్నిటినో నీవు నిష్కారణముగ, నిర్దయగ చంపితివి. అదంతయూ పాపము గాక పుణ్యమా ! అపాపమంతయు అనుభవించక తప్పదు. ఈ విధముగ వన్య ప్రాణులనన్నింటికినీ సంహరించుకుపోయిన ముందు ముందు ఎన్నో రకముల వన్య ప్రాణులు అంతర్ధానమగు అవకాశమున్నది. ముందు తరములవారికి పలువిధ వన్య ప్రాణుల గూర్చి తెలిసికొను అవకాశముండదు. తద్వారా విజ్ఞానము నశించి పోవుచున్నదేగాని ప్రజోపయోగము జరుగుటలేదు.

"కనుక నీవు పింజారికుల సంజాతుడవై పుట్టి మళ్ళీ నన్ను చేరగలవు. అప్పటికి నేను వృద్ధాప్యమున నుందును. అని చెప్పితిని." పీరూ ! ఆనందభైరవ యోగి ఎవరో అర్థమైనదా !- మీ సిద్ధయ్యయేనయ్యా ! తెలిసినదా ! ఈ బంధము ఈనాటిదిగాదు. మరి నీవంత సులభముగ మా బంధము త్రెంచ నెంచితివి. సాధ్యమైనదా ! సిద్ధుడు కారణజన్ముడు. ఇతనిని గూర్చి దుఃఖింపకుడు, క్లేశమును నీడుడు ఇతడు రానున్న కాలమున మహనీయుడగును. ప్రజలందరిచే ప్రశంశలందును. పూజింపబడును ప్రస్తుతింపబడును ధర్మసంస్థాపనా కార్యక్రమములలో నాకు చేదోడు వాదోడుగానుండి అఖండకీర్తి ప్రతిష్ఠల నార్జించి ఆచంద్రతారార్కము ప్రజా హృదయములలో ప్రకాశింపగలడు. దివ్యపురుషుడగును. గురు స్థానమలంకరించును."- అని వీర గురుడు చెప్పగా.

"హా! క్షమియ్యి గురుదేవ్! మూర్ఖత్వమునబడి మీకుచాల శ్రమకల్గించినాను. మీపట్ల అపచారము చేసినాను మన్నించి క్షమింపుడు. గురుదేవ్"—అని "ఒక చిన్న విన్నపము "—అన్నాడు పీరు.

"చెప్పు"—అనినాడు వీర గురుడు.

"లేక లేక కలిగిన ఒక్కగానొక్క కొడుకుగదా! కారణజన్ముడే.—కాదనను. కాని మేమునూ వృద్ధులమగుచుంటిమి. వాడివ్యర్థముగ సన్యాసి అయిపోయిన మాగతేమి కావలయును. అదియే మా బాధ. మాకింక దిక్కెవరు?"—అని పీరుసాహెబు కంటనీరు పెట్టినాడు....

"దిగులు చెందకు. నీవనుకున్నట్లు నీ కొడుకు సన్యాసి అవడు. నేను సన్యాసిని కాదు గదా! నా శిష్యుని ఎట్లు సన్యాసిని చేయుదును నేను గృహస్థుడను. రాజయోగిని. అతడునూ గృహస్థుడు కాగలడు సంతానవతుడగును. నీ వంశము నిలువబడును విచారించకు"— అనినాడు శ్రీ గురుడు.

ఆమాటలు ఆ భార్యాభర్తల నెంతయో సంతోషపరచినవి. "సిద్ధయ్య గృహస్థుడగును. బిడ్డల కనును"—అనుకొనిన వారి ఆనందమునకు మేరలేదు.

అదంబీ పీరుసాహెబులు వీరబ్రహ్మ గురువికి క్షమాపణలు, ప్రణామము లర్పించి "సిద్దయ్యా! ఏదో పుత్రవ్యామోహమునబడి నీ వెక్కడ మాకు దక్కకుండ పోదువోయను భయముతో, బాధతో నిన్ను కొట్టితిని, తిట్టితిని, దూషించితిని, దుర్భాషలాడితిని, అవమానపరచితిని. అవన్ని మనసున పెట్టుకొనకు. ఎంతైనను నిన్ను కన్నతండ్రిని. క్షమాపణ చెప్పుటలేదు. క్షమించు" అనినాడు పీరు....

"బాబా—!"—అని సిద్దయ్య తండ్రిపాదాలపై వ్రాలి "అంత మాటనకండి అబ్బా జాన్! బిడ్డెప్పుడూ బిడ్డడే. నన్ను దీవించండి."— అని తల్లికి కూడ నమస్కరించినాడు.

"భగవాన్ భలాయీకరే!"—అని ఆశీర్వదించి వీరగురువు శెలవు కోరినారు.

వారిని ఒక వారము రోజులు యింటనుంచుకొని, వారికన్నియూ సౌకర్యముల నేర్పించి, దిగులును పోకార్చి. సంతోషము కలుగచేసి తరువాత వారు ముడుమాల బయలుదేరుటకు శ్రీ గురుడు అనుమతి నిచ్చినాడు.

గోవిందమాంబ వారికి పండ్లు, పూలు, ప్రసాదము, బియ్యము, కూరగాయలు గుడ్డలు యిచ్చి "వెళ్ళిరండి"—అప్పుడప్పుడూ వచ్చి బిడ్డను చూచుకొని వెళ్ళండి. మీ అబ్బాయి మా అబ్బాయియేకాని వేరుగాదు. నిశ్చింతగా నిర్మల మనస్సుతో వెళ్ళిరండి. శుభం చేకూరుతుంది."—అని చెప్పినది.

## సిద్ధయోగి ప్రసిద్ధ భారతం

### -: ఇరువది రెండవ భాగం :-

ఆదీ ఆనాటి సుప్రభాత సమయం. సిద్ధయ్య శ్రీగురుని సుప్రభాతము తనకు వచ్చిన భాషలో ఆనందముగ గానముచేసినాడు శ్రీగురుడు అతని భక్తి పారవశ్యమునకు ముగ్ధుడై అతనిని దగ్గరగా తీసికొని తలనిమిరి" సిద్దా! నేననిన ఎందుకురా నీ కంత భక్తి – అనినాడు.

"గురుదేవులకు ప్రణామములు"—అనినాడు సిద్ధుడు.

సిద్ధయ్య కంఠమాధుర్యమునకు శ్రీగురుడు ఆనందపడినాడు. శ్రీగురుడు సుప్రశాంత వదనారవిందుడై....ఆనందుడై....వీరుడై....గంభీరుడై.....సర్వలోకములను తన మనో నేత్రమున దర్శించుచున్నటుల అర్ధనిమీలిత నేత్రజ్యోతి ప్రభా భాసితుడై పద్మాసనాసీనుడై, ప్రచండ తేజోభాస్కరుడై, వసుడై, విభావసుడై ప్రకాశించుచున్న శ్రీగురుని ముందు కరములు జోడించి, శిరస్సువంచి, నమస్కరించి సిద్ధుడు ఉపవిష్టుడయినాడు.

"ఉత్తిష్ఠత! జాగ్రత - ప్రాప్యవరాన్ నిబోధిత !<br>
క్షురస్యధారా నిశితా దురత్యయా! దుర్గంపథస్తత్<br>
కవయో వదంతి॥. —కఠోపనిషత్తు : 3 : 4•

"లేవండి! మేల్కొనుడు. ఎన్ని నాళ్ళీనిదుర. అజ్ఞానపు నిద్రనుండి లెండు. అజ్ఞానము ప్రసాదించు తాత్కాలిక సుఖములకు తలవొంచి, అదియే పరమ పదమని భావించి అసలైన జ్ఞానమార్గమును విస్మరించి యున్నారు. అయ్యో! మూఢాత్ములారా! ఇకనైనను కన్నులు తెరవండి. శ్రేష్ఠులైన ఆచార్యులను, గురువులను, యోగులను ఆశ్రయించి ఆత్మను సాక్షాత్కారము చేసికొనుడు ఆత్మజ్ఞానము బడయుడు ఆ మార్గము అంత సులభమైనదియూ కాదు ఎంతయో కృషిచేయవలె, జీవిత కాలము చాల స్వల్పము. ఉన్న ఈ స్వల్పకాలమును ఈ అజ్ఞానపు నిద్రలో గడిపిన, వచ్చు జన్మము కూడ చింతల పాలేయగును. ప్రజలారా! అజ్ఞాన మార్గము కత్తి మొనవాదరవలే అతితీక్ష్ణమైనది. దాని ననుసరించి వెడలుట ప్రయాసతో కూడినది!— అయిననూ తప్పదు. ప్రయాసయని మానుకొనిన ఎన్ని జన్మములెత్తినను ఇంతియేగదా! ఇప్పుడు ప్రయాస పడిన ముమ్ముందు ఫలితము లభించగలదు. మోక్షసాధన సులభసాధ్యము కాగలదు.

శ్రవణాయాపి బహుభిర్యోనలభ్యః
శృణ్వంతోఽపి బహవో యంన విదుః
ఆశ్చర్యో వక్తా కుశలోఽస్యలబ్ధా ఽఽ
శ్చర్యోజ్ఞాతా కుశలాను శిష్టః ॥.

కఠోపనిషత్తు 2 : 7

ఆలోచించి చూచిన ఆత్మ జ్ఞానమును గూర్చి వినుటకు కూడ ఎంతో మందికి సాధ్యపడదు సాధ్యపడి వినినప్పటికీ దానిని గ్రహించగలిగిన వారు ఏ ఒక్కరో వుందురుగాని ఎక్కువమంది వుండరు అది అంతటి కష్టతరమైనది. అసలా ఆత్మ జ్ఞానమును గురించి ఉపదేశించగల గురువు కూడ అద్భుతమైన వాడుగా నుండును. సమాజ మందతడు అతి సకృతుగా కన్పించు ఆత్మ జ్ఞాని. ఆయన శక్తి, స్వభావము గూడ నిజముగా ఆశ్చర్యకరమైనవిగా నుండును అటువంటి గురువులే సమాజమునకు జీవగర్రలు.

"అటులనే శిష్యుడును. అద్భుతమైన బుద్ధి తీక్షణత గలవాడుగా నుండవలయును. లేకున్న దానిని స్వీకరించలేడు. అటువంటి శిష్యులునూ అరుదుగనే యుందురు. సామాన్య మానవుల కంటె అతడు ఎంతో విశిష్టుగా నుండును. అవసరమైన అర్హతలు సాధన చతుష్టయము కలిగియుండి ఆత్మ విద్యకు తగిన వాడుగా నుండును. సమర్థుడైన ఆచార్యుడు ఉపదేశించగా దానిని గ్రహించగల శిష్యుడు గూడ నిజముగ అద్భుతమైన వాడే.

"సాధన చతుష్టయ మనిన

"1. నిత్యా నిత్య వస్తు వివేకము : ఏది శాశ్వతము. ఏది అశాశ్వతము. ఏది క్షణికము — అన్న వివేచన కలిగియుండుటయే నిత్యా నిత్యవస్తు వివేకము.

"2 ఇహాముత్ర ఫలభోగ విరాగము; ఈ జీవిత మందునూ, స్వర్గాది లోకముల యందును, అనుభవించగలుగు సుఖములపట్ల వైరాగ్యము కలిగియుండుటే ఇహాముత్ర ఫలభోగ విరాగము.

"3. శమాదమాది షట్క సంపత్తి : (i) మనో నిగ్రహము (ii) ఇంద్రియ నిగ్రహము (iii) ఆనందాన్వేషణనుండి విరమించుట (iv) సహనము

(v) శాంతి (vi) శ్రద్ధ—ఈ ఆరు గుణములు కలిగియుండుట శమదమాదీ షట్క సంపత్తి.

"4. ముముక్షుత్వము; మోక్షము సాధించవలెయుననెడి కోరిక. దానినినే ముము క్షత్వ మందురు.

"ఇంకొక్క విషయముచెప్పి యిది ముగింతును బాగుగాఅర్థముచేసికొనుడు.

"నరేణ అవరేణ ప్రోక్త ఏష
సువిజ్ఞేయో బరచదా చింత్య మానః।
అనన్య ప్రోక్తే గతిరత్ర నాస్త్య
ణియాన్ హ్యతర్క్య మణు ప్రమాణాత్॥1

-కఠోపనిషత్తు 2;8

"అసమర్థుడైన పురుషుడు బోధించితే ఈ ఆత్మ ఏనాటికీ బోధపడదు శిష్యుడు హించ లేడు. ఇచ్చట అసమర్థుడైన పురుషుడు అనిన, ఆత్మజ్ఞాని కానివాడు అని ము ఆత్మ యనిన యేమొ, ఆత్మజ్ఞాన మననేమొ తెలియనివాడు ఆత్మ గూర్చి చెప్పగలడు. బ్రహ్మ మననేమొ, బ్రహ్మ విద్య యనిన యేమొ, తెలియని కి 'బ్రహ్మ విద్యా నిధి, యని బిరుదు ప్రదానము చేసినట్లుండును. అతడు చెప్ప గునది శూన్యము. శిష్యుడు నేర్చుకొనినది శూన్యము తప్ప వేరుండదు. చెవు మంత్రము ఊదినంత మాత్రమున ఎవరునూ గురువులు కాలేరు. లేక దీక్షలు లంభింపచేసి, వ్రతములు చేయించినంత మాత్రమున గూడ గురువులు కాలేరు. వు తనకై తాను ఆత్మ జ్ఞానియై యుండవలయును. అప్పుడు శిష్యునకు ఆత్మ మును గూర్చి విశదీకరించగలడు శిష్యుడునూ గ్రహించ వీలగును.

"ప్రయత్న మాత్రమున ఆత్మ బోధ తెలియదు. అలవడదు. సమర్థుడైన దేవుని ద్వారా తప్ప ఆత్మ జ్ఞానము బడయుట మరెవరి వలనైననూ సాధ్య దు. వేషధారుల వలన ప్రయోజనముకన్న ప్రమాదమే ఎక్కువ.

"అసలు విషయమే సూక్ష్మాతి సూక్ష్మమైనది. మనసునకు అతీతమైనది. రాగాన అంతుబట్టనిది. తర్కానికి లొంగనిది.

"అందువలన సమర్థుడైన గురువు తప్ప ఆత్మ బోధ మరెవరివలనా సాధ్య దు. అందుకు గురువు అవసరము....."అని చెప్పి ఆనాటికి సభ చాలించినాడు

## సిద్ధయోగి ప్రసిద్ధ భారతం

—: ఇరువది మూడవ భాగం :—

ఆదంబీ పీరుసాహెబులు శ్రీ గురుని బోధలువిని మనసును మార్చుకొని సిద్దయ్యను శ్రీ గురుని కప్పగించి వెళ్ళి ప్రశాంత జీవనమున జీవించుచుండినప్పటికినీ, కొంత మంది మత దురహంకారులు, మత ఛాందసులు శ్రీ గురునిపై వైరము ప్రకటించి అతని నెట్టులైనను అపకీర్తి పాలుచేయతలంచిరి. ఎట్లులైనను సిద్దయ్యను వీరగురు నుండి వేరుచేయవలయుననియు, వీరగురునకపకారము చేయవలయునను దుస్సంకల్పముతో ఒకనాడు వీరందరూ కలసి కడపను పాలించు నాటి నవాబు సమీపమున కేతెంచి.

"జహాంపనా! మాదిముదమాల! అక్కడ సిద్దయ్య అను ముస్లిం బాలకుని ఒక హిందూ గురువు అతని మతములోనికి మార్చుకొనినాడు."

"ఎవరా హిందూ గురువు."

"వీరబ్రహ్మం. విశ్వకర్మ. ఈ బాలకునిన కేవేవో దుర్బోధలు చేసి మాయలు మంత్రములు చూపించి, తన వైపున కాకర్షించుకొనినాడు. జహాంపనా! కొడుకును తెచ్చుకొనుటకు తలి తండ్రులు బ్రహ్మం దగ్గరకు వెళ్ళిన. వారికినీ ఏవో మంత్రములు ప్రయోగము చేసి మనసు మార్చివేసినాడు."

"ఏమి!"

ఔను జహాంపనా! కాషాయాంబరములు గట్టించినాడు. ముఖముపై గంధాది తిలకములు దిద్దించినాడు. మెడలో రుద్రాక్షలు వేయించినాడు."

అప్పటికి నవాబు అగ్రహోదగ్రుడైనాడు. ముఖమంతయు ఎఱ్ఱని మందార పుష్పమువలె రక్తవర్ణ సంశోభితమై రౌద్రాకారముగ మారినది. పళ్ళు పటపట కొరికినాడు నవాబు,

"ఎంతటి అవమానము. ఎంతటి అప్రియత్వములగు మాటల వింటిని. ఈనాడెంతయో పాపపుదినము. ఒక ముస్లిము మతానువర్తనుడైన బాలుని ఒక విశ్వకర్మ బ్రహ్మము హైందవునిగ మార్చెనా? విడ్డూరముగ నున్నదే. ఎంతటి సాహసము. ఆయన నిప్పుడే ఆ గురు శిష్యుల పట్టి తెప్పించి, ఆ గురువుకు బుద్ధి సెప్పియా చిఱుతను మీ వెంట బంపుదునా!- యాద్‌రఖో! ఇతర మతంబులవారిని మన మతములోనికి దెచ్చి మన మతమునభివృద్ధి చేయవలయును గానీ, మన వారిని మాత్రము యితర మతములలోనికి పోనీయరాదు."— అని "ఎవరక్కడ"—అని చప్పట్లు చరచినాడు.

భటులు ఆయుధ పాణులై వచ్చి "జోహుకుమ్"- అనుచు వంగి నిలువ బడినాడు.

"వినుడు- మీరు వెంటనే కందిమల్లాయపురంబున కఱిగి. వీరబ్రహ్మము, అతని శిష్యుడు సిద్దయ్యను పట్టి తెండు. ఇదుగో ఫర్మానా వ్రాసి యిచ్చుచున్నాను. ఈ ఫర్మానా ఆగ్రామాధి-పతికి నింజూపి ఆతని సాయముగొని, వారినిద్దరనూ యిటకు కొని రండు."— అని ఫర్మానా వ్రాసి యిచ్చినాడు.

నవాబు కఠిన మనస్కునివలె కన్పించిననూ, ఫర్మానాను పరుష పదజాలముతో నింపలేదు. దూషణ భాషణలందు జొప్పించలేదు. భక్తి శ్రద్ధలు ప్రదర్శించుచునే వ్రాసినాడు.

భటులు తమ తమ గుఱ్ఱములపై బయలుదేరి కందిమల్లయపల్లె గ్రామాధికారి గృహంబున కుంజని నవాబు ఫర్మానాను వారికి అందచేసినారు.

గ్రామాధికారి ఆశ్చర్యము వ్యక్తము చేసినాడు.

"—ఏమిటీ వింత? యిది ఎంతటి సాహసము. పరమేశ్వరుని బంధించుటకు ప్రభువులు ఫర్మానా పంపుటయా! ఆశ్చర్యము. వీర బ్రహ్మమనిన వారు సామాన్య మానవుడని, పైగంబరుండని తలంచి యుండిరి కాబోలు. అల్లా అపరావతారమైన ఆది శంకరుడుగదా వీర గురుడు అట్టి వానిని బంధించుటయా! తప్పు! తప్పు!

"బాల్యమునందుననే పాపాఘ్ని పీఠమునందు దత్తు తల్లికి విశ్వరూపమును ప్రదర్శించి ఆమెకు ఆత్మజ్ఞానమును ప్రసాదించిన సాక్షాత్తు శ్రీకృష్ణమూర్తి ఈ వీర గురుమూర్తి. ఆల అనసూయలకు అనుంగు సూనుడై జన్మించిన ఆది గురుదేవుడు దత్తాత్రేయుడే ఈ విశ్వ విజ్ఞాన వీరగురుడు. బనగాని పల్లెలో గరిమిరెడ్డి అచ్చమ్మ కుమారుడు అంధుడు అనంద రెడ్డికి దృష్టి ప్రదానముచేసి, బ్రహ్మానందరెడ్డిగ నామ కరణముగావించిన పరమాత్ముడు వీరగురుడు.

"భటులారా! మీకిది చేటుకాలమునుమా! ఆమహాత్ముని పట్టుకొని బంధించుట సులభమను కొంటిరా! అతడు గనుక అలిగి శపించెనా నవాబు వంశము నిర్వంశమై పోవునే!—కనుక ఒకమాట చెప్పెదను. అవ్విధముగ ప్రవర్తింపుడు లేకున్న సర్వనాశము తప్పదు.

"మీరలు వీరగురుని దరిజేరి నమస్కృతులు సలిపి!—'ఓ! సద్గురూ! తమ చెంత సిద్దుడనెడి బాలుడుండెనట. ఆతనిని పాదుషా కొలువునకు గైకొని రమ్మని హుకుమ్ జారీ చేసినారు. కనుక తమరు అన్యథా తలంచక, అగ్రహమ్మును వహింపక, బాలుని మా వెంట నంపిన జాగ్రత్తగ తీసుకొని పోగలారము. లేకున్న మీరు పాదుషా హుకుమునకు సమాధానము వ్రాసి యిచ్చినను సంతోషమే'-అని చెప్పుడు.

"శ్రీ గురుడు కల్లలెరుగని కరుణామయుడు. ప్రేమమయిడు. తప్పులను క్షమించగల ధీరోదాత్తుడు. సదా మందస్మిత వదనార విందుడు. అప్పుడు-'సరియే' సిద్దుని గొంపొండు'—అని సెలవిచ్చెదరు. అప్పుడు మీరు సిద్దని గొంపొయి పాదుషాముందు నిలువబెట్టవచ్చును."—అని చెప్పినాడు.

"మరి బ్రహ్మముగారిని కూడ తీసికొని రమ్మనిరిగదా! పాదుషావారు"—అనినారు భటులు.

"అదియూ వారితోనే విన్నవింతము. అబద్దము శ్రీ గురుని ముందు పనిచేయదు ఇంత యేల? ఉన్నదుండినయట్లు వారికే ఎఱింగింతము. కానున్నది కాకమానదు వారు చెప్పినటు నడచుకొనుట అందరికినీ శ్రేయోదాయకము"

"సరిసరి!—అదీనూ బాగుగనే యున్నదీ. అయిన మీరునూ స్వాముల సన్నిధికి రండు. పోవుదము.

గ్రామాధికారి లేచి, వస్త్రములను ధరించి, తలపాగ చుట్టుకొని, చేత కట్టుపట్టు పెద్ద పెద్ద అడుగులు వేయుచు. భటులు వెంటరాగ తానునూ శ్రీ వీర ని సన్నిధికి వచ్చినారు.

ఆ సమయమున శ్రీ గురుడు సిద్ధయాది శిష్యులు పరివేష్ఠించి యుండ వారికి ్మచర్యాది విషయములను ప్రబోధము చేయుచున్నారు.

అప్పుడు గ్రామాధికారిలోని కరుదెంచి శ్రీ గురునికి సాష్టాంగ ప్రమాణంబు రించి, నవాబు పంపించిన ఫర్మానాను అందించినారు. శ్రీ గురుడు ఫర్మానాను య్య కందించినాడు.

సిద్ధయ్య ఫర్మానాను చదువుట ప్రారంభించినాడు.

"శ్రీ మత్కందిమల్లయ్య పుర మఠ సంస్థానాధ్యక్షులు, వేద వేదాంత మణి! సకలశాస్త్ర పురాణేతిహాస ప్రబంధజ్ఞాన చూడామణి! భక్త జనచింతామణి! ధారణ సమార్థ్యష్టాంగయోగ నిష్ఠా విజ్ఞాన సుధీమణి! కాలజ్ఞాన ప్రబంధవచనా న్మణి! సద్గురు పరంపరాద్యుమణి! సద్గుణమణి! సమస్త సద్గురులోక శిరోమణి! ములు.

"మీరు మహ్మదీయ మతస్థులను ఆహ్వానముచేసి, ఆకర్షణ చేసి, మాయలు, త్రములు చేసి, బలవంతముగ హిందూ మతమును వారి కంటగట్టి, మా ము మతమునకు తీరని ద్రోహము చేయుచుండినట్లు మాకు పిర్యాదులందినవి. నకు నిదర్శనముగ సిద్దుడను మహమ్మదీయ బాలుని ఇస్లాం మత సాంప్రదాయ కు విరుద్ధముగ, హిందువుగ మార్చి, అతనిచే కాషాయ వస్త్రములను, రుద్రాక్ష కల ధరింపచేసిరట. కనుక మీరు స్వయముగ వచ్చి, సమాధానము చెప్ప డియేగాక సిద్దయ్యను మాకు వెనువెంటనే అప్ప చెప్పక పోయిన కఠిన చర్య నవలసి వచ్చునని యిందుమూలముగ తెలియ చేయుచున్నాము."— అని సిద్దయ్య ఫర్మానాను గురు సన్నిధినుంచి ఊరకుండినాడు,

శ్రీ గురుడొక్క త్రుటి కాలమేమియూ మాట్లాడలేదు.

గ్రామాధికారి కంపించి పోవుచున్నాడు. శ్రీ గురుని కంఠమునుండి ఎటువంటి శాపాక్షరములు వినవలసి వచ్చునోయని, ఎటువంటి దుర్నిమిత్తములు రాబోవుచున్నవోయని, వికల మనస్కుడై. భయాందోళనలతో ఏమియూతోచక, ఏమియూ మాటాడలేక "సీదయ!"— అనినట్లు రెండు చేతులూ జోడించి శ్రీ గురుని కెదురుగా నిల్చినాడు.

శ్రీ గురుడు చిరుదరహాస చంద్రికల వెలయించుచు గ్రామాధికారివంక జూచి "భయంబుడుగుడు."- అనినాడు. సిద్ధుని వంకచూచి శిరఃకంపనము చేసినాడు. సిద్ధుడు గురుదేవుని నయన భాస్కరులలోనికి అంతర్వీక్షణచేసి సంకేతముల నర్థము చేసికొని, అదురు బెదురు లేక స్థిరసంకల్పుడై, సిద్ధసంకల్పుడై, ప్రశాంతచిత్తుడై, ప్రపుల్లవధనార విందుడై నిలువబడియుండినాడు.

"దేవా ! గురూత్తమా ! మా కడప నవాబు నుత్తర్వు మేఱకు మేమిట కేతెంచినాము. ఇందు నూదోసమినుమంతయూ లేదు. ముఖ్యముగా సిద్ధుని వెంట గొనిపోవుటయే మా ముఖ్యోద్దేశ్యము. మేమతనిని గొంపోయి నవాబుయెదుట నిలబెట్టకయున్న యెడల నవాబు మమ్ముల ప్రాణంబులతో మననీయడు. దేవా ! మీ మహిమలు మేము వినినాము. గ్రామాధికారియూ చెప్పినాడు. సిద్ధునిమా వెంట బంపినచో అదియే మాకు ఆనందము, లేకున్న అతడు గ్రామమునలేడనియూ, వచ్చిన పిదప పంపెదమని ఫర్మానాకు సమాధానము వ్రాసియిమ్ము. అది గొంపోయి నవాబున కందజేతుము. తమరు వీలునుబట్టి పాదుసాహిని సందర్శింతుమని సమాధాన పత్రమునందు పొందుపరపుడు."— అని ప్రాధేయ పూర్వకముగా భటులు అడిగినారు.

"భటులారా ! చూడుడు అదుగో సిద్ధమూర్తి, ప్రేమమూర్తి· కట్టెదుట నిలవబడియుండెగదా ! ఏ మాత్రము వికల మానసుడుగాక, కళవెళపడక, భయమ్మనునది లేక, ప్రశాంతచిత్తుడై ప్రకాశించుట మీకు కన్పించుటలేదా ! అట్టితరి లేడని నేనెట్లు అబద్ధమాడగలను ? అది మహాపాపముగదా !

"సిద్ధా ! నీవేమనెదవు."- అనినాడు గురుదేవుడు.

"గురుదేవా! తమ ఆజ్ఞ, మత దురహంకారమున పరమాత్మ నెఱుగుటకు బదులు ఈ పాలకులు నియంతలై నియమోల్లంఘనముల చేయుచు మెలంగు చుండిరి. పరమేశ్వరునిపై మనసులగ్నముచేసి పరమపదము చేరుట మతధర్మమై యుండవలయునుగానీ! కేవలము మత ప్రచారము అల్లాకు సంతృప్తి కలిగించునా! అల్లా అందరివాడుగానీ కేవలము ముస్లిములకు మాత్రమేకాదుగదా! అభియోగము నకు కారణము నేనుగానీ, మీరుగాదుగదా! గురుదేవా! నేనే స్వయముగ నవాబును దర్శించి, సంజాయిషి యిచ్చి సమాధాన పరచి. సంతృప్తిపరచి, తిరిగి వత్తును."- అనినాడు సిద్దయ్య.

"అభీష్ట సిద్ధిరస్తు. విజయోస్తు. శిష్యలోక ప్రసిద్ధా! నా ప్రియసిద్ధా! తప్పక వెడలి రమ్ము విజయలక్ష్మి నిన్ను వెన్నంటియున్నది భయమన్నదీ నీ జోలికిరాదు. విజయుడవై మరలిరమ్ము."- అని ఆశీర్వదించినాడు శ్రీ గురుడు

సిద్ధుడమితానంద భరితుడైనాడు. "ఆహా! ఎన్నినాళ్ళకు అస్మద్గురు దేవులు నన్ను "నా ప్రియసిద్ధా"-యని సంబోధించిరి. ఎన్ని నాళ్ళకు నాకొక ముఖ్య కార్యము నెరవేర్చుభారము నొసగిరి. జై! వీరబ్రహ్మగురు మహరాజ్!"— అని శ్రీ గురుని చరణ సన్నిధియందుచేరి "వీరగురురాట్ సార్వభౌమా! అస్మద్గురు దేవుల నాజ్ఞనౌదల దాల్చి నెరవేర్చుటకన్న నాకు వేరొండు భాగ్యము గలదా! దేవా మీ దివ్యచరణ ద్వయంబిచట కొంచెము ముందుకు చాచుడు. స్పృశించి, నమస్కరించి, భటుల వెంటనేగి కడువేగముగ తిరిగివచ్చెదను.

"పువ్వులు పాదమందునిచ్చి, ముందుగ శీర్షమువంచి మ్రొక్కెదన్
చివ్వున చేయిజాచి తమచేతిని నాశిరమందు నుంచగా
నవ్వు ముఖంబుతోడ తమ నామము కీర్తన చేయుచుందు- నో
మువ్వుర మూర్తులన్ మిగుల మోదము బొందిన వీరసద్గురూ!

- బనగాని పల్లెలో పరిసరాటవులందు, చేతగఱ్ఱనూని, గోపాల వేషంబు ధరించి, గోవుల పాలించిన బాలబ్రహ్మస్వామి పాదమిదియేగదా! ప్రాజ్ఞులెల్లరు ప్రశంశింపగ కాలజ్ఞాన గ్రంథంబు రచించి వాసికెక్కిన దివ్యజ్ఞాన భాస్కరుని పాదము లివ్వియేగదా! గుణవతీ తిలకము. సాక్షాత్పార్వతీ యవతారమూర్తియగు

గోవిందమాంబ గళమున మంగళ సూత్రము ముడివేసిన దివ్యహస్తదారుడైన శ్రీ మహేశ్వరావతారుడైన వీరగురుపాద పంకజములివ్వియేగదా! పోలేరమ్మచే నిప్పుతెప్పించి గ్రామ ప్రజల యజ్ఞాన చీకటుల పాత్రోలిన స్వామి పద పంకేరుహము లివ్వియేగదా! అట్టి నీదివ్యపాద పద్మములందు నాశిరస్సునుంచి ప్రార్థించు చున్నాను. దీవించి కారణ మొసంగుదునని అభయంబునీయుము. దివ్యగుణ సాంద్రా! శ్రీవీరదేశి కేంద్రా!"—అని పదములయందు సాష్టాంగ నమస్కృతుల గ్గురునకు సమర్పింప శ్రీగురుడును ఆనంద తుందిల హృదయారవిందుడై చిరుదరహాస శోభితాననుడై సిద్దప్పను లేవదీసి హృదయమున కత్తుకొని "సిద్ధా! నాయనా! ఎన్ని చిక్కులెదురగుచున్ననూ వాటన్నిటినీ లెక్కకు రానీయకు "కారణ" మను మాటను మరపుకు రానీయవుగదా! జగత్తులో నీవునూ కారణజన్ముడవే. అట్టి నీకు 'ఉపదేశ' మీయక ఎట్లుండగలనయ్యా! నా కోసము నీవు, నీ కోసము నేనూ- మనమిద్దర మొకరికొకర మొకరము జన్మించితిమి. అట్టి శిరి "కారణము" నీకు కాక యింకెరికిత్తును.

"కడప నగరమునకుం జని, నవాబునుం గలసి, తిరిగివచ్చిన పిదప నీవడుగకయే 'కారణము' నిచ్చెదను సందేహింపకు ఇపుడు నీవడుగకుండగనే నీలో నా మహిమను ప్రవేశింప చేయుచున్నాను. శిష్యవరా! నీవు పాదుషాను చేరి నపుడు నీకు విజయమగునుగాక! సందియములేదు. మహిమ నిచ్చితి గొనిపొమ్ము. మరలిరమ్ము!"— అని సిద్ధునిపై యోగదృష్టిని ప్రసరించి నాడు శ్రీగురుడు అప్పటికే సిద్ధునిలో ఏవేవో వింతధ్వనులు మ్రోగసాగినది. అంతరంగము నందే వియో దివ్య సందేశములు విన్పించుచున్నవి. శరీరమంతయూ దివ్యకాంతులతో ప్రకాశించుచున్నది.

శ్రీ గురుడు సిద్ధుని దగ్గరగా చేర్చుకొని శిరస్సుదువ్వి, హస్తమస్తక సంయోగ మాచరించి దీవించినాడు శ్రీగురుడు ప్రసారంచేసిన దివ్యశక్తి దేదీప్యమైన కాంతులతో, భగ్గుమని మండుచున్న కాంతిగోళమువలె ఒక్కసారి అక్కడ ప్రాదుర్భవమై క్రమముగ సిద్ధునిలో అంతర్లీనమైనది. దివ్యశక్తిని గ్రహించినాడు సిద్ధుడు.

18)

చూచువారల కదేమియో తోచలేదు. అయోమయమున బడినయట్లైనది. కన్నులు మిరుమిట్లుగొల్పినవి. మూతలు పడినవి. అక్కడ ఏమి జరుగుచున్నదో వారికి తెలియని అచేతన స్థితికి వెడలినారు.

కొంత సేపటికి కళ్ళు తెరచిచూడ—సిద్ధుడు. 'గురుమహాదేవా! కడుం గడు దయతో నీవొసంగిన దివ్య మాహాత్మ్యంబు నాలో ప్రవేశించినది. నేనిప్పు డెంతయో దివ్యానుభూతి ననుభవించుచున్నాను. నాలోని అణువణువు గురునామము నుచ్చరించుచున్నది. కాని గురుదేవా! చిన్నసందియము. అడుగమందురా!'— అనినాడు సిద్ధుడు.

"సందియమా! సదసద్వివేక ప్రజ్ఞా ప్రసిద్ధా! సిద్ధా! నీకు యింకనూ సందియమా! అడుగుము. అందుకింత అలస్యమేల ?'- అనినాడు శ్రీగురుడు.

"దేవా! నీవిడినట్టి ఈ దివ్యమహిమాధిక్యంబు నాలో గర్వము నుదయింప చేయునేమోయని సందియమూ, భయము కలుగుచున్నది. ఎంతైననూ మానవుడనుకదా! నా విజ్ఞాన మనోజ్ఞ మార్గమునకు అది అటంకమును కలుగసేయుటయే గాక కంటక ప్రాయమగును. గర్వాంధకారంబునంబడితినా, యింకనేనధః పాతాళంబునబడి సర్వనాశనమై పోదును. అందుచే కదపకుంజని విజేతనై తిరిగి వచ్చిన వెంటనే ఈ దివ్య మహిమను మీరే పునఃగ్రహించవలయును. పరిపూర్ణునిగ నేను భాసిల్లినపుడు మాత్రమే యీ మహిమ నెనరున నిడగా వలయును. అందులకు మీరు సమ్మతించినగాని నేనడుగు కదపను."— అనినాడు సిద్ధుడు వినమ్రుడై.

"అవశ్యము సిద్ధా! నీకీర్తి దిగంతములకు ప్రాకగలదు. వీరబ్రహ్మకీర్తి ప్రపంచ మందెంత కాలముండునో అంత కాలమూ నీకీర్తి చంద్రికలు విస్తరిల్లుచుండును. వెలుగు నీదలవలె మనమిరువురము ప్రపంచమున ప్రబోధము చేయవలసియున్నది. వెఱపందవలదు. వెళ్ళిరమ్ము. విజయోస్తు - అనినాడు వీరగురువు.

— —

## సిద్ధయోగి ప్రసిద్ధ భారతం

### -: ఇరువది నాల్గవ భాగం :-

"ఓరీ ! మూర్ఖా ! మహమ్మదీయ మతమందు జన్మించి, ఆ హైందవ గురువైన విశ్వకర్మను జేరి మత సాంప్రదాయమునకు మచ్చతెచ్చితివి. మర్యాదగ యా భూతి తిలకంబులందీసి పారవైచి యా కాషాయరంగు వస్త్రముల విసర్జించి, ముస్లిం మత సాంప్రదాయ సిద్ధమైన దుస్తుల ధరించి జరిగిన దానికి క్షమింపుమని వేడికొనుము. లేదా ! నీకు కఠిన దండన విధించగలము."…. అనినాదు నవాబు కోపోద్రిక్త మానసుడై.

సిద్దయ్య అటులనే నిలువంబడినాడు. ఏమియూ మాటాడలేదు. నవాబును తీక్ష్ణముగా చూచుచుండెనేగాని, తలవంచి నమస్కరించలేదు. పల్లెత్తి మాటాడలేదు.

"ఏమట్లు చూచుచుంటివి? - పాదుషా ముందుతలవొంచి నమస్కరించవలయునుగాని, గుడము కొట్టిన గుండురాయి వలె ఏమట్లు నిలువబడియెదవు. సలాములొనరించక సభయందిట్లు నిలువబడుట మహాపరాధము. ఊం! వంగి నమస్కరింపుము."

అప్పటికినీ సిద్ధయ్య మారు పలుకలేదు.

"సిద్ధా ! నీవీవిధి మొండి తనంబు ప్రదర్శించితివేని భటులతో నిన్నుగొట్టించుటయేగాదు. ఖండఖండంబులుగా నీ శరీరము ఖండింపజేతును. కులమువారు లేరా ? గురువులు లేరా ? తలితండ్రులులేరా ? నీవెవ్వరికీ చెప్పక అన్యమతంబులోకి చనుట అపరాధము. అపచారము. కనుక తప్పు ఒప్పుకొని సలాములు సమర్పించి వేషము మార్చుకొని సంస్కరింపబడుము."

సిద్దయ్య నవ్వినాడు.

"ఏమా పరిహాసము. పాదుషా ఎదుట ఎటుల ప్రవర్తించవలయునో తెలియదా ? ఇదియేనా మీ హిందూగురువ్య నేర్పినవిద్య!"

"జహాఁపనా ! ఇచ్చట అస్మద్గురువుల విషయము అప్రస్తుతము. నీవు ప్రజా పాలకుడవు. ప్రజా రంజకుడవు. ప్రజలకు తండ్రివంటి వాడవు. అటువంటి నిన్ను దర్శించ ఇతర మతస్థులెవరైన యరుదెంచు సమయమున స్వమతస్థులకు చెప్పిరావలయునా ? జగజ్జనకుని దర్శించజనువేళ మాతా పితరులకు చెప్పివెళ్ళవలయునా ? అఖిల లోకేశ్వరుడైన అల్లాను అర్చించుటకు పెద్దలనుండి సమ్మతి కావలయునా ? ప్రపంచమునకే మిత్రుడు ఆప్తుడైన భగవంతుని పూజించుటకు, ప్రార్థించుటకు బంధు సంఘంబులకు చెప్పివెడలవలయునా ? గురుదేవుల చెంతకుజని, జ్ఞానభిక్ష నర్థించుటకు వెడలునప్పుడు కల్లబొల్లి మాటలుచెప్పి. జన ధన ధాన్యములు దోచుకుతిను కల్లగురువుల సమ్మతి అవసరమా జహాఁపనా ! వీరగురుడు దేవుడు. గురుదేవుడు. అట్టి దివ్యతేజో విరాజితుడైన సద్గురువును సేవించి తరించ వెడలుటకు నాకెవరి అనుమతియూ అవసరములేదు."....
అనినాడు సిద్ధయ్య.

నవాబు మాటాడలేదు.

"నేనేతప్పు చేయలేదు. ఎవరి సొమ్మూ దొంగిలించలేదు. అన్యతమాడ లేదు. ఎవరినీ దూషించలేదు. జ్ఞానార్జనాపిపాసతో సద్గురువును సందర్శించి అతని సేవలో ఆత్మజ్ఞాన సాధన చేయుచున్నాను. అందువలన నేనొకరికి క్షమాపణ చెప్పనవసరములేదు

"జ్ఞానసముపార్జన ప్రపంచమందు పుట్టిన ప్రతి మానవుని జన్మహక్కు. ఎవరికి తోచిన మార్గము వారనుసరించుదురు. భగవంతుడు ఏ ఒక్కరి సొంతమూ కాదు. అట్టి జ్ఞానసముపార్జనాతృష్ణను మతముతో, కులముతో ముడిపెట్టి అవరోధములు కల్పింపబూనుట అజ్ఞానము

"షహి-దల్లాహు-అన్నహూ-లాఇలాహ-ఇల్లా-హువ-
వల్-మలా-ఇకతు-వ-ఉలుల్-ఇల్మి-ఖాఇమమ్-బిల్-
ఖిస్తి-లాఇలాహ-ఇల్లా-హువల్-అజీజుల్-హకీమ్.॥

ఖురానెషరీఫ్ : 3 : 18.

—దేవుడు తప్ప పూజ్యుడు లేడు....అనుటకు దేవుడును. దేవదూతలును విద్యావంతులును సాక్షులు. అతడే న్యాయాధికారి. అతడు తప్ప వేరు దేవుడు లేడు. అతడు సర్వశక్తుడు. సర్వజ్ఞుడు. వివేచనా పరుడు.

-హే! రాజన్! యిందులో భగవంతుని యేకత్వమును నిరూపించబడి యున్నది గదా! దేవదూతలు, విద్యావంతులు దేవుడు ఒక్కడేయని యెఱిగి సాక్ష్యమిచ్చుచున్నారు. దేవదూతలు దేవుని ఉత్తరువులను శిరసావహించువారు. దేవుని ఆజ్ఞలకు విరుద్ధముగా వారెట్టి పరిస్థితులలోనూ పోరు. పోజాలరు. విద్యావంతులు ప్రతి కాలమునందును దేవుడు ఒక్కడే అని సప్రమాణముగ పలుకుచూ వచ్చినారు.

"అట్టి విద్యావంతులలో అస్మద్గురు దేవులు వీరబ్రహ్మేంద్ర స్వాములు ఒకరు. అందువలననే నేనతనిని గురుదేవునిగా స్వీకరించినాను. వారిద్వారా భగవద్దర్శనము చేయవలయుననెడి నా సంకల్పము దోషమెట్లగును ?"

"మరినీవేల హిందూ మతమును స్వీకరించితివి?"

"ఇచ్చట మతవిసర్జనము....మత స్వీకరణము అనుమాటల కవకాశమే లేదు. నా గురువు నామతమును గూర్చి ప్రశ్నించలేదు. నామతమును గూర్చి పట్టించుకొన లేదు. నన్ను మాత్రుమతమును విసర్జించ మనలేదు. హిందూ మతమును స్వీకరించమని చెప్పనూలేదు. వారిదీ ప్రేమ మతము. ఆ ప్రేమ నందుకొనుటకు మతముతో సంబంధములేదు. కుల ప్రసక్తి అంతకన్ననూలేదు. సత్య స్వరూపుడు నా గురుడు సత్యమార్గ మవలంభించుటకు మత ప్రమేయ మెందుకు రాజా!

"హే! ధరణీపతీ! ఇస్లామ్ అనగ 'విధేయత' యనిగదా అర్థము. అనగా సర్వము వినియోగించుట. దీనినే హిందువులు శరణాగతి అనుచున్నారు మానవులు దేవునియాజ్ఞకు విధేయులై తమ తమ సర్వవాంఛలను దేవుని యాజ్ఞకు లొంగినట్లు చేయుటయేగదా! లౌకికమైన వాంఛలు వదలి అలౌకికమైన పరమాత్మ సన్నిధిని వాంఛించుటయేగదా యిందు ప్రధానోద్దేశ్యము. దేవునికి అవిధేయులై యుండుటయేగదా ఇస్లాము. నేనిప్పుడు దేవునికి విధేయుడనేగాని అవి

ధేయుడను గానే!-ఏ మతమూ దేవునిపట్ల అవిధేయత ప్రదర్శించమని చెప్పదే!"—అని ఊరకుండినాడు సిద్దయ్య.

నవాబు మాటాడలేదు....

"మరొక్క విషయము మనవి సేతును. అన్యథాతలంపకుడు బాలుడను. నేనెఱింగిన విషయములను విన్నవించుచుంటినేగాని ప్రబోధము సేయుటగాదు.

"వలా-తసుబ్—ల్లజీన—యద్—ఊన-మిన్—
దూనిల్లాహి-ఫయ-సుబ్బుల్లాహ-అద్-వమ్-
బిగైరి-ఇల్మిన్-కజాలిక-జై-యన్నా-వికుల్లి-
ఉమ్మదిన్-అమలుహమ్-సుమ్మ-ఇలా-రబ్బిహిమ్-
మర్-జిఉహుమ్-ఫయనబ్బి-ఉహుమ్-బిమా-
కానూ-యఅ-మలూన్.

ఖురానెషరీఫ్ : 7 : 109.

"అవిశ్వాసులు దేవుని వదలి పూజించునట్టి యితర దైవములను మీరు దూషింపకుడు. ఎందుకన వారు అక్రమముగ బుద్ధి విహీనులై దేవుని దూషింతురు. అటులే ప్రతి జాతి వారికిని వారి వారి యాచారములు బాగుగా తోచునట్లు చేసితిమి. పిదప వారందరూ తమ ప్రభువునొద్ద చేరవలసి యున్నది. అపుడు ప్రభువు వారు చేయుచున్న కర్మల గూర్చి వారికి దెలుపును.

"అనగా!—దానినిట్లు వ్యాఖ్యానముచేయ వచ్చును. ముస్లిములు మత ప్రచారము చేయవచ్చును. అందు ఇతర మతస్థుల, మతసిద్ధాంతముల గూర్చి చర్చింపవచ్చును. కాని మత ప్రచారము చేయునపుడు ఇతర జాతుల వారు ఆరాధించు దేవతలనుగాని, వారి పెద్దలనుగాని దూషింపరాదు. అటుల గనుక ముసల్మానులు దూషించినట్లయిన ఇతర జాతులవారు దేవుని దూషించు ప్రమాద మున్నది. దానికి ముసల్మానులు బాధ్యత వహించవలసియుండును. కాబట్టి అట్లు దూషింపరాదు. ఎందుకన ప్రతిజాతి వారికినీ, వారి వారి యాచారములు ప్రియముగా నుండును. అవి మంచివి అని వారికి తోచును. కనుక అన్యద్గురు దేవుల దూరుట మంచిదిగాదు."—అనినాడు సిద్ధయ్య.

నవాబులో అంతర్మథనమే ప్రారంభమైనదో, అగ్రహమే రగుల్కొను చున్నదో తెలియుటలేదు. నవాబు కేవలము శ్రోతగా మిగిలి పోయినాడు.

"మేధినీనాథా"— మరల సిద్ధయ్యయే ప్రారంభము చేసినాడు. "నా మనవి వినుడు. ధరణీ విభునకైనను తారతమ్యము లున్నవి. నీవు కేవలము భూనాథుడ వైనంత మాత్రమున నన్ను మ్రొక్కుము, మ్రొక్కుము అనుచు బలవంతము చేయు చుంటివి. బలవంతముచేసి బడయు సత్కార, నమస్కారముల ఫలిత మందునా'—అది హృదయమునుండి రావలయునుగానీ!– బెదరించి గొను మర్యాదలు మర్యాదలుగావు."

"అయిన నీవు నాకు నమస్కరించవన్న మాటేగదా!"

"కువలయేశ్వరా! మీరు అంతగా బలవంతముచేసి, నాచేత నమస్కారములు బడయ వలయునన్న అటులనే సేతును. కాని తరువాత సంభవింపబోవు పరి ణామములకు నేను బాధ్యుడను కాను."

"అనిన"

"నా నమస్కార ప్రభావము చాల తీవ్రపరిణామములు కల్గించును. నా హృదయ పూర్వక నమస్కారము గ్రహింపశక్తి అస్మద్గురువరునకు తప్ప అన్యు లకు లేదు. చేతులెత్తి నమస్కరింతునేని హృదయము వ్రయ్యలగును. నమస్కార గ్రహీత నేలకూలును. నా వందన మంతటి వరప్రభావ సముజ్వలమై పాశుపతా స్త్రమువలె ప్రాణహరణ శక్తి కలిగియుండును. అందువలన నేనందరికీ నమస్క రింపను. కావలయునన్న నమస్కరింతును. తదుపరి మీ యిష్టము.

"మరియొక సంగతి విన్నవించెద. వివేకముతో ఆలోచింపుడు నా గురు దేవుని ఆహార్య మెటులుండునో నా యాహార్యమునూ అటులనే యుండును. గురువునే శిష్యుడు అనుకరించును. అనుసరించునుగానీ అన్యులనెట్లనుకరించును. అందుకు నీవు నన్ను చెండించిననూ, దండించిననూ, ఖండించిననూ నాప్రవర్తనలో మార్పురాదు.

"విశ్వ విజ్ఞాన వీరగురు దివ్యపాదార విందములను నమ్మి సేవించునట్టి నాకు భీతి అనునది కలుగదు. కనుక నా నిర్ణయములో ఎట్టి మార్పునూ రాదు."—

అని ఘంటా పదముగ బిల్లిగ్రుద్ది పలుకుచున్న సిద్దయ్య ధైర్యసాహస వినయ పూర్వక మాటలకు పాదుషా ఆశ్చర్య చకితుడైనాడు.... లోలోన ఆనందించినాడు

వెంటనే తేరుకొని "ఏమాయహంకారము. పాదుషా ముందు ప్రవర్తించ వలసిన, ప్రసంగించవలసిన పద్ధతి ఇదియేనా ? భటులారా ! ఈ పాలసుడు దండ నంబునగాక సద్భాషణముల వినడు. మతమునువీడి మనదారికి వత్తునని చెప్పు వరకు ఇతనిని కొరడాలతో కొట్టుడు."- అని ఆజ్ఞాపించినాడు.

సిద్ధయ్య అతని ఆజ్ఞను విని ఏ మాత్రమూ తొట్రుపడలేదు. భయపడలేదు. కంగారుపడలేదు. "జై! శ్రీ వీరబ్రహ్మగురుదేవా !" యని మాత్రము నిన దించినాడు

అప్పుడు సిద్దయ్యపై ఫిర్యాదులొసగిన ముల్లాలలో ఒకరు సిద్దయ్యకు దగ్గ రగావచ్చి 'బేటా! వీరేశుని మతము విడిచిపెట్టెదను. కరుణించి నన్ను వదలి పెట్టుడు. అని భూవరునకు మ్రొక్కి మన్నించమని వేడుకొనుము. లేకున్న ఈ భటులు నిన్ను ప్రాణములతో విడువరు. నా మాటలు వినుము. అనవసరముగ నిండు ప్రాణముల బలిపెట్టకుము. నీ తలితండ్రులు దుఃఖార్తులయ్యెదరు. దిక్కు లేని వారయ్యెదరు "— అనినాడు.

"హూఁ! భాయీసాబ్ ! వీరేశునికి ప్రత్యేకమైన మతములేదు. అట్టితరి వీరేశుని మతమును వదలి పెట్టుమనుట అసందర్భము. గురుదేవులు హిందూ మతమునందుద్భవించిననూ సర్వమతములను గౌరవించుటయే వారి మతము. సర్వ జనులను ప్రేమించుటయే వారిమతము. 'సబ్‌కా మాలిక్ ఏక్' అన్నదే వారి నినా దము- కనుక వారికొక ప్రత్యేకమతము నంటగట్టకుడు.

"భాయీసాబ్ ! కొట్టినవారికి మరల కొట్లు, తిట్టినవారికి మరలతిట్లుకలుగును. మంచికి మంచి, చెడ్డకు చెడ్డ ఫలితములనుభవించక తప్పదు. తెలిసి తెలిసి నేనే యపరాధమూ చేయలేదు. ఎవరికీ నేను అపకారము చేయలేదు. ధర్మ మార్గమును విడనాడలేదు. నేను ఎట్టి పరిస్థితులలోనూ శిక్షార్హుడనుగాను నా గురుపాద, నామ స్మరణములే నాకు రక్ష. జై ! శ్రీ వీరబ్రహ్మగురుదేవా !'.... అని మరొక్క సారి గట్టిగా నినదించినాడు సిద్దయ్య.

"అరే ! సిద్దయ్యాసాబ్ ! నవాబుకు సలాంచేసి క్షమాపణ చెప్పుకోభాయ్! ఎందుకు అన్యాయంగా చచ్చిపోతావు."- అన్నాడు భటులలో ఒకడు.

"దాన్నిబట్టి నేను చచ్చిపోవుటనునది అన్యాయమను సంగతి వీరందరెరిగిన విషయమేనని స్పష్టమగుచున్నది. పాదుషా నన్ను వట్టిపుణ్యమునకే శిక్షించు చుండెనని అందరికీ తెలిసినదన్న మాటయేగదా ! ఇంక అలస్యమేల ? మీరు రాజాజ్ఞకు బద్ధులు. మీ విధి మీరు నిర్వర్తింపుడు."- అనినాడు సిద్దయ్య.

భటులు కొరడాలు పైకెత్తినారు.

"జై ! శ్రీ వీరబ్రహ్మగురుదేవా !"— అని నినదించి రెండుచేతులెత్తి నమస్కరించుచూ అట్టులే నిలువబడినాడు. అంతియే పైకిలేచిన కొరడాలు లేచినట్లే నిలువబడిపోయెను. భటుల ఒడలంతయూ మంటలతో బాధలు ప్రారంభములైనవి. క్రిందపడి దొర్లుట ప్రారంభించినారు.

"మహరాజ్ ! ఇతన్ని మేము కొట్టజాలము. కొట్టకుండగనే మా శరీరమంతయు మంటలు మండుచున్నవి. కొట్టిన యింకఎట్టి బాధలు భరింపవలసి వచ్చునో ఎవ్వరెరుగుదురు."— అని ప్రక్కకు తప్పుకొనినారు. ఒంటిపైపడ్డ వాతల చూచుకొనుచు.

నవాబు ఆశ్చర్యచకితుడైనాడు. "సిద్దయ్య మాంత్రికుడై యుండవలయును. లేదా ఈ భటులాతని వద్ద లంచంబు గ్రహించి దాని మధ్యమున ఓషధీ ప్రక్రియలచే యీవాతలను నిర్మించుకొని వచ్చి చూపుచున్నారు. కాని వేరొండుకాదు. అదే నిజముగ అతని మహిమమైన నేనే కొట్టుదును. అప్పుడు నాకునూ మంటలెక్క వలయునుగదా."— యని తలచి కొరడా తనచేత ధరించి ఒక్కొక్క అడుగే వేయుచు, భీకర స్వరూపమున, క్రోధారుణ నేత్రుడై ముందుకు వచ్చుచున్నాడు. కాని వెంటనే అతనికి మరొక ఆలోచన పొడసూపినది. ఒకవేళ ఆ దెబ్బలు నిజముగ నన్ను తాకిన నేనునూ వారివలె పెడబొబ్బలుపెట్టి క్రిందపడి దొర్లిన నలుగురముందు నగుబాటులగుదు. పది మంది ముందు పరిహాస భాజనుడనగుదును. మరియొక విధంబున నిజంబును గాబట్టుట మంచిది."— అని యెంచి చేతనున్న

కొరడా విసరుగ నేలపై వైచి.... కోపమును తగ్గించుకొని, లేని నగవును తెచ్చి పెట్టుకొనెను.

“సిద్దయ్యా ! వీరిద్దరికి ఎంతెంత ధనము లంచముగా నిచ్చితివి అట్టిదానితో మార్గమధ్యమున ఈ వాతల గీతలు శరీరములపై నలదుకొని వచ్చి నాటక మాడు చుండిరి.”- అని “సిద్దా ! వీరగుపుడు దక్క అన్యులెవరూ నీ నమస్కారప్రహార మును భరించ లేరనిగదా పల్కితివి. అట్లుకాదని నమస్కారంబులు పొందినగుండె పగిలి చచ్చుదురంటివి గదా!”

“అవును. అందుకు సందియమేమి ?- నీకు నమస్కరింపుమందువా ! చెప్పుము. ఇప్పుడే నమస్కరించెదను తరువాత నీవు గుండె పగిలి క్రిందపడిన నాకెట్టి బాధ్యతయునూ యుండదు”— అని సిద్దయ్య నమస్కరించినట్లు నటించ బోవ “ఆగు ! ఎందులకా తొందర. ఊరి బయట విశాలమైనానంబున ఒకగుండు రాతి బండ నేర్పాటు చేసెదను. దానికి మ్రొక్కి వక్కలౌతీరునఁ జేయఁగలవుగదా! తెల్పుము నీమహిమను నేనేగాక, సర్వజనులూ చూచి తరించెదరు. నీ తలమ వారే ఖండించెదరు అప్పుడు నీ శరీరమును కాక ఘూకములకు విందొనర్చెదను”- అనినాడు పాదుసాహి.

“క్షితితలాధీశా ! నన్ను పరీక్షించుటయే నీ అభిమతంబైన అటులేకానిండు నీ యిష్టమైన బండరాతిని తెప్పింపుడు దానికి మ్రొక్కెదను అస్మద్గురు మహిమ ప్రదర్శింపబడును.”— అనినాడు సిద్దయ్య.

వెంటనే భటులను పంపి పెద్ద బండరాతి నొకదానిని బండ్లపై కెక్కించి విశాలమైనానమునకు తెచ్చిరి. ఈ విషయమప్పుడే పురప్రజలకు పాకిపోయినది జనంబులు తండోపతండములుగా యీ చిత్రము చూడవచ్చినారు.

పాదుసాహియు బండను చూచి “సెహబ్బాస్” అని ఆ సిద్దుని తోడ్కొని రండు. వాడి బండారమంతయు ఈ బండరాతితో బయట పడగలదు ”— అనినాడు.

అక్కడ క్రిక్కిరిసిన జనంబులా గుంటిని సమీపించి చూచుచుండ దర హాసిత వదనారవిందుడై సిద్దడు అచ్చట కేతెంచినాడు. ఎక్కడి సిద్దుడు. ఎక్కడి బండరాయి. బండరాతి పరిమాణముకో సగము గూడలేని సిద్దయ్య కేవలము దణ్ణముతో ఈ బండను ఏమిచేయగలుగును”- అని, అతని లేఁబ్రాయమును చూచిన

జనంబులు "అయ్యయ్యో! ఇంతటి సుందరవదనారవిందుడు, చిఱుతప్రాయమున నున్నవాడు, ఈపాటి వయసుననే యింతటి వైరాగ్యమున బడెనా! పడెనుపో! కష్టసమయమున ఆ వీరగురుని విడనాడి, పాదుసాహికి ప్రణామంబులొనర్చి, ప్రాణముల రక్షించుకొని, నిజనివాసంబున కఱుగక, పాదుసాహితో ఎందుల కింతటి పంతమునకు దిగినాడు ఎంతటి మూర్ఖత్వమున బడినాడు. పాదుసాహితో పంతము సామాన్యమా! భగవాన్! ఈ అబోధ బాలకుని రక్షించు భారమునీదే! అని వారు లోలోన భగవంతుని ప్రార్థించుట మొదలు పెట్టినారు.

మరికొందరు "వీడికి తలపొగరు లేకున్న పాదుసాహితో పంతమా! ఈయనగారి జోతలకు శిల పగులునో పగలవోగాని, ఇతని శిరము పగులుట మాత్రము తథ్యము."- అని అనుకొనిరి.

మరికొందరు- "ఏమాహాత్మ్యము లేకుండిన ఇంత ధైర్యముగ ఇంతమంది జనమధ్యమున పంతమునకు దిగునా! తప్పక అతడు విజయదుందుభి మ్రోగించ గలడు. పాదుసాహయే ప్రణామము సేయకతప్పదు" అనుకొనినారు.

సిద్ధయ్య మాత్రము నిదానముగ, నిర్మలమనస్కుడై, ఏ మాత్రము వికలము చెందక, అందోళనపడక, తన గురునామస్మరణము సేయుచు, మనసునందు గురుస్వరూపమును నింపుకొని గుంటిని సమీపించి.

తే॥గీ॥ అస్మదిష్ట గురుండు మహాత్ముఁడేని,
నేను తద్గురు సత్కృపాన్వితుడనేని?
మన్నమస్కృతి సోకిన మాత్రముననె,
కఠిన శిలనేడు వేయి వ్రక్కలగుఁగాక!

— సిద్ధయోగి చరిత్రము ; శ్రీ కాశీపత్యవధాని.

అని "శ్రీ వీరబ్రహ్మేంద్ర గురుసార్వ భౌమునికి జై!"—అని ఎలుగెత్తి జయజయధ్వానములు సేయుచు, యా గుంటి కొఱకు వందన మొనర్ప, ఏనుగ ఎత్తుగా నుండిన ఆ కఠిన పాషాణము పిడుగుబడినరీతి ఫెళఫెళార్భటములతో సహస్రశకలములైనది. అంతియేగాదు ఆ నిలి శిలాముఖములు దూర దూరములకు ఖిసరబడి కొంత మంది ప్రేక్షకులకు, రాజోద్యోగులకు తగిలి గాయములైనవి,

అసలా భయంకర శబ్దములకు. ఆవిర్భవించిన మెఱపులకు, భయపడిన జనంబులు దిక్కులుతోచక ఎవరికి తోచిన రీతి వారు పర్వులెత్తిరి. రాజభటులు, రాజోద్యోగులు సహితము, ఎవరికా శిలాఖండములు తగిలి ప్రాణములు పోవునోయని భయపడి దూరమునకు పరువులు పెట్టిరి.

ఆ శబ్దమునకు భూమిసహితము దద్దరిల్లి ధూళిదూసర యుక్తమైనది. ఆకసమున మేఘములు కమ్మినయట్లు ధూళిగుంపులు పైకి లేచి ఒకరి కొకరు కనబడక ఒకరి నొకరు గ్రుద్దుకొనుచు క్రిందపడిపోవు చుండిరి.

కొద్దిసేపటికి ధూళియంతయు వల్చబడి మామూలు వాతావరణ మేర్పడినది. సిద్ధయ్య అఖండరాయి ప్రక్కనే కనులు మూసికొని నమస్కారమిడుచు నిలువబడిమే యుండెను. పాదుసాహి దుమ్ముకొట్టుకొని, ఎవరూ గుర్తుపట్టుకు వీలుకాని రీతిలో, భార్యాబిడ్డల జాడ తెలియక, దిక్కుతోచక, కనులు నులుము కొనుచు భయవిహ్వలుడై--సిద్ధయ్యను చేరి.

"ఓ! మహాసీయా! నీమహిమను తెలియ జాలక మామూలు మంత్ర తంత్రములంజేయు, బాలకుడవనుకొంటిని గాని గురుభక్తి సమన్వితుడవై యింతటి బలవంతుడవని, మహిమోపేతుడవని, గుర్వారాధకుడవని తెలియక, నీపట్ల అపచారము గావించితిని. హే! బాలయోగీ! మిమ్ముల నెన్నియో విధముల తూలనాడితిని అహంకార మదమాత్సర్యములచేత నిన్ను లెక్కగొనక దూషించితిని. మీ గురు దేవుల నవహాస్యము చేసితిని పవిత్ర ఖురాను వాక్యముల నీవుప్రవచించుచు ప్రసంగించుచున్నను, అందలి సత్య సత్యములు గ్రహించక అహంకార మదమోహితుడనై నీపై కక్ష సాధించవలయుననెడి బలవంతమైన ఆకాంక్షకు తలయొగ్గి న్యాయా న్యాయముల నరకుగొనక నీపట్ల కఠినముగ ప్రవర్తించితిని. అమర్యాద చేసితిని. నేరము లెన్నక తప్పులు క్షమింపుము. నీవింత మాన్యుడవని, అసామాన్యుడవని నెఱుగక పోతిని. కఠిన పరీక్షల కెఱ చేసితిని. జడుడనై అపరాధముల చేసినాడను నన్ను మన్నింపుము."—అని పాదుషా సిద్ధయ్యకు పాదాక్రాంతుడై అపాదకమలములబట్టి వదలడాయె

"జహాంపనా! నీవిట్లు నన్ను పరీక్షలకు గురిసేయకున్న అస్మద్గురు మహాత్మ్యము ఎట్లు వెల్లడి కాగలదు నీ అనుమానమెట్లు రాహిత్యము కాగలదు.

అని "బిస్మిల్లా-హిర్రహ్- మా న్రిరహీమ్"—అని ఖురాను మంత్రముతో ముగించి నాడు సిద్దయ్య.

అంత పాదుసాహికి ఫిర్యాదు చేసిన ముల్లాలు, భయంబుతో సిద్దయ్యను చేరి నమస్కరించి "సిద్దయ్యా! సాబ్!" మాఫ్‌కీజియే! ఇదంతయూ మావలననే జరిగినది. జరిగిన దానికి మేము క్షమాపణలు చెప్పుకొనుచున్నాము. పాదుసాహిని అనుగ్రహించినట్లే మమ్మును గూడ అనుగ్రహింపుము. మా బంగారు తండ్రివి, మానోముల ఫలమవు. నీవింత మాన్యుడవని తెలియక, [1]. నస్రానీయుడవని పొరబడితిని. నీవు తప్పక [2]. సావిహీనుడవు [3]. సిద్ధిఖివి గాని వేరుగాదు అజ్ఞానులమై యిట్లు ప్రవర్తించితిమి."....అని ప్రాధేయపడిరి.

అంత నవాబు సిద్దయ్యను కన్న తలితండ్రులైన ఆదంబీ పీరుసాహెబులను రప్పించి, అభ్యంజన స్నానముల నేర్పాటు చేసిరి. సిద్ధమాన్యుని అర్ఘ్యపాద్యాదుల నతిభక్తి పూజించి, వారి వారి కిష్టమైన మధురాతి మధుర పదార్ధముల భుజింప చేసిరి. మూడు దినములు నవాబు వారి నచ్చటనే యుంచుకొని సిద్దయ్యద్వారా వీరగురు మహిమల చెప్పించుకొని విని ధన్యత గాంచెను. వీర గురు బోధిత కాలజ్ఞాన విశేషములను గూడ సిద్దయ్య నోట గానము సేయగా విని సంతసించినారు నాల్గవ నాడు నానావిధ వాయిద్యములతో సిద్దయ్యను మెరవిణి చేయనెంచి ఏనుగులు, అశ్వులు, రూకలు, బట్టములు, పసిడిపళ్ళెరమున వారి కొసకి "ఆదియె పల్లకి మెరవణి"—అధివసింపుము"— అన్న ప్రభువునిచూచి సిద్దయ్య "భూరమణా! నేనిప్పుడు యింతటి గౌరవమర్యాదల కర్హుడనుగాను. గురునాజ్ఞ లేక నేనిందు ఒక్కపైస యైనను తాకరాదు. ఈ గౌరవ మర్యాదలన్నియు అస్మద్గురుదేవులకే చెందవల యునుగాని నాకుకాదు. నేను నిమిత్తమాత్రుడను. జరిగినదంతయు గురుమహిమ తప్ప వేరుగాదు. కనుక యివేవియూ నాకవసరము లేదు ఎటుల వచ్చితినో అటులనే వెళ్ళుట, అటులనే నా గురు దేవుని చేరుట - అవశ్యము.

"పాదుసాహి! పాదచారినై మద్గురు సదనంబున కేగి మునుమార నా గురు పాదసేవ చేయు పదవి కన్న యివన్నియూ గొప్పగాదు. తృణప్రాయములు."—అని

1. నస్రానీయుడు=దుర్మార్గుడు. 2. సావిహీనుడు=సత్ప్రవర్తకుడు.
3. సిద్ధిఖి=సత్యవంతుడు

చెప్పగా పాదుసాహియు సంత సంబంధీ, పీరగురునకు సమర్పించుటకు ఉపాయ నంబుల నిచ్చి సిద్దయ్యను ప్రమాణము చేసినాడు. భటజనంబును వెంట పంపుచూ, తాను పాదచారియై కొంతదూర మేతెంచి, మహితాత్మా! కందిమల్లయ్యపురి కరుగ దెంచి. శ్రీగురుని దర్శింపవలయునని మనసువ్విళ్ళూరు చున్నది అందుకు మీరు సహకరించి గురుదర్శనము చేయించి నన్ను కృతార్థుని చేయవలయును." అని వేడి కొని, జోహారు లర్పించి దీవెనలు పొంది సెలవొంది నవాబు నిలువగా సిద్దయ్య నవాబునకు ఒక రుద్రాక్షమాల బహూకరించెను. నవాబు సంతోషంబున నారుద్రాక్ష మాలికను గ్రహించి కంఠసీమనలంకరింపచేసుకొనెను. తరువాత పరిజనంబుల తోడను, తల్లిదండ్రుల తోడను కందిమల్లయ్యపుర మేగినాడు సిద్దయ్య.

అప్పటికే సర్వమెఱింగిన శ్రీగురుడు సిద్దయ్యను హృదయమున కత్తుకొని ముఖమును ముద్దాడి. "భళా! భళా!" – యని మెచ్చుకొనినాడు. పరిజనంబులను, సిద్దయ్య తలి తండ్రులను కూడ చూచి బ్రహ్మము అమితానందమంది మరొక్కసారి సిద్దయ్యను తన పవిత్ర ప్రేమ పరిష్వంగమున బంధించినాడు.

"క్యాహై! పీరూ భాయ్! అబ్ క్యాబోల్ సక్తే! ఇపుడే మందువు. నీకుమా రుని కీర్తిప్రతిష్ఠల నిపుడు కనులార గాంచితివి గదా! నేను నీ కుమారు నేల గ్రహించి తినో యిప్పటికైనను సంపూర్తిగ అర్థమైన దనుకొందును. కారణము లేక కార్యము జరుగదు. నీ కుమారుడు లోకోత్తరుడగును. చింతింపకుడు, సకలాంధ్ర జనావళిచే పూజలందుకొని నీ కుమారుడు పరమ పురుషుడై భాసిల్లగలడు. కారణ జన్మలకు కావలసినది జన్మకారణముల నిర్వహించుటే గాని మతము, కులము యిత్యాదులు కాదు. సూర్య చంద్రులెట్లు సర్వజనులకూ సమానులో, అట్లే ఆధ్యాత్మిక తత్త్వ సంపన్నులును. అజ్ఞానాంధ కారమున బడి నీవు, నేను, నీది, నాది అను తార తమ్యములతో మనలను మనమే ద్వేషించుకొనుచున్నాము"-అని ప్రబోధము చేసి నాడు శ్రీగురుడు

సిద్దయ్య తల్లి ఒడిలో చేరిన బిడ్డలా శ్రీగురుని పాదముల చెంత ఒరిగిపోయి కడపలో జరిగిన సర్వవిషయమును వివరించి శ్రీగురుని పాదపద్మముల కనుల కద్దు కొని "గురు మహారాజ్! మీ అపార కరుణాకటాక్షవిశేషమున నవాబు తానున్న అజ్ఞానము నుండి బయల్వడి జ్ఞానాన్వేషణా మార్గమునకు మరల్చబడినాడు విజ యము సంప్రాప్తమైనది. స్వామీ! – మీదయ అపారము. మీ ప్రేమ అసమా

నము. అమోఘము అచింత్యము. అప్రతిహతము. అత్యంత పవిత్రము. అత్యంత ప్రతిభావంతము."—అని శ్రీగురుని స్తుతించినాడు సిద్దయ్య.

కడప నవాబు పంపించిన యుడగరములను తెచ్చి భృత్యులు వీరగురుని ముందల నుంచినారు. వీరగురుడు సంతసంబంది వచ్చిన పరిజనములకు, సిద్దయ్య తలి తండ్రులకు, ఇతర భక్త జనావళికి శిష్యజనములకు షడ్రసోపేతమైన భోజనముల నేర్పాటు చేసినాడు. అందరూ భోజనముల చేసి ఎంతయో సంతసించినారు.

సిద్దయ్య తలితండ్రులైన అదంబీ పీరుసాహెబులు శ్రీగురుని సమీపించి ముకుళిత కరకమలులై "వీరబ్రహ్మగురుదేవా! నీవే మాకు గురుడవు. దేవుడవు. మా నేరములను క్షమించి మమ్ముల కాపాడుము. దేవా! సిద్దయ్య పేరుకు మాత్రమే మాకు కుమారుడు కన్నది మేమే అయిననూ బిడ్డడు మీ వాడే! మీ సాన్నిధ్యమున, మీ పెంపకమున, బిడ్డడు ఎంతయో ఎదిగిపోయినాడు. ఐహికాముష్మిక సుఖంబు లీ సుతునకు అందజేసి అతనిని కృతార్థుని చేయుము. దేశ కళ్యాణమునకు నా బిడ్డను ఆయత్తము చేయుము. ఆధ్యాత్మిక వికాసముతో అజ్ఞానపు చీకటుల పోద్రోలు శక్తి సామర్థ్యముల ప్రసాదింపుము. సిద్దయ్యను ప్రసిద్ధునిగా చేయుము. సుప్రసిద్ధునిగా చేయుము"—అని చరణంబుల వ్రాలి భార్యాభర్తలు శ్రీగురుని దివ్యపాదారవిందముల నొదలకున్న సదయాంతరంగుడగు శ్రీగురుడు వారిద్దరినీ పైకి లేవనెత్తి.

"ఓ!- సయుశాలులారా! మనంబున శంకలు వీడి మీ నిజనివాసంబుల కేగుడు. మీ కుమారుడు నా కుమారుడే. అతడు సమర్థుడగును. ఆదర్శప్రాయుడై అశేషజనహృదయాంబుజములందు ఆ చంద్రతారార్కము అచీత్యుడై వెలుగొందును. అఖండ కీర్తి నార్జించును. పండిత పామర లోకమంతయు అతనిని కీర్తింతురు"—అని చెప్పగా, అదంబీ పీరుసాహెబులు మనశ్శాంతిని బొంది ఆనంద పరవశులై, ఒక్కసారి కుమారుని కౌగలించుకొని, ముద్దుల కురిపించి, శ్రీగురుడిచ్చిన తీర్థ ప్రసాదములు స్వీకరించి ముడుమాలకు బయలుదేరి.

గోవిందమాంబ అదంబిని అక్కున చేర్చుకొని, ప్రేమామృతము కురిపించి, ఆమెకు చీరయు, రవికలగుడ్డయు, ప్రసాదము నందించగా పుల కాంకితురాలైన అదంబి అమ్మ చరణారవిందములకు నమస్కరించి, వెనక్కు, వెనక్కు తిరిగి చూచుచూ....ముడుమాలకై ముందుకు నడిచిరి

## సిద్ధయోగి ప్రసిద్ధ భారతం

### —: ఇరువదైదవ భాగం :—

రోజులు గడచుచున్నవి. సిద్ధయ్య శ్రీ గురుని సేవలో నిమగ్నుడై సర్వవిధ సపర్యలను తానే స్వయముగ చేయుచుండినాడు శ్రీ గురుడు జపమునకు కూర్చుండ బోవునపుడు మృగాజిన మాలికాదులను తానే సిద్ధపరచుచుండెను. శ్రీ గురుడు ఎచట కూర్చుండినను మనోహరమగు రీతిన సురటి వీచి సుఖమును కలుగ జేయుచుండినాడు. శ్రీ గురుడు విశ్రాంతిగా విశ్రమించు సమయమున వెంటనే కూర్చొని పాదమ్ముల నొత్తుచుండెను. శ్రీ గురుడెచటకైన బయలుదేరిన సితచ్ఛత్రంబుపట్టి వెంటనేగును. అప్పుడిప్పుడని లేదు, అహర్నిశములు ఏ సమయము నందే సేవ చేయవలయునో అట్టి సమయోచిత సపర్యల నొనగూర్చి శ్రీ గురునకు అత్యంత ప్రీతి పాత్రుడగుటయేగాక ప్రేమ పాత్రుడుగూడనయ్యెను.

సిద్ధయ్య సంపూర్తిగా తనే ప్రతిసపర్యయు శ్రీ గురునికి చేయుచుండుట వలన అటు కొమాళ్ళకుగాని, పత్ని శ్రీమతి గోవిందమ్మకు గాని శ్రీ గురుని సేవలో సంపూర్తి విశ్రాంతి లభించినదనే చెప్పవలయును. శ్రీ గురుని కొమాళ్ళలో ఇది కొంత ఆలోచన, అసంతృప్తి రేకెత్తించినను దానినెవ్వరూ పెద్దగా పట్టించు కొనలేదు.

శ్రీ గురుడునూ సిద్ధయ్య నుద్దేశించి “నాయనా! సిద్ధయ్యా! మజ్జనమునకు సమయమైనది. సేవాకార్యక్రమము నొకింత నిలిపి మజ్జనము పూర్తిచేసికొని రమ్ము.”—శ్రీ గురుడే విశ్రాంతి కల్పించెడి వారు. “ప్రియసుతా! వేళయైనది. మీ అమ్మనడిగి భోంచేసిరమ్ము.”—“నందనా! విశ్రాంతి నెరుగక సురటి వీచు చుంటివి. నీహస్త నాళికము నొచ్చునయ్యా! ఇంక నాపుము.”— అని పలు సారులు పలువిధములుగా విశ్రాంతి గొనుటకు శ్రీ గురుడే కల్పించును. “పుత్రకా! రాత్రి కావచ్చినది. కొంచెమైనను విశ్రాంతి గొనకుండిన శరీరము నీరసించును కావలసినంత నిద్రయు మనిషికి అవసరమైయున్నది. కనుక సిద్ధా! వెడలి విశ్రాంతి గొనుము.”....అని విశ్రాంతికై పంపును

శిష్యులెవరైన శ్రీ గురుని చేరినను చేరక పోయినను సిద్ధయ్యను కూర్చుండ బెట్టుకొని మధురమనోహరమంజుల రీతిని కాలజ్ఞానమును బోధసేయు చుండును.

సిద్ధు నెప్పుడూ దూరముగ కూర్చుండనీయడు శ్రీగురుడు. తన వెంటనే కూర్చుండ బెట్టుకొనును. తండ్రిగా వీరగురుడు సిద్ధుని దగ్గరగా చేర్చుకొనును. కొడుకుగా సిద్ధయ్య యూ వీరగురుని చేరును. వారిద్దరూ ఎప్పుడూ అభేదముగానే ప్రవర్తించు చుండిరి.

ం....ం

సిద్ధయోగి ప్రసిద్ధభారతం :-

-: ఇరువది ఆరవభాగం :-

“గురుదేవా! నీ అండ నాకు లేదనికాదు. కటాక్షము నీయవనీ కాదు. ఆకొని నప్పుడు తిండి పెట్టిన దాని మనసార జీవి కడు తృప్తిని పొందును గదా! అటులె నాకిప్పుడు ‘కారణము’ గొన వలయు ననెడి తృష్ణ తీవ్రతరమైనది. ఆ ‘కారణ’ పిపాస, నన్ను విశ్రాంతిగ నుండ నివ్వుటలేదు. కనుక దేశికోత్తమా, ఈ ఉపదేశ వాంఛా పరితప్తుడ నైన నాకు ఉపదేశ మిచ్చి శాంతి గూర్చవేవా స్వామీ!

గురుదేవా! అల్పుడను ఆశ్రితుడను ఆకాంక్షితుడను. ఆశకొద్ది అడుగు చుంటిని గాని!- అన్యథా తలంపకుడు. ఎప్పుడు ఎవని కేది ఈయ వలయునో అప్పుడే నొసంగెదవు. తరుణము నీకు తెలియదని కాదు. కాని మానవ సహజమైన బలహీన తతో ప్రవర్తించితిని.... అన్యథా తలంపకుడు.

దాహార్తి యైయున్న మానవునకు జలము గ్రోలిన గదా దాహము తీరుట. తటాకము వెంటనున్న మాత్రమున దాహము తీరునా! స్వామీ! రోగికి వైద్యుడెంబ డున్నంత మాత్రమున వ్యాధి ఉపశమించునా? ఔషధసేవన మొనరించిన గదా వ్యాధి తిరోగమించునది. హే! భగవాన్! కర్షకునకు రసవంతమైన భూమి యుండినంత మాత్రమున పంట పండునా! అందు విత్తనముల నాటి వ్యవసాయము చేయవల యును గదా! కామధేనువు వెంటనున్న పాలు పిండక పాడి కాదునా స్వామీ! ముముక్షువులకు దుర్లభమైనది మోక్షము. సముచితమగు గురూపదేశము, సాధన లేకున్న పొందించ గల్గునదీ సున్నయేగదా! ఆ సాధన నవలంబించి సుస్థిర స్థానము బొందవలయుననిడియే నా తాపత్రయము స్వామీ! — అనినాడు సిద్ధయ్య.

“భళా! సిద్ధా! వాదోపవాదముల యందును సిద్ధహస్తుడవైతివి. గురువునకే పాఠములు చెప్పు స్థాయికెదిగితివనినమాట. తాపత్రయ పడినంత మాత్రమున తమ స్సువీడి తపస్సులో నిల్వగలవా సిద్ధా!.... ఆ తాపత్రయమే ముందు సడించవలె. ఆ ఆందోళనే ముందు సడించవలె.”— అనినాడు శ్రీ గురుడు.

“స్వామీ! క్షమింపుడు. నన్ను అపార్థముచేసి కొనకుడు. మీపాదములపై ఆన. నాలో దుష్టచింతన యిసుమంతైనను లేదు. కేవలము ‘కారణము’ బొంది జ్ఞానసముపార్జనా తృష్ణ బలవత్తరమైనందువలన అట్లు పలికితినిగాని, అన్యము గాదు. నన్ను మీరు ఖండించి చూచినను నాలో దురాలోచనగాని, దుష్ట ప్రవృత్తిగాని లేదు.”— అని పాదాక్రాంతుడైనాడు సిద్ధుడు.

“సిద్ధా! నీమనోభీష్టము నాకు తెలుసు. నీ గురించి నీకు తెలియని వెన్నియో నాకు తెలుసు. నీకేమి కావలయునో నేను నీకు ఏమి తెలియ వలయునో కూడ నాకు తెలుసు. తొందరపడకు. కడపకు జని నవాబు దివాణము నందు విజయుడవై తిరిగి వచ్చినంత ఉపదేశ మిచ్చెదనని చెప్పియుంటినిగదా! మరచితివనుకొంటివా? అయి నను యింత తొందరేల? దేనికైనను సమయము సందర్భము కలసి రావలయును గదా!”— అనినాడు శ్రీగురుడు.

“క్షమించండి స్వామీ!....”

భయమునుడుగుము. నీవింక ఎంతో ఎత్తు ఎదుగవలసి యున్నది. హిమవన్నగ మంత ఎత్తు ఎదుగవలె. అప్పుడు గదా నాకు ఆనందము సిద్ధా! అందువలన నిన్నూరక

విడుతునని ఎట్లనుకొంటివి? పిచ్చివాడా! బిడ్డల మంచి చెడ్డలు తల్లితండ్రులకు తప్ప అన్యులకు తెలియునా? సరియే! నీవూరక తొందర పడుచుంటివి గనుక నీ వాంఛా ఫలసిద్ధి చేకూర్తును. ఈనాటి రాత్రి శుభనక్షత్ర, శుభయోగ సందర్భమున నీకుప్రదేశ మిచ్చెదను.... కాని నీయీ తొందరపాటు చర్యవలన రామన్న ఒకానొక మహత్తర కార్యక్రమములో పాలుపంచుకొను భాగ్యమును కోల్పోవు చుంటివి.... కానిమ్ము.... ఎవనికి ఎంత వరకు ప్రాప్తమో!— అంతియే చేకూరును.... ఆశించినంత మాత్ర మున అన్నియూ లభించునా! యోగ్యతయూ అవసరము కదా!"— అనినాడు శ్రీగురుడు....

సిద్దయ్య మహదానందమున మునిగినాడు. పరమాహ్లాద మూర్తియై ప్రకాశించి నాడు సిద్దమూర్తి. అతని కన్నులనుండి వెలువడిన ఆనందము ఆనందమా! అది బ్రహ్మానందము. పరమానందము. ఆ మహదానందమున కవధులు లేవు.

కాని !- అంతలోనే అతనిని విచార మేఘములు క్రమ్మినవి. తొందర పడి రామన్న ఏమహత్తర కార్యక్రమమున పాలుపంచుకొను భాగ్యమును కోల్పోవు చున్నానో!.... అనెడి బాధ అంతర్గతముగా బాధింప మొదలిడినది. కాని 'కారణ' మిచ్చు మెండెగదాయను సంతోషమున దానిని గూర్చి ఎక్కువగా ఆలోచింపలేదు. 'ఆత్రగానికి బుద్ధి మట్టము' అను సూత్రమిచట సిద్దయ్యకు సరిపోయినది.

"అయిన గురుదేవా! తగిన యేర్పాట్లు చేయమందునా!"

"తప్పక !"— శ్రీగురుడు.

ఇంక సిద్దయ్య కోలాహలంబరోత్తరం, సభోజన సామాగ్రులు, సర్వవాద్యము లను, పూజా వస్తువులను, అదియిది యననేల సర్వవస్తువులను అతి త్వరలో సమ కూర్చుకొనినాడు.

అతని హడావుడి, ఆనందము, సంబరము, సంతోషము గని గోవిందమాంబ సిద్దయ్యా! ఏమిటయ్యా విశేషము. అతిసంబర పడుచుంటివి. ఈ పూజా కార్యక్రమ ములు ఈ వాయిద్య విశేషములు — ఓహో! — ఏమీటీ సంబరము .... సంతోషము"— అనినది.

"అమ్మా! మీరే వచ్చితిరా! మీ కడకేతెంచుదమను సమయమున మీరే వచ్చితిరి."— అని అమ్మ పాదములకు నమస్కరించి "తల్లీ! నేటికి నా జన్మము ధన్యమైనది. శ్రీ గురుడు బ్రహ్మోపదేశము చేయ నేటి రాత్రికి ముహూర్తము నిర్ణయించినారు. అదియేనమ్మా ఈ ఆనందకోలాహలము."— అని చెప్పి ఆశీర్వచనముల నాశించినాడు.

"నాకు తెలుసు లేవయ్యా! పిచ్చితండ్రి. గురువులు నాకీ విషయము తెల్పి నీకు వలయు సామాగ్రి సదుపాయముల నిమ్మనినారు. తెలిసినదా!"— అని గోవింద మాంబ తెలిపి "నిజముగ నీవు అదృష్టవంతుడవురా సిద్ధా! ఏవరికి లభించని దివ్యాశయ సిద్ధి నీకు లభించబోవు చున్నది. నీవు నిజముగ మంత్రసిద్ధుడవై సిద్ధులను వశము చేసికొందువు. శుభమగుగాక!" — అని దీవించి వెడలినది.

మఠప్రాంగణమంతయు మహనీయ మంజుల మనినట్లు దివిటీలు వెలిగించినారు. ప్రదేశ మంతయు పట్టపగలుగ మారినది. బహు విధములుగ లలిత మంగళ తూర్యములు అనుపమస్థితి ప్రతిధ్వనులీనుచున్నవి. వేద పండితులు అప్పటి కప్పుడు ఎక్కడ నుండి వచ్చిరో గాని, వేదమంత్రముల గంభీరముగ గానము సేయ మొదలిడినారు. శ్రీగురు దంపతులు సింహాసనాశీనులై శివపార్వతులవలె ప్రకాశించుచున్నారు. గురు దంపతులకు గురుపుత్రులు ఇరుపైపుల ఛత్రచామరముల చేబూని వినరుచు నిలవబడిరి. భజన సంఘంబులు వీరగురు నామ భజన దిక్కులుపిక్కటిల్లు నట్లుగా ప్రతిధ్వనింపసేయు చుండిరి. సిద్ధుడు సుప్రసిద్ధుడై శుచియై గురు మిథునమునకు షోడోపచారాది పూజలు, పురుషసూక్త ప్రకారముగ స్వయముగ నిర్వహించినాడు.

గురుపుత్రులు ఏమిటీ వింత!— కుమారులమైన మాకు యింతవరకూ తండ్రి గారు మంత్రోపదేశ మిడలేదు. ఈ సిద్దయ్య అంమనా మతాంతరుడు.... ఎంతగా తండ్రిని సేవించిననూ బ్రహ్మోపదేశ మిచ్చు చుండెనే!— ఔరా! సిద్దయ్య ఎంతటి అదృష్టవంతుడవయ్యా!'— అని మనసున తలచినారు.

అపుడు శ్రీగురుడు సిద్దయ్యను చేరబిలిచి. దగ్గరగా కూర్చుండ బెట్టుకొని, ముఖవస్త్రభాసితునింజేసి కరము శిరమునిడి, వక్త్రింబు చెవిని జేర్చి బ్రహ్మోపదేశ మొనరించినాడు.

"హరహర! మహాదేవ శంభో!"— అని నినాదములు మిన్ను ముట్టినవి. "జై వీరబ్రహ్మేంద్రస్వామికీ జై!"— అని జయ జయధ్వానములతో ప్రవేశమంతయు మార్మ్రోగినది. జనముల శరీరములు గగుర్పొడిచినవి.

అప్పటికి రెండు మూడు రోజుల క్రితమే సిద్దయ్యను చూచి పోవుటకు వచ్చిన సిద్దయ్య తలిదండ్రులు ఆదంబీ పీరుసాహెబులకు, ఈ బ్రహ్మోపదేశ దృశ్యదర్శనం, అత్యంత ఆనంద అనుభూతులను కలిగించినది. బ్రహ్మంగారంతటి మహానుభావుడు తనకుమారుని చెంత కూర్చుండబెట్టుకొని, చెవిలో మంత్రోపదేశము చేయుట - వారినెంతగానో కదిలించివేసినది. తురుష్కుడైన వానిని ఒక హిందూ గురువు అంత దగ్గరగా చేర్చుకొని శిరసుపై తన కరమిడి అక్కున చేర్చుకొని, మంత్రోపదేశమిడుట బహుశా చరిత్రలో అదే మొదలు తుదియేమొ!.... ఆదంబీ పీరుసాహెబుల ఆనందము వర్ణనాతీతము.

గురుమంత్రము కర్ణద్వారముగుండి సిద్దుని పవిత్రహృదయ కమలము చేరినది. చీకటి యలుముకొనిన గృహము బంగరు దీపికచే ఎట్లు వెల్గులతో నిండి పోవునో, అట్లేనటుగా సిద్దుని హృదయ కమలము విప్పారి వేలకాంతుల ప్రభాసించినది .... ప్రసరించినది.

శ్రీగురుడు సంతసానంద హృదయార విందుడై సిద్దుని కౌగలించుకొని, భుక్తశేష ప్రసాదంబుల నొసంగ, సిద్దుడు వాటిని కన్నుల కద్దుకొని 'మహాప్రసాదము' అని స్వీకరించినాడు. గురుపాదములకు వంగి నమస్కరించి తలపైకెత్తు సరికి సిద్దని కండ్లకు శ్రీగురుడు అనంతావతారుడై, ఆదిమధ్యాంత రహితుడై, సర్వమూ నిండి, సర్వమూ తనలో నిముడ్చుకొని సర్వాంతర్యామియై విశ్వరూప దర్శన మొసంగినాడు.

ఆదివ్య దర్శనముతో సిద్దుడు బ్రహ్మానందపడిపోయినాడు. అతనిలో భయము, భక్తి ఉప్పొంగొని వచ్చినవి. "హే! పరంధామా! విశ్వబ్రహ్మా! గురుబ్రహ్మా! సకలలోక సృష్టికర్తా! సర్వేశ్వరా! విశ్వేశ్వరా! అజాండము నీ శరీరము. శైల విశాలములు అస్థులు, పవనము ప్రాణములు, ధరణి పాదములు, ఆకసము నాభి, దేవతాభువనము శీర్షము. అగ్ని ముఖము, రవిచంద్రులు కన్నులు, ఆహా! నీవు సాక్షాత్తు విశ్వరూపుడవు. విశ్వనాథుడవు, విశ్వ నిర్మాణకర్తవు, విశ్వజ్ఞుడవు, నీవు

దేమున్నదీ లోకమందు? సర్వము నీలో నిండియున్నవి. హే! పరాత్పరా! గమాం! పాహిమాం!"—అని పలువిధములుగా స్తోత్రించినాడు సిద్ధమూర్తి.

శ్రీగురుడు ప్రసన్నుడై అతనికి స్వాస్థ్యము చేకూర్చినాడు.

అంతయూ మరల ప్రశాంతముగనున్నది.

"వత్సా! సిద్ధా!"

సిద్ధడు కనులు తెరచి చూచినాడు.

వత్సా! ఇటువంటి దివ్యదర్శనమందరికినీ లభ్యముగాదు. నీవు పూర్వ జన్మ ర చేసికొనిన పుణ్యఫల విశేషమునాడు నీకీ దివ్యదర్శన భాగ్యము లభ్యమైనది. నీ అదృష్టము"—అని సిద్ధుని సాధారణ స్థితికి గొనివచ్చి "సిద్ధా ప్రతివారూ మూలుగా చేయు పూజలన్నియు డంబమునకు, లోకాచారములుగాని, ప్రాజ్ఞు ్రకూ ఈ పూజలపై మనసు రానీయరు. దేవాలయములందు పూజారులు పూజను సారము చేసినారు. రానున్నకాలమున ఈ వ్యాపారమింకనూ ఉధృతి చెంది జారులు భక్తుల కానుకలపైననే మోజు చూపింతురు తప్ప భక్తిపైనగాదు. హారతి ్రమందు ఎక్కువ కానుకలు సమర్పించువానికి ఎక్కువ ప్రసాదములను, యూ వేయనివానికి అసలు తీర్థముగూడ లేదను దుస్థితికి ఈ దేవాలయములు జారును. నిజమగు పూజ అదిగాదు.

"సిద్ధా! అభిషేక మనిన పాలు, పంచదారలు కలిపిన జలాభిషేకము మ్యా! భక్తిరస సుధాధారలచే అభిషేకించవలయును. పూజారి, భక్తులకు రుని, తనకూ తెలియని మంత్రముల పఠింపుచూ లింగాది ఆకారములకు యుచ్చ వచ్చినరీతి నీరము పోయుట అభిషేకమనలేదు. అది కేవలము ధనార్జనా ము తప్ప అన్యముగాదు. అందువల్లనే ఈ పూజారులకు రానురాను సమాజ మ గౌరవ మర్యాదలు నశించును.

"భగవద్భక్తికి, భగవత్సేవకు ముఖ్యము విశ్వాసము. విశ్వాసమనెడి జ్యోతిని వ చేయవలయునుగాని అన్యముకాదు. సాత్విక, రాజస గుణములను చందనా తో అలంకరించవలయును. శమదమాదులను పుష్పమాలికల సమర్పించ ును. జఠరాగ్నిలో అరిషడ్వర్గములను ధూపమిడవలయును. విజ్ఞాన దీపముల

వెలిగించవలయును. విస్తృతాసనమును నై వేద్యముగా నిడవలయును. వినయమను తాంబూలము సమర్పింపవలయును. తమోగుణమును నిష్కామము దక్షిణగా నొసంగ వలయును. నిష్ఠ, ఓర్మి కలిగియుండవలయును. అతీంద్రియుడై నమస్కృతులు సల్పి శిష్యుడు ఆచార్య నర్చించిన అదియే నిజమైన గురుపూజ.

దురాశ లేని ఆచార్యుడు, ధనాశలేని శిష్యుడు ఒకరి కొకరు తోడైన వారి చెలువము నెన్న నలువకైన దరమా ? సిద్ధా ! నా కెట్టి ఆశలూ లేవు. నీకునూ ధనాశ లేదు. ఇంకనూ నీకు ఆలోచన లేల?"—అని వీర గురుడు అచ్చట చేరిన జనంబు లకు తీర్థ ప్రసాదంబులు పంచ వారందరూ అత్యానదంబున స్వీకరించి, శ్రీగురుని ఆశా రహిత, వాత్సల్యాది గుణంబులకు ఆనందపడుచు ఆశ్చర్యపడుచు, సాక్షాదీశ్వరుడే యని కొందరు, సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే యని మరి కొందరు, శ్రీగురుని ప్రశంసించుచు, ప్రార్థించుచు స్మరించుచు స్తోత్రించుచుండిరి.

"కాల జ్ఞానము మహత్తర, బృహత్తర గ్రంథ నిర్మాణము. అద్దానిని నిర్వ హించుట సర్వసామాన్యమైన విషయము గాదు. దేవదానవులు క్షీరసాగర మథనము సేయునపుడు మంథరగిరి క్రింద పడిపోకుండ దాని క్రింద మహాకూర్మమై యుండు నంతటి మహత్తర కార్యము.

-ధర్మాధర్మ, సత్యాసత్య, న్యాయాన్యాయ నిమ్నోన్నతములతో కూడిన విశ్వంభరను చక్క చేయుట, అహింసా సిద్ధాంతములను ప్రచారము చేయుట, సాత్వి కాహార ప్రయోజనమును చాటి చెప్పుట. పుణ్యజనేంద్రుని చేత భూదానాది సత్కా రము లందుట, మహాద్విజసమూహమునకు ద్వేషుడుగా గాక దివ్యమిత్రుడుగా తేజ రిలుట, విశ్వకర్మాన్వయమూ విఖ్యాతుడై యుండియు, ఆ నారాయణాంశమున గోపాల కుండై అలరుటయు, బుధులు గణియింపక అతడు అసమ ప్రబుద్ధుడగుట, ధరణిపై ధర్మము స్థాపించ బుట్టుట, ఇవన్నియు చూడ ఈతడు దశావతారుడైన ఆది విష్ణువు గాక యితరుడెవరు? సాక్షాత్తు మమ్మూర్తుల యవతారమైన దత్తగురుడే వీరగురుడు.

అట్టి వీరేశ్వరుని శిష్యుడై, భక్తుడై, సేవకుడై, సాక్షాత్తు ఉపదేశమం గొనినవాడూ సిద్ధుడు మాత్రమం సామాన్యుడా! విష్ణుతల్పమైన ఆదిశేషుడు రామావతార మున లక్ష్మణ స్వామియైనట్లు ఈ జన్మమున సిద్ధమూర్తిగ పుట్టినేమొ?-ఎవరెరు గుదురు.

"లేకున్న! నిత్యమాంసాశన కులమున బుట్టి సహజ సమంచిద్విచారుడగుట ఏ జన్మమునందు చేసికొన్న పుణ్యము గాక మరేమగును. వీరబ్రహ్మగురుని భక్తితో సేవించుట బాల్యముననే మతమునకు ప్రాధాన్యమీయక, వేదాంత సిద్ధాంతములపై మనసుగొనుట, తలిదండ్రులకు సహితము ధర్మప్రబోధము, అహింసా ప్రయోజనము మొదలగు విషయముల వివరించి చెప్పుట, జగద్గురు స్వరూపుడైన వీరగురు సాక్షాత్కారము బొందుట, పలువిధ జనంబులచే వినతుడగుట—మొదలగు సత్ప్రవర్తనంబులను, సద్గుణంబులను, సదాచారంబులం బట్టి జూడ, ఇరువురకును భేదమున్నట్లుదోపదు. సిద్ధుడు చిరతరానందమూర్తి. కలియుగ ప్రహ్లాదుడన అతనికే చెల్లును."—అని జనులు వారివారి మనంబుల వారి కిష్టమైనటుల, వారికి తోచినటుల తలపోయుచు.

"జై! శ్రీవిరాట్పోతులూరి వీరబ్రహ్మస్వామికీ జై"
"కలియుగ ప్రహ్లాదుడు సిద్ధ సుధీమణికీ జై!"—

అని వీరావేశంబున భక్త జనంబులు చేయు జయజయ ధ్వానంబుల నాలించి వీరగురుదేవుడు ఆనందమంది సిద్ధుని అక్కున చేర్చుకొని, చుబుకము ముద్దాడి దివ్యాశీస్సుల నొసంగినాడు.

శ్రీ కరముగ శివ కవులకు
ప్రాకటముగ భక్తులకును, భావజ్ఞులకున్
లోకములలోను వెల్గుని
ఓంకారునకు శరణుజాయర సిద్ధా!

శ్రీగురునకు పరశివునకు
బాగుగ సద్భక్తియోగ, బావజ్ఞులకున్
యోగ తపోనిష్ఠులకును,
రాగద్వేషులకు శరణు జాయర సిద్ధా!

శ్రీగురు పదముల పట్టియు,
బాగుగ త్రివిధ ప్రసాద భక్షకుడైతే
యోగంబు సేయనేటికి
యోగులలో నుండనతడు యోగ్యుడు సిద్ధా!

అని అనేక పద్యముల నాశువుగా చెప్పి శ్రీగురుడు నాటి కార్యక్రమము మంగళారతితో ముగించినాడు!

సిద్ధయోగి ప్రసిద్ధభారకం :-

-: ఇరువది ఏడవభాగం :-

శ్రీరామచంద్రమూర్తి వనవాసానంతరము, తిరిగి అయోధ్యకుచేరి పట్టాభిషిక్తుడైన సందర్భమున సీతామహాదేవి ఆంజనేయస్వామికి మణిహారము నొకదానిని ప్రదానము చేసినదట. ఆంజనేయస్వామి ఒక్కొక్క మణిని తీసి చెవి దగ్గర పెట్టుకొని కొరికి అవతల పారవేయుట ప్రారంభము చేసినాడట.

సీతా మహాతల్లి ఎంతో ఆనందముగా, ఆదరముగా నిచ్చిన ఆ మణిహారము నావిధముగా కొరికి పారవేయుట గాంచి ఆంజనేయస్వామిపై కినుక వహించి, దండించినదట.

అప్పుడు ఆంజనేయుడు "అమ్మా! ఇది మణిహారమే! గానీ, ఏ ఒక్క మణియందునూ శ్రీరామనామ శబ్దమే లేదు. రామ శబ్దము లేని ఈ మణులవల్ల ప్రయోజనమేమి తల్లి! రామ శబ్దము వినా నాకేమియూ అవసరములేదు. నా శరీరమంతయు రామ శబ్దముతో నిండియున్నది. రోమ రోమమునందును శ్రీరామ నామ దివ్య శబ్దము ప్రతిధ్వనించుచుండును." — అని తన శరీరము నుండి ఒక రోమమును పెకలించి ఆమె చెవి దగ్గర పెట్టినాడట. అందుండి శ్రీరామనామము "రాం! రాం! రాం!" — అను దివ్య శబ్దములు వెలువడుట సీతాదేవి స్వయముగ విని ఆంజనేయుని ప్రగాఢమైన భక్తికి ఆశ్చర్యపోయినదట.

అటులనే సిద్ధుడు వీరగురుని పట్ల ఆంజనేయుడు. సిద్ధుని శరీరమంతయు గురునామ శబ్దామృత మయం. అతని ఉచ్ఛ్వాసా నిశ్వాసములు గురునామ శబ్దముసు ధ్వనించుచుండును. అతని రోమ రోమమునందును వీరగురు నామమే ప్రతిధ్వనించుచుండును. అతని రక్తమంతయు గురునామ జప సంకీర్తనములతో శరీరమునందు ప్రసరించుచుండును. గుండె గురునామమునే ధ్వనింపచేయుచుండును- అటువంటి శిష్యుడుగాక మరొకరు గురుకృపకు పాత్రులగుదురా! అందువలననే శ్రీగురువకు సిద్ధుడు అత్యంత ప్రీతిపాత్రుడైనాడు. ప్రేమ పాత్రుడైనాడు.

ఇది ఇతర శిష్యులలో కొంత ఈర్ష్యకు కారణమైనది. స్వభావ సిద్ధమైన మానవ బలహీనత కొంతమంది శిష్యులను ఆవహించి, సిద్ధుని ఆధ్యాత్మిక సామ్రాజ్య సింహాసనమధిష్టానమును సహింపలేక, ఎటులైన అతనికి కొంత అపకారము చేయవలయుననెడి తలంపునకు దాసోహము చేయించినది. అందులకు వారు గురుపుత్రులను పావులుగా వినియోగించదలచుకొనిరి. గురుకుమారు లెంత ప్రబుద్ధులైనను, సుబుద్ధులైనను, గురువేపులంతటి దివ్యాత్మ స్వభావులు కారు గావున, సాధారణ మానవ జన్మమునకు సంబంధించిన బలహీనతల చిక్కుముడులలో చిక్కుకున్న కారణమునను, వారి గత జన్మపై భవములు వారికి తెలియవు గనుక యితర శిష్యజన మనోభావాల ప్రభావము వారిపై బాగుగనే ప్రసరించినది .... ప్రభావితము చేసినది.

పింజారికుల సంజాతుడైన సిద్ధుని అంతగా నెత్తికెక్కించుకొనుట, అంతటి మేళతాళముల మధ్య జ్ఞానోపదేశము చేయుట, తమనసలు గుర్తింపకుండుట — గురుకుమారులలో అశాంతి, తండ్రి తమను సంపూర్తిగా నిరాదరణ చేయుచున్నాడన్న బాధ, అనుమానము లేకపోలేదు. దానికితోడు నిప్పుకు గాలితోడైనట్లు యితర శిష్యజన్య నిందారోపణలు, వారిలో అంతర్గతముగనున్న బాధను మరికొంచెము పెంచినవి. వారి పిర్యాదులలోకూడ కొంత నిజములేకపోలేదు-అను నిర్ణయమునకు వచ్చినారు. అందున పోతులూరయ్య ఒకింత ముందుముందు స్వభావి గనుక అంతలోనే అతడు తొందరపడి మరుసుగా ప్రవర్తించినాడు.

"సిద్ధయ్యా!"—పిల్చినాడు బిగ్గరగా

"వచ్చుచుంటిని గురుపుత్రా!"— అని తాను చేయుచున్న పనిని పక్కన పెట్టి "ఏమన్నా! పిల్చితిరి. సెలవిడు"—అని నాడు.

"నీ పక్క విసరుములు కట్టిపెట్టి, నీ విక్కడ నుండి వెంటనే మరుమాలకి వెళ్ళిపోవలయును. ఇది మా ఆజ్ఞ. నీవు మా నికేతనమున అన్ని ప్రదేశములందు తరతమ బేధములేక తిరుగుచు సమస్త వస్తువులను మైలపరచుచుంటివి. ఇతరు లెల్లరు ఆక్షేపణలు చేయుచుండిరి.

"మేమా అగ్రజాతివారము. నీవా దూదేకుల వాడవు. నీకు మాకును సాటిరాలోర నీతి. నీవు మా యింట నుండుట తగదు. రేపో మాపో మా నెలవును వి

వెళ్ళక తప్పదు. ముందుగనే చెప్పుచుంటిని."— అని యీ క్షణ వీక్షణములతో పోతులూరయ్య సిద్ధయ్యను హెచ్చరించినాడు.

"ఎన్నడూ లేనిది ఏమిటిది? ఈ రోజు గురుపుత్రులింత ఆగ్రహము ప్రదర్శించుచుండెను. నావల్ల ఏదైన అపరాధము జరిగినదా! ఏమిటీ విపరీతము."- అని తనలోతాను తర్కించుకొని.

"అన్నా! నేనెన్నడూ ఏరికినీ అపకారము తలపెట్టి ఎరుగను. ఏరిపట్లకూడ అమర్యాదగా ప్రవర్తించి ఎరుగను. ఎందులకిట్లు నాపై కినుక వహింతురు. తప్పు చేసినట్లయిన తెలియచెప్పుడు దిద్దుకొందును. అంతియేగాని గురుసేవ విడనాడి, గురువాజ్ఞ లేక తిరోగామునవు గమ్మని మాత్రమాజ్ఞ నిడకుడు."— అని నమస్కరించి విన్నవించినాడు....

"అదేమియూ కుదరదు. వెడల వలయునన్న వెడల వలసినదేగాని, ఎదురు మాటాడరాదు. ఎందుకని ప్రశ్నింపరాదు."— అని నాడు పోతులూరయ్య.

"గురువాజ్ఞలేక నేనెట్లు గురు సాన్నిధ్యము వీడగలను. అయిననూ! అన్నా! కఠినముగా శాసింపకుడు. నా వలన మీ కెవిధమైన యిబ్బంది కలిగినను ఎచ్చట నుండ మనిన అచ్చటనే యుండెదను. దేనికీ ముట్టను. నీ యానతి జవదాటి చరించను. మీ కెవ్వరిద్వారా మాటరాకుండ చూచుకొని మెదను."— అని ముకుళిత కరకమలుండై మనవి చేయు చున్న సిద్దుని జూచి తనలో తానిట్లు తలపోయసాగినాడు. "ఇతడు మామూలుగ వెడలమన్న వెడలడు. తండ్రిగారి యాజ్ఞ వడయవలయు నన్న అది అసాధ్యము. తండ్రి అతనిని ఎట్లు పొమ్మనును— అందుల కొకటియే మార్గము. అన్నపానాదుల నడకున్న ఆకలి కట మపటించు వాడేపోగలడు."— అని యితర శిష్యజనంబుల చేకొని తల్లిని చేరినాడు పోతులూరయ్య.... అతని సహోదరులు.

"అమ్మా !"— అనినారు పుత్రులు.

"ఏమిటి నాయనా! ఏమిటిది? అందరూ ఒక్క సారే వచ్చినారు. ఈ శిష్య జనంబులేల వచ్చిరి? ఏమిటి విశేషము." తండ్రిగారేమైననూ కోపించిరా! ఔనూ!- సిద్దుడెక్కడ ?"— అనినది గోవిందమాంబ.

"సిద్ధుడూ! సిద్ధుడూ!.... సిద్ధుడూ!.... సిద్ధుడూ! అందరికినీ ఈ సిద్ధడి పిచ్చి బాగుగా పట్టినది. లోకమున సిద్ధయ్య తప్ప యింత శిష్యులే లేరా! అటు తండ్రిగారికి సిద్ధయ్య! ఇటు తల్లిగారికి సిద్ధయ్య! వచ్చిన భక్త జనావళికి సిద్ధయ్య. అంతయునూ సిద్ధయ్య మయమైపోయినట్లుండెను గాని, నిజపుత్రుల సంగతి పట్టించుకొను నాధుడే లేడా? వీరి కెనికి యేదికిని అవసరము లేదా ?"— ఆగ్రహించినాడు పోతులూరయ్య.

"ఎందుకురా అటుల ఆగ్రహోన జ్వాలాతప్తుడ వయ్యెదవు. ఇప్పుడేమైనదని సిద్ధయ్య యనిన ఎందుల కింత చిందులు త్రొక్కెదవు. ఇప్పుడు నేను మాత్రమే మంచిని?— సిద్ధయ్య యేడీ అంటిని.... అంతియే గదా!— అంతమాత్రమున కెందుల కిట్లు కోపోద్దీపితమానసుడవై కటు శబ్దముల నాడెదవు. గోవిందయ్యా— ఎందులకీ పోతులూరయ్య యిటుల చిటపటలాడు చుండెను. నీవైనా చెప్పుము"— అనినది గోవిందమ్మ.

గోవిందయ్య శాంతస్వభావుడు. పోతులూరయ్య దుండుడుకు స్వభావమతనికి అవగత మైనప్పటికీ, తన వెంట రాలేదని, తననెక్కడ అతడు అపార్థము చేసికొని ఆగ్రహించునోయని, సోదరుని అనుసరించినాడు....

గోవిందయ్య తల్లిని కూర్చుండ చేసి శాంతముగా సౌమ్యముగా చెప్ప దొడగినాడు.

"అమ్మా! వీరందరినీ ఎఱుగుదువు గదా!"

"ఎఱుగకే!— మనశిష్యజన పరివారమేగదా !"

"అవునా! సిద్ధయ్య మన యింటచేరి చాల దినములైనది. తండ్రిగారికి సిద్ధయ్యకు అనుబంధము అంతకంతకు దృఢపడుట మనము గ్రహించుచునే యున్నాము. తండ్రిగారు సిద్ధయ్యను చూచు చుండినట్లు తక్కిన వార్ల చూచుటలేదు. సిద్ధయ్య మహమ్మదీయుడై యుండియూ, జన్మ తరింపజేయు సకల విధ వేదాంత రహస్యముల నన్నియూ గ్రహింపుచూ ధన్యత్వము నార్జింపు చున్నాడు. జన్మసాహిత్యమునకు మార్గము సుగమము చేసికొనుచున్నాడు. అది యంతయూ ఈ శిష్యజనంబున కొకింత ఈర్ష్యగా నున్నది. అంతియే గాదు బ్రహ్మముగారి పుత్రులమైన మాకు గూడ తెలుపని దివ్యరహస్యములను తండ్రి సిద్ధునికే బోధించుచుండిరి. అతడు

ధన్య జీవుడగుచున్నందులకు మాకేమియూ అభ్యంతరము లేదు. కాని మమ్ము మించిన స్థానమును కెదుగుచున్నాడు. ఎదుగు చుండినను మా కభ్యంతరము లేదు. కాని అతనిలో గర్వపు పొరలు చూచాయగా దన్పట్టు చుండినటుల ఈ శిష్యగణ విశ్లేషణ. మమ్ము అసలు లెక్కగొనుటలేదు. మమ్ము మించి చరించు చుండెనా యని యనుమానము కల్గుచున్నదని సోదరుల ఫిర్యాదు. ఇతర శిష్య జనంబుల నసలు తండ్రిగారు పట్టించుకొనుట లేదు. కేవలము సిద్దయ్యయే తానై, తానే సిద్దయ్యయై చరించుచున్నారు. అది ఈఇతర శిష్య జనంబులలో తీవ్రమైన రాశ్యమును పాదుకొల్పి నది. మమ్ములను తండ్రిగారు సంపూర్తిగా నిర్లక్ష్యము చేసినారని— అనుమానము మాకునూ ఇప్పుడిప్పుడే కలుగు చున్నది.

"ఇదే పరిస్థితి కొనసాగిన యెడల ఇతర జనంబులందు సిద్దునికే పెద్ద పీట వేసి సకల గౌరవ మర్యాదలు చక్కగను గాని మమ్ముల నెవరు లెక్కింతురు. సిద్దుని మహామాన్యుడని, బోధోత్తముడని, భావోత్తముడని, ఘనుడని, ఇంద్రుడనీ, చంద్రు డని— మన మఠము నందే స్తోత్రములు జరుగు చుండినవి. ఇప్పటికే అతనిని అపర ప్రహ్లాదుడని, కలియుగ ప్రహ్లాదుడని, ప్రశంసల వర్షము కురిపించు చున్నారు. జయజయ ధ్వానములు చేయుచున్నారు. ఇంక మాదైన్యస్థితి కొక్కసారి యోచింపుము.

గురుడే విధముగ నిత్యమూ వేదాంత విజ్ఞాన చంద్రికలను యావత్తు అతనికే నూరి పోసిన, అతడు మన గృహమందే యుండిన ఇంక మాకు గుర్తింపు ఎట్లు వచ్చును?— మమ్ము పలుకరించు వారెవరు?— భాషించు వారెవరు?

"జననీ! సిద్ధుడు స్థాయిగ మన నివాసమునందే స్థిరపడిన ఎదోనాటికి పరమ బూజ్యుడగుటయేగాక, మఠాధ్యక్షపదవిని పొందినను ఆశ్చర్యపడవలసినది లేదు. అంతటి పరిస్థితి రాకనేయుండ వలయునుగాని, వచ్చిన అప్పుడు చేయగలిగిన దేమున్నది.

"అందుకు నీవు సిద్దయ్యను వెంటనే పిలువనంపి, నయముననో భయ ముననో 'నీవు అంటరాని వాడవు, మాకడ నుండుట మంచిదికాదు. అయినను నీవు కోరినదేదో నీకు లభించెను కదా! యిక నింటికి పొమ్ము'- అని చెప్పవలయును.

"గురువాజ్ఞ లేక సిద్ధుడు కదలడు"

"కదలడు కనుకనే గదా నీ వద్ద కరుదెంచినది"

"తండ్రిగారు సమ్మతించరు"

"మరి దీనికి మార్గాంతరము"

"చెప్పమందురా!"

"చెప్పుతల్లీ!"

"ఈర్ష్యా ద్వేషాలతో భగ్గుమంటున్న మీ హృదయాలపై ప్రేమ అనే అమృతవర్షం చల్లండి. మనసును మంచి మార్గమున పెట్టుకొని సత్యపథగాములై నడవండి. సర్వమూ చక్కబడును.

సీ॥ "ఎదలోన ఈర్ష్యతో నొదను చెందెడివాడు । శీలమెరుగబోడు చెనటివాడు,
పరుల కల్మిని జూచి బాధ చెందెడివాడు । ధర్మమార్గము దప్పి తనరువాడు,
ఈర్ష్యవలన కల్గునెంతయో దుఃఖమ్ము। ఈర్ష్యవలన బాధలిబ్బడియగు,
ఈర్ష్యాదు లెప్పుడున్ ఇతరుల బాధించు। స్వార్థమ్ముకాతండు సుఖుడు సుమ్మీ,

ఆ॥ వె॥ సొంతవాడినయిన చూడడితడు జాలి। కడుపుకొట్టు టందు ఘనత చెందు।
రమ్యగుణ సుమిత్ర। రాజీవ దళనేత్ర । భవ్యగుణ పవిత్ర । భరతపుత్ర।

సీ॥ ధార్మికులను జూచి తాల్మిలేనియతండు. ప్రమగ్గును దారిద్ర్య మంటుకొంచు,
ఇతరుల సంపద నీర్ష్యతో తిలకించు వాని గృహము నీదు వనధి జాత
లక్ష్మి తప్పినచోట రాజనాల్పడిపోవు, పెద్దమ్మకక్కడ పీటబడును,
నరకగామి యగును నాశనమైపోవు ఛీ! యని పదిమంది ఛీత్కరింత్రు

ఆ॥ వె॥ ఈర్ష్య లేని బ్రతుకు ఈశ్వరు చేరుచు, ధనము కలిగి జన్మ ధన్యమగును,
రమ్యగుణ సుమిత్ర రాజీవ దళనేత్ర! భవ్యగుణ పవిత్ర! భరతపుత్ర!

"అమ్మా! నీవట్లనుట భావ్యముగాదు. మేమొక సలహా చెప్పెదము. నీవట్లు ప్రవర్తించిన చాలును."

"ఏమది?"

"కొట్టువద్దు. పనిగట్టుకొని తిట్టవద్దు. అతని కన్నుముపెట్టక యుండుము. అకటిబాధ కోర్వజాలక అతడే పయనించును. ఈ సలహా బాగుంటెను కదా!"

గోవిందమ్మ ఒక శుష్కహాసము చేసి "పట్టుదల! దీక్ష! గుర్వనుగ్రహము కలిగినవారి నెవ్వరూ కదుపలేరు. వీర్లకౌదియో విపరీత కాలము దాపురించినదని"- మనసునవలచి, "ఇక్కడ మీకొక చిన్నకథ నెఱిగింతును. సావధాన చిత్తులై విని తర్వాత ఒక నిర్ణయమునకు రండు"- అని కథ చెప్పుట ప్రారంభినది....

"ద్వాపర యుగమున ధౌమ్యుడను వేదవేదాంత, శాస్త్ర, పురాణేతి హాస విదుడగు బ్రాహ్మణుడు కలడు. ఇతడు చాల ఉత్తముడు. ఇతనికి అరుణుడు, బైదుడు, ఉపమన్యువు అను ముగ్గురు శిష్యులుండిరి.

"ఒకానాడు ధౌమ్యుడు అరుణుని బిల్చి - నీవు వెంటనే పొలమునకు పోయి నీరుపెట్టి రమ్ము"— అనినాడు. శిష్యుడు వెళ్ళి కాలువకు గండి పడియుండుట గమనించి, ఆ గండి పూడ్చినగాని పొలమునకు నీరు రావని గ్రహించి, గండి పూడ్చుట కెంతయో శ్రమించెనుగాని గండి పూడ్వబడుటలేదు. తానే గండి కడ్డముగా పడుకొని, పొలమునకు నీరుపెట్టినాడు. శిష్యుడెంత దనుక రాకపోవుట చూచి ధౌమ్యుడు తానే తరలివచ్చి శిష్యుని భక్తి విశ్వాసములకు, ధృఢత్వమునకు, కార్య దీక్షతకు మెచ్చి అతనిని సర్వవిద్యాపారంగతునిగా చేసి ఇంటకి పంపినాడు.

"పంట బాగా పండిన పిదప, ధౌమ్యుడు రెండవ శిష్యుడైన 'బైదుడు' అను వానిని పిల్చి, పంట నూర్పించి ధాన్యమునింటికి చేర్చుమని ఒక దున్నపోతు బండిని యిచ్చినాడు. బైదుడు పంట నూర్పించి బండిలో చేర్చి, రెండవ దున్నపోతు స్థానమున తానే కాడి తన మెడపై నిడుకొని బండిని లాగుకొని వచ్చు సమయమున, దున్నపోతు బురదగుంటలో పడిపోయినది. బైదుడెంత ప్రయత్నించినను దున్న పోతు పైకి లేవలేకపోయినది. ఇక దానినట్లేవదలి మొత్తము బండిని తానే పైకి లాగుటకు ప్రయత్నము చేసినాడు. కాని తనశక్తి చాలలేదు. ధౌమ్యుడు శిష్యుని దగ్గరకు వచ్చి అతని గురుభక్తికి, కార్యదీక్షకు మెచ్చి అతనినికూడ సకల విద్యాపారంగ తునిగా చేసినాడు.

"మూడవవాడు 'ఉపమన్యువు'- ఇతడు గోపాలను మేపుచు, ఒకనాడు ఆకలి బాధకోర్వజాలక మధ్యాహ్నము మీరిన పిదప ఇంటికి చేరినాడు. గురువు "అట్లకాదు. చీకటి పడునందనుక గోవులను మేతాడ నివ్వవలసినదే"-నని శాసించినాడు.

"అప్పుడు ఉపమన్యువు మధ్యాహ్నవేళలలో సమీప గ్రామమునకు వెడలి బ్రాహ్మణ గృహములలో మాధూకరమెత్తుకుని భుజించుచూ సాయంకాలమునకు యిల్లు చేరుచున్నాడు. మధ్యాహ్నం భోజనము లేకున్ననూ ఉపమన్యువు బలముగ నుండెను!- ఎట్లు? అని కారణమడిగి తెలిసికొని, ఆ మాధూకరము తెచ్చి తనకే సమర్పించుమని గురువు ఉపమన్యుని శాసించినాడు. ఉపమన్యువు అట్లే చేయుచు, రెండవ పర్యాయము మరికొన్ని గృహములకెగి భిక్ష స్వీకరించుచుండెను. అదియునూ తనకే సమర్పించుమని గురువు మరల ఆదేశించినాడు. అతడునట్లే చేసినాడు. కాని-ఆకలిబాధ ఎక్కువగుట మూలమున, దూడలు తృప్తిగ పాలు త్రావిన పిదప పొదుగునుండెడి కారెడు పాలను దోసిటబట్టి త్రాగి క్షుద్బాధ నివారించుకొనుచుండెను.

ఈ సంగతి నెరింగిన గురువుగారు అదియునూ నిషేధించినాడు. దాన శిష్యునకు వేరు మార్గాంతరము లేక, జిల్లేడు పాలను త్రాగినాడు. తద్వారా అతనికి దృష్టిపోయి అంధత్వము సంప్రాప్తమయ్యెను. ఉపమన్యునకు దారి తెలియక ఒకనూతి యందు పడిపోయినాడు. గోవులు శిష్యుడు లేకుండగనే యిల్లు జేరుట గురువు నాశ్చర్యపరచినది. శిష్యుని వెదకి కొనుచూ వచ్చి, శిష్యుని నిజావస్థను గమనించి, అతనిని మించిన విద్వాంసుడు ఈ లోకమునందు లేకుండునట్లు ఆశీర్వదించి అతనికి ఉచ్చస్థితి కల్పించినాడు.

"జనమేజయుని చేత సర్పయాగము చేయించిన 'ఉదంకుడు' ఈ ఉపమన్యుని శిష్యుడే! తెలియునా!.... కనుక గుర్వనుగ్రహము కలిగిన వారలకు-ఆహారలేమి బాధించదు....మీరు ప్రారంభించబోవు పనులవల్ల సిద్ధుడు మరికొంత బలవంతుడై ఉపమన్యునివలె, సంపూర్ణ గురు కటాక్షమునకు పాత్రుడై మరింత ప్రయోజనము పొందునుగాని మీరనుకొనినట్లు అతడు పారిపోడు...."

"అవి అంతయు పురాణ కథలు తల్లీ! ఇతడు కేవలము కలియుగ మానవుడు. అటువంటి మహనీయులు నెట్టి క్రమములలో పోల్చుటతగదు. నీ ప్రయత్నము నీవు చేసి మాకు సహకరించుము. తర్వాత ఎట్లు కానున్న అట్లేయగును."-

"నాయనలారా! అతడు మీకు సోదరతుల్యుడు. గుర్వానుగ్రహము పొందిన వాడు. సోదరునిపట్ల ఈ విధమైన ప్రవర్తన తగదు. సముచిత భావ సంసిద్ధుడు సిద్ధడు. అతని వలన మీకు శ్రేయంబే కలుగుసుగాని కీడు జరుగదు. మరి అతనికి మీరెట్టి హాని తలపెట్టినా మీ తండ్రిగారు సహించరు. అతడు కలియుగ ప్రహ్లాదు డనునది కటిక సత్యము. తండ్రి హిరణ్యకశిపుడెన్ని బాధలు పెట్టిననూ శ్రీహరి ఎన్నంటి రక్షించలేదా! అటులే సిద్దయ్యకు మీరేయపకారము చేసిననూ మీ తండ్రి అతనిని ఎన్నంటి రక్షించును. గురుకృప అతనికి శ్రీరామరక్ష. మీరు అతనిని కలియుగ ప్రహ్లాదుడని ఋజువు చేయుదురే తప్ప అతనికేమాత్రము హాని చేయ లేరు. నామాట విని మీ దుష్ట సంకల్పములు మానుకొనుడు.

"నేను మీ తండ్రి ననుసరించి మెలగుదాననేగాని అతని అభీష్టమున కెదురాడుటగానీ, అడ్డు చెప్పుటగాని జరుగదు. పతికెదురాడు భార్య భార్యయేగాదు. అట్టి అతివకు యిహపరములందు పుట్టగతులుండవు. పతిభక్తియే సతికి పరమధర్మము. అయిననూ మీ తండ్రిగారు కానికార్యమే దియూ చేయలేదు. 'సర్వేజనా స్సుఖినో భవంతు' గదా వారి ధ్యేయము. మానవుల మధ్య నెలకొనియున్న కులమత జాతి ద్వేషములను నాశముచేసి సర్వమానవ సమానత్వము చాటుటయే మీ తండ్రిగారి ధ్యేయము, ఉద్యమము. ఆ ఉద్యమమునకు కొడుకులైన మీరు శిష్యులైన వీరూ, పత్నినైన నేనూ సహకరించి, ఆ ఉద్యమములో భాగస్వాములమై వారి జీవితా శయమును నెరవేర్చుటలో ధర్మము స్థాపించుటలో సమసమాజ స్థాపనలో, విజయము చేకూర్చవలయునుగాని, యిటువంటి సంకుచిత మనస్తత్వముతో ప్రవర్తిల్లుట శ్రీవీరబ్రహ్మకుమారులగు మీకు తగదు నాయనా! ఆదర్శవంతులై నిలువవలసిన మీరు యిట్లీ దురహంకార సంజనిత భావోద్రేకమునకులై ప్రవర్తించుట మంచిపనికాదు. శాంతి, సత్యశీలము, సౌభ్రాతృత్వము, స్నేహము, ధర్మమార్గావలంబన యిత్యాది పంచశీలల ప్రతిష్ఠాపనకు కంకణము కట్టుకొని కృషిచేయుచున్న ఆదర్శపురుషుడు "శ్రీవీరబ్రహ్మేంద్ర గురు సం... సము నందు ద్వేష మేలాంకురింపనీయరాదు! తప్పునాయనా తప్పు. ఇంతవరకు పవిత్రమైన సంఘటనలతో ప్రభావితమై, ప్రకాశించుచున్న ఈ వీరబ్రహ్మ గురుమఠ సంస్థానమునందు అశాంతి బీజాల నాటవలదు. ...

ద్వేషా సూయ దురహంకారములను నిలుకానీయకుడు".... అని కలవరపాట
పలికినది గోవిందమాంబ.

కుమారులు మారుపలుకలేదు. ఆమెయే మరల ప్రారంభించినది. "పిచ్చి
మన యింట తిరుగుటలేదా! బ్రహ్మానందరెడ్డి తిరుగుట లేదా? యితరు లెవరెవ
ఎందరెందరో వారి స్వగృహమా యనినట్లు స్వేచ్ఛగా సంచరించుచుండిరి.
వారందరిపై లేని కక్ష ఒక్క సిద్దయ్యమీదే ఎందుకు నాయనా?

మీరు సిద్దయ్యను అనుజుని వలె, మిత్రుని వలె భావించి ఆదరించవలయు
గాని, శత్రుని వలె భావించి అసహ్యించుకొనుట గాని, అతనిని మారవము చే
వలయునను తలంపుగానీ మంచివి గావు. బాల్యచాపల్యమున మీరట్లు బుక్కుచుం
గాని నిజానిజములు విశ్లేషించిన మీకే తెలియగలదు. అన్నము పెట్టుమంచు వ
నేరికైన అన్నము పెట్టక పంపుట ధర్మమా?- న్యాయమా!

"ధర్మపరిరక్షణ మన ధ్యేయముగాని, అధర్మము నాలింగనము చేసికొన
రాదుగదా! ధర్మము తప్పి ప్రవర్తించుట చేతను పాపమింతయూ టగట్టుకొనుటయే
ఆలోచింపుము. మీకే దుర్బోధలు ఎవరు చేసిరో గాని, అవి మీ మనసునకు
పట్టినవి. మంచియనునది ఎప్పుడునూ వెగటుగనే యుండును. చెడుఫలితము
వించినాక గాని తెలియదు. దాని ప్రభావ మెంత ప్రమాదకరమైనదో.

శ్లో॥ ధర్మా ధర్మః ప్రభవతే ధర్మాత్ప్రభవతే సుఖం
ధర్మేణ లభతే సర్వం ధర్మసార మిదంజగత్॥.

"ధర్మము వల్లనే ధనము, సుఖము, సర్వము లోకమందు సంభవిం
చున్నవి. ఇంతెందుకు? ఈ జగత్తే ధర్మమునకు సారభూతమైనది.

శ్లో॥ యువైవ ధర్మశీలఃస్యాత్ అనిత్యం ఖలు జీవితం
కో హి జానాతి కస్యాఽద్య మృత్యుకాలో భవిష్యతి॥.

"చిఱుత ప్రాయమందుననే మానవుడు ధర్మశీలుడు కావలయును. ఎందుచే
ననిన జీవితము అస్థిరము గదా! ఎవని కెప్పుడు మృత్యువు గలదో ఎవరూ ఎరుగర

శ్లో ॥ నజాతు కామాన్నభయా న్నలోభాత్
ధర్మం త్యజే జీవిత స్యాపి హేతోః
ధర్మో నిత్యః సుఖదుఃఖేత్వఽనిత్యే
జీవో నిత్యః హేతు రస్యత్వ నిత్యః॥

— మను : 2: 84

"ధర్మము నిత్యము. సుఖ దుఃఖములు అనిత్యములు. కావున సుఖేచ్ఛచేగాని, భయముచే గాని లోభమున గాని ప్రాణాపాయ కాలమందు గూడ ధర్మమును వీడ రాదు. జీవుడు నిత్యుడు. వానికి కారణములు అనిత్యములు. కావున అనిత్యమైనవాటికై వ్యర్థ ప్రయత్నము సేయక నిత్యుడైన జీవునికి నిత్యమైన ధర్మము కొఱకై యత్నము గావించుట శ్రేయము.

"కనుక సిద్ధునిపై ద్వేషము వీడి మంచితో మెలగుము."— అని ధర్మ ప్రబోధము చేసినది మాత. కాని వారికి తృప్తి కలుగ లేదు. "అయిన తండ్రినిజేరి మీరే మీము ఉద్దేశ్యము తెలుపుడు." అనినది గోవిందమ్మ.

"లేదమ్మా! నాన్నగారు వినరు. నీవే ఈ కార్యమును నెర వేర్చవలయును. తండ్రిగారితో నీవే ఈ విషయమై ప్రస్తావించి తగు నిర్ణయము చేయ వలయును.— లేకున్న పరిస్థితుల ప్రభావము చాల తీవ్రముగా నుండును. తరువాత ఏమనుకొని నను ప్రయోజనము లేదు."— కోదండరామయ్య.

"భగవాన్! ఏమిటీ పరీక్ష. నన్ను సేవించువాని కన్యాయము చేసి పాపమెట్లు మూట కట్టు కొందును. ఈ పుత్రులేమైన సిద్ధున కపకారము తలపెడుదురా! దేవా! నీవే వీరల రక్షించవలయును. దుర్బోధలు వీరిని సంపూర్ణముగా పెడత్రోవను పెట్టినవి."- అని మది తలంచి "సరియే నేనే మీ తండ్రితో మాట లాడెదను. అంతదనక ఓపిక పట్టి యుండుడు. తొందరపడి ఏ అఘాయిత్యమున కొడి గట్టకుడు."— అని హెచ్చరించి లోని కరిగినది.

గోవిందయ్యలో ఒక విధమైన తర్కము ప్రారంభమైనది. తల్లిగారి మాట లలో నిజము అతనికి అవగతమైనది. తాము నిజముగ తప్పచేయ చుండిన యట్లు నిర్ణయమున కొచ్చినాడు.

"తమ్ముడూ! పోతులూరయ్యా! అమ్మ చెప్పిన విషయముల నొక్కసారి అవలోకన చేసికొనుము. ఆమె మాటలలోని పరమార్థము నీకర్థమగుటలేదా! సిద్ధునిపై మనము అనవసరముగ కక్ష బూనుటచేతనూ మనము మాట గట్టుకొనుటయేగాక ఇంకేమియూ కాదు. ఈ చపలుల మాటలు విని పెడమార్గమున బోవుట ధర్మము కాదు. కక్ష మనలను కాల్చినట్లుగా కాల్చి దహించి వేయునే గాని శాంతి చేకూర్చదు. ఇన్నినాళ్ళుగాలేని ఈ వైరము యిప్పుడు మాత్రమేల? నిజముగ సిద్ధుడు తండ్రి గారికి చేయు సేవలు వీరిలలో ఏ ఒక్కరైననూ చేయ గలరా? కనీసము చేయుటకు ప్రయత్నించిరా!— వార్ల సంగతి యటుండనిమ్ము. మనమూ! గురు పుత్రులమని గర్వించుచుంటిమేగాని, జ్ఞాన ప్రకాశులమగుటకు మనము చేయు ప్రయత్నము సిద్ధుని ప్రయత్నముతో పోల్చిన ఎంత యుండగలదో ఆలోచించుము.

"ఓంకారయ్యా! నీవే మందువు."

అన్న చెప్పినది బాగుగనేయున్నది. ఏమన్నా! గిరి రాజయ్యా పోతులూరయ్యకు నచ్చినట్లులేదు."

"నచ్చుట!— నచ్చకపోవుటాకాదు. సిద్ధుని భక్తి తత్పరతలు కాని, అతని కార్యదీక్షా దక్షతలనుగాని శంకించుటలేదు. కాని ఎంతైననూ అతనూ మానవుడే కదా! అనూ సమయ సందర్భములను బట్టి, నాయనగారి మంచితనమును, ప్రేమనూ, ఆసరగా గైకొని రేపు మఠాధి పత్యముకే స్వీకరించిన మనమతనికి ఊడిగము చేయ వలసి వచ్చును. ఇది నామాటకాదు. ఇతర శిష్యులందరూ అనుకొనెడి మాట. వారి మాటల యందునూ కొంత నిజము లేక పోలేదు గదా !"

"ఏమో! నాకందు నెంత మాత్రము నమ్మకము కలుగుటలేదు. మఠము బ్రహ్మము గారిది. ఆయన కుమారులము మనము. హక్కుల ప్రకారము చూచిననూ కుమారులమైన మనకు హక్కుండునుగాని, సిద్ధునకెట్లు హక్కుండును. అయిన తండ్రిగారు మాత్రమంత నిర్దయగా, కాఠిన్యముగా ఎట్లు వ్యవహరింతురు. అనవసరముగా ఈ పనికిరాని పదిమంది శిష్యుల మాట విని మనము తండ్రిగారి మనసు నొప్పించుట భావ్యము కాదు"— గోవిందయ్య.

"నీవు దూరమాలోచించుట లేదన్నా! అగ్నిజ్వాల లంటుకొనిన పిదప హరిత పత్రముల పట్టుకొనిన ప్రయోజనముండునా!"— పోతులూరయ్య.

"ఏమో నీవాదన నాకు మంచిదిగా తోచుటలేదు."

"ఔను! నావాదన చెప్పుచూ అట్లనేయుందును. తీరా కొంప మునిగిన తరు వాత గాని తెలియదు. శివుడు ఆత్మలింగమును రావణ బ్రహ్మకిచ్చిన పిదప గదా దానిని రక్షించుకొను భారము సంవరూ స్వీకరించవలసి వచ్చినది."—అని నాడు పోతులూరయ్య.

"సరియే! తల్లిగారిపై భారముంచితిమిగదా! తండ్రిగారితో మాటలాడుదునని చెప్పితిగదా! ఇంతలోనే మనమేల యిట్లు వాదోపవాదములు చేసికొనవలె"— ఓంకారమయ్య.

"తండ్రిగారొప్పుకొందురా యేమి? అది ఎన్నటికినీ జరుగదు. సిద్ధయ్యను పెడలనంపుట కలలోని వార్తయే తప్ప ఇలలోని వార్త మాత్రముగాదు" — గిరి రాజయ్య.

"పోనీలే అన్నా! సిద్ధయ్యను ఉండమనుడు. అప్పుడే ఆలోచించు కొందుము అతనూ మంచివాడే. ఎవరో ఏవో గిట్టని సమాచారమందించినంత మాత్రమున దానిని పట్టుకొని మనమేల యిట్లు అతనికి అన్యాయము చేయ తలపడవలె!" అని నాడు ఓంకారమయ్య.

"ఆలోచించుకొనుడు సోదరులారా! నాకు మాత్రమీ విషయముంచెట్టి ఉత్సాహములేదు. ఒక విధముగా చెప్పవలయునన్న సిద్దయ్యను పెడలనంపుట నాకూను యిష్టములేదు."—అనినాడు గోవిందయ్య.

"అన్నా! తొందరేల? - అమ్మగారితో మాటలాడిన పిదప ఆలోచింతము"- అనినాడు గిరిరాజయ్య. అంతటితో వారు అచ్చటనుండి పెడలినారు.

o....o

సిద్దయోగి ప్రసిద్ధభారతం :-

-: ఇరువది ఎనిమిదవ భాగం :-

నాటి రాత్రి పనులన్నియు పూర్తియయిన పిదప శ్రీగురుడు శయ్యా మందిరమున కరిగిన పిదప తానునూ భర్తననుసరించి, పాద సంవాహన మొనర్చుచు పుత్రుల ఈప్సితము నొక్కొక్క మాటనే బయటపెట్టినది గోవిందమాంబ.

"అయ్యయ్యో! ఎంతటి దురవస్థ సంభవించినది. నీతి నియమములు కలిగి జ్ఞాన సముపార్జనా యుక్తచిత్తుడై ఎంతటి కఠినతర దీక్షను సిద్దుడు వహించుచుండెనో ఎఱుగక అంతటి సాధుమూర్తిపై కినుక వహించిరా కుమారులు.

"సిద్దుడు అంటరానివాడా! అయిన సిద్దుడు అంటరానివాడైన అంటగలిగిన వాడెవడు మరి? క్షమించరానిదీ అభాండము. అత్యంత హేయమైనది. ఇట్టి అభియోగము ప్రతిపాదించి బిడ్డలు అంటరాని తనమునకు చేరువయగుచుండిరి. గోవిందా! కులము కాదు ప్రధానము. గుణము. మహాత్ములకు 'అంటు' అన్నది వేరే యొకటుండునా చెపి!

సీ॥ బోయకులంబునన్ బుట్టిన వాల్మీకి
యమహాత్ము డగుట బ్రహ్మర్షిగాడె.
వేశ్యకాంతకు నుద్భవించినట్టి వశిష్టు
డమలాత్ము డగుట బ్రహ్మర్షిగాడె
బెస్త చేడియకు నావిర్భవించిన వ్యాసు
డమలాత్ము డగుట బ్రహ్మర్షిగాడె,
చండాలయువతికి జన్మించిన మతంగు
డమలాత్ము డగుట బ్రహ్మర్షి గాడె.

గీ॥ అల్పకులులైన సుజ్ఞానులగుదురేని,
యవని నగ్రత్వమునను బూజ్యతనుగనరె
వారి నస్పృశ్యులనగల వారు గలరె
సిద్దు డట్టిడు గాదె యోజింప గాంత.॥

సిద్ధయోగి చరిత్రము : శ్రీకాశీపతి అవధానులు :

"గోవిందా! కుమారులలిగిన అలుగనీ! కులమువారంత కట్టకట్టుకొని ఊరేగుదురుగాక! యితర శిష్య జనంబులంత నన్వీడిపోవుగాక! నేను మాత్రము సిద్ధుని బొమ్మని చెప్పనుగాక చెప్పను".— అని శ్రీగురుడు తన నిశ్చయమున వెలుకబలికినాడు.

..../*/....

సిద్ధయోగి ప్రసిద్ధభారతం :-

-: ఇరువది ఏడవభాగం :-

"అమ్మా! నాన్నగారేమనినారు"— కుమారుల్,

"ఏమని చెప్పమందురు? మీ తండ్రిగారు ధర్మసంస్థాపనార్థము పుట్టిన పరమేశ్వరావతారులు. వారు ధర్మము తప్పి నడతురని మీరెట్లు భావింతురు. 'ఏకమేవా ఉద్వితీయంగు బ్రహ్మ'- అనిన వారే!- 'ఏకం సత్ విప్రా బహుదావదంతి'-అనిననూ వారే!- భక్తజన హృదయమందిరము ఆయన నివాసము. సిద్ధయ్యలో ఆయన, ఆయనలో సిద్ధయ్య ఐక్యమై యున్నారు. వారిని విడదీయుట అసంభవము. అందుకు ప్రయత్నించుట అజ్ఞానము. మహాపాతకము. నా మాట విని మీరు మీ ప్రయత్నముల మానుడు. తండ్రిగారి కాగ్రహము తెప్పింపకుడు. ఆ దేవుడు ఆగ్రహించిన ఎటువంటి దుష్ఫలితములు, దుష్పరిణామములు, సంభవించునో అనూహ్యము. ఎంతటి దారుణ ఫలితముల ననుభవింపవలసి వచ్చునో చెప్పజాలము."— అని హితవు చెప్పినది గోవిందమ్మ.

"అమ్మా! మీరెందుల కంతకష్టము. కడుపున పుట్టినమేము కానివారమై ు. ఎటనుండో వచ్చిన మతాంతరరుడు సిద్ధయ్య మీకు ఆప్తుడైనాడు. ఇంక పనియేమి? మేమింక అడవులకు పోదుము. మీరందరూ సిద్ధయ్యతో కూర్చుని జనరీతి మందిరమందు గౌరవాభిమానముల పొందుడు. నీకునూ మాకునూ ుబు దీరినది."— అని కోపంబున వారు ధరియించియున్న నొత్తులు తీసి తల్లి పాదముల చెంత బడవైచిరి....ఘోరమనేడ్చుచు అట నుండి కదలిరి.

గోవిందమాంబ అంతయూ ఆలోచించినది. ఆమె సామాన్యురాలు కాదు. తీదేవి వరప్రసాదంబున పుట్టి పతివ్రతాలలామ. శివస్వరూపుడైన శ్రీవీరగురుని త్ని. పాపమున కొడిగట్టునా? ఆమెయు అంతర్వీక్షణ సేయగలదు. ఆమె బు మూసికొని భవిష్యత్తు నొకసారి తిలకించినది. ఆమె కంతయూ అవగత . కర్మనుదాట ఎవరికైననూ సాధ్యముగాదు. సిద్ధయ్య కొంత మానసికాం , వ్యధ చెందవలసి యుండుట ఆమె గ్రహించినది. కాని అతడు విజయ ంబులు మ్రోయించుననియూడ ఆమె కవగతమైనది. కాని కలిగెడు అవమానము ్రాలికము. అతడా కర్మననుభవించుటకు నేనునూ దోహదకారి కావలసి నే!- తద్వారా నేను పాపము చేసిన దాననగుదును. కాని అతనికి ఆ కర్మ ్ విచ్ఛేదనమగును కనుక!- నేనపాటి తప్పిదముసేయక తప్పదు.

"శ్రీగురుడు సిద్ధునెప్పుడూ వెన్నంటియే యుండును. అతని కెట్టి పరిస్థితుల ననూ ఓటమి రాదు. సిద్ధయ్య ధీశక్తి, భక్తి బహిర్గతము కావలయునన్న ఔన్నత్యము పదుగురకు తెలియవలెనన్నను..అతడు నిర్మలుడు, నిశ్శంకుడు నందుడు, నిశ్చలుడని కుమారులు తెలియ వలెనన్నను, అతడు నిర్మోహుడు ంకారుడు, ఈర్ష్యారహితుడు, ఎంతటి కఠిన పరీక్షనైన ఎదుర్కొనగల గుండె రము, ధైర్యము కలిగినవాడు, దుష్టసంకల్ప రహితుడు, ప్రశాంతచిత్తుడు, కార్య హణ దీక్షాదక్షుడు, పట్టువదలనివాడు, సత్ప్రవర్తనముల సాధించగల శక్తిమంతుడు, , నిష్ఠ, నియమము కలిగిన దృఢ సంకల్పుడు.— అని కన్నబిడ్డలకు తెలియ న్న సిద్ధయ్య కీర్తిచంద్రికలు నలుదిశలూ వికసించి, విస్తరించవలయునన్న ళ్ళ కళ్ళు తెరపిడిబడి, సిద్ధయ్యలోని నిజతత్త్వమును, స్నిగ్ధ, సిద్ధ స్వరూప చూడవలయునన్న, సిద్ధయ్యను క్షమాభిక్ష వేడి, వారి వారి దోషములను,

పగలను, ఈర్ష్యను ధ్వంసము చేసికొని, పవిత్రులు కావలసియున్నను-తానీ నాటకము తప్పక ఆడి తీరవలయును....తానీ కపట నాటకము కేవలము కుమాళ్ళకు దుర్బోధ ప్రభావ సంజనిత దాత్యహంకార జాడ్యమును పోగ్రోలుటకు, సిద్ధునిపై పెంచుకున్న ఈర్ష్యాద్వేషములు పటాపంచలగుటకు, హృదయ మాలిన్యమును ప్రక్షాళనము చేసికొని, జ్ఞానకాంతుల నింపుకొనుటకు మాత్రమే ఆడుచున్నాననియు, సిద్ధునిపై ద్వేషముతో కాదనియు, తనకు తాను సమర్థించి చెప్పుకొని, భర్త పాద ద్వయమును, ఆ దివ్య స్వరూపమును మనసున తలచుకొని, స్మరించి, ప్రార్థించి, మనసుతోనే తాను సంజాయిషీ చెప్పుకొని, నయన కమలముల నుండి రాలు కన్నీటి బిందువులు తుడుచుకొని, బిడ్డల కౌగిట చేర్చుకొని, తానునూ దుఃఖించుచు "నాయ లారా! మిమ్ము చూడకుండ నొక్క క్షణమైనను బ్రతుకగలనా! కానల కేగుదెంచిన మిమ్ము కానక నేనొక్కదానను గృహము నందెట్లుండ గలను. సరియే కానిండు. ఈ కార్యక్రమమున నాకొకింత పాపము రానీయుడు. మీ గురించి ఆ పాపభారమును, బాధను భరించెదను. మదీయ స్వామి నాపై అలిగి, ఆగ్రహించినను సరియే! సిద్ధునకు చిక్కులు గల్పింతును. చీకాకుల సృష్టింతును. ఇడుములు గుడిపింతును. మానసికముగ బాధింతును, వేధింతును. ఇప్పట్టున నతడు పారిపోక యేమి చేయ గలడు? అతడు పారిపోకయుండిన మీరేమి చేయగలరో! అదియునూ చూతును. మీకునూ కన్నుల పండువగ నుండును. ఆనందముగ నుండును. మీ సుఖమునకై, ఆనందమునకై కన్నతల్లి కింత పాపకార్యమును మూటగట్టిన పుణ్యము మీకునూ దక్కును."

"అమ్మా!"

"మీకు వలసిన దదియేగదా! అమ్మా-యని అరిచిన ప్రయోజనమేమున్నది. రాబోవు దుష్పరిణామములకు నేను బాధ్యత వహించను. నాటి శ్రీరామ బ్రహ్మ బాణమెంతటి అమోఘమో! నేటి శ్రీ వీరబ్రహ్మము మాటయు నంతటి అమోఘము. అది మాత్రము [illegible]కుడు. అందులకు మీరే బాధ్యులగుదురు. అప్పుడు మరల వచ్చి 'అమ్మా! నీపై [illegible]ంచవలయునని నా కాళ్ళావేళ్ళా పడినను ప్రయోజన ముండదు. నేనేమియూ చేయజాలను. ముందుగనే హెచ్చరించుచుంటిని. ఎవరి

కర్మకు వారే బాధ్యులుకాని, ఒకరి కర్మకు మరొకరు బాధ్యులు కాలేరు. జాగ్రత్తగా ఆలోచించుకొనుడు. తరువాత దుఃఖించిన ఫలితము శూన్యము. వెడలుడు"— అనినది.

పుత్రులు, యితర శిష్యగణంబులు కొద్దితరి ఆలోచనా నిమగ్నులయిరి. కాని, సిద్ధుడు వెడలిపోవునను సంతోషమున యితరముల గూర్చి వారాలోచింపలేక పోయిరి. వారు ఆ కాలమందు తమోగుణ, రజోగుణబద్ధులై ప్రవర్తించిరి గాని, వేరు కాదు.

"కేవలము యిది ఈ పుత్రులను దుర్బోధ, దుర్భావ సంజనిత పిశాచ కబంధ పరిష్వంగ బలవత్తర బంధనల నుండి విముక్తులను చేయుటకు తప్ప అన్యము కాదు. భగవాన్! నన్ను క్షమింపుము."— అని లోలోన స్వామి పాదములకు నమస్సులర్పించినది గోవిందాసని.

ఆమె కన్నుల నుండి కారెడు కన్నీటి వాన నామె వక్షస్థలమే స్వీకరించినది 'కాటుక కంటినీరు చనుకట్టు పయింబడ నేల యేడ్చెదో' అని బమ్మెర పోతనామాత్యుడు వర్ణించిన సరస్వతీ దేవివలె ఆమె అక్కడ ప్రత్యక్షమయినను, అజ్ఞానోద్భవ భావవల్లరీ వలయ బంధీకృతులైన పుత్రాది జనములకు ఆ దివ్య స్వరూపము కానంబడదయ్యె.

నాటి నుండి ఆమెలో కర్మ-కర్తవ్యము, కాఠిన్యము విశృంఖల నాట్యము సేయ ప్రారంభించినవి. "సిద్ధునకు భోజనాదుల యందు బాధలు కల్పింతును. ఆ బాధల కోర్వజాలక అతడు శ్రీగురునకు విన్నవించును. శ్రీగురుడు నన్ను ప్రశ్నింపును. నేను కుమారుల పైబడి మరిగొంతసేపు స్వాములకు వెల్లడింతును. పరిస్థితులెట్లు మారునో వేచి చూడవలయును. మహామాయ యేమి చేయుచున్నదో?- సిద్ధుడు విజయుడగును. అందుకు సందియమేల?"— అని అనుకొనుచున్న సమయమున [illegible] పరిచారిక యొకతె అటుగా వచ్చుట చూచి, కుమారులు పరిచారిక సేవలకు [illegible] వెళ్ళింపేదియో యాడిరి. గోవిందమాంబ కది గ్రహించుట కెంతయో సేపు పట్టలేదు. దుష్టపన్నాగమని తెలిసికొనెను.

పరిచారిక మూలము కొంత సేపు ప్రవర్తించినను, కుమారులు పెట్టు బాధలకును, ప్రలోభములకు, యితర శిష్యజనంబులు ఎటు చూపించిన పాతివ్రత్యమునకు

తలవంచి, సరియేననినది. గోవిందమాంబ వారి దురితపు నడకలు, దుర్మార్గపు యోచనలు గ్రహించి వారి ప్రభావమెటు లుండునోయని వేదనాభరిత యైనది.

"ఏది యేమైననూ సిద్ధుని పరాజితుని చేయుట జరుగనిపని. హరిహరాదు లెదురు వచ్చినను సిద్ధుని యిక్కడ నుండి వెడలనంపలేరు. గురుకటాక్షమతనికి సంపూర్ణ రక్షణచక్రమై నిల్చియున్నది. సిద్ధునకూ కొంతకష్టకాలమైననూ కుమాళ్ళకు కనువిప్పు కలుగుటకు కూడ యిదియే మంచి సమయము."— అని మరోవంక మనమున తలచినది.

ప్రాతఃకాలమైనది. పక్షులు కిలకిలారావంబులు సేయుచున్నవి. ఉదయ పవనము మెల్లగా వీయుచు జీవులకు హాయిని, ఆనందమును చేకూర్చుచున్నది. సకల జీవులు వాటి వాటి నిత్యజీవన సంగ్రామమున కాయత్తమైనవి.

మఠంబు నుండి శ్రీగురుడు సిద్ధయ్యను ఏదియో కార్యార్థమై ఇంటికి పంపి నాడు. సిద్ధయ్య గురునాజ్ఞ గోవిందమాంబ కెఱింగించి అచ్చటనే నిలువంబడినాడు.

ఇంతలో పనిచానిక చేత చీపురు ధరించి వచ్చి "ఏం నాయనా! తెల్లవారెనదా! వచ్చి కూరుచుంటివి. ఉదయము లేచుచునే నీ ముఖము చూడవలసివచ్చినది. ఏమి జరుగనున్నదోయేమో! పోయిపోయి పింజారి వాని ముఖముం జూచితిని! లేఁ-లేఁ-" అని సిద్ధయ్యను గదిమెనది.

సిద్ధయ్య ఒక్కసారిగా విచలితుడైనాడు. "ఏమి యీ దూతిక ఈనాడింత అసహ్యముగ, అసభ్యముగ ప్రవర్తించుచున్నది. ప్రతినిత్యము గౌరవముతో, అభి మానముతో పలుకరించు యీ పనిచానిక ఈనాడిచేల? వచ్చినే ఆగ్రహించి అపసవ్య ముగ మాట్లాడుచున్నది!"— అని మనమున తలచి ప్రక్కకొదిగి నిల్చుండినాడు. ఈసారి ఆకసవంతయు అతనిమీదకు చిమ్మి "అటుల దున్నపోతువలె నిల్చుండెద వేల? కన వూడ్చుచుంటిని. తెలియదా? కన్నులలో సూదులు గ్రుచ్చుకొంటివా యేమి? కనబడుట లేదా? కదలవేమయ్యా!" అని ఒక్కనెట్టు నెట్టినది. అనుకొనని యీ హఠాత్పరిణామమునకు సిద్ధయ్య తూలి క్రిందపడినాడు.

పనిచానిక చేయు పనులను, అనెడి మాటలను అన్నియునూ గోవిందమాంబ చూచుచున్నది, వినుచున్నది కాని. "అదియేమని"— అనదాయెను. 'భర్త కొట్టి

సందుకు కాదు. తోటికోడలు నవ్వినందుకు నినట్లు "పరిచారిక పరాభవించుచుండ మాత్రముచేపత పరిచారికను దండించుటకు మారు మిన్నకున్నవేల?"— అతనికి అర్థమగుటలేదు.

"గురుసేవల కీవిషయము విన్నవించుటయా! వలదా! గురుదేవి ఎందుల కిట్లు ప్రవర్తించుచున్నది. నేను వచ్చిన నాటినుండి తన కన్నబిడ్డల మిన్నగా, నన్ను సాకు ఈ మాతృమూర్తి నన్నేల యిట్లు హింసకు గురి చేయుచున్నది. ఏమో! తెలియదు. నేను నా గురుదేవిని తప్పుపట్టరాదు. తీవ్రపడి గురుదేవునకు విన్న వించిన ద్రోహినగుదును. నిన్నటి దినంబున గురుపుత్రులునూ విరుద్ధముగ ప్రవర్తించిరి. దీనికేదైనమా కారణమున్నదా!"— అని తనలో తాను పరిపరి విధముల ఆలోచనలతో అతాకుతలమై పోవుచుండెను.

అట్లు కొంత సమయమైపోయినది.

"సిద్దా! భోజనమునకు రమ్ము"- అని వీరగురుడు సిద్ధుని ఎలుగెత్తి పిల్చి నాడు. సిద్దయ్య కర, పాద, ముఖపద్మములు ప్రక్షాళనము చేసికొని వచ్చి కూర్చొన గానే "సిద్దా! నీవు వెంటనే బజారునకు వెళ్ళి ఇవిగో ఇందు పొందుపరచిన పదార్థముల నన్నియు కట్టించుకొని రమ్ము. ఇవన్నియు నిండుకొనినవి"- అని ఒక పట్టికనిచ్చినది గోవిందమ్మ.

"ఆజ్ఞ! మాతా!"- అని సిద్దయ్య మారుమాటాడక బయటకు వెళ్ళినాడు. కొద్దికాలమైన పిదప ఆ పని పూర్తిచేసికొని వచ్చి భోజనమునకు కూర్చుండ "అన్నమంతయూ నిండుకొనినది. మరల వంట చేయవలె. కొద్దిసేపాగవలయును"- అని అవతలకు వెడలినది.

కాని తన కనుల ముంచే అందరూ భోజనముల చేసినారు. మరి వారల కందరికి భోజన మెట్లు వచ్చినది. "నిండుకొన్నది నా ఒక్కనికేనా! ఏమీ విపరీతమై ఖరి"- అని తనలో తానే విస్మయ మందుచున్నాడు సిద్దయ్య. తీరా తను భోజనమునకు కూర్చొనగనే "ఇప్పుడింక భోజనము తయారుచేయుటకు వలను పడదు. అమ్మగారు అవతలకు వెళ్ళమనిరి"- అని పరిచారిక తెలియచేసినది.

సిద్దయ్యకు అర్థమగుటలేదు.

గోవిందమ్మయూ తనలో తాను ఆతాకుతలమై పోవుచున్నది. సిద్దయ్య ముఖము చూచి కన్నీరు ధారాపాతముగ కార్చుచున్నది.

"ఈ నాటకమున కేదియో కారణముండవలయును. అన్నపూర్ణమైన ఆయమ్మ తన కన్నము లేదనుటయూ! నమ్మజాలను. ఇందేదియో మోసముండినది."- యని తలంచి, ఆనాడు తాను అందరి కంటె ముందే వచ్చి భోజనమునకై కూర్చుండి నాడు.

"ముందుగా నీకే వడ్డించవలయునా యేమి?"- అని పలుమారులు పలువిధ పనులను పైనబెట్టి మఠమునకు, యింటికిని త్రిప్పుట ప్రారంభించినది గోవిందమాత. అప్పటికైనను మొదటిలోవలె, కరుణతో యింత కబళము పెట్టదాయె. సిద్దయ్య ఆకలితో నకనక లాడుచుండెను.

ఒకనాడు పోతులాచార్యుడు "ఒరేయి సిద్దా!"— అని కేకవైచినాడు. సిద్దయ్య ఆ పిలుపుకు, ఆ పిలుపులోని ఆగ్రహ ధ్వనులకు నిశ్చేష్టుడైనాడు. అతని సంబోధనలో కన్పించిన, వింతయైన, విపరీతమైన యీ ధోరణి సిద్దయ్యను విపరీత బాధకు గురిచేసినది. ఇంతవరకూ గురుపుత్రులెవరూ సిద్దుని 'ఒరేయి' అని సంబో ధించి ఎఱుగరు. గురుదేవులు గానీ, గురుదేవిగాని ఎప్పుడైనను అదియూ ప్రేమాధి మానములు వెల్లువిరుకు సమయములో అట్లుందురు గానీ, ఈ రోజింత కఠినముగ 'ఒరేయి' అని పిల్చుటలో గల వింతధ్వనులు సిద్దయ్యను ఎంతగానో బాధించినవి. ములుకులవలె గ్రుచ్చుకొనినవి. సిద్దుడా పిలుపుకు అప్రతిభుడై నాడు. తమాయించు కుని "ఏమిటి గురుపుత్రా!" — అని ఎదురుగా వచ్చి చేతులు కట్టుకొని నిలువబడి నాడు.

"ఏమున్నది. నీకు పొగరు తలకెక్కినది. తేర తిండితిని ఒల్లు పెంచుకొంటివి గాని పని మాత్రము సున్న. నీవు వెంటనే అడవికిం జని 'శౌనక శృంగపుష్పములు' కొని రావలయును. అవి అత్యంత అవసరము."

"శౌనక శృంగ పుష్పములా! ఆశ్చర్యముగ నున్నదే. ఇటువంటి పుష్పము లుండునని నేనెప్పుడూ వినలేదు. గురుదేవులూ యిటువంటి పుష్పములుండుననిగానీ, అవి మానవావసరముల కుపయోగపడునని గాని చెప్పియుండలేదు. శౌనక మునిగా

శునకమే గదా! శృంగ మనగా కొమ్ము. కుక్కకు కొమ్ము లెట్లుండును? ఆ కొమ్ము లకు పూవులెట్లుండును."— అనినాడు సిద్దయ్య.

"ఏమిరా! మాకే ఎదురు చెప్పుచుంటివి. ఒల్లు క్రొవ్వి గురుపుత్రులనే అప హాస్యము చేయుటకు సమకట్టితివి!- నిన్నింక ఊరక వదలిన ముమ్ముందు నీవెంతటి మహోపద్రవమునైననూ సృష్టించ గలవు."— అనినాడు పోతులూరయ్య.

"క్షమింపుడు గురుపుత్రా! శౌనక శృంగపుష్పములు దొరకవంటివిగాని నేనేమియూ అనకూడని మాటలనలేదే. ఎందుల కట్లు దూషింతురు. లభ్యము గాని సరకుల దెప్పని చెప్పుట నన్ను వ్యర్థునిగా ఋజువు చేయుటకా లేక వేళాకోళమా!" అనినాడు సిద్దయ్య.

"ఆః! ఆః!— ఔను వేళాకోళమురా! లేక లేక నీ తోడనే మేము వేళాకోళ మాడవలయును. మాకింక ఎవరూ లేక!- కులభ్రష్టుడవు. మతభ్రష్టుడవు. అంటరాని వాడవు. నీతోటి మాకు వేళాకోళమేమిటి? వేళాకోళమాడుటకునూ సమాన ఉజ్జీ ఉండవలయును. సేవకుడవు. నీతోటినూ మేము వేళాకోళమాడుట"- అని అంతటితో ఊరుకొనక సిద్దునిపైబడి బాదబాదుట మొదలిడినారు.

సిద్దుడన్నిటినీ సహించుచుండెనే గాని పల్లెత్తి మాటాడుటలేదు. గోవిందయ్య అన్నిటినీ చూచుచుండెనే గాని, తాను మాత్రము సిద్దునిపై చేయి వేసికొనలేదు.

అందరితో అలసూ అవలకు వెడలిరి.

సిద్దయ్యకు అన్నము కఱువైనది. మఠమందు గురువేవుడిచ్చిన పూజా ప్రసా దములతో కడుపు నింపుకొనుచుండెను. దానితోనే తృప్తిపడుచుండెను. గురు దేవునితో ఏ ఒక్క విషయమును కూడా చెప్పలేదు. జరుగుచున్న ప్రతి విషయమును తన గర్భకుహరమునందుననే దాచిపెట్టుచుండెను. గురుసేవలో ఏ మాత్రమూ ఏమరుపాటు రానీయుటలేదు.

ఎవరెన్ని విధముల ఏడిపించినను, దూషించిననూ, కష్టముల పెట్టిననూ, పీడించిననూ. గురుదేవులకు నివేదించడు సరికదా! పారిపోవుటకెట్టి పరిస్థితులలోనూ ప్రయత్నించుట లేదు. పారిపోవుదనని గురుపుత్రులు, ఇతరులు తలంచిరిగాని, సిద్దయ్య హృదయములో అసలా దురాలోచనే లేదు. కష్టమిచ్చినప్పుడు అనుభవించుట

నేర్చుకుండెను గాని దానినుండి పారిపోవుట అతను నేర్చుకొనలేదు. అందువలన అతనిలో పారిపోవుటను ధ్యాస కించిత్తు మాత్రముగూడ లేదు. అసలా ప్రసక్తే లేదు. ఈ మారిన పరిస్థితుల వెనుక దాగిన ప్రచ్ఛన్న హస్తమేమిటాయని మాత్ర మతడు ఆలోచించుచుండెను. శుభతేజమును వీడలేదు. బ్రహ్మానందమనుభవించుటలో అవాంతరమేమీ లేదు. ధ్యానమందు నిమగ్నమైనచో అన్నపానాదులవిషయమే అతనికి గుర్తుండదు.

ఇవ్విధంబుగ రోజులు గడుచుచున్ననేగాని, కుమారిల్ల ఆశించిన మార్పు సిద్ధునిలో రాలేదు. పైపెచ్చు అతనిలో కఠోర నిశ్చయము, నిర్ణయము తొంగి చూచుచున్నవి. పట్టుదల పెరిగిన పైనము అతని ముఖములో ద్యోతకమగుచున్నది.

"హాఁ! మనము ఎన్నియిడుములు సృష్టించిననూ మొండిగ అనుభవించుట నేర్చియుండెను గాని, సిద్ధుడు మాత్రము కదలుటలేదు. పారిపోవ నుంకించుటలేదు. మన మాశించిన ఉద్దేశ్యము ఫలించలేదు. ఫలించునను ఆశయూ లేదు. ఇంక భయపెట్టి బలవంతమున వెళ్ళగొట్టవలయునే గాని, సాధారణ కృత్యముల కితడు వెరపొందడు."— అని తలంచి నాటి ఉదయమే స్నానాదికముల ముగించుకుని మఠప్రవేశము చేయబోవు సిద్ధునడ్డగించి

"ఆగూ! నీకిప్పుడు ఆఖరిగా చెప్పుచున్నాను. మర్యాదగా మఠము వీడిపుడు. మాలకు పోవుదువా? లేక బలవంతముగా నిన్ను బయటకు నెట్టమందువా? ఎదురు తిరిగిన దేహ శుద్ధి తప్పదు, జాగ్రత్త! ఏమందువు? ఏమందువు?— వీడిపోయెదవా?.... ఇదుగో! ఈ శిష్యజనంబులందరు నిన్ను అసహ్యించుకొనుచుండిరి. నీగాలి కూడ వారికి సోకరాదట!— నీ నీ మహాభాగ్యము వదిలించుటకు కుతూహలపడుచుండినావనియూ వీరంతయూ గ్రహించిరి.... కనుక [illegible] నీవు యిచటి నుండి నిష్క్రమించక తప్పదు."

"అన్నలారా! ఎందుకింతటి ఘోర శిక్ష విధించుచుంటిరి. నేనే పాపమూ ఎరుగను. నన్ను అన్యాయము చేయకుడు. నేను గురుసేవా మరంద పాన మత్తుడనై యుంటినే గాని ఏ యితర కార్యములందునూ కొరత చూపించలేదు. మీకార్యక్రమముల కేవిధముగనూ అడ్డు [illegible]. పైపెచ్చు మీరు ఆజ్ఞాపించు కార్యములన్నియూ బొడల దాల్చి నెరవేర్చుచుంటిని. మరెందుకు నన్నిట్లు వేధింతురు. అన్నా!

గోవిందయాచార్యా! నీవు పెద్దవాడవు. తమ్ముళ్ళకు చెప్పలేవా? నీదృష్టియందు నేను ద్రోహినా! దోషినా! చెప్పుమన్నా! చెప్పుము"— అని గోవిందయ్య చేతులబట్టి ఊపి ప్రశ్నించినాడు సిద్దయ్య.

గోవిందయ్యయేమియూ మాటాడలేదు. నిశ్శబ్దము వహించినాడు. ఓంకార మయ్యయూ ఏదియో చెప్పబోయెనుగాని పోతులూరయ్య రౌద్రాకారమును చూచి భయపడి ఊరకుండెను.

"అదంతయూ నీ కనవసరము. నీవు తక్షణమే ఈ ప్రాంతము వీడిపోవల యును. లేకున్న కడపనవాబు నుండి యీ యావత్ప్రదేశమునకే ముప్పువాటిల్లనున్నది. నీనుండి మమ్ముల నందరిని ఆపదలపాలు కమ్మందువా?— అఖండతేజో విరాజ మానమై యొప్పు మా బ్రాహ్మణ్యము నీవలన మంట కలసినది. కనుక నీవిచ్చట నుండుట కెంతమాత్రముతగదు. కడపనుండి నవాబు భటులు వచ్చులోపల నీవిట నుండి నిష్క్రమించుట యెంతైననూ మంచిది"—

"ఎంతమాత్రము కాదు. కడప నవాబు నుండి ప్రమాదము సంభవించుననెడి మాటసంపూర్తిగా అబద్దము. ఈ సంగతి మీ కెఱుకలేకపోవచ్చు. గురుదేవులకు తెలుసు. గురుదేవులే కదా నన్ను మహిమోపేతుని చేసి కడపకు పంపినారు. నవాబు నన్ను మెచ్చిసత్కరించి పంపినేగాని చెడుచేయ సంకించలేదు. కనుక నవాబునుండి ప్రమాద మనునది పచ్చి అబద్ధము తప్ప వేఱుగాదు. మీకెవరో గిట్టనివారు అందించిన తప్పుడు సమాచారము తప్ప అన్యము గాదు. అన్నలారా!"— అని యింకేదియో చెప్పబోవునంతలో "ఏమిరా! అన్నలారా! అన్నలారా! యంచు మమ్ము సంబో ధించుచుంటివి? ఏనాటి తమ్ముడవు. మాలివాడవా? మా యమ్మ నిన్ను కన్నదా? అన్నలట! అన్నలు. ఇంకనేదో మాటలేల?"— యని అతనిపైబడి మెడపెట్టి సిద్దుని బడనెట్టినారు యితర శిష్యులు కొంతమంది. క్రింద పడినవానిపైకెక్కి చెపుల వడ జెట్టిరి. గుదెల జెడాబడా గొట్టిరి. గాయముల చేసిరి. ప్రేటు ప్రేటునకు "గురు దేవా" యని ఎలుగెత్తి అరచుచుండెనేగాని ఎదురు తిరగలేదు. అది ఆసరగా తీసి కొని పోతులూరయ్య ఆతనిని విపరీతముగ బాధించెను. ఇంకనూ దెబ్బలకు తాళలేక సిద్దయ్య.

మ॥ అపరాధంబెప్పుడీ భవంబునను జేయన్ నేరకున్నట్టినన్
విపరీతంబుగఁగొట్టు చుంటివి మహావేశంబునన్ నీసుతున్
కృపతో నేలఁగ నీకుఁ దక్క మదిలే రెవ్వార లీ పట్లనన్
విపదంభోనిధి దేల్చిబ్రోచుటకు రావే తండ్రి! వీరేశ్వరా!

శా॥ ఈవే దేవుఁడ వీవెనా గురుఁడ వీవె తండ్రి వౌనంచు నే
భావంబందున నమ్మి తారక పదాబ్జ ద్వంద్వమునే గొల్చిన
న్నీవేళలన్ జనులంచు నీలసయు లెంతే కొట్టు చున్నారిదే
రావే!— చూడవె! బ్రోవవే! సదయ వీర బ్రహ్మవిశ్వేశ్వరా!

—సిద్ధయోగి చరిత్ర : శ్రీపోటూరికాశీపత్యవధానులు.

అని ఎలుగెత్తి సిద్ధుడు కేకవేసినాడు. అదే సమయంబున శ్రీగురుడు మఠంబునందు తపస్సమాధిలో నుండినాడు. సిద్ధుడు ఆర్తితో, భక్తితో నిడిన యాకేక వీరగురుని హృదయాంతరాళము చేరినది. ఒక్కసారిగా కన్ను తెరచినాడు. శ్రీగురున కంతయూ అవగాహనమైనది. కచుని కష్టపెట్టిన రాక్షసులు శ్రీగురుని కండ్లముందు గోచరించినారు. కనులు అరుణారుణములైనవి. మేఘ గంభీరధ్వానంబుతో పెద్దపెద్ద అడుగులు వేయుచు, భూమికంపించు చుండెనా యనినట్లు గురుదేవుడు రుద్రమూర్తియై అచ్చట కేతెంచినాడు.

అప్పటికే వీరగురుని రౌద్రాకారమునుగాంచిన పుత్రులు, గోవిందమాంబయు, ఇతర శిష్యజనంబులు భయభ్రాంతులై గడగడ వణంకుచు నిలువబడిరి. శిష్యజనంబులు పరువులు బెట్టిరి.

క॥ తిట్టుదునా యిలువెళ్ళఁగ! నెట్టుదునా తిరుగు లేని నెఱిశాపంబున్
బెట్టుదునా చేకోలదిగ। గొట్టుదునా యేమిసేతు గ్రహరులమిమ్మున్॥

— సిద్ధయోగి చరిత్రము.

అవి ప్రళయకాల రుద్రునివలె వచ్చిన వీరబ్రహ్మ గురుదేవుని భీకరాకారము జూచి, గోవిందమాంబ, కుమాళ్ళ కంత్యకాలము సమీపించినదని భయపడి, పరుగు పరుగున వచ్చి గురుదేవుని పాదంబులపై బడి కదలనీయక "పుత్రభిక్షపెట్టుడు" అని దీనవదనయై చెరగు పట్టి నిలుచ బడినది.

అంతవరకు కన్నుమిన్నుగానక ప్రవర్తించిన గురుపుత్రులు భీతావహులై దిక్కుతోచక శ్రీగురుని పాదంబులపైబడి "రక్షింపుడు. రక్షింపుడు"— అని పాదములు బట్టి విడువరైరి.

సిద్ధుడు రానున్న ఆపదను గ్రహించి ఎటులైనను గురుదేవుని శాంతింప జేయకున్న ప్రమాదములు వాటిల్లునని తలంచి యితర శిష్యజనంబుల వెరదీసి

"జై! వీరబ్రహ్మ జై! గోవిందమాంబ జై
గోవిందమాంబ జై! జై! వీరబ్రహ్మ జై"

అని నామ సంకీర్తనము ప్రారంభించినాడు. శిష్యులు, కుమారులు అందరూ అందున గొంతు కలిపి నామ సంకీర్తనము సేయగా శ్రీగురుడు శాంతించినాడు. గోవిందమాంబయు ఆవేదనను, ఆందోళనను వీడి, మందస్మిత వదనారవిందయై శ్రీగురుని చెంత నిలచినది.

"నిత్యము నాపాద పద్మముల సేవించుచు, శిష్యులలో మేటియైనట్టి అత్యంత వినేయుడైన సిద్ధయ్యను కొట్టుటకు మీ చేతులెట్లాడెనురా? కపట చిత్తులారా! కఠిన హృదయులారా! నా శిష్యుడైనను, తన సర్వస్వము నా కర్పించి, నన్ను శరణు గోరిన సిద్ధయ్యకు మీరు పనులు చెప్పినను విసుగుకొనక, భక్తితో, ఓపికతో, మీరు గురుపుత్రులను గౌరవముతో మీ ఆజ్ఞల శిరసావహించుచున్నందులకు యిదియా అతనికి మీరిచ్చు గౌరవము....మర్యాద!

"పోతులూరయ్యా!.... కొనగ శృంగపుష్పములు తెచ్చు బాధ్యత నేను నీకప్పగించుచున్నాను. సిద్ధయ్య కాదు. నీవే తెచ్చి సమర్పింపవలయును. లేకున్న"- అని యింకేదియో అనబోవుచుండ, పోతులూరయ్య స్వామిపాదంబుల బడి "బుద్ధి గడ్డి తిని, చెప్పుడు మాటల ప్రభావంబున తప్పుత్రోవబడితిని, క్షమింపుడు"- అని ప్రార్థించినాడు.

సతత గురుపాద సేవా తత్పరతలో మునిగి తేలుటతప్ప, అన్యులనెవరిని తలంచనట్టి సుధీమణిని, అతిభక్తితో, ఎట్టియాజ్ఞలనైన తిరస్కరించక నౌదలదాల్చి నెరవేర్చునట్టి విశ్వాసపాత్రుని, తల్లిదండ్రుల కన్న, చుట్టముల కన్న, అన్నియును మనమేనని తలచి, నమ్మికొని, మన యింట పడియుండి, మనల సేవించి జీవించు

యున్న పరమభక్తాగ్రగణ్యుని, గురుసేవా ధురంధరుని, అఖిల సద్గుణములకు నెలవైన వానిని, ఎల్లప్పుడు మేలేకోరు హితైషిని, పసివానిని కొట్టుటకు మీకు చేతులెట్లాడెను. క్రూరులైన మీరుండు ఈ గృహమందొక్క నిముసమైనను మాకు నిల్చుటకు సమయము లేదు. ప్రశాంత జీవన వనమందు విషగాలులు సృష్టించినారు. మీరలే ఈ గృహమునాయుల నేలుకొనుడు. నేనునూ సిద్దయ్యయూ కానలకేగగలము."— అని విసవిస కోప సుంకించి "సిద్దా!" అని అతనిని దగ్గరగా తీసికొని, అతని శరీరమంతయు అతని అమృతహస్తముతో తడివినాడు. సిద్దునిలో నూతనోత్సాహము, ఉత్తేజము కలిగినది. ఆ బాధంతయునూ చిటికలో మాయమైపోయినది.

అప్పుడు గోవిందమాంబ "పుత్రులారా! గ్రహించితిరా! నాడు నేనెంత చెప్పినను వినక, ఇతర ఈర్ష్యాపరులైన శిష్యులు కొందరు ప్రేరేపింప, సహజ మానవ బలహీనతలకు లొంగి ఇంతటి వైపరీత్యమును సృష్టించితిరి. నేను మీకు తగు గుణపాఠమును చెప్పుటకు, మీతో చేతులు కలిపినట్లు నటించితిని గాని సిద్దయ్యకు విజయము తప్పదన్న సంగతి నాకు ముందే తెలియును." అని శ్రీగురునివైపు తిరిగి "స్వామీ! నటించుటలో సిద్దయ్య నిబ్బంది పెట్టినది వాస్తవము. అన్నము పెట్టకుండుటయూ నిజమే! యిదంతయూ నాటకమే గాని నిజముగ నతనిని యిబ్బందుల పాలు సేయుట నా యభిమతము గాదు. అయినను దోషము దోషమే గనుక నేను పాపము చేసినదాననైతిని. తగిన శిక్ష విధింపుడు"- అని రెండు చేతులూ జోడించినది.

"అమ్మా!"— అనినాడు సిద్దయ్య.

"ఏను నాయనా!" అని దగ్గరగా తీసికొని, తలనిమురుచూ "అమ్మా! అన్నమని వచ్చిన నిన్ను పనులు చెప్పి బయటకు పంపినాను. అన్నము పెట్టని పాపిని." అని తనను తాను నిందించుకొను సమయమున సిద్దయ్య "అటుల పల్కకు తల్లీ! ఇదియంతయు దైవలీల! గురులీల! జరుగవలసిన విధి యున్నది. జరిగినది. అన్నలు గాని, మీరు గానీ ఎవరూ బాధ్యులు గారు. అందరమూ విధిచేత కీలుబొమ్మలమే! స్వామింప చేసికొన వద్దు."— అనినాడు సిద్దయ్య.

"సిద్దా! సోదరా! తెలిసి తెలియక, ఇతరుల ప్రోత్సాహమువలన, నీవే మఠమును కబళించి మమ్ముల కన్యాయము చేతువని, తండ్రిగారంతయూ నీకే కట్టబెట్టి మమ్ముల మాలకముగ నెట్టివేతురను భయముచే, స్వార్థ ప్రలోభము చేత యిట్లు ప్రవ

ర్తించితిమి. ఇంకనెప్పుడు యిటువంటి నీచ కార్యక్రమమున కొడంబడము. క్షమింపుము. అన్యథా తలంచకు”— అని సిద్ధుని వేడినారు.

“తప్పు. తప్పు. సోదరులారా! నేను చాల చిరుతను. మీరలే నన్ను క్షమించవలయును. మనల నందర క్షమించువాడు, రక్షించువాడు, ఆ వీర గురుడే- ఆ దివ్య తేజుని పాదములే శరణ్యము”- అని చెప్పి, సిద్ధయ్య శ్రీగురుని పాదములపై వ్రాలినాడు.

అందరూ వీరగురునికి నమస్సుమాంజలులర్పించిరి.

—o—

సిద్ధయోగి ప్రసిద్ధ భారతం :

## : ముప్పదవ భాగం :

సిద్ధుడు మొదటి నుండియు పరమేశ్వర ధ్యానానురక్తుడు. గురుసేవానురక్తుడు. వేదాంత విషయ శ్రవణాసక్తుడు. భగవత్కథా శ్రవణ, మననానురక్తుడు. సత్యాన్వేష కౌతుకుడు. ప్రశాంత చిత్తుడు. సతతము భగవన్నామ పీయూషపాన మత్తుడు. సంకల్పశుద్ధుడు. సిద్ధుడు. ప్రాపంచిక విషయ విరక్తుడు. సద్విషయానురక్తుడు. సన్మార్గ ప్రవృత్తుడు. శుద్ధుడు, పరిశుద్ధుడు.

జన్మతః అతనిలో శుద్ధాచరణ మనునది పాదుకొల్పబడి యున్నది. కనుక వీరబ్రహ్మ బోధల గ్రహించుటలో గాని, ఆచరించుటలో గాని, సేవానిరతిలో గాని, తీగ యల్లుకొని పోవునట్లు అతి శీఘ్రముగ పురోగమించుచున్నాడు.

నిత్యము బ్రహ్మముహూర్త కాలముననే నిద్రమేల్కాంచి, యోగముద్రల నవలంబించి, తదుపరి చన్నీటి జలకంబులాడి, విభూతి, గంధ, కుంకుమాదుల ధరించి, రుద్రాక్షమాలల ధరించి, బాలశివునివలె ప్రకాశించుచు, కాషాయాంబర ధారియై ధ్యానముద్రలో కొన్ని గంటల సమయము గడుపును. ఇది యంతయు శ్రీగురుని శిక్షణలో తు. చ. తప్పకుండ నెరవేర్చును.

ఒక్క క్షణము గూడ గురువు నెడబాయువాడు కాదు. ఎల్లప్పుడును గురు సన్నిధానముననే యుండును. సమయము చిక్కినపుడెల్లనూ శ్రీ గురుపాద సంవాహనము సేయుచు, వినకర్రతో వీచుచు శ్రీగురుని దివ్యచక్షువులలోనికి చూచుచు ఎంతయో ఆనందము ననుభవించుచుండును.

అది ఆనాటి సుప్రభాతవేళ. సిద్దయ్య శ్రీగురుని సుప్రభాతము కడురమ్యముగ గానము చేసినాడు. శ్రీగురుడును సంభ్రమాశ్చర్యములు చెందినాడు. సిద్ధుని తన్మయత్వమునకు, అతని కంఠము నుండి జాలువారు భక్త్యమృత శబ్ద సంపత్తికి, నిష్కల్మష మనస్తత్వమునకు, నిశ్చలాసంవస్థితికి శ్రీగురుడు సంతసించి అతనిని తలనిమిరి దగ్గరగా తీసికొనినాడు.

శ్రీగురుడు సుప్రశాంత, సుందరవదనారవిందుడై, ఆనందుడై, బ్రహ్మానందుడై, పరమానందుడై, వీరుడై, గంభీరుడై సర్వలోకములను తన మనోనేత్రముల దర్శించుచున్నటుల అర్ధనిమీలిత నేత్రజ్యోతి ప్రభాభాసితుడై, పద్మాసనాశీనుడై, ప్రచండతేజోభాసుడై, వసుడై, విభావసుడై, ప్రకాశించుచున్న శ్రీగురుని మ్రోల కరములు జోడించి, శిరస్సు వంచి, స్మరించి, నమస్కరించి, స్తుతించి, ప్రస్తుతించి సిద్ధుడు-

శ్లో ॥ చైతన్యం శాశ్వతం శాంతం వ్యోమాతీతం నిరంజనం
నాదబిందు కళాతీతం తంగురుం ప్రణమామ్యహమ్॥

- గురుగీత :

"హే! గురుసార్వభౌమా! నీవు విశ్వవ్యాపకుడవు. విశ్వకర్తవు, అనంతుడవు, శాశ్వతుడవు, చైతన్య స్వరూపుడవు. పరబ్రహ్మస్వరూపుడవు, పరమాత్మవు,

డవు. నిర్మలాత్ముడవు. అజ్ఞానాంధకారముల కతీతుడవు. అప్రమేయుడవు. ఆనందు డవు. అన్ని శక్తుల కాధారభూతమైన వాడవు. నీకు నమస్కరించుచున్నాను"— అని సిద్ధయ్య గురు పాద పారిజాతములకు అభివాద మొనరించి ఆశీనుండైనాడు.

"సిద్ధయ్యా! సుప్రసిద్ధుడవై ప్రపంచమందు ప్రఖ్యాతి గాంచెదవయ్యా! గురుసేవా దీక్షాదక్షుడవైన నిన్ను మించిన వారింకొకరుండరు. శిష్యలోకమునకు తలమానికమవై తప్తకాంచన సన్నిభుండవై సుప్రభాసితుడవయ్యెదవు."- అని ఆశీర్వదించినాడు శ్రీగురుడు.

శ్లో ॥ నగురోరధికం తత్త్వం। నగురో రధికం తపః ।
తత్వజ్ఞానాత్పరం నాస్తి। తస్మై శ్రీ గురవే నమః ॥

-గురుగీత : 93.

"గురువును మించిన సత్యము లేదు. తత్త్వమూ లేదు. తపస్సు లేదు. గురు సేవా భాగ్యము వల్లనే కదా సత్యదర్శనమగునది. తత్త్వరహస్యము తెలియవలె నన్ననూ గురుసేవయే మార్గము తప్ప అన్యమార్గమెందేనియూ లేదు. గురుసేవ వలననే తపఃఫలము సిద్ధించును. గురువును మించిన దైవమే లేదు కదా! ఓ గురు దేవా! నీ కిదే అస్మత్ కృతాంజలి"- అని సిద్ధయ్య అంజలి సమర్పించినాడు. అతనే మరలా కొంచమాగి

"తండ్రీ! గురుసార్వభౌమా! నాకు కల్గిన భాగ్యము అతీతమైనది, అమోఘ మైనది, అనిర్వచనీయమైనది. అప్రమేయమైనది. అగణితమైనది. అత్యుత్తమమై నది. అదియంతయు నా గురుదేవుల కృపాకటాక్ష విశేషము గాకున్న మరియేమి న్నది? లేకున్న గురుదేవులు నన్నింత ఉద్ధరించగలరని గ్రహింతును! స్వామీ! ప్రపంచ మందు గురుసేవాభిలాషతో సద్గురు సందర్శనాభిలాషతో ఎందరెందరో ప్రవర్తిల్లు చుందురు. వారలందరకు కనువిప్పుగా సద్గురు కార్యకలాపములు తెలియజేయుడు స్వామీ!"- అని సిద్ధయ్య ప్రార్థించినాడు.

అతని జిజ్ఞాసకు, పరోపకారబుద్ధికి శ్రీగురుడు ఎంతయో సంతసించినాడు. కుమారులను యితర శిష్యజనములను చూచి శ్రీగురుడు చెప్పుట ప్రారంభించి నాడు.

"గురువు త్రిమూర్త్యాత్మస్వరూపకుడు. గురుచరిత్రలు నిరంతరము శ్రవణము చేయవలయును. గురుచరిత్రలు ప్రతినిత్యము పారాయణ చేయుచుండవలయును. ఒకరికి వినిపింపవలయును. వివరింపవలయును. సద్గురువు యొక్క సాంగత్యము సాధకునికి అత్యంతావశ్యకము. కుటుంబ బాధ్యతవలన గాని, మరి యే యితర కార్యకలాపముల ఒత్తిడివలన గానీ మహనీయుల, మహాపురుషుల సన్నిధికి సంసారులు రాలేకపోదురు. అట్టివారు నిరాశపడి దుఃఖింప నవసరము లేదు. మహాత్ముల చరిత్రలను, ఉపదేశములను వినుట, నిత్యపారాయణము చేయుటకూడ సత్సంగమే. నిజమునకు 'సత్' అనగా బ్రహ్మము గదా! సర్వత్ర నిండియున్న ఆపరబ్రహ్మ స్వరూపుడే సద్గురువు. ఎచ్చట నున్నను, ఏ కార్యమందు నిమగ్నమైయున్నను ఆ సత్యస్వరూపుని మరువక గుర్తించుచు, స్మరించుచుండిన సద్గురువు సాంగత్యము నందుండి నటులేయని గమనించవలయును.

"ఇనుము నందు అయస్కాంత శక్తి నిద్రాణముగ నున్నది. దానిని మరొక అయస్కాంత సంపర్కముతో జాగృతము చేయుటయే గురువు శిష్యునికి జ్ఞాన దీక్షనొసంగుట. కనుక గురుచరిత్ర పఠన పారాయణములు అత్యంతావశ్యకము.

"గురువు ఒక్కొక్కచోట యోగము, ఒక్కొక్కచోట భోగము, ఒక్కొక చోట రోగము కలిగియుండును. ఒకచోట త్యాగము, ఒకచోట మంత్రము, ఒకచోట ధ్యానము కలిగియుండును. ఒకచోట లక్ష్యము, ఒకచోట సమాధి, ఒకచోట కూటమై కూడియుండును. ఒకచోట భక్తి, ఒకచోట జ్ఞానము, ఒకచోట గ్రంథ పఠనము గలిగియుండును. ఒకచోట నిశ్చబ్దము పాటించి యుండును. ఒకచోట బ్రహ్మము నూహించు చుండును. ఒకచోట బ్రహ్మముతో తానేకమై ఆనంద మనుభవించు చుండును.

"ఒక్కొకచోట నవ్వును, ఒక్కొకచోట ఆదరణపొందును. ఆడుచుండును. పాడుచుండును. పిల్లల నాదరించును. పరమాత్మను గానము చేయును. పరవశత్వమున నాదబ్రహ్మమైన ఆ పరమేశ్వరునితో సంయోగము చెందినట్లు తానే నాదమై, తానే బ్రహ్మమై భాసించును.

అంతియేగాక జలపాత్రంబులకు జలంబులంటని భంగి విషయము లందున్నట్లు కన్పించును. కాని విషయముల సంటక విశుద్ధ స్వరూపుడై ప్రకాశించు చుండును.

“గురువునకు శుశ్రూష చేయు నరులకు నమ్రత, న్యాయము, పరమార్థంబులు. గురువుకు శుశ్రూషలు చేయక ఎవరునూ గురువు కాలేరు. కలనైన కరి సింహంబగునా? భ్రమర కీటక న్యాయంబున గురు శిష్యులు సంధానంబున కూడి నట్టివారలకు బ్రహ్మజ్ఞానంబవలీలగా సిద్ధించును.

తుమ్మెద పురుగులను తెచ్చి యుగ్మస్థానంబున గూడునేర్పరచి, ఆ పురుగుల నందుంచి తానే కమ్మని ఝుంకారము సేయుచుండును. అటుల సేయగా, సేయగా కొన్నాళ్ళకా పురుగులు తుమ్మెద రూపములై బయటపడును.

“సంపూర్ణ సిద్ధుడైన గురువును మాత్రమే ఆశ్రయించి తీరవలయును. నే నటులే వీరభద్రస్వామి నాశ్రయించితిని. అతనికి శుశ్రూషలు, సేవలు సలిపితిని. గురువునకు కావలసినది కేవలము దక్షిణలు, కానుకలు కావు. గురువు శిష్యునినుండి వాంఛించునవి రెండే రెండు. ఒకటి నిష్ఠ, రెండు ఓర్మి. నేనా రెంటినీ నా గురువు దేవులకు సమర్పించినాను.

మరొక అనుమానము రావచ్చును. పరిపూర్ణ జ్ఞాన ప్రభాభాసితుడైన గురు భాస్కరుని కనుగొనుటెట్లు? గుర్తించుటెట్లు?- అని. ఎట్లు లభ్యమగును?- అని. ఒకవేళ మన అదృష్టవశమున అటువంటి మహనీయుడు, మహానుభావుడు, మహిమోపేతుడు, మన కట్టెదుట నిలువబడినను, సకలదోష పరివృతులమైన మనము ఆ దివ్య తేజోప్రభాభాస మానవరూపమూర్తాంబుని గుర్తించలేక పోవచ్చును. మరి అతనిని ఎట్లు గుర్తించుట? ఎట్లు ఆ దివ్యజ్ఞాన స్వరూపుని స్పృశించుట ఆయన దివ్యవాణిని వినుట ఎట్లు?

“ఇనుపముక్కను చూడుము. అది మట్టిలోబడి తుప్పుబట్టి అయస్కాంత శక్తిని పోగొట్టుకొనును. కాని ఆ ఇనుపముక్కకే ఆ తుప్పును శుభ్రముగ వదలగొట్టి, అసలైన యినుమును బహిర్గతము చేసిన, దానికి అయస్కాంత శక్తి కలిగి యుండును. ఇనుపముక్క ఒకటే! కాని దానిపై దళసరిగ పేరుకొనియున్న తుప్పు

నకు అయస్కాంత శక్తి లేదు. అందువలన తుప్పు లోపల కొంత యినుము ఉండినప్పటికీ, దాని కయస్కాంత శక్తి యుండినప్పటికీ, పైన బట్టిన తుప్పు పొరలు ప్రభావమున ఆ ఆకర్షణ శక్తి కోల్పోవునది. అదే తుప్పును సంపూర్తిగ వదల గొట్టిన ఆ తుప్పు లోనున్న కొద్దిపాటి యినుము ఆకర్షణశక్తి కలిగి యుండును. కనుక మానవుడును తనకు పట్టిన దోషములను తుప్పును వదలుకొట్టుకొనినగాని గురువు అను అయస్కాంత శక్తిని ఆకర్షింపజాలడు.

మానవుడు ఎన్నియో వ్రతములను, పూజలను చేయును. ప్రాయశ్చిత్తములు, జపధ్యానములు గూడ చేయును. స్వల్ప పాపపరిహారము మాత్రమే వాని వలన ప్రాప్తించునుగాని అధిక పాపము చేసిన మానవునకు పైవాటి వలన అత్యంత ప్రయోజనము చేకూరదు. అట్టివారికి సద్గురు సేవ రామబాణమువంటిది. సద్గురు సేవలో ఆ పురుషుడు తప్తకాంచన సన్నిభుడై ప్రకాశించగలడు.

“ప్రారంభమున మహాత్ముల చరిత్రలు పఠన పారాయణముల వలన మనసు పరిశుద్ధమై అతనిలో గురుభక్తి, ముముక్షుత్వము జాగృతము కాబడును. సద్గురు సమాగమ వాంఛ బలవత్తరమై పరితాపము ప్రారంభమగును. ఆకాంక్ష ఎక్కువగును. ఆ విధముగ శ్రీగురుని దివ్యరూప సందర్శనా కాంక్ష, గురుపాద సేవాసురక్తి, ఆసక్తి, ద్విగుణీకృతము కాబడి అయా [illegible]త్తమోత్తమ గ్రంథపఠన, పారన పారాయణముల వల్ల తప్పక సద్గురువు దగ్గరకు చేరగలరు.”- అని

శ్రీగురు పదములు ముట్టియు బాగుగ త్రివిధ ప్రసాద భక్షకుడై నే
యోగంబు సేయనేటికి యోగులలో నుంచునటుడు యోగ్యుడు సిద్ధా॥
గురుపాద [illegible] గురు [illegible] సుని దేవుమ్మన్
గురువుల మర్మము తెలియుడు [illegible] గురు సద్గురుడే గోప్యము సిద్ధా॥
గురుడు గురుడనంగ గురువెంత గురువెరుగు! గురుదృష్టి గురువెరుగు
గురుడు గురుడు,
నాయంత గురుడై నే నన్ను గననేర్తును. నే తన్ను గన నేర్తు నేర్పు సిద్ధా॥
అని చెప్పిన [illegible] స్వయ్య సద్గురు స్తుతి ని విధముగ ప్రారంభము చేసినాడు.

శ్లో ॥ ఆనందమానందకరం ప్రసన్నం। జ్ఞానస్వరూపం నిజబోధయుక్తం
యోగీంద్ర మీఢ్యం భవరోగ వైద్యం। శ్రీమద్గురుం
నిత్యమహం నమామి ॥

సంతోషమును సృష్టి చేయునట్టిదియు, అనుగ్రహము ప్రసాదించునట్టిదియు, ఆనంద రస స్వరూపుడవైనట్టిదియు, తాను తానుగానేయుండి పరమయోగీశ్వరులచే ప్రస్తుతింపబడునట్టిదియు, సంసారమను వ్యాధికి భిషగ్వరుడవైనట్టిదియు, గురువగు నీకు నమస్కరించుచున్నాను.

శ్లో ॥ నమోస్తు గురవే తస్మై। ఇష్టదేవ స్వరూపిణే
యస్యవాక్యామృతం హంతి। విష సంసార పంజ్కలం ॥

గురుదేవా! నీ యొక్క అమృతమైన వాక్కు వలన సంసారమనెడి విషము సమూలముగ నాశనము చేయబడుచున్నది. అట్టి సద్గురుడవు....నీవు..నీకే నమస్కరించుచుంటిని.

శ్లో ॥ నమస్తే! సతతే! జగత్కారణాయ। నమస్తే చితే సర్వలోకాశ్రయాయ,
నమోఽద్వైత తత్త్వాయ ముక్తిప్రదాయ। నమోబ్రహ్మణే వ్యాపినే
శాశ్వతాయ ॥

స్వయంప్రభాభాసితుడు, సర్వజగత్తుకు సంపూర్ణ జ్ఞానస్వరూపుడు, సకలలోకములను కరుణించువాడు, అద్వితీయుడు-అనగా నీవు, నేననెడి భేదములేక నుండువాడు, మోక్షప్రదాత, సర్వాంతర్యామి అయిన గురుబ్రహ్మ! నీకు నమస్కరించుచున్నాను.

శ్లో ॥ త్వమేవ మాతాచత్వమేవ। త్వమేవ బంధుశ్చ సఖాత్వమేవ
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ। త్వమేవ సర్వం మమదేవ దేవ॥

నాకు తల్లియు, తండ్రియు, బంధు జనంబును, స్నేహితుడు, సర్వవిద్యలును, సర్వ సంపదలును-అంతయూ నీవే. నీవే నాకు దైవము, సర్వమయుడవు, సర్వేశ్వరుడు- నీకే నమస్కరించుచుంటిని.

—o—

సిద్ధయోగి ప్రసిద్ధభారతం :-

-: ముప్పది ఒకటవభాగం :-

ప్రతి విషయము నందును శ్రీగురుడు సిద్దయ్యకే ప్రాముఖ్యమిచ్చుటయు పలు ప్రదేశములందు సిద్దయ్య గౌరవాభి మానముల పొందుటయు, ఇతర శిష్యులలో ప్రాదుర్భవించిన ఈర్ష్య యింకా సమసిపోలేదు. దాని నీలినీడలు ఇంకనూ వారిని వెంటాడుతూనే యున్నాయి. గత మందొక సారి యిట్టి ద్వేషమును శ్రీగురుని కుమారులలో నెక్కించి, సందర్భమును, సమయమును విషపూరితముజ్జేసి, దానికి తగిన ప్రతిఫల మనుభవించిననూ, వారి కింకనూ బుద్ధి రాలేదు. శ్రీగురుడు వారికేమియూ చెప్పుట లేదనీ అంతయూ సిద్ధునకే బోధసేయుచుండెనని అపార్ధ ప్రభావములో పడిరిగాని సిద్ధునిలోని పట్టుదల, ఉత్సాహము తెలిసికొనవలయు ననెడి జిజ్ఞాస, నేర్చుకోవలయు ననెడి తపన, వారిలో లేదన్న సంగతి వారు గ్రహించ లేకుండిరి. కాని అందులో ఒకరిద్దరకు ఆవిషయము తెలిసిననూ, శ్రీగురుని శక్తి సామర్ధ్యములు తెలిసిననూ సహవాసదోష ప్రభావముండక తప్పదుగదా!

“ఏమిరా! చూచితిరా! గురుసేవలు ఎంతకూ సిద్దయ్యనే అభిమానించుచుండిరి గాని మన యునికినే సంపూర్ణముగ విస్మరించి నటులుండిరి. బోధలన్నియూ సిద్ధ మూర్తికే జరుగుచున్నవి. మనల గూర్చి అసలు యోచించుటయే లేదు. ఇటుల కొంతకాలముండిన మనము కేవలము ఋంటలమై, ఎందుకూ పనికిరాని వెధవలమై వీధులబడి తిరగవలసి వచ్చునేగాని జ్ఞాన వంతులమగుట స్వప్నవృత్తాంతమే యగు నేమొ!”—— అనినాడు ఒకడు.

“నోరు మూయ్యరా. సిద్దయ్యలోని పట్టుదల మనలో ఎంతమంది కుండినది. సిద్దయ్య శ్రీగురువులకు చేయుచున్నసేవ మనలో ఎవరైననూ చేయుచుండిరా? సిద్దయ్యలో నున్నదృఢదీక్ష, సంకల్పము, పట్టుదల, ఓరిమి, నిష్ఠ మనలో ఎవరికైననూ యుండెనా? పట్టుదల లేకుండిన సాధించునది సున్నయే గదా! నాయనా!—— రేయనక, పగలనక, సిద్దయ్య గురుసేవలనే అంటిపెట్టుకొని సంపూర్తిగా గురు సేవలకే అంకిత మొనర్చుకొనినాడు. మరి మనలో ఎవరైన అంకిత భావముతో నుండిరా!— చెప్పుము. కడుపునిండుగా తిని, కంటి నిండుగ నిద్రపోటవు తప్ప మనము చేయు

ఉన్నదేమో తెల్పుము?— అనుచునూ ఒకసారి శ్రీగురుడు మనకు గుణపాఠ క్లే చెప్పినను వీడు బుద్ధిగాను తెలుసుకొనలేదు దురదృష్టము. ఇప్పటికైనను బుద్ధితెచ్చుకొని గురుదేవుని కంటికిముందు తిరుగు"— అని బుద్ధిచెప్పి జాలితో పలికినాడు ఒక బుద్ధి కలిగిన శిష్యుడు.

"ఏమో కదు. తాను మహాసిద్ధయ్య కావలయునని తలపోయు చుండెనుకాబోలు. వీడి జన్మలో ఏదు కాలేడు. మనకంటే ఏదో అధికముగా తెలియునని అనుకొనుచు ఉండినట్లున్నాడు. పట్టుమని పదిశ్లోకాలు అప్పచెప్పలేడు. వీడూ మనకు చెప్పువాడే. పురుషోత్తమే కాదు.... మనకు బుద్ధిచెప్పుటకువచ్చినాడు."— అని విసుగు కొనినాడు ఒకడు.

అదే సమయమున గురుదేవులటుగా రావడము తటస్థించినది, గురువులా సంభాషణమును వినిరేమోయని శిష్యులు కొంతకళవెళబడి ఒకరి ముఖము లొకరు చూచుకొనినారు. భయపడిరి కూడా! కాని గురుదేవులు ఆగ్రహించలేదు. దూషించ లేదు. వారు కారణజన్ములుగదా! మనుషులలోని చెడును తొలగించి, జ్ఞాన జ్యోతుల వెలిగించుట కదా! వారి జన్మమునకు మూల కారణము. అట్టి సమయమున వారికి బట్టిన మౌఢ్యము తొలగించ వలయునే గాని ఆగ్రహించరు కదా! అందుకే శ్రీగురులు ముందుకు వెళ్ళిన వారల్లా మరలా వెనుకకు వచ్చి చిర్నగవుల వెలయించుచూ, అందర్ని చూచి,దగ్గరగా వచ్చి, వారిమధ్యలో నిలబడి చెప్పినాడు.—

సీ॥ మాట తూలుటెపుడు మంచిదికాదన్న
మాటలందు పొదుపు మంచికూర్పు.
పొరబాటుగానైన పొరల కూడదు మాట
మాట శక్తి యొక్క మహిమ ఘనము.
నాల్క యదుపు దాటి నిలకడ లేకున్న
ప్రాణహానియు కల్గు పరువుపోవు.
మననోటి మాటలే మనకు చేయును కీడు
తెలిసి మసల వలె తెలివి కలిగి.

ఆ॥వె॥ నాల్క నదుపునందు నడపడె మెరుగెక్కు
నాల్కయదుపు తప్ప నష్ట మొందు.

కనుక శిష్యులార! గాంచుతయ్య నిజము
మహాత్మ నెఱిగి జగతి మనలు కొఱకు.

సీ॥ పాపకృత్యముల ప్రతిరోజు చేసెడి
పాపులు జడియరు పాపమునకు.
భయమొందు సుజనుండు, పాప బాధల జూచి
పారిపోనుంకించు పాపినుండి,

పాపమగ్నిని బెంచు భయమును కల్గించు
కాని పాపివినడు. కనడు- రాడు.
కీడు చేసిన వాని కీడుతలపకుంట
విజ్ఞాన మందురు విబుధులవని.

ఆ॥వె॥ మరువబోకు- కీడు మదినెప్డు తలపకు।
ధర్మమార్గ మెపుడు మరువబోకు,
రమ్యగుణసుమిత్ర! రాజీవదళనేత్ర!
భవ్యగుణపవిత్ర! భరతపుత్ర!

సీ॥ ఏను మేలనటంచు ఇతరుల కెగ్గును
సేయబూన వగచు శిరులు తరుగు
దుఃఖబాధల నుండి దూరము పోవంగ
ఇతరుల కెందుల కెగ్గుసేయ

పగనుండి దప్పగా పరుగెత్తి పోవచ్చు
కాని పాపము నుండి కదల గలమె
పాపబాధ నరుని పడగొట్టిహతమార్చు
తప్పించు కొనలేరు ధరణి నరులు.

ఆ॥వె॥ పాపమెపుడు విడదు పాపిష్ఠి నెప్పుడు-
నీడవోలె వెంట నడచుచుండు.
రమ్యగుణసుమిత్ర!- రాజీవదళనేత్ర!-
భవ్యగుణపవిత్ర!- భరతపుత్ర!

సిద్దయోగి ప్రసిద్ధ భారతం:

ముప్పది రెండవ భాగం:

శ్రీగురుడు సంచారము నిమిత్తమై శిష్యులందరూ వెంటరాగ బయలుదేరి నాడు. మున్ముందు విజయవాడ చేరి కనకదుర్గ దేవాలయంబున ఐదు దినంబులుండి ఆ తర్వాత అక్కడ నుండి బయలుదేరి, పలుప్రాంతములు దాటిన పిదప మార్గము అనుకొనినంత నిష్కంటకముగా లేదు. సన్నని యిరుకు బాటల గుండ, అరణ్యముల గుండ పోవలసివచ్చినది. పెద్ద పెద్ద బండలను దాటుచు, ముండ్లపొదలను తప్పించుకొనుచు నడుచుచున్న సమయమున

"స్వామీ! ఆకలి దహించుకు పోవుచున్నది. అడుగుదీసి అడుగు వేయలేక పోవుచున్నాము. మమ్ము కనికరించి కొంత ఆహారమొసంగుడు."- అని చేతులు జోడించినారు కొంతమంది శిష్యులు.

శ్రీగురుడు సిద్దని వంక జూచి "సిద్దా! క్షుద్బాధా పీడితుడవగు చుంటివా!"— అనినాడు శ్రీగురుడు.

"స్వామీ! తమ సేవలో నాకు ఆకలిదప్పులు రావు. నాకు నా గురు నామ స్మరణమే ఆహారము. నా గురురూప సందర్శనమే నాకు సకల క్షుద్బాధాహరము. గురుపాద సంవాహనమే నాకు పానీయము. అంతకు దక్క నాకు అన్యమేమియూ తెలియదు స్వామీ!"— అనినాడు సిద్దయ్య.

"సిద్దయ్యకు ఆకలి లేకపోవచ్చును స్వామీ! మాకుమాత్ర మాకలి అపరిమితముగ వేయుచున్నది. మాకింత జలపానమైననూ లేకున్న మేమిక్కడ మరణించుట తథ్యము."— అనినారు శిష్యులలో ఒకరిద్దరు.

"అటులనా! అంతగా ఆకలి దహించుచున్నదా! బిడ్డలారా! అది నిజముగ ఆకలి గాదు. అజ్ఞానమను ఆకలి మిమ్ముల నిలువనీయుటలేదు. ఈర్ష్యయను ఆకలి మంట మీలో ప్రవేశించి మిమ్ములనిట్లు దహించి వేయుచున్నది. సహనము, ఓర్పు, నిష్ఠ మీలో నశించిపోయినవి.

సీ॥ పలుగు పారలు పెట్టి పలువూర్లు త్రవ్వినా
ఛరియించుచున్నదే ధరణిమాత,

ఉత్తమ ధర్మమందుండుట సహనమ్ము
　　సహనమ్మునకు భూమి సాదృశమ్ము

హాని చేసినవాని నన్నిట క్షమియించ
　　మంచి గుణమనంద్రు మహిని బుధులు,
హాని చేసినవాని నసలు సంపూర్తిగ
　　మరచిపోవుట చాల మంచిదంట,

ఆ॥వె॥ సహనమునకు యిట్లు సందర్భమును బట్టి
మంచి చెప్పినారు మనకు ఋషులు,
రమ్యగుణ సుమిత్ర రాజీవ దళనేత్ర
భవ్యగుణ పవిత్ర! భరతపుత్ర

సీ॥ మహనీయతను బొంద మక్కువే యుండిన
　　సాధింపవలయును సహనమెంతొ,
సహన రహితులను సజ్జనుల్ రానీరు
　　సహన శీలురనగ స్వర్ణనములు,

అపకారి కప్పుడే ఉపకార మొంజేయు
　　తాత్కాలికమ్ము సూ తనివిగాని,
ఓర్మితో నాతని నొనరుగ క్షమియించ
　　చిరకీర్తి కల్గును చిత్తశుద్ధి

ఆ॥వె॥ కమక ఓర్మినెపుడు కాదనరాదయా
ఓర్మి కూర్చు కీర్తి ఒరిమ ఘనము,
రమ్యగుణ సుమిత్ర! రాజీవదళనేత్ర!
భవ్యగుణ పవిత్ర! భరతపుత్ర!

అవి చెప్పి అటు తిరుగగా అక్కడ ఒక మృత శునక శరీరము కృశిం కృశించి దుర్గంధభూయిష్టమై లుకలుక మను పురుగులతో కన్పించినది. దుర్వాసన వారందరి నాసికా రంధ్రములను బ్రద్దలు చేయుచున్నది.

"ఇదియే మంచి సమయము. వీరి మౌఢ్యము, సిద్ధునిపై వీరికున్న ద్వేషము నశింప చేయుటకు యింతకన్నమంచి సమయము దొరుకదు."— అని తలంచి "నాయనలారా! ఆకలియైనప్పుడు దానిని భరించరాని సమయమున ఏది దొరికిన అది తిని ఆకలి తీర్చుకొనక తప్పదు. 'విశ్వామిత్రునంటివాడు ఒకానొక సమయమున కుక్కమాంసమును తిని క్షుద్బాధను నివారించుకొనెను'.... అను కథ యొకటి ప్రచారములో నున్నదిగదా! ప్రస్తుత మీయరణ్యమధ్యమున ఫలభరిత వృక్షసంపదగానీ, కనీసము జలప్రపూర్ణములైన చెలమలు గానీ కన్పించుట లేదు. అదుగో!— అటు చూడుడు. ఆ శునక శరీరము భక్షించి ఆకలి తీర్చుకొనుడు."— అని అట ఒకింత ఆగినాడు.

"ఏమేమీ! ఈ శునక మృతకళేబరమును భక్షించుటయా! దుర్గంధభూయిష్ఠమై క్రిములచే నిండి చూచుటచే ఒడలు జలదరించుచుండ అట్టి ఈ కుక్క శవమును భక్షించుటయా?"— అని ఒకరికొకరు చెప్పుకొని ముందుకురారైరి.

కొంతమందికి స్వాములపై కోపము కూడ వచ్చినది. మరి కొందరిలో భయము కూడ చోటు చేసికొనినది. ద్వైధీయ మనస్కులై సమాధానము చెప్పజాలని స్థితిలో నున్న శిష్యులను చూచి శ్రీగురుడు "ఏం? నాయనా! ఆలస్యము చేసెదరేల? భక్షింపుడు"— అని తొందర చేసినాడు.

అప్పటికినీ ఎవరూ ముందుకు రాలేదు. అవాక్కయి స్థాణువులవలె నిలువబడినారు....దిక్కుతోచక....

"సిద్ధా! వారూ శునకమును భక్షించుట కంగీకరించుట లేదు. గురుసేవాపావన మకరందమత్తుడవైన నీకు వార్ధకమున్నట్లు క్షుద్బాధా తీవ్రత లేకపోవచ్చును. కాని యిది గుర్వాజ్ఞ. భక్షింపుము"— అనినాడు శ్రీగురుడు.

శ్లో॥ వందే గురు పదద్వంద్వం వాఙ్మనో తీతగోచరం
శ్వేతరక్త ప్రభాయుక్తం శివయోగాత్మకం పరం॥

గురుగీత :

ఓ! గురుదేవా! నీపావన పద్మద్వయమునకు నమస్కరించుచున్నాను. నీ పా. పద్మ సౌందర్యాకర్షణ ప్రభావమును వర్ణింప శక్తిలేనివాడను. వాక్కునకు, మనస్సునకు

అందని అతీతమైన ఔన్నత్యం నీది. తెలుపు, ఎఱుపు కలగలిసిన విచిత్ర వర్ణ సౌందర్యం నీపాద పద్మయుగళి. అదే ఆత్మ పరమాత్మల సంయోగానికి చిహ్నం. పరమశివుడు, పరబ్రహ్మము అయిన సచ్చిదానంద విశ్వవిరూపాక్ష రూపుడవు. నీకు నమస్కారములు."- అని సిద్ధుడు శ్రీగురుని పాదములకు నమస్కరించి నిర్వికారముగ, నిరాఘాటముగా, నిర్భయముగ, నిశ్శంకగ, నిర్ర్వమాదముగ, నిరవద్యముగ, నిండు మనసుతో, నిశ్చల చిత్తముతో, నిర్మలానంద సందోహతుందితాత్ముడై గురు నిర్ధారితమైన ఆ శునకమాంసమును భుజించుటకు దానిని స్పృశించెను.

కాని!- ఆశ్చర్యము. సిద్ధుని కరస్పర్శమాత్రమున ఆ శునక శరీరము అతిటాకు సందమర్చిన అమృతతుల్యమైన పరమాన్నముగ, ఖర్జూర, జీడిపప్పు, ద్రాక్ష పండ్లు యిత్యాది వస్తు సంభరితమై మధురవాసనలు వెదజల్లుచుండెను.

సిద్దయ్య- "శ్రీవీరబ్రహ్మగురుదేవార్పణమస్తు"- అని 'ఆ దివ్య పదార్థమును గురుదేవులకు ముందుగా సమర్పించినాడు. అంత నా శిష్యులందరును బుద్ధి తెచ్చుకొని, శ్రీగురుని పాదములపైబడి క్షమింపమని ప్రార్థించినారు. భక్తసులభుడైన శ్రీగురుడు వారలందరకూ దివ్యప్రసాదమును పంచి వారి యాకటి బాధను పోకార్చినాడు. వారి కమండలువులో నుండి 'అమృత జలముల నొసగి వారి దాహబాధయు దీర్చినాడు.

శ్లో ॥ మునిభిః పన్నగై ర్వాపి సురై ర్వాశాపి తోయది
కాలమృత్యుభయాద్వాపి గురుః రక్షతి పార్వతి ॥

- గురుగీత

"అని శంకరుడు పార్వతీదేవికి చెప్పినట్లుగా మనుష్యులకు మూడురకములగు శాపములుండును. ఋషుల శాపం, నాగుల శాపం, దేవతా శాపం. ఈ మూడు రకముల శాపముల నుండి శిష్యులను రక్షించగల సమర్థుడు గురువు ఒక్కడే. అటులనే శిష్యుని అకాల మృత్యువు నుండి, మృత్యు భయమునుండి కూడ రక్షింపగలవాడు గురుదేవుడే.

శ్లో॥ అశక్తాహి స్వరాద్యాశ్చః అశక్తా మునయ స్తథా
గురుశాపేనతే క్షీణాః క్షయం యాంతి నసంశయః ॥

-గురుగీత :

"గురువుముందు అందరూ శక్తిహీనులే. దేవతలు, మునులు, ఋషులు వారు వీరననేల? అందరూ శక్తిహీనులగుదురు. వారెవరూ శిష్యుని రక్షించలేరు. ఉద్ధరించ లేరు. గురువు ఆగ్రహించి శపించినచో శిష్యుని యోగశక్తులన్నియూ నశించి పోవును. శక్తిహీనుడగును, నిర్వీర్యుడగును, నిశ్చలుడగును. అందువలన గురువున కెప్పుడూ ఆగ్రహము కలిగించరాదు. గురుపనుగ్రహమునే సదా వాంఛించవల యును."- అని శ్రీగురుడు అందర్ని కూర్చుండ నియమించి ఈ విధముగా చెప్ప ప్రారంభించినాడు.

"భగవంతుడు అద్వితీయుడు. అతనికి సముడు మరొకడు లేడు. ఆ మహ నీయుడు సృష్ట్యారంభమున తాననేక మగుదును గాక యని సంకల్పించుకొని తనకై తాను వినోదము కల్పించుకొనుటకు ఈ అనంతసృష్టిని ప్రారంభము చేసినాడు. అట్లు ప్రారంభము సేయుట యందునూ పరమార్థము కలదు.

జలనిధు లీదగ వచ్చును। కులగిరులను నెగుర వైచి। గొబ్బునచేతన్
నిలుపంగ వచ్చు తనలో। కలనైనను తన్ను తెలియ। కఠినము సిద్ధా॥

వేదంబులు శాస్త్రంబులు। వాదంబుల కొఱకె చదివి। వస్తువు గనిరా।
యేదారి తెలియలేకను। వాదములకు దగుదు రొట్టి। యధములు సిద్ధా ॥

సంసారము నందుండియు। సంసారము మిధ్య జేసి। సర్వముతానై
సంసారమందు నిలచిన। సంసారే రాజయోగి। సత్యము సిద్ధా ॥

—o—

సిద్ధయోగి ప్రసిద్ధ భారతం :

: ముప్పది మూడవ భాగం :

సిద్దయ్యతో సహా శ్రీగురు దంపతులు పల్లె కనతి దూరముననున్న అడవి ప్రాంతమునకు వెడలినారు. ఒకానొక ప్రశాంత స్థలమునందు గుబురుగా నున్న తరుచ్ఛాయలలో శ్రీగురుడు పరమ శాంతమూర్తియై కూర్చుండి యున్నాడు. స్వామి కెదురుగా సిద్దయ్య అచంచల భక్తి విశ్వాసములకు ప్రతిరూపమా యనినట్లు వీర గురుదేవునే తదేకముగా చూచుచు కూర్చుండినాడు. గోవిందమాంబయు స్వామివారి చెంతనే కొలువుదీరి యున్నది.

శ్రీగురుడు తన సుమధుర సుగ్రీవముతో తత్త్వమును గానము సేయుట ప్రారంభము చేసినాడు.

తత్త్వం :

ఓం నమశ్శివాయ సిద్ధ మైనాపదవి। ఓంకారమేదిరా యోరీ !
ఒనరుగ త్రికూట భ్రూమధ్యమందున్న వాడెవ్వరో చూడరోరీ॥

అఆలు-పదియారు। అక్షరంబుల కాచి। వాడెవ్వరో చూడరోరీ !
ఆకారమను చిలుక। హంసతో జతగూడి। ఆడిస్తునున్నాడురోరీ ॥

కఖాలు-పదిరెండు పర్వములు చేసుకొని। కన్నుమూసుకు చూడరోరీ!
కదిసి రేకుల తుదను। కాంత యొకటున్నది। కరకంఠుడెరుగురా యోరీ ॥

తథ దధ యని సర్వములు తానెరిగి। తలుపుతీసుక చూడరోరీ !
తెరతేరకాదునై దేవాలయములోన। తేటగా నున్నాడు రోరీ ॥

యరలవా-యని యెడు నారాయణ బ్రహ్మ। రుద్రులెవ్వరో చూడరోరీ!
శషసహా-యనియెడు శివపోతులూరయ్య-సాక్షిగా నున్నాడురోరీ ॥

అని తత్త్వగాన సుధామధుర మంజులనాద ప్రసారమును ముగించి సిద్దుని వైపు తిరిగి

"సిద్దా! పంచవింశతి తత్త్వంబుల చేతను, పలువిధ నాడుల చేతను సప్త ధాతువుల చేతను కప్పబడియున్న ఈ దేహము లోపల నిజముగ నేడు కమలము

లున్నవి. వాటినే షట్చక్రములనియు పిలుతురు. మరియొకటి సహస్రార చక్రము ఉన్నది. దానితో కలిసి మొత్తము యేడు చక్రములు మన దేహమందు యిమిడి యున్నవి. వాని విషయములు వివరించెదను వినుము. మనస్సు గురుసేవయందు స్థిరపరచి, దృష్టి నటు నిటు కదలనీక, స్థిరచిత్తముగ, ఏకాగ్ర దృష్టితో గమనింపుము.

ఈ యేడు చక్రములను యేడు లోకములుగా భావింపవలయును. అవి వరుసగా యిట్లు చెప్పనగును. భూః, భువః, సువః, మహః, జనః, తపః, సత్య. లోకములని.

"మూలాధార చక్రము నుండి సహస్రారము వరకున్న వెన్నెముకనే వేణు దండము లేక బ్రహ్మ దండి అని పిల్చెదరు. ఈ వెన్నెముకకు నడుమనేయున్న నాడి పేరు 'సుషుమ్న'యని పిల్చెదరు. ఈ వెన్నెముకను, సుషుమ్నను అనుసరించియే ఆధారము మొదలైన ఆరు కమలములు అంటుకొని యున్నవి.

"1. మూలాధార కమలము లేక చక్రము" :- ఇది గుదస్థానమునకును, లింగ స్థానమునకును మధ్యనుండును. ఇది త్రికోణాకృతిలో నుండి అధఃకోణము గలదై యుండును. మిగిలిన రెండు కోణములు ఊర్ధ్వాభిముఖములై యుండును. ఈ కమలమునకు నాలుగు దళములుండును. ఈ నాలుగు దళములు నాలుగక్షరములకు సంకేతములు. వ,శ,ష,స- అనునవి ఆ యక్షరములు. పంచభూతములలో ఒకటైన పృథ్వీభూతమున కిది నివాస స్థానము. అనగా మన దేహమందు భూమి దేవతయు ఒకానొక రూపంబున స్థిరపడియున్నది. భూమి గంధమున కాధారము గనుక, ఈ మూలాధార చక్రము గంధగుణము కలిగియున్నది. ఇది స్వర్ణవర్ణమున నొప్పుచు ఘ్రాణేంద్రియమునకు కారణమైయున్నది. కనుక నావాసన యనునది ఈ మూలాధారము నందుద్భవించి ఘ్రాణేంద్రియమైన నాసికలయందు నశించుచున్నది. కుండలినీ శక్తికిది ఆధారభూతమై యొప్పుచున్నందున ఈ కమలమునకు మూలాధార కమలము లేక మూలాధార చక్రము అని పేరు.

దీనికధిపతి గణపతి. మనము ఒకనాటి సూర్యోదయము మొదలు మరునాటి సూర్యోదయము వరకు ఇరువదియొక్కవేల ఆరువందల (21,600) పర్యాయములు

శ్వాస ప్రశ్వాసములు చేయుచుందుము. యోగి 'సోऽహమ్' అను హంస మంత్రముతో ఆరువందల సార్లు అజప గాయత్రిని జపించి మూలాధార అధిష్ఠాన దేవతయైన విఘ్నేశ్వర స్వామికి సమర్పించవలయును.

మనము సప్తలోకముల గురించి ఆలోచించినచో, మొదటి లోకము ఈ భూలోకమే....ఇదియే 'భూః'.

2. స్వాధిష్ఠాన కమలము : దీనినే స్వాధిష్ఠాన చక్రమనియు అందురు. ఇది షట్దళములు కలిగిన దివ్యకమలము. దీనికి బ్రహ్మదేవుడు అధిష్ఠాన దేవత. ఈ ఆరు దళముల యందు బ,భ,మ,య,ర,ల—అను ఆరు అక్షరములు కలిగియుండును. పంచభూతములలో నొకటియైన జలభూతమునకది ఆవాసము. శ్వేతవర్ణము కలదియై రజిత కాంతులు నీనుచుండును. ఇది పురుషులకు లింగస్థానమునందును, స్త్రీలకు యోనిస్థానమునందును యుండును. ఇది జిహ్వేంద్రియమునకు కారణము. దీని యందు రసముద్భవమై జిహ్వేంద్రియమున లయమగుచున్నది. జలభూతమునందు పుట్టిన షడ్రుచులను నాల్కగుర్తించును. ఈ షడ్రుచులే షట్దళములై ప్రకాశించుచుండినవని భావించవలయును.

"ఈస్వాధిష్ఠానమున కధిపతి బ్రహ్మదేవుడు కనుక లింగ, యోని స్థానములు రెండును సృష్టికి కారణములైనవి. ఇందలి ప్రజాపతిని ప్రసన్నము చేసికొనవలయునన్న ఆరువేల హంసలచే అర్చించ వలయును. ఇదియే భువర్లోకము— 'భువః'

3. "మణిపూరక కమలమునేక మణిపూరక చక్రము, :- ఈకమలము నాభిస్థానమునందు ప్రకాశించు చుండును. దీనికి పది దళములు. ఈ పది దళములలో డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ— అను పదియక్షరములుండును. ఇది రక్తవర్ణమై రంజిల్లుచుండును. అగ్నిభూతమున కావాసము. ఇదియే జఠరాగ్ని ఈ అగ్నియే మనము భుజించు పలువిధ ఆహారములను జీర్ణింప చేయుచున్నది. అందువలననే భోజన సమయమున నందు.

శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాందేహమాశ్రితః
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నంచతుర్విధమ్॥

గీత : 15 : 14.

"అను గీతాశ్లోకమును పఠింపమని పెద్దలు పల్కు-చుందురు. పై శ్లోకము అర్థము. నేను వైశ్వానరుడను పేరుగల జఠరాగ్నినై సకలప్రాణుల శరీరముల సనూ ప్రవేశించి, జఠరాగ్నిని ప్రజ్వలింపజేయు ప్రాణాపానములను వాయువు కొని, భక్ష్యము, భోజ్యము, లేహ్యము, చోష్యము అను పేర్లుగల నాల్గు విధము ఆహారమును పచనము చేయుచున్నాను — అని అర్థం.

"ఇది దృశ్యేంద్రియమైన నేత్రేంద్రియమునకు కారణము. అగ్ని వలన ప్రకాశము వలన కలిగిన రూపముల నన్నిటిని నేత్రములు గ్రహింపజాలు వి. మనకు దృగ్గోచరమగు నలుపు, తెలుపు, ఎఱుపు, పసుపు, ఆకుపచ్చ, మిశ్ర మొదలగువర్ణషట్కము, లావు, సన్నము పొట్టి, పొడుగు- మొదలగు ఆకార యము కలసి పదియగును. కనుకనే ఈ కమలమునకు పది దళములు.

"ఈ మహత్తర చక్రమున కధిపతి శ్రీమహావిష్ణుడే. అతడే అనంత పద్మ ం. ఈ దేవునకు ఆరువేల హంసల అజపగాయత్రిని జపించి సమర్పించ వల . ఈ చక్రస్థానమే సువర్లోకము.... "సువః" అని చెప్పబడినది.

"ఇక్కడ ఇంకొక విషయము చెప్పవలయునని యున్నది. సిద్ధా! అనంత ాభుడు అని చెప్పితినిగదా! అనంతపద్మనాభ వ్రతము చేయుటయు సాధారణ ్రులకు ఎంతయో అవసరము. అదిపాపహారము గూడను.

అనంత పద్మనాభస్వామి వ్రతం :- ప్రతి భాద్రపదశుద్ధ చతుర్దశి దివసమున ్క పద్మనాభస్వామి వ్రతమును ఆచరింతురు. ఈ వ్రతమును గతకాలమున ష్యుడీ వ్రతము నాచరించి పెక్కు-నిష్టార్థములను బడసినాడు. ధర్మరాజు జూద రాజ్యభోగములను గోల్పోయి తమ్ములతోడను, భార్యతోడను అరణ్యముల ు అనేక బాధలకు, అవమానములకు గురియయి చివరికీ వ్రతము నాచరించి ర్థముల బడసెనని పురాణగాథ.

"ధర్మరాజునకీవ్రతము నాచరింపుమని ఎవరుబోధ చేసిరి స్వామీ"

"ఇంకెవరు? సర్వకాల సర్వావస్థలయందు వారిని కంటికి రెప్పవలె కాపాడు ఆ శ్రీకృష్ణగురుడే!"

"ఏమని వచించెను,"

"వ్రతములలోనెల్ల ఉత్తమమైనదీ అనంత పద్మనాభవ్రతము. అనంతుడన నెవరో గాదు. నేనే సుమా! బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాది సకల దేవతలు నాయందే గలరు. మేషాది ద్వాదశరాసులు, నవగ్రహములు, అన్నియు నాలోనే యున్నవి. నేను అంతటా వ్యాపించి యున్నాను. ఒక్కమాటలో చెప్పవలయునన్న నేను సర్వాంత ర్యామిని."- అనినాడు శ్రీకృష్ణుడు.

"నందనందనా! అయితే ఆవ్రత విధానము తెల్పుము. గత మందెవరైన నీవ్రతము నాచరించి శుభంబులు బొందిరా! వారి విషయమును సవిస్థరముగా తెలుపుము"— అనినాడు ధర్మరాజు."

"యుధిష్టరా! బావా! భాద్రపద శుద్ధచతుర్దశీ సమయమున అనంత పద్మనాభ స్వామివ్రతము నాచరించవలయును. కృతయుగమున వసిష్ఠ గోత్రసంభవుండైన సుమంతుడను విప్రుడు కలడు.అతని భార్యదీక్షాదేవి భృగుమహర్షి పుత్రిక. వారికొక కూతురు సుశీల. తరువాత కొంతకాలమునకు సుమంతుని భార్యదీక్షాదేవి కాలధర్మ మొందినది. సుమంతుడు మరల వివాహము గావించు కొనినాడు. ఈమె పరమ గయ్యాళి.

"సుమంతుని కూతురు సుశీల దైవచింతన కలిగి సదా దైవస్మరణ చేయుచు కాలము గడుపుచున్నది. ఆమెకు యుక్త వయసు వచ్చినది. సుమంతుడు తగిన వరునకై అన్వేషణ చేయుట ప్రారంభించినాడు. తుదకు కౌండిన్యునకిచ్చి వివాహము గావించినాడు.

"సుమంతుడు కుమార్తెను కాపురమునకు బంపుటకు అయత్తముసేయు, దారి బత్తెమునకు ఆమెకేదైననూ మూటగట్టి యిమ్మని భార్యను కోరినాడు. కాని ఆమె అందుకియ్యకొనక తగవులాడి ఒక మూల ముసుగుతన్ని బరుండినది. సుమంతుడు సత్తుపిండిని మూటగట్టి కుమార్తెకిచ్చి సాగనంపినాడు. నూత్న దంపతులు మధ్యాహ్న మగునరికి ఒకానొక తటాక ప్రాంతమునుజేరి, సంధ్యావందన కార్యక్రమముల నాచ రించ ప్రారంభించిరి.

"ఆ దినము భాద్రపదశుద్ధ చతుర్దశి. అనంతపద్మనాభవ్రత సందర్భముగ అచటి ముత్తైదువలనేకులు సుస్నాతలై యెర్రని చీరలు రవికెలు ధరించి అనంతుని తమతమభర్తలతో కూడ పూజించుచుండిరి. సుశీల అచ్చట కలిగి విషయములనన్నియు

సవిస్తరముగా తెలిసికొని, ఒకనాటి భాద్రపద శుద్ధ చతుర్దశి దినమున ప్రాతఃకాలమున మేల్కాంచి, కాలకృత్యాది కార్యక్రమముల ముగించుకొని, స్నానమాచరించి, గృహము నంతయు శుభ్రముగా గోమయముతో నలికి రంగురంగుల రంగవల్లులం దీర్చి 'సర్వతోభద్రము' అను ఎనిమిది దళములు గల తామర పుష్పమ్మునుంబోలు మండలమును నిర్మించి మండలమునకు చుట్టు, రంగవల్లుల నైదింటిని రచించి, తెల్లని బియ్యపుపిండిచే ముగ్గులు వేసి అందముగా అలంకరించినది. తరువాత కలశపాత్రను పరిశుద్ధ జలములతో నింపి మండపము కుడిభాగమున నుంచి దర్భలచే అనంత పద్మ నాభస్వామిని చేసి, మండప మధ్యభాగమున నునిచి, యావాహనముఁజేసి

శ్లో॥ కృత్యాదర్భమయందేవం। శ్వేతద్వీపేస్థిరంహరిం.
సమన్వితం సప్తఫణైః। పింగాక్షం చతుర్భుజమ్॥.

అను శ్లోకముచే ధ్యానము చేసినది. పిదప షోడశోపచారములన్నియు ముగించి, ధూపదీపములు వెలిగించి, ప్రదక్షిణ నమస్కారములను చేసినది. పదునాల్గు ముళ్ళు గల తోరమును తయారుచేసికొని తాను ధరించినది. అయిదు వళ్ళ గోధుమ పిండిచే ఇరువది ఎనిమిది అతిరసములను చేసి స్వామికి నివేదించినది. పిదప పదునాల్గు అతిరసములను, బ్రాహ్మణునకు వాయనదాన మొసగినది. వ్రతసమాప్తము చేసినది.

ఆయన యిల్లు పాడిపంటలచే సిరిసంపదలతో పెల్లివిరిసినది. మితిలేనిసంపద వచ్చి చేరుటచే కౌండిన్యునకు పరమాత్మపై ఒకింత చులకన భావమేర్పడుటయేగాక ధనాధిక్యత అతనినజ్ఞానాంధ కారమున బడవైచినది. స్వామిని నిర్లక్ష్యము చేసినాడు. భార్య చేతి నలంకరించబడియున్న పట్టుని తోరణమును త్రెంచి అవతల పారవైచి, భార్యనవమానించుట ప్రారంభము చేసినాడు.

క్రమముగ అతనికి దారిద్ర్యబాధలు ప్రారంభమైనది. సంపదను దొంగలు దోచుకొనిరి. ఇల్లు తగులబడిపోయినది. తినుటకు తిండిలేక, కట్టుబట్టలేక దుర్భర మైన జీవితమునకు తలవొంచక తప్పలేదు. కౌండిన్యుడు దిక్కుతోచక అడవుల పాలైపోయినాడు. అప్పటికి గాని అతనికి తెలిసిరాలేదు తను చేసిన పాపకృత్యము. అనంతపద్మనాభస్వామి దక్క అన్యులెవరూ తనను కాపాడలేరని గ్రహించి, ఆ స్వామిని వెదుక ప్రారంభించినాడు. అతనటులు సంచరించు సమయమున ఒక

మామిడిచెట్టు కన్పించినది. అబ్బ! ఆ చెట్టు నిండుగ పండ్లు ప్రేలాడుచుండినవి. కాని ఆ చెట్టుపై ఒక్క పక్షియైనను కానరాకుండెను. "ఓ! చూతవృక్షమా! పద్మనాభ స్వామి వృత్తాంతమేమైననూ తెలుపగలవా?"— అని అడిగినాడు. కాని సమాధానము లేదు. మరికొంత దవ్వేగుసరికి ఒక గోవు ధేనువుతో సహా ఒక పచ్చికబయలులో నుండెను. ఆబయట సంపూర్ణముగ పచ్చని పచ్చికతో నిండియుండెను. గాని, ఆ గోవుగాని, ఆ ధేనువుగాని ఆ పచ్చికనేమాత్రము తినక ఊరక నటునిటు తిరుగుచున్నవి. వాటిని అడిగినాడు అనంతపద్మస్వామి వివరములు. అక్కడనూ అతనికి నిరాశయే యెదురైనది. మరికొంత దూరమేగుసరికి మోకాటిలోతు పచ్చికలో నిలిచియున్న ఒక వృషభరాజు కనంబడ అద్దానినడిగెను గాని, అచ్చటనూ అతనికి సమాధానము రాలేదు. ఆ పిదప యింకొంత దూరమేగగా రెండు కొలనులు కన్పట్టినవి. ఒకదానిలో నీరు, మరొక దానిలోనికి ప్రవహించుచున్నవి. దృశ్యము చూచుట కెంతయో మనోహరముగ నుండెను గాని, తనకు కావలసిన అనంత పద్మనాభుని వివరములు మాత్రము తెలియరాలేదు. ఆ తరువాత ఒక గాడిద, ఒక ఏనుగు కన్పట్టినవి గాని, ప్రయోజనము లేకపోయినది.

ఇంతలో నొక ముదుసలి అటకేతెంచి, అలసియున్న కౌండిన్యునికి చేయూత నిచ్చి పైకి లేవనెత్తి తనవెంట తీసుకొని వెళ్ళినాడు. అబ్బా?- అదియేకాబోలు అనంత పద్మనాభుని దివ్యసౌధము. నవరత్న మణిమయ సహిత నిర్మాణము. దివ్య సింహాసనము. శంఖచక్ర గదాధారియై అనంత పద్మనాభస్వామి కౌండిన్యునకు ప్రత్యక్షమయినాడు. కౌండిన్యుడు అనేక విధముల స్వామిని సంస్తుతి చేసినాడు, స్తోత్రము చేసినాడు.

"కౌండిన్యా! నీవనుభవించిన కష్టక్లేశము లికచాలును. ఇప్పటికి నీకు పశ్చాత్తాపము కలిగినది కనుక, పశ్చాత్తాపము మానవుని మార్చును గనుక....నీవు నన్నే స్మరించుచు, వెదకుచూ వచ్చితివి గనుక ఇంక నీవు సకలైశ్వర్యములు పడసి, సంతుష్టిగానుండెదవు"— అని వరప్రదానము చేసినాడు.

"దేవా! సంతోషము. కాని నాకు కొన్ని సందేహములున్నవి. తీర్చ ప్రార్థన. స్వామీ! తమనన్వేషించుచూ దారిలో నే గాంచిన విషయముల వివరించ ప్రార్థన.... అని అడిగినాడు కౌండిన్యుడు.

"అవియా! అవియా! ఆ మామిడిచెట్టు....గత జన్మమున అతడొక బ్రాహ్మణుడు. విద్యాగర్వమున మదించి తానేర్చిన విద్యల నొరులకు ప్రదానము సేయకుండి నందున ఈ జన్మమున ఎవరికీ ఉపయోగపడని చెట్టై పుట్టినాడు.

"ఆవు....గత జన్మంబున పిల్లి కికూడ బిచ్చము పెట్టక, పిసినారియై లోభియై ప్రవర్తిల్లిన ఒకానొక మానవుడు. పచ్చని పసరికబయలు ఎదుటనున్నప్పటికీ తినుటకు నోరాడని ఆవుగా పుట్టియున్నాడు.

ఎద్దు....తననాశ్రయించిన ఒకరికి జవిటినేలను దానము చేసిన ఫలితముగా ఎద్దు జన్మమెత్తి అడవుల బట్టి తిరుగుచున్నాడు.

రెండు కొలనులు....ఒకటి ధర్మము....రెండు అధర్మము....సాటి మానవులను సాదరముగ బలుకరింపక, అసహ్యించుకొనుచు సర్వదా తూలనాడు స్వభావము గలవాడు గాడిదయై పుట్టినాడు. ఎప్పుడూ తన పూర్వీకులిచ్చిన దానమును, తనదని తగాయిదా పెట్టుకొని, తిరిగి స్వాధీనపర్చుకొని దానిని విక్రయించి లాభపడిన ఒకడు ఏనుగై పుట్టినాడు.

"ఇక నీచెంత జేరిన వృద్ధ బ్రాహ్మణుడను నేనే!- అనంతపద్మనాభస్వామిని కౌండిన్యా! నీవీ అనంతవ్రతమును నియమముగ, నిష్ఠగ, ఓర్పుతో పదునాలుగు సంవత్సరము లాచరింపుము. నీకు నక్షత్ర మండలమున అత్యున్నత స్థానము కలుగును"- అని అనంతుడు కౌండిన్యు ననుగ్రహించి అంతర్ధానమందినాడు.

"ఆ విధముగ కౌండిన్యుడు ఆ వ్రతమునననుసరించి చివరకు నక్షత్రమండల మందు శాశ్వత స్థానము నాక్రమించుకొనినాడు.

కనుక ధర్మజా! అగస్త్యమహర్షి ఈ వ్రతమాచరించి ప్రపంచ ప్రఖ్యాతి గాంచినాడు. సగరుడు, దిలీపుడు, భరతుడు, హరిశ్చంద్రుడు, జనకమహారాజు మొదలైన వారెందరో ఈ అనంత పద్మనాభస్వామి వ్రతమాచరించి ఉత్తమ ఫలితములను బొందినారు.

ధర్మరాజాదులు, పాంచాలీ సమేతముగ నీవ్రతమును సలిపి, తిరిగి తమ రాజ్యములను బడసి హాయిగానుండిరి"- అని శ్రీకృష్ణుడు చెప్పిన విషయములను శ్రీ వీరబ్రహ్మగురుడు ఆ సమయమున సందర్భానుసారముగ వివరించినాడు.

4. అనాహత కమలము: దీనినే అనాహత చక్రము అని గూడ అందురు. అనాహతము అనగా దేనిచేతను కొట్టబడనిది అని అర్థము. క్రిందికి చూచుచుండును, పదిరెండు దళములు కలిగి హరితవర్ణ సంశోభితమై యొప్పుచుండును. ఈ పదిరెండు దళములు క,ఖ,గ,ఘ,ఙ,చ,ఛ,జ,ఝ,ఞ,ట,ఠ అను పదిరెండక్షరములతో భాసించు చుండును. వాయుభూతమున కావాసమై త్వగింద్రియమునకు కారణమగుచుండును.

చర్మము స్పర్శలను గ్రహించును. అందువలననే ఇది స్పర్శేంద్రియము. శీతము, ఉష్ణము, శీతమిశ్రోష్ణము, ఉష్ణమిశ్రశీతము, మృదుత్వము, కాఠిన్యము- అను షడ్విధ స్పర్శలు ఎక్కువతక్కువల భేదముచేత ద్వాదశ విధములైనవి. వానిని సూచించుటకే ద్వాదశ దళ ప్రకాశమని భావింపుము, ప్రాణవాయువు గుండెనుండియే ప్రసారణము సేయును. ఈ ద్వాదశ కమలాధిపతి రుద్రుడు. ఈయనను ఆరువేల హంసలు అజపగాయత్రిచే అర్చించవలయును. ఇదియే మహర్లోకము- "మహః"

5. విశుద్ధ కమలము: లేక విశుద్ధ చక్రము : ఇది కంఠస్థానము నందుండి, నీలవర్ణ సంశోభితమై, షోడశదళ ప్రభాసితమై, ఆకాశభూతమున కాటపట్టయినది. అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఎ, ఐ, ఓ, ఔ, అం, అః - అనునవి పదహారు అక్షరములు. ఈ పదునారు అక్షరముల ఆయా దళముల నధిష్ఠించి యుండును.

ఇది శ్రోత్రేంద్రియమైన కర్ణేంద్రియమునకు కారణము. కావుననే కంఠో ద్భవమైన ధ్వనులు కర్ణేంద్రియములందు లయింపబడున్నవి. జీవునకు నివాసస్థానమే విశుద్ధ కమలము. యోగి యిచ్చట తనకుతాను శుద్ధ స్ఫటికాకారము కలవానినిగా భావించును గనుక ఈ చక్రమునకు విశుద్ధచక్రమని పేరు వచ్చినది. ఇది ఆకాశ భూత ప్రధానమైనది గనుక, యిందు పుట్టిన అకారాది పదహారు స్వరములు పద హారు దళములుగ భావింపనగును. ఈ విశుద్ధ కమలాధిపతి జీవుడే. ఇతనినే క్షేత్రజ్ఞు డనియు అందురు. అందువలననే గీతాచార్యుడు:

శ్లో ॥ క్షేత్రజ్ఞం చాపిమాం విద్ధి సర్వక్షేత్రేషు భారత।
క్షేత్ర క్షేత్రయోర్జ్ఞానం యత్తజ్జ్ఞానం మతం మమ ॥

-గీత : 13:3

అని చెప్పినాడు. అనగా బ్రహ్మాది స్తంభ పర్యంతము గల సకల ఉపాధుల యందు అనగా సమస్త దేహములయందుండెడు క్షేత్రజ్ఞుని (జీవుని) నన్నుగా ఎఱుంగుము. దేహాత్మల యొక్క స్వరూపము నెఱుంగునది యేది గలదో అదియే జ్ఞానము అని అర్థము. ఈ జీవునికి వేయిహంసల జపము సమర్పించవలయును. ఇదియే జనోలోకము- "జనః"

6. ఆజ్ఞాకమలము లేక ఆజ్ఞాచక్రము : ఇది భ్రూమధ్య స్థానమునందుండెడి కమలము. దీనికి రెండు దళములు. 'హం-క్షం'- అను అక్షరములు కలిగి మాణిక్య వర్ణముతో ప్రకాశించుచుండును. అంతఃకరణమునకు స్థానమై అవ్యక్తమదహంకార ములకు ఆవాసముగ పరిగణింపబడుచున్నది. సకలేంద్రియములు తమ తమ కార్య క్రమములు నిర్విఘ్నముగ కొనసాగించుట కాజ్ఞాపింపబడు చున్నవి. ఈ రెండు దళ ములను సంకల్ప. వికల్పములకు మనోబుద్ధులకు నిదర్శనములని కూడ చెప్పుదురు. దీని కధిపతి పరమాత్మయనియు, సదాశివుడనియు కూడ చెప్పుచుందురు. ఈ పర మాత్మకు వేయిహంసలు అర్పితము చేయవలయును.

ఇంతవరకూ నీవు తెలిసికొనిన ఆరు చక్రములలో, ఐదు చక్రములు ఆయా భూతముల కధిష్టానమై, ఈ ఆరవ చక్రమొకటి మాత్రము అంతఃకరణమునకు స్థానమై నెగడుచున్నది. ఇది ఇడ, పింగళ, సుషుమ్న యను మూడునాడులు కూడలి. కనుక త్రికూట స్థానమనియు తెలియదగును. ఇదియే తపో లోకము— "తపః"

7. సహస్రార కమలము లేక సహస్రార చక్రము: ఇదియే బ్రహ్మరంధ్ర స్థానము. మెదడుండుస్థానము. ఇచ్చట అక్షరము పరబ్రహ్మ స్వరూపమైన 'ఓం' అను ప్రణవము. ఇది అష్టదళ పద్మమే యైనను ఒక్కొక్క దళమునందు 125 అంతర్దళములుండుట వలన మొత్తము సహస్రదళములై యున్నందున దీనిని సహ స్రారమని చెప్పిరి. "ఓం! సహస్రశీర్షం దేవం"— అని మంత్రపుష్పమునకు ముందు ఈ పరమేశ్వరుని స్తుతించుటకు కారణము. అంతియేగాక శ్రీకృష్ణునకు వేయిమంది భార్యలని చెప్పుటలోని పరమార్థము గూడ యిదియేగాని, నిజముగ వేయిమంది భార్యలు కాదు. దీనికధిపతి సద్గురువు. సద్గురుడనగా త్రిమూర్తులకు సహితము గురు స్థానములంకరించిన శక్తి. అతడే విశ్వనిర్మాణ కర్త. కర్మ ద్వారా విశ్వకర్మమును

నెరవేర్చుచూ విశ్వకర్మగా ప్రసిద్ధి చెందిన నిత్యపారిశ్రామికుడు. అతడే ఈశుడు, అంబి. గాయత్రి. విశ్వకర్మ. విశ్వబ్రహ్మ. ఈ సహస్రారమే సత్యలోకము."- అని చెప్పి శ్రీగురుడు [illegible].

అంత గోవిందమాంబ శ్రీగురుడు చెప్పిన విషయములను విని సెలవుబడసి గృహోన్ముఖురాలయినది. ఏదో మగతనిద్రలో నుండినట్లు, ఇంకనూ ఆయా లోకము లందే సంచరించుచున్న సిద్దుని మనసు యింకా యిహలోకమునకు రాలేదు. శ్రీగురుడు అది గ్రహించి అతని శిరముపై కరమిడిన కొంతసేపటికి సిద్దయ్య కనులు తెరచి "ఆహా! స్వామీ! దివ్యానందము ననుభవించితిని."— అని అతని పాదములపై బడి ప్రణమిల్లినాడు. ఆనందోద్రేకమున తత్త్వము గానము చేసినాడు.

తత్త్వం :

నే జూచినానే బ్రహ్మమునాలో నే జూచినానే!
సద్గురు నాలో!- నే జూచినానే-
నేజూచి నానమ్మ నెలతరో తారక
రాజయోగమునందు రంజిల్లు నాగురుని ॥నే జూచినానే॥

కన్నుల నడుమను సన్నంపు దిడ్డిన
తిన్నగ వెలిగేటి పున్నమ చంద్రుని. ॥నే జూచినానే॥

ఫాలభాగమునందు నీలజ్యోతుల నడుమ,
ఓలలాడుచునున్న ఓంకారమూర్తిని ॥నే జూచినానే॥

చూపుల లోపల పాపల నడుమను
వ్యాపించి వెలిగేటి ఆ పరంజ్యోతిని! ॥నే జూచినానే॥

నాసాగ్రమునందు పశ్చిమ వీధిన
నిక్షేపమై వెలుగు సాక్షిభూతుని నాలో ॥నే జూచినానే॥

చందమామకు నడుమ కుండలాకృతిలోన
అందముగ వెలుగొందు హరిపోతులూరినీ ॥నే జూచినా నే

ఇంతలో శ్రీగురుడు కంగారుపడుచు, "సిద్దా! ఆలస్యము సేయకు. వెంటనే నడువుము. ప్రమాదము సంభవించుచున్నది"- అని సిద్దుని రాకకై ఎదురు చూడకుండ, పెద్ద పెద్ద అంగలు వేయుచూ, హరిజనవాడకు చేరినాడు.

అప్పటికే అక్కడ జనులు గుంపులుగూడి "గురువులోరు! గురువులోరు! బెమ్మంగారు! బెమ్మంగారు"- అనుచు అందరనూ ప్రక్కకు తప్పుకొనిరి.

అది కక్కయ్య ఇల్లు....

శ్రీగురుడు సిద్దయ్యతోసహా కక్కని ఇంటిలోనికి వెళ్ళినాడు. రక్తపు మడుగులో పడియున్న కక్కని భార్య-ఆమె వెంట కూర్చొని గగ్గోలుగా యేడ్చుచున్న కక్కయ్య.

"కక్కా! నీవే జన్మమున పుణ్యము చేసికొనియుంటివో గాని, నా బోధనలో యింతటి జిజ్ఞాస రేకెత్తించుటయేగాక సకల దేవతా స్వరూపములను కన్నులార గాంచితివి. నీవు మరలా ఆ దేవతా స్వరూపములను చూడవలయునని ఉవ్విళ్ళూరుచుంటివిగదూ! రా!— నా వెంటనే కూర్చో!"— అని అతనిని వెంట కూర్చుండచేసి, కక్కని భార్యయైన ముత్తి శరీరమునందు మరలా సర్వదేవతలను దర్శింపచేసినాడు సిద్దయ్యకు మరొక్కసారి ఆ భాగ్యము కలిగినది.

కక్కయ్య శ్రీగురు పాదములపైబడి శరణు వేడినాడు. శ్రీగురుని లేవదీసి, తన శిష్యునిగా స్వీకరించినాడు. అస్పృశ్యతా నివారణకు ఆనాడే నాంది పలికిన వీర బ్రహ్మం ప్రప్రథమాంధ్రుడు గావచ్చును.

శ్రీగురుని మంత్రజల ప్రోక్షణతో ముత్తి నిదుర నుండి లేచినట్లు లేచి కూర్చుని—జరిగిన విషయము తెలిసికొని, శ్రీగురు పాదంబులపై బడి ప్రార్థనలు చేసినది.

అసలు జరిగిన విషయమిది—సిద్దునికి శ్రీగురుడు షట్చక్రములు దర్శనము చేయించుచున్న సమయమున కక్కయ్య చెట్టుచాటున నుండి వినుటతో, అతనికి మనోనిశ్చలత గలిగి సిద్దయ్య చూచిన ప్రతి దృశ్యమునూ అతను చూడగలిగినాడు. అంతటితో తృప్తిపడక భార్య గర్భమును ఛేదించిన సర్వదేవతలందరను చూడవచ్చు

నను అమాయకతతో భార్యను గర్భచ్ఛేదనము చేయబోగా ఆమె పడిపోయినది. కక్కయ్య చేతికత్తి ఆమె గర్భముపై బడి గాయమై రక్తము స్రవించినది. ఇంక నాలస్యమైన ప్రమాదము జరుగునని గ్రహించిన శ్రీగురుడు హరిజనవాడకు పరుగులు తీసి ప్రమాదమును నివారించుటయేగాక, ప్రయోజనము చేకూర్చినాడు.

"ఏ బాపనయ్యా మా గూడేనికి రాడు. వచ్చినా మమ్మల్ని ముట్టుకోడు. దూరం నుండి మాటాడుతాడు. అట్టాడిది. బెమ్మంగారు మా గూడేనికివచ్చి మమ్మల్ని తాకి మా మత్తిని బతికించారు. "జై! బెమ్మంగారికీ"- వారందరూ బ్రహ్మంగారికి ఊరేగింపు జరిపి స్వామి మఠప్రాంగణంలో దింపి-శలవు తీసుకొని వెళ్ళినారు.

—o—

సిద్ధయోగి ప్రసిద్ధ భారతం :

: ముప్పది నాల్గవ భాగం :

తరువాత మరి కొన్ని దినములకు శ్రీగురుడు శిష్యజనసమేతుడై భక్తి ప్రచారము సేయుచు, ధర్మప్రబోధమును గావించుచు దిగువమెట్ట యను గ్రామమునకు చేరినాడు. అక్కడ స్వాములు దాహము గొనియుండి ఆ ప్రాంతముననే ఒక గృహ ప్రాంగణమందాగినాడు. అది యొక విశ్వబ్రాహ్మణుని శిల్పశాల. వారొక విగ్రహ నిర్మాణార్థమై లోహము కరుగుచుండిరి.

"ఆచార్యులారా!"— యని పిల్చినాడు శ్రీగురుడు.

వారు మాటలాడక విసుగుపడుట జూచి సిద్ధయ్య కల్పించుకొని "అగ్లేల వచింతురు. కల్పవృక్షము మీ వాకిట నిలబడి తలుపుతట్టుచున్నది. కామధేనువు మీ

ముంగిట నిలువబడి అంబాయని అబుచుచున్నది. వీరలెవరో తెలిసిన మీరట్లు మాట లాడరు. వీరు శ్రీ విరాట్పోతులూరి వీరబ్రహ్మగురుసార్వభౌములు, సాక్షాద్విశ్వ కర్మ స్వరూపులు. త్రిమూర్త్యాత్మక స్వరూపులైన దత్తాత్రేయుని దివ్యావతారము.... మీ ముందు నిలువబడి దాహమడుగుచున్నారు. లేదనకుడు. వెంటనే శ్రీ గురున కింత జలదాన మొసంగి పవిత్రులు కండు."- అనినాడు సిద్దయ్య.

"ఏమిటి ? మేము పవిత్రులము కావలయునా?"

"అవును"– సిద్దయ్య.

"ఈయనకు జలమీయకుండిన మేము పవిత్రులముగామా ?" ఇంతవరకు మేము అపవిత్రుల మనియూ మీ భావము."- శిష్యులు.

"అయ్యలారా ! ఆగ్రహింపకుడు. పూజించవలసిన మహాత్ములు ఎదురుపడి నపుడు పూజింపక పోవుటయేగాక యిటులవమాన పఱచుట భగవంతునిపట్ల అపచా రము చేసినవారలగుదురు. వీరగురునకు భక్తితో మీరు సమర్పించు జలములు మీ సకల పాపములను ప్రక్షాళనము సేయుటయేగాక మీయావద్వంశమునకే కీర్తి ఘటి ల్లును."- సిద్దయ్య.

"ఏమేమీ ! ఈయన కొక్క చెంబుడు మంచినీళ్ళిచ్చిన మాత్రమున మా యావద్వంశమే పవిత్రమగునా ! భళా ! ఏమి పలికితివయ్యా !" శిష్యులు.

"నేను చెప్పినది సత్యము"—సిద్దయ్య.

"ఆయన అంతటి మహనీయుడా!" శిష్యులు.

"అవునో కాదో నీ బోటి యజ్ఞాని కెట్లు తెలియును. సిరిరా మోకాలొడ్డు చందమున, సర్వేశ్వరుడే నీ కెదురు నిలచి జలదాన మడుగుచుండిన అతని నొక మామూలు మనుష్యునిలా భావించి కసరుకొను చుంటివిగాని, సాక్షాత్తు సాంబశివుడని గ్రహించలేక అహంకార మదోన్మత్తుడవై, అజ్ఞానాంధకార పరీవృతుడవై, యిష్ట మొచ్చిన యట్లు పల్కు చుంటివిగాని కనీసము తోటి మానవుడను సానుభూతియై ననూ నీకు లేకుండినదే! నీవేమి బ్రాహ్మణుడవయ్యా. కనీస మొక్క మహనీయునకు త్రాగుట కింత జలమీయలేని నీవూ బ్రాహ్మణుడవేనా?" —అని ఒక శిష్యుడనగా ఆ

విశ్వకర్మ బ్రాహ్మణుడు "అంత మహనీయుడైన యిదిగో ఈ కణిగెడి లోహమును త్రాగమనుము—చూతము ఆ మహనీయత"—అని పెద్ద పట్టుకారుతో ఆ పెద్ద మూసను కొలిమిలోనుండి బయటకు లాగినాడు.

సాయంకాలపు సూర్యబింబమువలె ఎఱ్ఱగా కాలి పెలిగిపోవుచున్న ఆ మూసను రెండు చేతులతో నెత్తుకొని శ్రీగురుడు గటగట లోహమును త్రాగినాడు. అనంతరా మూసను సిద్ధుని పైపు విసరినాడు. సిద్ధుడు దానిని క్రిందపడకుండ పట్టుకొనినాడు.

అంతనా శిల్పాచార్యుడు స్పృహ తప్పిపడిపోవ అతని భార్య శ్రీగురుని పాదముల పైబడి ప్రార్థించినది. కొద్దిసేపటి కతడు లేచి శ్రీగురుని పాదములపైబడి ప్రార్థించి....చెంపలు వైచుకొని....సిద్ధయాది శిష్యులందరికి భోజనాది సౌకర్యములు సత్కారము లందించి శ్రీగురుని ఆశీస్సుల బొంది తరించినాడు.

o .... o

సిద్ధయోగి ప్రసిద్ధ భారతం :

ముప్పదైదవ భాగం :

అది నంద్యాల పట్టణము ఊరికి కొంచెము దూరమున వదాన్యులు కట్టించిన సత్రము చుట్టు ప్రక్కల పచ్చని చెట్లతో మంచి నీరము సమృద్ధిగా కలిగిన బావులతో పరివృతమై శోభించుచున్నది. శ్రీ వీరబ్రహ్మగురుదేవులు శిష్యులతో ఆ సత్రమునందు మకాము చేసినారు. రామానుజులు శ్రేష్ఠిస్వామిని ప్రతి నిత్యము సేవించు వారలలో ప్రథముడు. అందునకొక ప్రత్యేక కారణముగూడ కలదు.

రామానుజులు శ్రేష్ఠిగారి కొమరితకు ప్రసవ వేదన సమయమందు వాతము కమ్మి
ఆమె మరణావస్థకు చేరుకొనినది. అప్పుడు బ్రహ్మంముగారచ్చటకు చేరి ఆమెకి
కేవలము చిటికెడు విభూతి ఉద్ధరించెడు నిశ్చతో స్వస్థత చేకూర్చినాడు. అంతిం
కాదు. రామానుజులు శ్రేష్ఠి అన్నగారు రంగమన్నారనెడి వాని కుమారుడు ఉడయ
వర్లను పేరబరగువాడు యువకుడు, మంచి స్ఫురద్రూపి. కాని మూర్ఛల వ్యాధిచే
బాధపడుచుండెను. అందువలన అతనికి వివాహము కాలేదు. ఆ విషయము
బ్రహ్మంముగారి కెఱుక పర్చగా అతనిని తన ఎదుట ప్రవేశ పెట్టమనిరి. రం
మన్నారు తనకుమారుడైన ఉడయవర్లను తెచ్చి స్వాములవారెదుట నిలువబెట్టిరి. స్వా
అతనిని తీక్షణముగా చూచి తలపై చున్నగా రెండు దెబ్బలు వేసిరి. అంతనా యు
కుడు స్పృహతప్పి క్రింద పడిపోయినాడు. రామానుజులు శ్రేష్ఠి రంగమన్నారుగా
కుటుంబ సభ్యులు కంగారు పడి గగ్గోలు పెట్టిరి, వీర బ్రహ్మంముగారు వారి
శాంత పరచి "భయపడకుడు అతని నిప్పటి వరకు పట్టిన మూర్ఛల వ్యాధి నేటికి
వదలి పోయినది. ఒక గంట కాల మనంతరము అతడు నిద్రలేచును"—అ
చెప్పిరి.

అటులనే జరిగినది. అప్పటినుండి వారలకు వీరబ్రహ్మంముగారిపై గురి కుది
నది. ఒకనాడు అనుకోకుండా రామానుజులు శ్రేష్ఠిగారికి విశ్వమహాపాచార్యస్థ
ఎదురుపడగా, ఆ విషయము ఈ విషయము మాట్లాడుచూ, శ్రేష్ఠిగారు స్థపతిగా
శ్రీగురుని విషయమై తెలిపిరి. స్థపతి అంత శ్రద్ధచూపలేదు. కాని శ్రేష్ఠిగారు వ
మరీ చెప్పుట మూలమున విశ్వమహాపాచార్యస్థపతి తన దగ్గర బంధుగులైన శి
కంఠాచార్యుడు, శంకరాచార్యుడు, శరభాచార్యుడు ఆదిగాగల విశ్వకర్మ బ్రాహ్మ
లను తోడుతీసికొని శ్రేష్ఠితో కలసి సత్రమునకు వెళ్ళినారు. వెళ్ళగానే వా
శ్రీగురునితో భక్తి పురస్సరముగ గాక నిర్లక్ష్యభావముతో మర్యాద రహితము
మాటాడ జొచ్చిరి. సిద్ధయాది యితర శిష్యులకు, శ్రేష్ఠిగారికి కూడ వారి ప్రవర్త
అనుచితము గాను, అసహ్యముగాను, అహంకారపూరితముగాను తోచినది. ఆ
హము కూడ కలిగినది. అపుడు సిద్దయ్య కల్పించుకొని "ఆచార్యా! మీరేమి మా
లాడు చుంటిరో మా కవగతమగుట లేదు. మామీద మీ కేల అలుక! ఎవరి భ
వారిది. ఎవరి నమ్మకము వారిది. మీలో భక్తి లేనంత మాత్రమున ఇతర భక్తుల

చులకన చేసి మాటలాడుట మంచిదికాదు, మర్యాదకాదు. అయినను మేము మిమ్ములను ప్రత్యేకించ స్వయంపాకములుగాని, సన్మానములు గాని కోరలేదే !"- సిద్దయ్య.

"నీ వెవరవోయ్"

"నేనా! పరమేశ్వరస్వరూపులైన, రాజాధిరాజ, రాజయోగి పరమేశ్వర!— విశ్వవిజ్ఞాన వీరగురు దేవుల సేవకుడను. వారి దివ్య మాహాత్మ్యమును, అవతార విశేషములు తెలియక తెలియజాలక, తెలిసికొనవలయునను జిజ్ఞాసయులేక, అల్పజ్ఞులై యిట్లు మాటాడుచుంటిరి గాని వారి నిజావతారము తెలిసిన మీరట్లు మాటాడరు."— సిద్దయ్య.

"చాలింపుము. ఎందులకీ స్వోత్కర్ష. మీరేదో యవతార పురుషులమని చెప్పుకొన్నంత మాత్రమున భయపడి పాదములపైబడి పణముల సమర్పించుకొని ప్రాయశ్చిత్తమిమ్మని ప్రాధేయపడు అల్పజ్ఞులము కాము."- ఆచార్యుడు.

"మీరల్పజ్ఞులగుదురో కారో! మీకై మీరే ప్రశ్నించుకొనుడు. కోరి మాతో కయ్యమునకు విచ్చేసినటులుండె గాని, విజ్ఞతతో వచ్చినటుల కాన్పింపదు. శ్రీగురుడు విశ్వకర్మ బ్రహ్మవంశ పయః పారావార రాకాసుధాకరుడు, విశ్వజ్ఞుడు, విబుధుడు, విజ్ఞాని, ఆధ్యాత్మిక విజ్ఞాన ప్రబోధ భాస్కరుడు. అట్టివానిని గౌరవించుట మీ విధి. దానికి మీరు సిద్ధపడకపోగా రామానుజుల శ్రేష్ఠిగారి సోదరులు, వారి కుటుంబ సభ్యులు వారిని అత్యంత గౌరవాభిమానములతో భక్తితో సేవించుచుండ, మీరేల యిట్లు కయ్యమునకు కడంగుదురు. మీరు మీ సాటి కులజుడైన యీ మహనీయుని, మహానుభావుని, శివస్వరూపుని, ఆహ్వానించి, ఆరాధించి, సమాదరించి, సన్మానించి, పూజించి పంపుట ధర్మముగాని యిట్లేల కలహమాడెదరు? హరిహరీ! ఎంతటి వైపరీత్యము. సద్బ్రాహ్మణ వంశ సంజాతులు, సాక్షాత్తు సాంబశివుని పట్ల విద్వేషమా? ఇది మీ యొక్క విజ్ఞాన దారిద్ర్యమునే గాక విత్తదారిద్ర్యమును గూడ బహిర్గతము సేయుచున్నది. వేషగాంభీర్యము ప్రధానముగాదు. వినయగాంభీర్యము ఆవశ్యము." సిద్దయ్య.

"ఏమీ! ఏమంటివి? మేము దరిద్రులమా!"

"లేకున్న! స్వామికింత సౌకర్యములు కల్పించుట మాని సంగ్రామమునకై వచ్చిన మీరలు దరిద్రులు గాక సమభావ సంపన్నులెట్లగుదురు? పురుషపుష్టి గలిగిన

సౌభాగ్య సౌశీల్య సంపన్నులెట్లగుదురు? వైశ్యాది యితర జాతులవారు, మహ్మ యాది యితర మతములవారు సహితము జాతి, మత, కుల, వర్ణ వ్యత్యాసము నొదలి, స్వాముల సమాదరించి, సమ్మానించి, సేవింపుచుండ, స్వజాతీయులైన మీర సమరభేరీ ప్రయోగించుట, స్వాములకింత భోజనాది సౌకర్యములు కల్పించలేకపోవు మీ ఆర్థిక దౌర్భాగ్యత కాక మరింకేమనవలయును"- అనినాడు సిద్దయ్య.

విశ్వకర్మబ్రాహ్మణులు కోపోద్రిక్తులయినారు. శ్రీగురుని, వారి శిష్యజనము యితర భక్తజనములను చూచి, అటులైన మా సత్తాయేమిటో చూపెదము. మీ అం కింత ముష్టిపడవేయలేని ముదనష్టపు బ్రతుకులు కావుమావి. మీకెంతటి అన్న కావలయునో తెల్పుము. అంతయూ వండించెదను. మీ ఎత్తు అన్నపు రాశిని కృ రింపమందురా!"- అందులోని శరభాచార్యుడను శిల్పి ఆగ్రహోదగ్రుడై పలి నాడు.

"ఎందులకీ పట్టుదల, ఆచార్యులారా! మీరెందుల కరుదెంచితిరో కా మనూహ్యము. సందర్శనమునకై వచ్చి యిట్లు సమరశంఖము పూరించనేల? శా చిత్తులై వెడలుడు. మాకేమియు వలదు. ప్రస్తుతము వీరలిచ్చు స్వయంపాకాది పాయములే మాకధికములై యున్నవి. కనుక మీరేల బాధపడియెదరు? మరి విధముగ భావింపక మీకు మాపైగాని మా కార్యక్రమములపై గాని యిచ్చలేక వచ్చినదారినే వెడలుడు. ఎందులకీ అధిక ప్రసంగము, అనవసర వాగ్యుద్ధమ అనినాడు శ్రీగురుడు.

"మమ్ముల దౌర్భాగ్యులనీ, దరిద్రులనీ మీ శిష్యులు పలుకుచుం అద్దానిని మేము సహింపము. పంతమునకైనను మేము నిలువవలసి యున్న కనుక ఒకపుట్టెడు బియ్యము నన్నము వండించమందురా!"- అనినాడు నీలక చార్యుడు.

"మీరు నామాట వినరా?" శ్రీగురుడు.

"ప్రస్తుతము పట్టుదల, పంతము తప్ప అన్యమేమియూ లేదు. మీ వినవలసిన అవసరము మాకు లేదు. మా మాటలు మన్నించవలసిన బాధ్యత మీ యున్నది, గ్రహింపుడు"

"సరియే అటులే కానిండు"

"ఒక పుట్టెడు బియ్యము సరిపోవునా!"

"ఒక పుట్టి యేల? అది మీ మీ శక్తి సామర్థ్యములపై, ఆర్థిక బల

ధాన్యపు నిల్వలపై ఆధారపడియున్నది. అంతియేగాని నేనెట్లు చెప్పగలను. మీరెన్ని పుట్ల బియ్యము వండింపగలరో అన్ని పుట్ల బియ్యము వండింపుడు. మా సిద్ధయ్యకు అసలే ఆకలి నాస్తి. ఒక్క విషయము గుర్తుంచుకొనుడు. తరువాత యింకనూ అన్నము కావలసి వచ్చిన 'లేదు' అనుమాట రాకూడదు. దాని పర్యవసానము, ప్రభావము చాల తీవ్రముగా నుండును. అప్పుడు మిమ్ములనే శక్తియు రక్షించలేదు. ఇప్పటికైనను మించిపోయినది లేదు. ఆలోచించుకొనుడు" అనినాడు శ్రీగురుడు.

"అటులనా! సరియే! చూచెదముగాక! ఇటువంటి బైరాగుల బండారము గతమందెంతయో చూచితిమి. ఇంతలోనే భయపడి పారిపోదుమనుకుంటిరేమో!- ఎంత మాత్రము అట్లు జరుగదు"- అని విసవిసా వెళ్ళిపోయినారు గ్రామ శిల్పులు.

రామానుజులు శ్రేష్ఠి స్వాముల దరిచేరి "స్వామీ! క్షమింపుడు. ఇందులో నా ప్రమేయమేమాత్రమూ లేదు. మీ స్వజాతి వారుగదాయని ఎరింగించితిని. అంతియే గాని వారట్లు మూర్ఖముగా ప్రవర్తింతురని ఊహించనైతిని" అనినాడు.

"నాకు కులమతాలతో సంబంధము లేదు. అందరూ నావారనే నేను తలంచు చుందును. కాని కొందరిట్లు అజ్ఞానమున ప్రవర్తింతురు. వారికి నేనేమి చేయగలను? వారట్లు అహంకార మద మోహితులై చరించుచుండ కర్మమనుభవించక తప్పని దేమున్నది....అయిననూ ఇదంతయూ భగవత్సంకల్పమే. మనమందరమూ పర మాత్మని చేతిలో పావులము మాత్రమే! జరుగునది జరిగితీరక తప్పదు....

మీరేమియూ భయపడకుడు. కారణము లేకుండ కార్యములు జరుగవు. ఇక్కడి వ్యవహారము జరుగవలసిన రీతిగనే జరుగును. అది జరుగవలయును గనుక నేనిచ్చట కేతెంచితిని. పరమేశ్వరుడు అందులకే నన్నిచ్చటకు పంపి యున్నాడు. లేకున్న నా ఆగమనమే వృథాయగునేమో! అంతయూ దైవనిర్ణయము. మనచేత నేమియున్నది. మనమందరము విధిచేతి కీలుబొమ్మలము. అది ఆడించినట్లు ఆడుటయే మన ధర్మము. అజ్ఞానమును వెడలగొట్టి జ్ఞానజ్యోతులు వెలిగించుటయే నా కార్యక్రమము. అందులో భాగమే ఈ విశ్వకర్మ బ్రాహ్మణ వంశ సంభవుల వింత ప్రవర్తన. జరుగబోవు వింత మీరునూ కన్నులార చూడుడు. రానున్న కాలమందు యిటువంటి వింతలూ విడ్డూరాలు ఎన్నియో జరుగగలవు."- శ్రీగురుడు.

"మాకు తెలవిప్పింపుడు స్వామీ."

"అప్పుడేనా! జరుగవలసిన కార్యక్రమమిప్పుడే ప్రారంభము కాబోవు చున్నది. ప్రసాదము తీసికొని వెడలుదురు గాక! అంతవరకూ వేచియుండుడు." అని చెప్పినాడు శ్రీగురుడు.

విశ్వకర్మ బ్రాహ్మణులు పుట్టి బియ్యము సేకరించి వంటచేయించి పెద్దాచార్యులైన విశ్వరూపాచార్యుల యింటిముందున్న విశాల స్థలమునందు అన్నపు రాసిని పోయించి శ్రీగురుని, వారి శిష్యులను భోజనమునకు రమ్మని అవహేళనము చేయుచు ఆహ్వానమును పంపిరి.

శ్రీగురుడు సిద్ధ మొదలగు శిష్యులను వెంటనిడుకొని, రామానుజులు శ్రేష్ఠి, రంగమన్నారు మొదలుగాగల పెద్దలందరు వెంటరాగా అచటకేతెంచినారు. ఎంతో ఎత్తుగా ఎదిగియున్న అన్నపురాశిని గాంచినారు.

"అదిగో అన్నపురాశి. పుట్టెడు బియ్యపు అన్నము. అది ఆరగించి మీమాట నిలుపుకొనుడు." అనినాడొక పెద్ద.

"బహుశా యిది సరిపోకపోవచ్చును. మీ గృహములందింకనూ ధాన్యముండిన వెంటనే వండించి సిద్ధము చేయింపుడు. లేకున్న దాని ప్రభావ మతి తీవ్రముగా నుండును"- అనినాడు శ్రీగురుడు.

ఈ వింత చూచుటకు జనములు తండోపతండములుగా వచ్చినారు. "ఇంతటి అన్నపురాశినెట్లు తినగలుగును? ఏమిటీ మాయ?" అని పలువురు పలువిధములుగా చెప్పుకొనుచుండిరి.

"అయ్యో! పెద్దాచార్యులుగారూ! స్వామితో అనవసరపు వైరము తెచ్చుకొంటిరి. పర్యవసాన మెట్లుండునో యేమో?" భయము వ్యక్తముచేసినాడొక పెద్ద.

శ్రీగురుడు అన్నపురాశి చుట్టూ ఒకసారి తిరిగి "భళా!" అని అంతటి అన్నపు రాశి నుండి ఒక పిడికెడు అన్నముతీసి తన చేతనుంచుకొని అథర్వవేదమందలి విశ్వకర్మ సూక్తమును మేఘగంభీర స్వరముతో గానముచేసి "సిద్ధా! యింక నీభోజనము కానిమ్ము"- అని అనుజ్ఞనొసగినాడు.

అంతియే! విచిత్రము. భూమ్యాకాశము లేకమైనటుల భయంకరమైన ధ్వనులుప్పతిల్లినవి. విపరీతమైన ప్రభంజనము ప్రచండరీతిలో విజృంభించి వీచినది. చూచుచుండగనే సిద్ధయ్య ఆకాశమంత ఎత్తు ఎదిగినాడు. అతని హస్త పరిధి గ్రామమంత వైశాల్యమున్నట్లు తోచినది. అతని ముఖము భయంకరాకారమును దాల్చినది. అతని గహ్వరమొక పర్వతగుహవలె నున్నది. దంష్ట్రలు భయంకరములై తోచినవి. కన్నులు అగ్నిగోళముల వలె కనిపించినవి. సిద్ధయ్య క్షణకాలములో

అంతటి అన్నపురాశిని భుజించుట పూర్తిచేసి "ఆకలి! ఆకలి" అని అరచుచు పిండులు త్రొక్కుట ప్రారంభము చేసినాడు. అతని పదఘట్టనలకు భూమి కంపించి నట్లు తోచినది. అతని పాదముల క్రిందబడి మరణింతుమేమోనను భయముచే ఊరి పెద్దలు భయభ్రాంతులై పరుగులు ప్రారంభించిరి. విశ్వరూపాచార్యాది విశ్వకర్మ బ్రాహ్మణులు దిక్కుతోచక భయముతో గడగడ వడంకుచు, చెంపలు వాయించుకొని అహంకారము నశింప, గర్వముడిగి, కనుల వెంట నీరు కార్చుచు, నిర్వీర్యులై నిరాశ్రయులై, తామేమైపోదుమోనను భయము తమను కృంగదీయ, ఆ భయంకర రూప వాతావరణమును చూడజాలక గిలగిల కొట్టుకొనుచు స్వామివారి పాదములపై బడి "పాహిమాం, పాహిమాం!" సర్వేశ్వరా! నీవే దిక్కు. నీ పాదములే మాకు శరణ్యం. వీరబ్రహ్మేంద్ర గురుదేవా! అహంకార మద గర్వపోతులమై తమ నిజ స్వరూపము తెలియక, బుద్ధి గడ్డితిని మీతో పంతమునకు దిగితిమి, మమ్ము రక్షింపుడు. రక్షింపుడు"- అని పాదముల విడువరైరి.

అంత శ్రీగురుడు ప్రశాంత గంభీరవదనుడై "గర్వాంధులై మీరట్లు ప్రవర్తించరాదు. మీ వలన యావద్గ్రామమంతయు యిట్టి భయంకర వాతావరణము కాంచవలసి వచ్చినది. మీరు దండనార్హులు." అని చెప్పగా "స్వామీ! తప్పులు క్షమింపుడు. ఇంకెప్పుడూ యిటువంటి దుష్కార్యముల కొడిగట్టము. సతము నీ నామరూప ధ్యానములనే చేయుచు జీవితము గడిపెదము."— అని పరిపరి విధముల ప్రార్థించిరి.

అంత శ్రీగురుడు తనచేతనున్న అన్నపు ముద్దను సిద్ధుని నోటనిడెను. అంత సిద్ధుడు సాధారణ రూపమున గోవుని త్రేన్చుచు ప్రశాంతమూర్తియై మందస్మిత వదనారవిందమున నిల్చినాడు.

అంతనా విశ్వకర్మ బ్రాహ్మణులు గురుదేవులకు సకలోపచారములతో పూజించి, ఊరేగింపు జరిపి, సిద్ధయ్యను సత్కరించి, వారు వీరను భేదములేక సహపంక్తి భోజనములు నేర్పాటు చేసినారు. అందరూ సలక్షణముగ భోజనముల చేసి, శ్రీగురుడిచ్చిన తీర్థ ప్రసాదముల స్వీకరించి గుర్వాశీర్వాదముల బడసి వెడలినారు.

—o—

సిద్ధయోగి ప్రసిద్ధభారతం :-

-: ముప్పది ఆరవభాగం :-

శ్రీ గురుడు కడప నగరం ప్రవేశించినాడు. నవాబు ఎదురేగి స్వాములను సిద్ధయ్యను ఎంతో భక్తి పురస్సరముగ వందనముల నర్పించుచూ, గౌరవ సన్మానములతో పట్టణములోనికి తీసికొని వెళ్ళినాడు. ఆధ్యాత్మిక సభ నేర్పాటు గావించి స్వాములవారి కాలజ్ఞానమును విని సంతోషించి స్వాములను ఘనముగ సన్మానించినాడు.

అనంతరము స్వాములు సిద్ధ మొదలు శిష్యులతో పుష్పగిర్య గ్రహారము ప్రవేశించినారు. బండిలో స్వాములు ఆశీనులై యుండిరి. శిష్యులు పాదచారులై వచ్చుచున్నారు. సిద్ధయ్య బండి వెంబడే నడచుచు, ఎద్దును అదిలించు చుండెను.

"సిద్ధా!"— అని పిల్చినాడు స్వామి.

"ఏమిస్వామీ!"— అని చేతులు జోడించి నిలుఁవబడినాడు సిద్ధయ్య.

"ఆనాడు మనల నాహ్వానించిన కాశీబొట్ల వేంకటసోమయాజులీ యగ్రహార పండితుడే గదా! ఎటూ యింతదూర మరుగు దెంచితిమి. ఒక్కసారి యా పుణ్య దంపతులను పరామర్శించి పోవుదము."— అనినాడు శ్రీగురుడు.

"అవశ్యము గురుదేవా!"— అనినాడు సిద్ధమూర్తి.

శ్రీగురుడు శిష్యజన పరీవృతుడై అగ్రహారము నందు ప్రవేశించినంత అచ్చటి పండితులు కొందరు పరుగు పరుగున వచ్చి స్వాములను శిష్య జనములను చూచి

"ఆగు నాగుడు?— ఎవరు మీరు? ఎచటకేగు చుంటిరి? ఇది బ్రాహ్మణాగ్రహార మని తెలియదా? పండితులము. బ్రాహ్మణులము. యింత మందిమి మేమిచట నిలువబడి యుండ, బండి నుండి దిగక, మాకు నమస్కరింపక అగ్రహార వీధుల సంచరింప బూనుట సాహసముతో కూడిన వ్యవహారము. ఇట్టి చర్యను మేము క్షమింపము."
—గర్జించినారు పండితులు.

"అయ్యా! నేను సిద్ధయ్యను. వీరందరూ నా సహాధ్యాయులు. అదుగో శకటారోహులై, శంకర సన్నిభులై, దేదీప్యమానమై దివ్య ప్రభల వెలయించుచున్న త్రిమూర్త్యాత్మ స్వరూపకులైన దత్తాత్రేయుడు శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మగురు

౫౮

రాట్ చంద్రమౌళి. లోకోత్తర పురుషుడు. సదసద్వివేక సంపన్నుడు. సర్వజ్ఞుడు. సద్గుణుడు. సర్వేశ్వరుడు. అస్మద్గురువర్యుడు. ఆధ్యాత్మిక జ్ఞానస్వరూపుడై అజ్ఞానాంధకారమును పారద్రోల పుట్టిన పుణ్యమూర్తి."— అనినాడు సిద్దయ్య.

"చూడచూడ నీవు శూద్రమూర్తివలె కన్పట్టుచున్నావు. నీ వక్షస్థలంబునందు యజ్ఞోపవీతము లేదు. ఎవరవు నీవు? నీ కులమేది? మతమేది? ఏ జాతి వాడవు? యింత నిర్భయముగ మాటలాడు నీవు"—అని యింకేదో అనబోవునంత సిద్దయ్య

తత్త్వము :

1. ఏ కులమని నను వివర మడిగితే! ఏమని తెల్పుదు జనులారా !
ఓ జనులారా! ....బ్రాహ్మణులారా!

2. పాల భాగమును యేలలు జాడుచు! భావము గన్నది నాకులము !
పుట్టిన బుట్టింది కులము। పుట్టంటున పెరిగింది కులము
పుట్టిన హరియు పుట్టిన హరుడు। పుట్టిన బ్రహ్మం ముగ్గురు మూర్తులు
మూలము దెలిపింది కులము.

3. అంగము మూర్ఖమనే బ్రహ్మము। లింగము ముందర పెట్టుక.
ప్రపంచమంతా బ్రహ్మమయముగా। పూజలు సలిపింది కులము.

4. అంగములోన మేకను బట్టి। లింగములోనే గొంతుక కోసి
శాస్త్రమనే పాత్ర వేసి। చతుష్ప్రిత్మలకు
పంచి పెట్టినది । నా కులము॥.

5. ఇంటిలోపల ఇల్లు గట్టుకొని। మంటలోపల రాటం పెట్టుక,
కంటిలోపల కుదురు పెట్టుకొని। ముక్కులోపల ఏకు పెట్టుకొని
చెవిలోనాకా చేతికి దీసుక। నారాయణయని నరమువేసికొని,
అష్టాక్షరి యను వడికె తీసికొని। పంచాక్షరియను మంచె తీసికొని,
తఘిబు తఘిబు గుబదెబగుబదెబ। ఏకిన కులమే మా కులము॥.

5. ఏకిన ఏకులు పేకిన పిండెలు। లోకమంతనొక పాకము చేసుక।
ఏకిన కులమే మాకులము! దూదేకిన కులమే మాకులము॥.

7. రొమ్మున లక్ష్మీచీర గట్టుకొని। ఇమ్మగ సిరిపావడ దొడిగి,
వీర బ్రహ్మం శాల్వ గప్పుకొని। వెలుగొందినదే నా కులము॥.

8. ఒంటరిగాదూ నా కులము—సరు జంట దిరుగునూ నా కులము,
అండ పిండ బ్రహ్మాండ మెల్లను, నిండియున్నది నా కులమూ॥.

అని సిద్దయ్య తత్త్వగానమున ఆధ్యాత్మిక భావమంతయూ పొదిగి తన కుల నామధేయమును తెలుపగా "ఓహో! అదా సంగతి. ఆ బండిలో నున్న దండి యూపుడు నీ గురువా!"—అని నాకొక పండితుడు.

"అవును అతడే! సాక్షాద్విశ్వకర్మస్వరూపుడు, జగద్గురుడు. పరబ్రహ్మ. అనంత తేజుడు. అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుడు. అప్రమేయుడు. అనంతుడు. ఆదిమూర్తి. అతడే నా గురుమూర్తి. విష్ణుమూర్తి. శివమూర్తి."—సిద్దయ్య.

"అపభ్రష్టా! యూదినేకు కులప్రవాహమైన నీవెక్కడ, విశ్వకర్మ వంశ బ్రాహ్మణుడైన అతనెక్కడ. ఇస్లాంమత సాంప్రదాయబద్ధుడవైన నీవు బ్రాహ్మణుని వలె విభూతి రుద్రాక్షల ధరించి యూవద్బ్రాహ్మణ్యమునే అపహాస్యముపాలు సేయుదువా? తులువా! ఆ విశ్వకర్మ బ్రాహ్మణవంశ సంజాతుడైన ఆ వీరగురువొక గురువూ? నీవొక శిష్యుడవూనా? చాలించు నీ వృథా ప్రసంగము."- అని ఆగ్రహోదగ్రుడైనాడు మరియొక పండితుడు.

సిద్దయ్య మరో తత్త్వము గానము సేయబూనగా మిగతా శిష్యులందరూ అతనితో గొంతు కలిపినారు.

తత్త్వము :

కులమెంచగానేల గుణమె కారణము
కులబిందు కులమాయె! కులమెక్కడేదీ.... "కులమెంచగానేల"

యోని లింగము రెండు ఏకమై తరచగా
యోనిలో పిండము పెడలె నిపుడు
యోని ప్రజాపతులు ఎనసిపుట్టిన కులము
ఘనమైన కులమేది? కాని కులమేదీ? "కులమెంచగానేల"

చావు పుటుకలు రెండు సమమని తెలియక,
తావుకాని ఆశ్రమ బద్ధులై
పగలు రాత్రులయందు శివునియేమరకను,
శివమూల మెరిగితే సిద్ధుడౌ గాదా! "కులమెంచగానేల"

శుక్ల శోణితములలో సుప్తమైన కులము,
ముక్త సంసారిమై శక్తియుక్తుల తోడ,
ముక్తి తెలిసిన గురుని భక్తి సోహముగన్న
ముక్తి పొందినవారు ముక్తులే గాదా! "కులమెంచగానేల"

కశ్యపుడు, భరతుడు, గౌతముడు, గాంగేయ
కౌశికుడు, శౌనకుడు, వాశిష్ఠులెవరు?
వ్యాస వాల్మీకులకు వనరైన కులమేది?
వాసిగా శ్రీగురుడీంశుడే గాదా. "కులమెంచగానేల"

"చాలింపు నీ వాచా పేదాంతము. వేదమ్ముల నీవు పఠించుట మహాపాపము. ఇప్పటికి చేసిన పాపములుంగ వలయునన్న వెంటనే మా పాదంబులపై బడి, మా పాదరజోలేశము నొదలదాల్చి. క్షమాభిక్ష నర్థించి, బ్రాహ్మణ సంతర్పణ ఘనముగ చేయించి, మమ్ము తృప్తిపరచి, గోదాన, భూదాన, హిరణ్యాదిదానముల సమర్పించి, మమ్ము మెప్పించి, తమువరి నీ గురువు నాకు లొంగిపోయి, నిర్వీర్యుడనని, నిశ్చలుడనని, నిశ్శక్తుడనని, నిస్సహాయుడనని ఒప్పుకొని ఓటమినంగీకరించి జయపత్ర మిచ్చి కదలుము. తెలిసెనా! అప్పటిదనుక అడుగైననూ కదల్చజాలరు"- అనినాడు మరియొక బ్రాహ్మణుడు.

"అయ్యా! తన కోపమె తన శత్రువు. తన శాంతమె తనకు రక్ష. దయ చుట్టంబౌ కదా! తెలిసియు మీరట్లు ఆగ్రహంబు వహించి ఏల అనారోగ్యము పాల య్యెదరు? శాంతచిత్తులై సంప్రదింపులు సేయుడు. మీ ప్రశ్నములకెల్ల సమాధానము లిచ్చుచుంటిని గదా!

శ్లో ॥ క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాస్మృతి విభ్రమః
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశః బుద్ధినాశాత్ప్ర ణశ్యతి॥

గీత 6:3

"కోపము వలన అవివేకము ఉద్భవించుచున్నది. అవివేకము వలన మతి భ్రమ కలుగుచున్నది. మతిభ్రమ వలన బుద్ధి నశించుచున్నది. ఇట్లు బుద్ధి నాశము వలన తానుపూర్ణ నశించుచున్నాడు. ఇది మీకు తెలియనిది కాదు గదా!" సిద్ధయ్య.

"అనవసర పదప్రయోగాప్రగిష్టా! ఓరి భ్రష్టా! మమ్ములనే శాసించు చుంటివా! మాకే పాఠములు చెప్పుచుంటివా! ఏమి నీ ధైర్యము."

"క్షమించుడు. ఆగ్రహోదగ్రులు కాకుడు. వేదపఠనాధికారము విప్రులొక్క రికే జన్మహక్కు కాదు. సమస్త వర్ణముల వారును పఠించ వచ్చును. గతకాలమున విద్యావతియైన గార్గి నిగమంబుల ప్రవచించుచూ యాజ్ఞవల్క్యునితో వాదమొనర్చినది గదా! సూతుడు శూద్రఋషియే గదా!" అని ఎంతో సౌమ్యముగా సంభాషించినాడు సిద్ధమూర్తి.

"అనవసరపు వాక్చాతుర్య ప్రదర్శకా! బాలకా! మోమున బ్రహ్మదేవునకు పుట్టినవారము మేమురా! బాహువుల యందు పుట్టినవారు క్షత్రియులు, ఊరువుల నుండి పుట్టినవారే వైశ్యులు. పాదముల నుండి పుట్టినవారే శూద్రులు. కావున మాకు గల యధికారము ఇతరులకు లేదు"- అనినాడు భట్టు.

సిద్ధునితో జరుపు వాదోపవాదములన్నియూ వినిన శ్రీగురుడు తానిక కల్పించు కొనక తప్పదని ఎన్నియో విషయములను విశదపర్చినాడు. గంటల తరబడి వారితో చర్చలు జరిపినాడు. కాని వారి మూర్ఖపుపట్టు వదలరైరి. వీరగురుడు చెప్పినంత వరకూ చెప్పి ఇంక విసుగెత్తి, అచట నుండి వెడలిపో నుంకించు సమయమున గర్వాంధులైన యా పండిత బృందము వారిపై రాళ్ళు రువ్వుచు, వెకిలి చేష్టలు చేయుచు, కేకలు వేయుచు దుర్భాషల ప్రయోగించిరి. నాటి కౌరవ సభలో పాండవ రాయబారిగ వచ్చిన శ్రీకృష్ణుని త్రాళ్ళతో బంధించుటకు ప్రయత్నించిన మూర్ఖ దుర్యోధనాదుల వలె కొందరు వీరగురుని త్రాళ్ళతో బంధించుటకు ప్రయత్నించగా, స్వాములవారు వారి దుస్సంకల్పము నెరింగినవారై దొరికినట్లే దొరకుచు, మాయ మగుచు, వారిని ముప్పతిప్పలు పెట్టినాడు. ఆ దృశ్యమును గాంచి అమితానంద పరవశత్వముతో బాటు సంభ్రమాశ్చర్యములు కలిగిన సిద్ధయ్య గంతులు వేయుచు

పాట :

చిక్కడూ! బ్రహ్మము దక్కడూ!
ఇల మాయ నరులకు! ॥చిక్కడు॥

చిక్కనీ గురుపాదపద్మము
నిక్కముగ నెరనమ్మ వానికి
చిక్కునేమొ గాని మాయకు ॥చిక్కడు॥

శాంతభావము తెలియకను-శ్రీ
మంతులే కల మాయవాదుల
వింత వింతలడంచువారల
సొంతమేమొ గాని—మాయకు ॥చిక్కడు॥

కులము కులమని మాటి మాటికి
కలవరము నొందించెదరు-నా
కులముతో పనిలేదు-ఇంతటి
గురుడు నను రక్షించునయ్యా ! ॥చిక్కడు॥

కులము వాసన, కలిమి వాసన,
కొలిమిలో దిగనూది మూసన,
కలితురై తొలగుండువానికి,
కలుగునేమో గాని-మాయకు ॥చిక్కడు॥

తనువు, ధనము, మనసు గురునకు.
ధారపోసే, యిహము రోసే
పారమార్థిక పదము చూచెడి
వానికేమో గాని!- మాయకు ॥చిక్కడు॥

అని ఆనందాతిరేకమున చేతులు తడుతూ గానము చేయుచు నృత్యము చేసి నాడు సిద్ధయ్య.

అప్పటికీ వారి మౌఢ్యము తొలగించుకొనక బ్రహ్మము దొరకలేదని బండిని తిరగ్రోయుట కుద్యమించిరి. అంతట శ్రీగురుడు "వీరికి మహిమ వలన జ్ఞానోదయము చేయవలయునే గాని మాటలతో గాదని" తలచి రోషకషాయితనేత్రుడై, విస్ఫులింగములు రాల, ఒక్కసారి అగ్రహారము పైపు గ్రుడ్లురిమి జూచినాడు. అగ్రహార మంతయు కవోష్ణ అగ్నికీలా పరీవృతమై మండిపోజొచ్చెను. అంతట బ్రాహ్మణులు దిక్కుతోచక, భార్యాబిడ్డలతో ఎవరి కిష్టమొచ్చిన రీతిలో వారలు పరుగులు దీసిరి. నిలువ నీడలేక నిరాశ్రయులై విలపింపసాగిరి.

ఒక్క కాకిబొట్ల వేంకట సోమయాజులు గారి గృహంబు తప్ప తక్కిన వన్నియు బూడిద గట్టులైనవి. నిజమెఱిగిన సోమయాజులు భార్యాసమేతుడై స్వయముగ నరుదెంచి, శ్రీగురుని స్తోత్రించి, ప్రార్థించి, తన గృహమునకు శ్రీగురునితో బాటు శిష్యజనంబును తోడ్కొని పెళ్ళినాడు. శ్రీగురునకు అర్ఘ్య పాద్యాదులొసంగి శ్రీగురుని పాదంబులపై బడి వగచుచు, తప్పులు మన్నించమని ప్రాధేయపడిరి. అంత శ్రీగురుడు అథర్వణవేదాంతర్గత ఐకమత్య సూక్తమును ప్రబోధించి, కాలజ్ఞాన విషయములను సుబోధకము చేసి-ఆనాడు సోమయాజుల వారిచ్చిన ఆతిధ్యమును స్వీకరించి, వారికి తీర్థ ప్రసాదముల నిచ్చి-నాటి కచ్చట విశ్రాంతి గైకొని తెల్లవారి బయలుదేరినారు.

తెల్లవారి లేచిచూడ ఎవరి గృహములు వారికి యథావిధముగ నున్నవి. అందరూ సంతసించి, గర్వంబు వీడి, వీరగురునకు బ్రహ్మరథంబు పట్టి పురవీధుల యందూరేగించి, కానుకల నొసగి-సాగనంపిరి.

o .... o

సిద్ధయోగి ప్రసిద్ధ భారతం :

: ముప్పది యేడవ భాగం :

వైశాఖ శుద్ధ సప్తమీ గురువారమున తమ నిర్ణయము ప్రకారము శ్రీగురుడు పలువురు వేదపండితులు, ఋగ్వేదాది వేదమంత్రములు పఠింపుచుండగా, అష్టాంగ యోగాభ్యాసపరులైన ఋషిపుంగవులు అచ్చటికేతెంచి శుభాశీర్వాద మంత్రములు గానము సేయుచుండగ, శ్రీగోవిందాచార్యస్వాముల వారికి శాస్త్రోక్తంబుగ శ్రీవిరాట్పోతులూరి వీరబ్రహ్మేంద్ర గురుపీఠమునకు పట్టాభిషేకంబు, జయజయ ధ్వానముల మధ్య సంపూర్తి గావించిరి. అంత గోవిందాచార్యస్వామిని గజారోహణము చేయించి ముప్పది రెండు బిరుదములతో స్తోత్రించుచు, కైవారముల్ సేయుచు గ్రామగ్రామము నందును మహోత్సవము గావించిరి.

అంత శ్రీగురుడు ధర్మపత్ని గోవిందమాంబను పిల్చి ప్రశాంతచిత్తమున "గోవిందా! ఇంక నాకీ ప్రపంచముతో బంధము తెగిపోవుచున్నది. సహజమరణము నాహ్వానించి సమాధి చెందుట నా యభిమతము గాదు. సజీవునిగా యోగనిష్ఠాగరిష్టత్వంబున సమాధి ప్రవేశించ నిర్ణయించుకొంటిని. అదెప్పుడోకాదు వైశాఖ శుద్ధ దశమి ఆదివారము పగలు పదిరెండు గంటలకు, కార్యక్రమములన్నియు వెంట వెంటనే పూర్తి కావలయును. కుమార గోవిందునకీ విషయము తెలిపి తక్కిన కుమారుల నందర నాయత్తము కమ్మని చెప్పుము. సిద్దయ్యను వెంటనే బయలుదేరి బనగానపల్లెకు వెళ్ళి సమృద్ధిగా పుష్పతతుల సేకరించికొని రమ్మని చెప్పుము."- అనినాడు శ్రీగురుడు

గోవిందమాంబ నివ్వెరపోయినది. శ్రీగురుని నిర్ణయము పిడుగు పాటులా తోచినది. గజగజ వణికి పోయినది. అంతరాంతరమున దుఃఖపు పొరలు పైకెగ చిమ్మినవి. కన్నుల వెంట నీరుధారాపాతముగా కారినది.

"స్వామీ!" -యని ఆర్తితో ఆమె శ్రీగురుని పాదములపై వ్రాలి భోరుమనే డ్చినది. శ్రీగురుడు ఆమెను లేవనెత్తి ఎన్నియో విషయములను బోధించి సిద్ధుని వెంటనేపూలకై పొమ్మని చెప్పిరి. కాలమూస్వల్పము. కార్యక్రమమూ పెద్దది. -అనినాడు శ్రీగురుడు"

అంత గోవిందమాంబ సిద్ధమూర్తుని చేరబిలచి "నాయనా! సిద్దా! శ్రీగురుడు రేపు జీవసమాధి చెందబోవుచున్నారు. నీవు వెంటనే బనగానపల్లె మఠిగి సమాధి కప్పుటకు చాలినన్నిపుష్పములు కొనితేవలయును. ఇది గుర్వాజ్ఞ. నీవిప్పట్టున బయలుదేరకున్న ఆదివారమునాటికి శ్రీ ముఖ నామ సంవత్సర వైశాఖ శుద్ధ దశమీ అభిజిత్ లగ్నము నీవిచ్చట కలుదెంచుటకు సమయము సరిపడక పోవచ్చును. కనుక త్వరపడుము."—అని చెప్పినది గురుదేవి.

సిద్ధయ్య కావార్త అశని పాతమువలె తోచినది...."ఇంక తన గురుదేవుడు తన కనుల ముందు కన్పించడా!" అని ఘోరున విలపించినాడు. గోవిందమ్మ సిద్ధయ్యను చేరదీసి "పిచ్చివాడా శ్రీగురునకు మరణమెక్కడిది. ఆయన సర్వాంతర్యామి. ఆయన సామాన్య దృష్టికి సమాధికాబడినట్లు గోచరించినా సదా భక్తుల హృదయములలోనే నివసింతురు. సదా భక్తుల కోర్కెలను మన్నించుచునే యుందురు."—అని ఓదార్చినది. కాని అతనిదుఃఖము అనంతము. ఎన్నో విషయములను బోధించి సిద్ధయ్యను కార్యోన్ముఖుని చేసినది.

సిద్ధయ్య గురుదర్శనార్థమై మఠమునకు ఏడలినాడు. కాని గురుదేవులు ధ్యానసమాధిలో నిమగ్నులై యుండి కన్నులు తెరువలేదు. బరువైన హృదయముతో అంపెడు దుఃఖముతో బయట కడుగిడినాడు.

శ్లో॥ వందే గురు పదద్వంద్వం వాఙ్మనో తీతగోచరం,
శ్వేతరక్త ప్రభాయుక్తం శివయోగాత్మకం పరమ్.॥

గు : గీ :

ఓ! గురుబ్రహ్మ! నీపాద ద్వంద్వమునకు నా హృదయపూర్వక నమస్సుమాంజలులు. అద్వితీయము, అమోఘమైన నీదివ్యపాద పంకజములనేమని వర్ణింతును, ఏమని కీర్తింతును. మనోవాక్కాయ కర్మల కతీతమైనది నీయౌన్నత్యము. నీపాద సరోరుహమ్ములు శ్వేతరక్త ప్రభాభాసితములు. ఆత్మపరమాత్మల సంయోగమున కదియేగదా నిదర్శనము. పరమేశ్వరుడు, పరబ్రహ్మము, ప్రకృతి, అన్నియూ నీవే. సచ్చిదానందుడవు. అద్వితీయుడవు, అమోఘుడవు, అతీతుడవు, నీకు నా ప్రణామములు."— అని గురు పాద సరోజములకు నమస్కరించి బయలుదేరినాడు.

"సిద్దా!"— ఎవరో పిల్చినట్లయినది.

సిద్ధుడు వెనుదిరిగి జూచినాడు. ఎవరూ కానరాలేదు.

శ్లో॥ జరామరణ మాపచ్చ రాజ్యం దారిద్ర్యమేవచ,
రమ్యమిత్యేన యోఘం క్తేన జీవన్ముక్త ఉచ్చతే॥.

మహోపనిషత్తు :

"నేను ఆత్మస్వరూపిని కనిపించే ఈ దేహాన్ని నేనుగాదు. ఈ సంపద భోగము, ప్రభుత్వము, కష్టము, వృద్ధాప్యము చావు ఇవన్నీ నన్ను అంటజాలవు— అని తలచి దేనికైననూ భయము చెందక నుండువాడే జీవన్ముక్తుడు....

శ్లో॥ దేహేంద్రయేష్వహంభావ ఇదంభావ స్తదన్యకే
యస్యనో భవతః క్వాపి సజీవన్ముక, ఇష్యతే॥.

-అధ్యాత్మోపనిషత్తు.

నేనే ఆత్మ. ఆత్మయేనేను. ఈ రెండింటికీ భేదములేదు. అనితలచి దేహేంద్రియముల పట్ల మమకార రాహిత్యమును బడసినవాడే జీవన్ముక్తుడు బ్రహ్మనిష్ఠుడు.

"అహం బ్రహ్మేతి నియతం మోక్షహేతుర్మహాత్మనామ్"— అను (పైంగలోపనిషత్తు) వాక్యము ననుసరించి ఎటువంటి చింతలులేని ఆత్మస్వరూపునిగా నిల్చియుండు బ్రహ్మవేత్త: బ్రహ్మజ్ఞాని, "నేనే అపరబ్రహ్మను. అపర బ్రహ్మమేనేను"- అని జీవాత్మ పరమాత్మల ఐక్యభావమును పొంది యుండుటయే మోక్షముగాని— యింకేదీ మోక్షముగాదు.

"ఇవన్నీ నీకు తెలుసు. తెలిసి కూడా దుఃఖించుచుంటివా! వెళ్ళు. త్వరగా వెళ్ళు.... ధైర్యంగా వెళ్ళు. దేనికీ వెఱువరాదు, దిగులందరాదు, దుఃఖింపరాదు. దుఃఖము సర్వనాశనమునకు మూలము. దుఃఖమును దూరముగ తరుముటయే ముఖ్యకార్యము"— అని విన్పించినవి....

అది బ్రహ్మవాక్కేనని గ్రహించుటకు సిద్దయ్య కెంతో సమయము పట్టలేదు. పోయిన ఉత్సాహమును పుంజుకొని, స్థిరచిత్తముతో గురునామ స్మరణ చేయుచూ సిద్దయ్య ముందుకు సాగినాడు.



30)




సిద్ధయోగి ప్రసిద్ధభారతం :-

-: ముప్పది ఎనిమిదవభాగం :-

గోవిందమాంబ ఆలోచనలో పడినది. ఆందోళన పడినది. దుఃఖము వెల్లుబికినది. ఆవేదనాభరితమైనది. హృదయమంతయు శూన్యమైనట్లు తోచినది. ఏదో అన్యాయము జరిగిపోవుచున్నదను బాధామయ మేఘములు ఆమెను క్రమ్ముకొనుచున్నవి. సిద్ధయ్య పరిస్థితిపై ఆయమ్మ అయోమయావస్థలో పడిపోయినది....

గడపపై అట్లనే కూలబడినది. తలుపు నానుకుని కూర్చున్నది. ఎందులకిట్లు జరుగుచున్నది. ఇప్పటికి ద్వాదశ వర్షముల నుండి సర్వమూ తానేనని భావించి, సర్వమతని యందే లగ్నము చేసి, భేదభావము లేక సేవించి పునీతుడైన సుప్రసిద్ధుడు, అమోఘ ఆధ్యాత్మిక విద్యాప్రబుద్ధుడు కదా సిద్ధుడు. ఎన్నియో దివ్య మంత్రములను, మంత్ర రహస్యములను సిద్ధున కెరిగించిన శ్రీగురుడు, అతనిని లోపల, బయట కూడ తప్తకాంచనా సన్నిభునిగా మార్చిన శ్రీగురుడు, ఈ సమాధి ప్రవేశ కార్యక్రమమునకు సిద్ధునెందుకు దూరము చేయుచున్నాడు. అతడా దివ్య దృశ్యములతిలకించుటకు వీలులేకుండా బనగానపల్లె పంపుటలో ఏదియైననూ రహస్యముండునా? గురుదేవులేల యిట్లు ప్రవర్తించిరి. ఇందేదియో పరమార్థ ముండితీరును. లేకున్న సగము ప్రాణము తనేయైయుండిన సిద్ధమూర్తిని శ్రీగురుడు ఎందుకు దూరము చేసికొనును. అసలే హతాశుడైన సిద్ధయ్య, బనగానపురము చేరునెన్నడు? పూలు సమీకరించుకొనునెన్నడు? అసలే గ్రీష్మము. కాలముకాని కాలమున పూలెట్లు

లభించును. ఎన్నిపూలని సేకరించగలడు....ఎటుల సమాధి ప్రవేశ కార్యక్రమము నకు రాగలడు? ఇది మానవమాత్రులకు సాధ్యమా?

సిద్ధుని మచ్చలేని జీవితమును, దృఢభక్తిని, అతని మహత్తును జగద్విఖ్యాతము చేయుటకే శ్రీగురుడిట్లు నిర్దేశించి యుండును." అని మనంబున తలచి "ఆధ్యాత్మిక జ్ఞాన ప్రవృద్ధా! నా సిద్ధా! నీవేనాడో మహాపుణ్యము చేసికొని జన్మింతివి. అందువలననే శ్రీగురుని శిష్యుడవైతివి. లేకున్న ఎవ్వరికినీ దొరకని, చివరకతని కుమారులకు సైతము లభ్యముకాని దివ్యజ్ఞానము శ్రీగురుడు నీకు ప్రాప్తం చేసినాడు. నీ కీర్తి ఆచంద్రతారార్కము నిలువబడును. నీ మహత్తు జగద్విఖ్యాతమగును. నాటి సీతాదేవి ఆశీస్సులు అంజనేయుని కాపాడినట్లు నా ఆశీస్సులెప్పుడూ నీవెంట నుండి నిను రక్షించుచుండును. సఫలమనోరథుడవు కాగలవు."- అని మనస్సులోనే అతనికి ఆశీస్సులందించి, అక్కడ నుండి లోనికెళ్ళినది.

—o—

సిద్ధయోగి ప్రసిద్ధ భారతం :

ముప్పది తొమ్మిదవ భాగం :

పూలకై బయలువెడలిన సిద్ధయ్య గురువాజ్ఞ పాలించుటలోనే నిమగ్నుడై యుండినాడు. తన సర్వస్వమును గురునకర్పించి, తానే గురువై, గురువే తానై దివ్యాత్మ స్వరూపుడైన సిద్ధయ్య గురునామమును స్మరించుచు, ఎక్కడ బట్టినా, ఏ పువ్వులో బట్టినా, ఏ కొమ్మలో బట్టినా, కాయలలో, ఉప్పలలో సహితము శ్రీగురుని స్వరూపమునే చూచుచు, ధ్యానించుచు, కఠిన పాషాణముల సైతము లెక్కసేయక,

కాలికి ఎదురుదెబ్బలు తగులుచున్నను లెక్కసేయక, కంటకావృతమైన అరణ్య మార్గమున బడిపోవుచూ 'ఓం హ్రీం క్లీం శివాయ వీరబ్రహ్మేంద్రనమః' అను గురు మంత్రమును పఠింపుచు నడుచుచుండెను.

కటిక చీకటి. కన్ను పొడుచుకున్ననూ దారి కన్పించని చీకటి. మధ్యమధ్యన కీచురాళ్ళ అరపులు. రకరకాల పిట్టల అరపులు. అడుగులు ముందుకు సాగిపోవు చున్నవే గాని దూరము తగ్గుతున్నట్లు కన్పించుటలేదు. "ఏమిటిది? ఆశ్చర్యముగ నున్నదే! ఎంతదూరమేగిననూ బనగానపల్లియ రాదు. నేను ముందున కరుగు చుంటినా! లేక వెనుకకు నడుచుచుంటినా?"— అని తనలో తాను విస్మయమంది "అంతయూ గురులీల! నా గురువు నన్నంటియుండ నాకు భయమేల?" అనుకొనుచు నడచుచున్న సమయమున, ఆకాశమున నల్లని మబ్బులు ముసురుకొచ్చినవి. నక్షత్ర ములు, చంద్రుడు ఆ కారుమేఘములమాటున కప్పబడిపోయిరి. వాతావరణమంతయు ఉన్నట్లుండి ఒక్కసారిగా భయంకరముగా మారిపోయినది. ఉరుములు ఫెళఫెళమను శబ్దములతో భీతిని సృష్టించినవి. కుండపోతగా వర్షము ప్రారంభమైనది. ఎక్కడో పిడుగు పడిన శబ్దము. ప్రళయకాల ఝంఝామారుతమువలె తీవ్రముగా గాలి....చెట్ల ఊగిసలాటలు....నీటి ప్రవాహము.

"గురుదేవా! ఇది ఏమి? అసలే దారి కన్పించుటలేదు. చీకటితో అడవి యంతయు అలముకొని పోయినది. దానికితోడీ భీకర వర్షపాతమేమి? చలి వణికించి వేయుచున్నది. ఏమిటీ దారుణము. నన్నేల యిట్టి పరీక్షల కెఱచేసెదవు స్వామీ! నే చేసిన యపరాధమేమి? మార్గమధ్యమున నొక్క పుష్పమైనను కన్పించుట లేదు. అసలే గ్రీష్మఋతువు. గ్రీష్మమునందీ ఘోర వర్షపాతమేమిటి? నేనిప్పట్టున ఎప్పటికి బనగానపల్లె చేరగలను. పుష్పములెట్లు సేకరించగలను? ఎప్పటికి నిన్ను చేరగలను. ఇట్లయిన మీ మహాభినిష్క్రమణము నేమి దర్శించగలను?" అని తనలో తాను కుందుచూ, వగచుచు, ఏడ్చుచు, ఒకానొక వృక్షము క్రింద నిలువంబడి దిక్కు తోచక

శ్లో ॥ యదంఘ్రి కమలద్వంద్వం ద్వంద్వతాప నివారకం
తారకం భవ సింధోశ్చ శ్రీగురుం ప్రణమామ్యహమ్॥

గురుగీత :

"గురుసార్వభౌమా! ఓ వీరబ్రహ్మ గురురాట్చంద్రమా! నీ పద పారిజాతము లకు ప్రణామము లర్పించుచున్నాను. నన్ను ద్వంద్వాతీతునిగా చేసి రక్షింపుము. ఈ సంసార సాగరము నుండి నన్నుద్ధరింపుము."- అని పలు విధములుగా ప్రార్థనలు సేయుచు, ఎంతసేపటికీ చీకటి తెగకపోవుటచే, వర్షము తగ్గకపోవుటచే మనసు గురునిపై లగ్నము సేసి పద్మాసనాసీనుడై అట కూర్చుండినాడు.

తెల్లవారినది.

చెట్టుక్రింద కూర్చొని పద్మాసనాసీనుడై తపస్సమాధిలోనున్న సిద్ధయ్యను చూచి కొంతమంది జనులు అతనెవరో మునీశ్వరుడనుకొని చుట్టుచేరి నమస్కారములు సేయుచూ కూర్చుండిరి. కదలించిన నేమగునోయని, పిల్చిన అతని మనస్సు పాడగునేమోయని కొంచెము దూరముగ జనులందరూ చుట్టూచేరి శ్రీరామ నామ సంకీర్తనలు ప్రారంభము చేసినారు.

"సిద్ధా!" ఎవరో పిల్చినట్లనిపించినది.

సిద్దయ్య కన్నులు తెరచినాడు. కట్టెదుట ఒక దివ్యసుందర విగ్రహుండు, ఒక మహనీయుడు, మహాయోగి, కడుంగడువృద్ధుడు, పులిచర్మము ధరించి యున్నాడు. కాంతితో మెరిసిపోవుచున్నాడు.

"ఏమీ విచిత్రము. ఈ మార్గమున నింతటి తేజస్వియైన యోగీశ్వరునెప్పుడూ యింతకు మున్ను కానము. ఇంతటి ఉషఃకాలమున ప్రత్యక్షమైన యోగీంద్రుడు నా గురుదేవులేగాని వేరు కాదు." అని మనంబున తలచి, అతనిలో ప్రత్యక్ష గురు స్వరూపము భాసించుచుండ ఆనందోద్రేకమున అతని పాదములపై బడి నమస్కరించి

శ్లో ॥ అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా!
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీ గురవేనమః॥

-గురుగీత

"అజ్ఞానమనే అంధకారము చేత కప్పబడిన నానేత్రములు శుద్ధజ్ఞానమను కాటుకకడ్డీ చేత ఎప్పుడు వెలుగు ప్రసాదించబడెనో అట్టి నా గురుదేవులైన శ్రీ వీరబ్రహ్మ గురురాట్చంద్రమౌళి దివ్యపాదపద్మముల కివియే నా నమస్సుమాంజలులు,"

"సిద్ధయోగీ!"

"అదేమి స్వామీ! నన్ను యోగియని సంబోధించుచుంటిరి. అయినను నా నామధేయము మీకెట్లు తెలియును"

"నా కంతయూ తెలియును. గురుసేవాప్రవృత్తా! సిద్ధా! నీకింక సాధింపరాని దేదియూ లేదు. గురుసేవా దీక్షలో ప్రపూర్ణుడవైతివి. అందువలననే నిన్ను యోగీ యని సంబోధించితిని. రానున్న యుగతరమున కీవు ఆదర్శప్రాయుడవై ఆధ్యాత్మిక విప్లవము తీసుకరాగలవు. సరియే! ఒక్క విషయము. నీ విప్పట్టున బనగాన పల్లె వెళ్ళవలయునన్ననూ సాధ్యము కాదు. సమయము చాలదు. ఈ జనమంతయూ యిప్పుడే నీకు బుట్టలకొద్దీ పుష్పములు సమర్పింతురు. బండియునూ వారే ఏర్పాటు చేయుదురు. నీవు వెంటనే బయలుదేరుము. నీవు ప్రత్యక్షముగ నీ గురు సమాధి ప్రవేశ కార్యక్రమము చూడజాలకపోయిననూ నీమనోనేత్రముతో సర్వమూ దర్శింపగలవు. దిగులందకు." అని అదృశ్యుడైనాడు.

అతని మాటకు సిద్ధయ్య కంగారుపడినాడు. కలవరపడినాడు. "గురుదేవుని సమాధి ప్రవేశ దృశ్యమునీ చర్మచక్షువులతో చూడజాలనా!.... గురుదేవా! ఎందుకు నాకీ బాధ్యతనప్పగించి దూరము చేసితిరి. నే చేసిన పాపమేమి? పదిరెండేడులు సేవించినందుల కిదియా ఫలితము." దుఃఖించుచూ బయలుదేరినాడు. బండిముందుకు సాగుచున్నది. సూర్యుడు బహుతీవ్రముగా పరుగులు తీయుచుండెను. ఆకలిదప్పుల మాట మరచి బండిని పరుగులు తీయించుచుండినాడు సిద్ధయ్య.

మధ్యందిన మార్తాండుడు ఆకాశమధ్యమునకు చేరినాడు.

"అయ్యో! సమయము మించిపోవుచున్నదే. స్వామి సమాధి చేరువేళ చేరువనే యున్నదే. నే నింకెట్లు సమయమున కందుకోగలను? హతవిధీ! ఏమిటీ యగ్నిపరీక్ష!"— అనుకొనునంతలో బండి బురదగుంటలో పడి బయటకు రాలేక పోయినది.

అయిపోయినది. అంతయూ అయిపోయినది. సమయమంతయూ అయిపోయినది. నా బ్రతుకంతయూ వ్యర్థమైపోయినది. నా శ్రమయంతయూ బుగ్గి నందిడిన

పన్నీరై పోయినది. ఇన్నినాళ్ళ నా సేవ ఒక్క ముహూర్తకాలమున ఎందుకూ పనికి రానిదై వ్యర్థమైపోయినది. నా స్వామి నన్నేల యిట్లు చేసెను....

చీకటి కూడ పడినది.

"సమాధి ప్రవేశకార్యక్రమము పూర్తియయ్యేయుండును" అనుకొనునంతలో కొంతమంది జనమటుగా వచ్చుచుండిరి.

"అయ్యా! కొంచెము సాయము చేయుడు. బండి గుంటలో కూరుకుపోయినది. నేను నా స్వామి సమాధి ప్రవేశ మహోత్సవమునకు వెడలవలయును. పూలు సమీకరించుకొనుటకై వచ్చి యిట్లు నిర్బంధింపబడితిని. నా కర్మ మిట్లు కాలినది."- అని వలవల యేడ్చినాడు.

సిద్ధుని యేడ్పువిని వారందరూ ఎంతో జాలి ప్రదర్శించినారు. బండిని పైకి లాగినారు.

"ఎవరు నాయనా నీవు. ఏల యిట్లు విలపించుచుంటివి?"— అని ఒక వృద్ధుడడిగినాడు.

"స్వామీ! తమరు" అని యింకేదో అనబోవునంత "నేనెవరైన నేమిలే! ముందు శ్రీ వీరబ్రహ్మేంద్రగురు సార్వభౌముల ప్రసాదము తిని, ఆ **గురు**దేవుల పాదప్రక్షాళిత మంత్రజలమును త్రావి సేద తీర్చుకొనుము"- అని ప్రసాదము, పాద తీర్థము యిచ్చినాడు.

సిద్ధయ్య ప్రసాదము తిని, పవిత్ర జలమును సేవించి "స్వామీ! యిప్పుడు చెప్పండి"— అనినాడు.

"చెప్పమందువా నాయనా!"

"చెప్పండి స్వామీ! చెప్పండి"— అని అతను రెండు కనులూ మూసికొనినాడు. అతనికేదో మైకము కమ్మినట్లయినది. నాటి శ్రీగురుని సమాధి ప్రవేశ కార్యక్రమమంతయూ కన్నులకు కట్టినట్లయినది.

ఆనాడు శ్రీగురుడు బిడ్డలనందర్నీ దగ్గరకు చేరబిలిచినాడు. వారందరితో

రాజోద్యోగులను, భక్తులను చూచి స్వామి దివ్యోపన్యాసము చేసినాడు.

"పవిత్రాత్మ స్వరూపులారా! ప్రేమైకజీవులారా! నేసినాడు మధ్యాహ్నము రెండున్నర గంటలకు సమాధి నిష్ఠను ప్రవేశించుచుంటిని. నాయనా! గోవిందా యాచార్య! పవిత్రమైన ఈ అధ్యక్ష పదవి నధిరోహించుటకు భయపడవలదు.

"నేనొక పరమార్థము చెప్పుచుంటిని వినుము. నీ గర్భవాసంబున జన్మించిన ఈశ్వరమ్మ సాక్షత్తు జగన్మాత"- అని అనుచుండగనే ఈశ్వరమ్మ పదిపన్నెండేండ్ల ఈడుగల బాలిక అచ్చటకు వచ్చి తాతగారి ఒడిలో కూర్చుండెను. శ్రీగురుడు ఆమెను దగ్గరగా తీసికొని తలనిమిరి కుమారుడైన గోవిందయ్య వెంబడే కూర్చుండ బెట్టి తన దివ్యోపన్యాసమును సాగించినాడు. "ఆధ్యాత్మిక ప్రపంచమునకీమె మహా రాణియై ప్రకాశించగలదు. ఆమె అసాధారణ ప్రజ్ఞాశాలి. అద్భుత శక్తులను ప్రదర్శింపగలదు. దివ్యశక్తులామెకు వశీభూతములగును. భూత భవిష్యద్వర్తమానములు తెలిసిన బ్రహ్మవాదిని. బ్రహ్మజ్ఞాని. ఆమె వాక్కు జరిగి తీరును. తుదకామెయూ జీవసమాధి ప్రవేశించి ఆచంద్రతారార్కము కీర్తిప్రతిష్టలు బడయును. నా మఠంబు నెట్లు నిత్యపూజలు జరుగునో ఆమెకునూ నిత్యపూజలు జరుగును. నీకే కొఱతయూ నుండదు. సర్వజనుల సంశయములు సందేహములన్నియు పరమేశ్వరియే తీర్చును.

"ఇక సిద్దునా! అతడు ఆధ్యాత్మ జ్ఞానవిద్యా ప్రవృద్ధుడు, ప్రబుద్ధుడు, సిద్ధుడు. లోకప్రసిద్ధుడు, సుప్రసిద్ధుడు, అచంచల గురుసేవ దీక్షాదక్షత కుదాహరణముగ నిలువంబడి కీర్తిప్రతిష్టలతో విరాజిల్లి, సిద్ధయోగిగా, సిద్ధ గురువుగా ప్రసిద్ధుడై, లోకప్రశస్తి బొంది చివరికతడునూ సిద్ధిబొందును. అతని భక్తి అపారము, అనన్య సామాన్యము. అతడిహలోక జ్ఞానము కంటె పరలోక జ్ఞానమెఱిగిన రమప యోగి.

"అతడిప్పుడు ఇక్కడ లేక పోవచ్చును, కాని ఇక్కడ యిప్పుడు యేమి జరుగుచున్నదో అంతయూ తు.చ. తప్పకుండ తన మనో నేత్రమున దర్శించును. తద్వారా అతనిచ్చట శారీరకముగా లేడను శంక కొంత తీరును. మానసికముగా నేనెప్పుడూ అతని ననుసరించియే యుందును. మావి పాంచభౌతికమైన ఈ శరీరములు వేరుగాని సిద్దుడు లేక బ్రహ్మములేదు. బ్రహ్మములేక సిద్దడు లేడు. అతని కీర్తి పతాక దిగంతముల కెగబ్రాకుటకే అతడు దూరము గావలసి వచ్చినది. అంత

మాత్రమున అతడు దురదృష్టవంతుడు గాదు. గురుసన్నిధానము నెప్పుడూ బడయు చునే యుండును. ఆతనిని తక్కువగ అంచనా వేయకుడు."— అని చెప్పి భక్తుల వైపు తిరిగి కాలజ్ఞానమును బోధచేసి. "నేను సమాధి చెందిననూ నేనెప్పుడు భక్తుల హృదయ మందిరాలలో నివాసముంచును. నా సమాధి మీకు సమాధానము చెప్పును. నా సమాధి నుండి నిజభక్తుల కెప్పుడూ సంకేతము లందుచునే యుండును. నా నామము సర్వదా జపించు వారలకు తరుగనునది ఉండదు. నేను సర్వవ్యాపినై యుందును. నన్ను మనస్ఫూర్తిగ నమ్మి సేవించిన వారలకు లేమి అనునది ఉండదు. నా సన్నిధాన మెప్పుడూ వారలకు అనుభవమగుచుండును."— అని సమాధి ప్రవేశము చేయ బోవునంత "తండ్రీ! ఒక్కమనవి. మహా మహిమోపేతములు, పవిత్రములునగు యోగదండము, వెండిబెత్తము, అంగుళీయకము, సింహపాదుకలు మాకు ప్రసాదముగనిండు"— అని కుమారు లంజలి ఘటించినారు.

శ్రీగురుడు కడు దరహాస వదనారవిందుడై "బిడ్డలారా! ఎవరికి యేది ఎప్పటికి ప్రాప్తమో అది వారికి దక్కును. పాత్రములేని దానికి ప్రాకులాడుట ప్రయోజనములేని పని. పది రెండు వత్సరములు నన్ను సేవించి తానే నేనుగా మారిపోయిన జగత్ప్రసిద్ధుడైన సిద్దయ్యకే అవి చెందునుగాని మీకుకాదు. సిద్ధు డెంతటి మహిమాన్వితుడో వేచి చూడుడు"— అని ప్రేమ, శాంతి, కరుణ, దయగల తన గంభీర వదన పారిజాతముతో, ఒక్కొక్క అడుగే వేయుచు, మెట్లు దిగి సమాధి గృహము లోనికి ప్రవేశించినాడు.

"హరహరమహా దేవ శంభో!"— అని నినాదములు మిన్ను ముట్టినవి.

వాయిద్యముల దిక్కులు పిక్కటిల్ల మ్రోగినవి.

ఋంజవాయిద్యములు పెద్దపెట్టున చెవుల గింగిర్లెత్తించినవి.

వేదనాదములు, మృదంగఘోషలు, నాదస్వర వాయిద్యములు, భేరీఢమరుకాది వాయిద్యములు. ప్రకృతి నంతయు పరవశింప చేసినవి. మంత్రఘోష ఎడతెగక జరుగుచున్నది.

కొంతమంది రోదించినారు. మరికొంతమంది జయ పలికినారు. మరికొంత మంది సమస్కారాంజలు లర్పించినారు. మరికొంతమంది పుష్పముల జల్లిరి. ఆకాశము నుండి విరివాన కురిసినది.

ఈశ్వరి అంతయూ కన్నులార్పకుండ చూచుచున్నది. గోవిందయాది కుమారులు ఒక ప్రక్క దుఃఖము, మరొక ప్రక్క కార్యక్రమము, యిత్యాదులతో సతమతమగుచుండిరి. గోవిందమాంబ నిర్విణ్ణురాలై నిర్వికల్ప సమాధిలో నున్నటుల అంతయూ తిలకించుచున్నది. ఆఖరుగా స్వామిపాదముల కనుల కద్దుకొని భాష్పాంజలులు కురిపించినది.

సిద్దయ్య అక్కడ లేక పోవుట ఎంతయో లోటుగనే కల్పించినది. ప్రతివారినోటా "సిద్దయ్యయేడీ, సిద్దయ్యయేడీ"— అనే మాటలే. "అయ్యో! సిద్దయ్య, ఉండీ ఉండీ యిప్పుడు పోతివా!"— అను వారు కొందరు. "అబ్బా! సిద్దయ్య ఎంతటి దురదృష్టవంతుడు!"— అను వారింకొందరు.... సిద్దయ్య ప్రధాన చర్చనీయాంశమైనది అచట చేరిన భక్త సంఘము.

అని చెప్పి ఆ యోగి ఊరకుండినాడు.

సిద్దయ్య కన్నులు తెరచి చూచుసరికి ఆయోగి అచటలేడు....

"ఆహా! స్వామి! నాచే యేది యోలీల ప్రకటింప చేయదలచి, నాకీర్తి ప్రతిష్టల నినుమడింప చేయలదలచి, నీపాదతీర్థము నింతదూరము పంపి, అదృశ్యమంతయు నా మనోనేత్రముతో దర్శింపచేసి, నన్ను ధన్యుని చేసితివా తండ్రీ!.... అయిననూ పరుగురతో చూడలేక పోలినను బాధ, స్వయముగా అఖరి సేవలందించ లేకపోతినను వ్యథ నన్నూరకయార్చుండ నివ్వుటలేదు.... కాని యేమి సేతును...." — అని పలువిధముల రోదించి సిద్దుడు బయలు దేరినాడు.



సిద్ధయోగి ప్రసిద్ధభారతం :-

-: నలుపదవ భాగం :-

కంది పుల్లయ్యపురము నిర్మానుష్యమైనదా యనినట్లున్నది. అందరి వదనములలో విషాదము తొంగి చూచుచున్నది. శ్రీగురుడు యిక మన మధ్యలేడు. అనుకొనుటకు ఎవరి మనసూ అంగీకరించుటలేదు.

సిద్ధయ్య తనమనోనేత్రములతో సర్వత్రా దర్శించినను, శ్రీగురుడు లేడను దుఃఖము, సమాధి సమయమున తానక్కడ లేననెడి బాధ అతనిని తీరని దుఃఖమునకు గురిచేసినది. కరడుగట్టిన విషాదమూర్తిలా సిద్ధయ్య గ్రామ ప్రవేశము చేయగనే అనేకులు అనేక విధములుగా అతనిని పరామర్శించినారు.

"పాపము! ఇన్నినాళ్ళు సేవచేసి ఆఖరకు వెంబడిలేకుండా పోయినాడు. ఎంతటి దురదృష్ట వంతుడో"— అనేవారు కొందరు.

"చేసికొన్నవారికి చేసుకొన్నంత మహాదేవ! ఎవరు ఏమిచేయగలరు. అతని అదృష్ట మటులుండెను"— అనువారు కొందరు.

"అయినా బ్రహ్మంగారు అటుల చేసి యుండ వలసినదిగాదు. కాలము గాని కాలంలో పూలుమాత్ర మెట్లు దొరుకును. అదియునుం గాన బనగానపల్లి యిచ్చట నుండెనా పరుగిడి పోయి వచ్చుటకు"— అనెడివారు మరికొందరు.

"గోవిందమ్మగారైనా అడ్డుపడి ఉండవలసినది. ఆమెకూడా ఆపనిచేయలేదు. అంతయును విధిలిఖితము"— అను పల్కి జాలి ప్రదర్శించువారు కొందరు.

అవి యేవియూ అతనిమనసున కెక్కుటలేదు. నేరుగా సమాధి మందిరమునకే బండిని పరుగులు తీయించినాడు. సమాధి పైబడి ఘోరుఘోన ఏడ్వసాగినాడు. "నన్నేల యిట్లు మోసగించితివి 'స్వామీ! నే చేసిన యపరాధమేమి? నేను నీ సమాధి ప్రవేశము సమయమునకో గూడ నుండ జాలనంతటి మహాపరాధము చేసితినా! మహాపాతకము చేసితినా! ప్రభూ! ఎన్నెన్నియో వేదాంత రహస్యముల తెల్పితివి. నీ బిడ్డల కన్నమిండ నన్ను మిన్నగా ఆదరించితివి. విజ్ఞాన ప్రబోధము చేసితివి. స్వామీ ఈ తరుణమున వేలాది జనులు చూచిన నీ జీవసమాధి ప్రవేశము నన్నేల యిందరితో చూడనీక పోతివి. నా యాఖరి సేవల నేలగైకొనక పోతివి? నన్నేల దూరము చేసితివి?

"నా కంతిమ సందేశ మీయకనే వెడలుదువా స్వామీ! తండ్రీ! వీరబ్రహ్మ గురుదేవా! ఏది ఏమైననూగాని! నీవు సమాధి నుండి బయటకు రావలె. నా ఆర్తి చూడవలె. నన్నోదార్చవలె! నా కంతిమ సందేశ మిచ్చునగాని సమాధి చెందుటకు వీలుపడదు. స్వామీ! సమాధి బ్రద్దలు కొట్టుకొని బయటకురా! ఈ ప్రపంచమంతా నాశనమైపోనీ! దిక్కులన్ని ముక్కలు చెక్కలై పోనీ! గురురాట్ సార్వభౌమా! నీవు బయటకు రాక తప్పదు.

"జగద్గురూత్తమా! దేవా! ధీజనసన్నుతా! సచ్చరిత్రా! దీనావనా! అద్వితీయా! పరమాత్మా! నిరామయా! నిర్వికారా! నిరంజనా! నన్ను పూలకు పంపి, నే పూలను తేకుండగనే, నా పూజలు బొందకుండగనే నీవు సమాధి ప్రవేశము చేయుటకు మనసెట్లు ఒప్పెను.

"కడప నవాబు చెంగటికి జనునాడు నన్ను మహిమోపేతు చేసినట్టి కరుణ నేడెటు పరుగులు తీసెను తండ్రీ! భూతాత్మకులు నన్ను బాధించు సమయమున రౌద్రాకారమున ప్రవేశించి, వారల దండించి, నన్ను దరిచేర్చుకొని బ్రోచితివే! ఆ కరుణ దయ యిప్పుడెటు పారిపోయినవి? కుక్కకొక్కనగల కుష్ఠు నీటిని బూన పరమాన్నము చేసి పెట్టిన పవిత్ర ప్రేమ యిప్పుడే మాయెనయ్యా! ద్వాదశాబ్దములు అన్న వస్త్రం బొసగి పట్టుగా ప్రేమించి పెంచిన నీ అపార కరుణా రసవాహిని నిప్పుడెటు పయనమైపోయినది? తండ్రీ! దివ్య కరుణతో వేదాంత రహస్యములు వివరించితిరి. చివరకు సమాధి చేరు వేళ నాపై కినుక వహించి, నిర్దయగ నన్ను దూరము చేసితిరి. ఇది నీకు ధర్మముగాదు. ఇది నీకు న్యాయముగాదు."— అని ఎన్నియో రీతుల ప్రార్థించినాడు....

కాని సమాధి నుండి సమాధానము రాలేదు.

సిద్దయ్యలో కఠోరనిశ్చయము తెగింపు చోటుచేసికొనినవి.

విషయము మఠమంతయు గోవిందమాంబకు తెలిసినది. గురుపుత్రులతో కూడి గోవిందమాంబ పరుగు పరుగున అచట కేతెంచినది. సిద్దుని గట్టిగా పట్టుకొని

"కుమారసిద్దా! దుఃఖింపకు నాయనా! నిన్ను దూరము సేయుట దైవనిర్ణయమని స్వామి చెప్పిరి. అంతియేగాని నిన్ను మోసము చేయుటగాదు, దుఃఖము మానుము"—

అని బ్రతిమిలాడినది. కాని సమాధిని కౌగలించుకొని ఘోరాతి ఘోరముగ దుఃఖించు చున్న సిద్ధయ్యను ఎవ్వరూ ఓదార్చలేక పోయిరి. ఎంతమంది లాగినను రాడయ్యెను. గోవిందయాచార్యాది గురుపుత్రులు, ఇతర శిష్యులు అతనిని బ్రతిమిలాడి ఇవతలకు లాగిరి, కాని మరల వెంటనే వారిని వదల్చుకొని పరుగులెత్తి సమాధిని కౌగలించుకొని "నాకు దర్శనమిత్తువా? లేదా! లేకున్న నీ సమాధి ప్రవేశముతో పాటు నేనునూ సమాధి ప్రవేశింతును. నాతల బ్రద్దలు కొట్టుకొని చత్తును. నీవులేక నేనులేను, జీవించను"— అని అటులనే, మార్కండేయుడు శివలింగమును కౌగలించుకొని యివతలకు రానట్లు, సమాధిని కౌగలించుకొని పట్టువదలడాయె.

స్వామి ఎంతకునూ ప్రత్యక్షము గాలేదు. సిద్ధయ్య తనకింక సమాధి ముందర ప్రాణ త్యాగము తప్పదని నిర్ణయించుకొని సమాధికి తలకొట్టుకొన ప్రారంభించెను. తలపగిలి రుధిర ధారలు చిమ్ముచున్నవి. అతని మహోద్రేకమును చూచి ఎవ్వరూ నతని నాపజాలకపోయిరి. "హర హర మహాదేవ శంభో! జై వీరబ్రహ్మస్వామికీ జై!"— అని జనము నినదించుట ప్రారంభించినారు.

సమాధి స్థితిలో నున్న వీరగురుడు కనులు తెరచినాడు.
"రారా! సిద్ధా!"— యని మనంబున తలచినాడు."

ఒక్కసారిగా సమాధిపై కప్పబడ్డ బండ పెద్ద శబ్దము సేయుచూ తొలగినది. అందునుండి పెద్ద వెలుగు బయట కొచ్చినది. సామాన్యులెవరూ ఆవెలుగును చూడ జాలక కన్నులు మూసికొనినారు.

ఆ వెలుగులో శ్రీగురుని దివ్య స్వరూపము ప్రస్ఫుటముగా గోచరించినది. "సిద్ధా!"— అని అతనిని దగ్గరగా తీసికొని, శ్రీగురుడు కౌగలించుకొనినాడు. "నాయనా! సిద్ధా! అంతయూ దైవనిర్ణయము. నీభక్తిని, శక్తిని ప్రపంచమునకు చాటుటకే ఈ పరిస్థితులిట్లు పరమాత్మ మార్చినాడు. నీగురుభక్తి అనన్యసామాన్యము. నీవు సుప్రసిద్ధుడవై ప్రపంచకీర్తి నార్జించెదవు. నేను నీకిదివరకే చెప్పవలసిన వన్నియూ చెప్పితిని. నీకిప్పుడు దివ్యదృష్టి నొసంగుచున్నాను."— అని శ్రీగురుడు అతనికి దివ్యదృష్టి ప్రసాదించగా స్వామి విశ్వ రూపమును సందర్శించి సిద్ధయ్య.

దండకము :

శ్రీమద్విరాట్పోతులూరాన్వయం బోధిసోమా! సదైశ్వర్యసీమా! గతాక్రోశ కామా! సుధీసార్వభౌమా! త్రిలోకాభిరామా! వితాసాక్షధామా! పరబ్రహ్మనామ! పరంధామ!

వేదాంతసారా! సమంచిద్విచారా! యనాచారదూర! సదానిర్వికారా! మహోదారధీరా! మునీంద్రావతారా! సముద్యత్ప్రచారా! చిదాకార!

విజ్ఞాన నేత్రా! కవిస్తోత్రపాత్రా! లసద్విశ్వగాత్రా। బుధానీకమిత్రా! కనద్వాక్పవిత్రా! జగత్సృష్టి సూత్రా! శ్రీతారణ్య చైత్రా! సుచారిత్ర గంభీర కారుణ్య చిత్తుండవై! యత్త్వమే యుండవై! స్వప్రకాశుండవై! యద్వితీయుండవై! యున్ననీలీలలన్ బ్రహ్మకైనన్ గణింప శక్యంబు గాకున్న!- నిన్నెంచ నేనెంతవాడన్, గటాక్షంబునన్!- నాదు నేరంబు నైరించి రక్షింపవే!— వీరనారాయణాభిఖ్య మద్దేశికేంద్రా! నమస్తే! నమస్తే! నమస్తే!— నమః....

— సిద్ధయోగిచరిత్ర : శ్రీకాశీసత్యవధాని,

అని స్తోత్రముసేయగా శ్రీగురుడు అమితానంద కందళిత హృదయారవిందుడై, అతనిని హస్తమస్తక సంయోగమాచరించి భ్రూయుగళ మధ్యమున భూతి నుంచి, నాల్కపై బీజాక్షర సంపుటిని రచించినాడు....

"నీ కెల్లప్పుడు విజయలక్ష్మి తోడుగా నుండును. దిగులందవలదు. నేనెల్లప్పుడు నీవెంటనంటి యుందును"— అని దీవించి "నీవు గృహంబున కేగి గృహస్థాశ్రమము స్వీకరించి, రాజయోగివై సిద్ధయోగి నామంబున ప్రసిద్ధ వడిసి, సంతానవతుడవై సౌఖ్యములనుభవింపుము. ఎవరైతే ఈ సిద్ధయోగి ప్రసిద్ధ భారతమును భక్తి శ్రద్ధలతో పఠింతురో వారికి ఎల్లప్పుడు సర్వసౌఖ్యములు కలుగును." అని శ్రీగురుడు తన పాదుకలను, వెండిబెత్తమును, యోగదండమును, ముద్రిక, అక్షమాల మొదలగు వస్తువులను ప్రసాదించినాడు.

అంత సిద్ధడు "మహాప్రసాదము"— అని స్వీకరించినాడు. అంతవరకు నలుదిక్కుల అలముకొనిన వెలుగు మరల సమాధిలోనికి ప్రవేశించినది. సమాధి బండ మూత వీడియే యున్నది. అందరూ కన్ను తెరచి చూచునరికి సిద్ధయ్య చేతిలో వెండి పళ్ళెరము అందు శ్రీగురుని దివ్యపాదుకాద్వయము, వెండిబెత్తము, యోగదండము ముద్రిక, అక్షమాల- ఉండెను.

సిద్దయ్య మాహాత్మ్యమును ప్రజలందరూ కొనియాడినారు. ఆశ్చర్యపడినారు. "సిద్దయోగికి జై"— అని జయజయ ధ్వానముల చేసినారు. అప్పుడు సిద్దయ్యతాను కొనితెచ్చిన పూలబుట్టలనొక్కొక్క దానిని తెరచి సమాధి అంతయూ పూలతో కప్పినాడు. ఆశ్చర్యము బంతిపూలకది అసలు కాలము కాదు. కాని ఏమిమాయయో! తెలియదు. ఎన్నిరకముల బంతిపూలు, పలురకముల ముద్దబంతులు,కారపు బంతి, బియ్యపుబంతి, మల్లెపూలు, మందారాలు, రోజాలు చెప్పలేము.... ఎఱుపు, తెలుపు, పసుపు వన్నెలు గల రోజాపుష్పములు.... సంపంగి, ఎఱ్ఱ గన్నేరు, తెల్ల గన్నేరు తులసి, మరువము, యిత్యాది సువాసనా ద్రవ్యములతో— సమాధి నిండిపోయినది.

ఇన్ని ఎట్లు సమకూరెనా!— అనునది అందరకూ ఆశ్చర్యమే....

అంతభక్తజను లందరూ సమావేశమై అఖండ నామసంకీర్తన మొనరించినారు. అనంతరం సమాధిపై కప్పబడిన పూలు అందరకూ ప్రసాదముగా పంచబడినవి.



సిద్ధయోగి ప్రసిద్ధభారతం :-

-: నలువది ఒకటవభాగం :-

"గురుపుత్రా! చూచితిరా! తండ్రిగారి ప్రవర్తన. మీరు నోరు విప్పి యోగ దండాది ముద్రికలు యిమ్మని యడిగిననూ కన్నకుమారుల కీయక అవియునూ ఆ సిద్ధయ్యకే అప్పగించినాడు. స్వాములు గురుస్వాములే అయిననూ యింత చిన్న విషయమున సహితము ఎందులకింత పక్షపాతమై ఖరి ప్రవర్తించిరో తెలియదు"— అనినాడొక శిష్యుడు.

"తండ్రిగారు మొదటనే ఈ విషయమును తెల్పిరి. అవి సిద్ధునకు మాత్రమే నని. ఇప్పుడా విషయమెందులకు. ఎవరికి చెందవలసిన వస్తువులు వారికి చెందవలసినదే కదా!"— గురుపుత్రుడు.

"కానసుకొనుడు. నిజము చెప్పవలయునన్న హక్కు, అధికారములుగూర్చి ఒకింత ఆలోచనను చేసినను అవి పుత్రులు వారసులైన మీకు చెందవలయును గాని, శిష్యునకు అందుననూ అన్యమతస్తున కెట్లు చెల్లును."—శిష్యుడు.

"అంతియేగాదు గురునందనా! మఠాధిపత్యమును మీకొసంగి మఠమునందెల్లప్పుడూ ఉండవలసిన యోగదండాది వస్తువులు వేరొకచోట నుండవెట్లు వీలగును. మఠమెచ్చట నుండునో గురుదేవులుపయోగించిన పవిత్ర వస్తువులునూ అచటనే యుండవలయును"— అనినాడు మరియొకడు.

"గురుపాదుకాది వస్తువులు శిష్యునకే సంప్రాప్తమగుట లెస్స. మేము గురుదేవుల కుమాళ్ళమేగాని శిష్యులము కాము. అందువలన సాంప్రదాయబద్ధముగ, వంశానుగతముగ రావలసిన వారసత్వపు మఠాధిపత్యమును మాకొసగిరి. అందు నాయనగారు సరిగనే చేసిరిగాని....దారితప్పి చేయలేదు. మీరు మీమీ అవివేకమునింక కట్టిపెట్టి జ్ఞాన సముపార్జనకు ప్రయత్నము సేయుడు"—గురునందనుడు.

"క్షమింపుడు, మీరింతటి విశాల హృదయులు కనుకనే తండ్రిగారట్లు చేసినారు. మహిమాన్వితములైన గురుపాదుకాది వస్తువులు పరపంచను చేరుట బాధగానే యున్నది. తరువాత మీ యిష్టము"— అని నాడొక శిష్యవరుడు.

"ఇందు మీరంతగా బాధపడవలసిన దేమియూ లేదు. ఓరక ఈర్ష్యాసూయలకు దాసులై దుర్మార్గమున పడకుడు. గతమునందుననూ, మీబోటి దుర్విదగ్ధ, దురభిమాన, దురహంకారుల ప్రబోధములకు చెవియొగ్గి సుప్రసిద్ధుడైన సిద్ధుని అనుమానించి అవమానించినాము. అందుకు ప్రతిఫలము అనుభవించినాము. అవకాశవాదులైన మీకు యింకనూ బుద్ధిరాకపోవుట మీరు చేసికొన్న దుష్కర్మప్రభావము తప్ప యింకేమియూ కాదు. పెళ్ళుడు"—గర్జించినాడు గురుకిశోరుడు.

"అయ్యయ్యో! అట్లేల ఆలోచించుదురు గురుసంభవా! తండ్రిగారిప్పుడు మన మధ్యన లేరుకదా! సమాధినిష్టాగరిష్టులై యుండిరి. వారెంత పైకి వత్తురనునదికల్లయే గదా! రేపోమాపో సిద్దయ్య పాదుకాదుల మోసికొని ముడుపుల కేగును, సిద్దయ్య మహిమాన్వితుడేమీ కాదు. మా కంటే కాస్త ఎక్కువ నేర్చుకొనినాడు. మహిమాన్వితుడే అయియుండిన సమాధికాలమునకు వచ్చియుండెడివాడే గదా! సిద్దయ్యకు స్వయంప్రకాశము లేదు. గురుదేవుని అండ తప్ప అతని కన్యమేమియూ లేదు. ఇప్పుడు మనమేమి చేసిననూ అతడు అశక్తుడు. నిర్బలుడు. ఏమీ చేయలేడు. దాసోహమనక తప్పదు. అందునకొరకు ఉపాయమాలోచించి యుంచితిమి. చెప్పమందురా!"—శిష్యులు.

"అవసరములేదని చెప్పితినా!"

"మీరంతగా ఆగ్రహించిన యింకేమి చెప్పగలము. మీ ఉప్పు తిని బ్రతికిన దేహమిది. ఆ విశ్వాసము కొద్ది చెప్పుచుంటిమే గాని అన్యాయముగాదు. సిద్ధుడనిన మాకు మాత్రము గౌరవము లేదనుకుంటిరా! అపారమైన గౌరవమున్నది. కాని."

"కాని! అపారమైన ఈర్ష్యాద్వేషములు కూడ నున్నది. ఔనా! ఈ ఈర్ష్యయే మిమ్ముల నేదో నాటికి సర్వనాశనము చేసి తీరును. పెడలుడు. బుద్ధి కలిగి బ్రతుకుడు. మరొక్కసారి యిటుల అనవసర ప్రసంగములు తెచ్చి, అనవసర విషయములలో జోక్యము కల్పించుకొంటిరా!— జాగ్రత్త! పర్యవసానము చాల ప్రమాదముగ నుండును. పెళ్ళుడు"— దండించినాడు గురునందనుడు.

..../o/....

సిద్ధయోగి ప్రసిద్ధ భారతం :

: నలువది రెండవ భాగం :

"జననీ! పదిరెండు వత్సరంబులు తమ ప్రాపున పెరిగి, మీ బిడ్డలలో బిడ్డగా ఎదిగి, గురుదేవులాశీర్వాదమున జ్ఞానవంతుడనై స్వగృహమునకు ఇన్నేండ్ల తదుపరి గుర్వాజ్ఞతో వెడలుచుంటిని. నన్ను ఆశీర్వదించి పంపుము తల్లీ!"—అని అమ్మవారి పాదములపై వ్రాలినాడు సిద్ధమూర్తి.

"సిద్ధయ్యా! నీవునూ వెళ్ళిపోయెదవా! నాయనా! గురుసేవులు చెప్పిరే యనుకో! నీవిచ్చటనే యుండి, అన్నలకు తోడుగా మఠ నిర్వహణాధి కార్యక్రమములను చేపట్టరాదా! ఇందున నీకు అన్యమేమున్నది. అంతయూ నీచే! నీది కానిదేమున్నదీ. తల్లి మాట కాదనుకురా!"—అనినది గోవిందమాంబ.

"క్షమించు మాతా! గురుదేవి ఆజ్ఞను కాదంటున్నందులకు అన్యథా తలంపకుడు. నన్ను ఆశీర్వదించి పంపుడు తల్లీ!"—అని యొకమారు నమస్కరించినాడు.

"సిద్ధయ్యా! మహాసిపత్యము నాయనగారు నీ కొసగలేదని మనమున బాధ చెందుచుంటివా!"—అనినాడు గురునందనుడు.

"శివ! శివా!....ఎంతటి మాటంటివి సోదరా! నేనంతటి దురాశాపరుడనని ఎట్లు తలంచితివి. గురుహితము గురుపుత్రులకే చెందునుగాని నాకెట్లు చెందును? పాదుకాది వస్తువులు గురుసేవ లనుగ్రహించిననూ, మీరందరూ అనుమతించిననేగాని తీసికొని వెళ్ళను. కొంతమంది దురాశాపరులు మీకు దుర్బోధలు చేసిన విషయము కత్తాకత్తిగ నాకు తెలియుకపోలేదు. అన్నలారా! ఇవిగో యోగదండాది సర్వమూ యిచ్చుటనే యున్నాని. మీ అనుమతి అయినగాని నేను గ్రహించను."—వాటిని గురునందనుల ముందుంచినాడు సిద్ధయ్య.

గోవిందయ్య సిద్ధయ్యను కౌగలించుకొని కన్నీరు మున్నీరగుచు "తమ్ముడూ! సిద్ధయ్యా! మాకెటువంటి దురుద్దేశ్యము లేదు నాయనా! మొదట నాయనగారిని యోగ దండాది ముద్రికలు మాకు కొసగుమని అడిగిన మాట వాస్తవమే! కాని నాయనగారు వాటిని నీ కొరకే కేటాయించబడినవని, వాటిని మరొకరు ధరించలేరని, వాటిని సిద్ధునికేగాని పరులకివ్వరాదనని యిదమిద్ధముగా జెప్పిరి. గురుపాదుకాది

వస్తువులు శిష్యునికే చెల్లును గాని మాకుకాదు. వాటిని నీవు నిశ్శంకగా తీసికొన వచ్చును. అందు అభ్యంతర మేమియూ లేదు, ఇది మా మనస్ఫూర్తిగా చెప్పుచున్న మాట. నీవు నమ్మవచ్చును"—అనినాడు గోవిందయ్య.

"అన్నా! గోవిందయాచార్యా!"—యింకేదియో చెప్పబోవునంత "తత్త కొంచన సన్నిహుడవు. నీకీ ప్రపంచమున తిరుగనునది లేదు. సిద్దయ్యను గూర్చి చెప్పుకొనిన పరబ్రహ్మమును గూర్చి చెప్పుకొనవలె. పరబ్రహ్మము గూర్చి చెప్పుకొనిన సిద్దయ్యను గూర్చి చెప్పుకొనవలె. ఒకరిని వదలి మరియొకరిని గూర్చి చెప్పుకొనుటకు వలను పడదు. మీ యిద్దరి అనుబంధ మటువంటిది. మీరిద్దరిలో ఒకరు లేక మరియొకరు లేరు. నీ అభీష్టమే!—మా అభీష్టము"—అనినాడు గురు నందనుడు.

సిద్దయ్య అందరికీ మరొక్కమారు నమస్కరించినాడు.

"దీర్ఘాయుష్మాన్ భవ!"—అని అందరూ దీవించినారు.

పాదుకలను, దండమును, అంగుళీయకమును యిత్యాదులు పళ్ళెరమందిడు కొని శిరసున దాల్చి గురునామస్మరణ సేయుచు సిద్దయ్య స్వగృహమునకు బయలు దేరినాడు.

కొంతదూరము సాగినాడు.

"అగు! దురాత్మా! ఎక్కడకుబోగలవు. వెండిబెత్తము పాదుకలు యిత్యాదు లన్నియు నీ సొంతముగా భావించుకొని పోవుచుంటివే. మహిమాన్వితములైన యోగ దండాదులు అక్కడ ఉంచి వెళ్ళుము. లేకున్న నీ బుద్ధి రామకీర్తనము పాడించగలము"—అని కేకలు విన్పించినవి.

ఒక్కసారిగా నిశ్చేష్టుడైనాడు సిద్దయోగి. సర్వేంద్రియములను జయించి నాడు. భయమన్నది ఎఱుగడు, నాల్గుప్రెపుల జూచినాడు, ఎవ్వరునూ కనపడరైరి. మరల అడుగులు ముందుకు వేసినాడు.

మరలా గద్దింపు మాటలు వినబడినవి.

"ఎవరు మీరు! ఎక్కడ నుండి మాటాడుచుంటిరి. నేనిది దోచుకొని గానీ, దొంగిలించిగానీ పారిపోవుటలేదు. గురుసేవలు నా కొసంగిన బహుమతులు. గురు

నందనులు, గురుదేవి అనుమతించిన పిదపనే గొనిపోవుచుంటిని"— అనినాడు సిద్ధయ్య.

అప్పటికి ఆ దొంగలు యిరువురు కాలపాశములవంటి దండములతో భయంకరాకృతితో ఎదురునిల్చిరి.... "మర్యాదగా వస్తువులను మా వశముచేయుము లేకున్న...."

"ఆగుడాగుడు, మీకీ వస్తువులపై మక్కువెట్లు కలెగెనో తెలియకున్నది. మీరెవరో కూడ నాకు తెలియుట లేదు. మిమ్ముల నెప్పుడూ చూచిన జ్ఞాపకము కూడ లేదు. నిజముగ మీకీ వస్తువులపై అంతటి మమకారమున్న దానికి నన్ను చంపి తీసికొని పోనవసరము లేదు. మీరింతగా కష్టపడి దారికాచి నన్ను కొట్టబోనవసరమూ లేదు. మాకిమ్మని అడిగిన యిచ్చెడివాడనే గదా! పాపము మీరెంత కష్టనష్టములలో నుండిరో! వీటిని తీసికొనిపోయి విక్రయించిన గాని మీకు విత్తమురాదు. ఆ విత్తముతో మీ బ్రతుకు దెరువులు చూచుకొనవలయును కాబోలు. రండు తీసుకొనుడు"—అని తలపైనున్న పళ్ళెరమును క్రిందకు దించినాడు....

వారిపురా పళ్ళెరముపై చెయి వేయబోవునంత ఎచటినుండియో రెండు సింహంబులు గర్జించుచు అటుగా వచ్చినవి. ఆ క్రూరమృగముల జూచి ఆ తలవరులు భయభ్రాంతులై "అబ్బబ్బో! యివి యేడనుండి వచ్చె! ఇప్పుడెటుబోవుట"—యని యనుకొనునంత అవి వారిపై దుమికినవి. వారు స్పృహ తప్పి పడిపోయిరి.

"సిద్ధా!"—అతని గురుదేవుని దివ్యమైన సుగ్రీవ స్వరమే.

"గురుదేవా! నమో! నమః"—సిద్ధయ్య.

"ఇంక నీ ప్రయాణము సాగింపు"—గురుస్వరము....

"గురుదేవా! అమాయకులు. వీరల నిట్లు వదలి వెళ్ళుట ధర్మముగా తోచుట లేదు. వారిని తిరిగి పునర్జీవితుల జేయుడు."—అని ప్రార్థించినాడు.

"నీ పళ్ళెరమందు పాదుకల క్రింద విభూతి యున్నది చూడుము. అద్దానిని వీరి ముఖమున నుంచి శరీరమంతయూ జల్లుము. లేచెదరు"—అని గురుస్వరము విన్పించినది.

సిద్దయ్య అటులే యొనరించినాడు. తలవరులు లేచి జరిగిన దానిని గుర్తుకు తెచ్చుకొని సిద్దయ్య పాదములపై బడి "మహాత్మా! మీ మహాత్మ్యము తెలియక చెడు మాటలు విని ఇట్లొనరించితిమిగాని నిజముగ వీటితో మాకు పనిబడిగాదు. మమ్ముల క్షమింపుడు"— అని ప్రార్థించినారు.

సిద్దయ్య వారిని దగ్గరగా తీసికొని, వారి ఒడలంతయూ నిమిరి "అన్నలారా! ఎవరికినీ ఎప్పుడునూ హాని చేయకుడు. శ్రీగురుడు ప్రేమ స్వరూపుడు. ఆయన అందరినీ ప్రేమించునేగానీ!— ఎవరినీ ద్వేషించువాడుగాదు. ఈర్ష్యాసూయలు మానవుని మలిన పరచునేగాని మంచి చేయవు. బుద్ధి గలిగియుండుడు. భగవన్నామస్మరణ విడువక సేయుడు. మీకు మంచి చేకూరును"— అని చెప్పి వెడలబోవు సమయమున "అయ్యా! మేము మీ వెంట వచ్చి మిమ్ముల ముడుమాలకు చేర్చి, మేమునూ మీసేవ చేసికొనుచూ ముడుమాల యందే ఉండదలచితిమి. అన్యథా భావింపకుడు. అనుగ్రహింపుడు"- అని వేడుకున్నారు.

"సరే మీ అభీష్టము నెరవేరును. పదండి"- అనినాడు సిద్దయ్య.

ఇంతలో గోవిందయ్య నలుగురైదుగురు వ్యక్తులతో పరుగు పరుగున అచటికి వచ్చినాడు.

"గురుపుత్రా! యిదేమి? మీరేల వచ్చితిరి."- సిద్దయ్య.

"నీ కెవరో అపకారము తలపెట్టిరని, వెంటనే వెళ్ళి కాపాడమని తల్లిగారి మనసునందేదియో చెప్పరాని ఆందోళన తలెత్తినది. నన్ను వెంటనే పంపినది."- అని గోవిందయ్య చెప్పినాడు.

"ప్రమాద మేఘములు గురుదేవుల కరుణతో సంపూర్ణముగా తొలగిపోయినవి. చెప్పుడు మాటలకు తలయొగ్గి, చెడుమాటలకు బానిసలై ఈ తలవరులు ఈ సామాగ్రిని దోచుకొనుటకు వచ్చియుండవచ్చు. కాని వారిప్పుడు పరివర్తన చెంది పరమగురు శరణుజొచ్చి, నాతో ముడుమాల వరకు రానిర్ణయించుకొనిరి"— అని జరిగిన విషయమంతయూ తెలుపగా ఆశ్చర్యచకితులై సిద్దుని గొప్పతనమును, మహాత్మ్యమును మరొక్కసారిగా విని అబ్బురపడి.... ఆనందపడిరి.

"సిద్ధయ్యా! ఒకప్పుడు మేము నిన్ను యిబ్బందుల పాలొనర్చిన మాట వాస్తవము. తిట్టితిమి, నెట్టితిమి, చిక్కుల నెట్టితిమి. అప్పుడు నాయనగారు మా కన్నుల తెరపించి గుణపాఠము నేర్పినారు. ఇప్పటి సంఘటనకు మాకిహ ఎటువంటి సంబంధ మూలేదు. ఇది ఎవరో గిట్టనివారు మమ్ముల్ని అపఖ్యాతిపాలు చేయవలయునని తలంచి ఈ పన్నాగము పన్నియుండ వచ్చు."— అని గోవిందయ్య చెప్పినాడు.

"గురుపుత్రాగ్రజా! నేను మిమ్ములను తప్పుపట్టుటలేదు. మీరనిన నాకత్యంత భక్తి భావము తప్ప అన్యమేమియూ లేదు. నన్ను నమ్ముడు. శంకవీడుడు. జరిగిన దేదో జరిగిపోయినది. దానిని గూర్చియింక విచారమేల?- అంతయూ మనమేలునకే. వెళ్ళి వచ్చెదను. శలవొసంగుడు"— అని నమస్కరించినాడు.

"సోదరా! సిద్ధప్పా! ఇంకకొంత కాలము నీవు మఠము నందే యుండిన మాకునూ ప్రశాంతముగ నుండును. మాతయూ సంతోషము చెందును. కనుక నీవు ప్రయాణమునకు స్వస్తి చెప్పి గృహమునకు పోవుదము రారాదా!"— అనినాడు గోవిందయ్య.

"గురుపుత్రా! మహాత్మా! గురువాజ్ఞమీరరాలను. మీకోరిక కాదంటున్నందులకు అన్యథా తలంపకుడు. గుర్వాజ్ఞ లేక ఏదియూ జరుగదు. అంతయూ మన మేలునకే. మత్పురమున కేతెంచుటకే నిర్ణయించుకొంటిని. అప్పుడప్పుడూ అవకాశముండి నప్పుడల్లా తప్పక వచ్చి తమసేవ చేసికొందును."— అని శలవుగైకొని ప్రయాణము సాగించినాడు.

గురుపుత్రాదులు గృహోన్ముఖులైనారు.

o .... o



సిద్ధయోగి ప్రసిద్ధ భారతం :

: నలువది మూడవ భాగం :

సిద్ధయ్య గురునామ స్మరణచేయుచు, మధ్యమధ్యన అచ్చటచ్చటా కొంత కొంత విశ్రాంతి గైకొనుచు, ఆయా చెలమల యందలి నీరంబుల త్రావుచు, వృక్ష చ్ఛాయల క్రింద కూర్చొని సేద తీర్చుకొనుచు, లొంగిపోయిన తలవరులు వెంట రాగా, మార్గమధ్యమున పలుగురాళ్ళపల్లెయను గ్రామమునకు చేరినాడు.

పేరునకది పలుగురాళ్ళపల్లెయేగాని, పరమభక్తుల కావాసము. దీన సాధు జనంబుల నాదరించి, ప్రేమతో పట్టెడన్నమిడి ఆకలితీర్చు గృహస్థులా గ్రామము నందు పెక్కురు.

గ్రామమునందడుగిడగనే ప్రప్రథమున నొక కోనేరు దర్శనమిచ్చినది. తన అమూల్య వస్తువుల నా ఒడ్డున నుంచి కోనేరులో దిగి, పాదముఖ ప్రక్షాళనము గావించుకొని, కొద్దిగ నీరంబులద్రావి అచ్చటనే విస్తరించుకొని యున్నవట వృక్షంబు చెంత యించుక గూరుచుండి మరల ప్రయాణము ప్రారంభించినాడు.

గ్రామమధ్యమునుండి నడచుచుండి నపుడు విషాదఛాయలు గోచరించినవి. సిద్ధయ్య కేమియూ అర్థముగాలేదు. "ఎందులకీ గ్రామస్థుల ముఖకమలములు ముడుచు కొనియున్నవి? చింతాక్రాంతులై యుండిరి? కారణమేమై యుండును"— అని అలో చించుకొనుచు నడక సాగించుచుండ ఒక గృహంబునుండి ఘోరాతి ఘోరంబుగ ఏడ్పులు వినిపించినవి.

సిద్దయ్యకు విషయమర్థమైనది. విషయములు అడిగి తెలిసికొనినాడు. పాపము తిమ్మారెడ్డి ఉరగ దష్టుండై మృత్యువాత బడినాడు. బహుస్ఫురద్రూపి, కుఱ్ఱవాడు. ఎంతో అందమైనవాడు. జీవించవలసిన జీవిత మింక ఎంతయో యున్నది. భార్యయు కడుంగడు గుణవంతురాలు. జీవిత మందు కోర్కెలు తీరకుండగనే ఆమె పై భవ్యము మోయవలసి వచ్చినది. భగవంతుడెందులకో యింతటి మంచి వాని పైననే కత్తుల నూరును."— అని చెప్పుకొనుచుండిరి.

అప్పటికే శవమును స్మశానమునకు తీసికొని పోయిరి. తిమ్మారెడ్డి భార్య గోడుగోడున యేడ్చుచున్నది. తల్లితండ్రులు కన్నకుమారుని ఎడబాయలేక గుండెలు బాదుకొనుచు విలపించుచుండిరి.

సిద్దయ్య అడుగులు స్మశానముపై పునకు మరలినవి.

కాష్ఠంబుపై తిమ్మారెడ్డి శవము నుంచి, దహన సంస్కార క్రియలు ప్రారంభము సేయబోవుచున్నారు. తల్లి, తండ్రి, భార్య యితర బంధువులందరూ శవము చుట్టూ చేరినారు.

తిమ్మారెడ్డి తండ్రి శవమునకు అగ్ని సంస్కారము సేయబోవుసంతలో

"ఆగండి"—అనినాడు సిద్దయ్య.

అందరూ ఆశ్చర్యపడి అతనివైపే చూచినారు.

"ఏమిటీ వింత? బ్రతికి యున్నవానిని బలవంతముగ కాష్ఠముపై పరుండబెట్టి అగ్నిసంస్కారము చేయబోవుచుండిరా! ఇదెక్కడి న్యాయము!"— అనినాడు సిద్ధయోగి.

"తిమ్మారెడ్డి చనిపోయినాడు"

"లేదు. మీరు పొరబడుచున్నారు. సరీగా చూడుడు. అతను బ్రతికియే యున్నాడు."— అని కాష్ఠంబు దగ్గరగా చేరి— "తిమ్మారెడ్డీ! నేను సిద్దయ్యను. లెమ్మనుచుంటిని లే! ఇది గుర్వాజ్ఞ! జై! వీరబ్రహ్మ గురుదేవా! జై!" అని —అతని పశ్వరము మందున్న విభూతిని అతనిపై జల్లినాడు."

తిమ్మారెడ్డి కదులుట ప్రారంభించాడు.

"తిమ్మారెడ్డి కదులుచున్నాడు"—అనినాడు తండ్రి.

మరునిమిషము ఆవలించి, చిటిక వేయుచూ లేచి కూర్చుని "ఏమిటిది ? నేనెక్కడున్నాను"—అనినాడు. వెంటనే ఆ కాష్టము నుండి క్రిందకు దూకినాడు.

విషయమంతయూ విన్న తిమ్మారెడ్డి సిద్దయ్య మాహాత్మ్యమును విని, ఆశ్చర్య పడి, అతని పాదంబులపైబడి, ఘోరున విలపించి, అతని కన్నీటితో అతని పాద ములు కడిగినాడు. తిమ్మారెడ్డి తలిదండ్రులు, భార్య సిద్దయ్య పాదములపైబడి నమ స్కారములు సమర్పించినారు.

చుట్టూ చేరిన జనము సిద్దయ్యకు జయ జయధ్వానములు సల్పినారు.

"అంతయూ గురులీల! నా గురువాజ్ఞ మేరకే నేనీకార్యము నిర్వహించితిని. ఇందునా ప్రమేయమేమియునూ లేదు. అంతయూ ఆ వీరగురులీలా విశేషము"— అనినాడు సిద్దయ్య.

"దేవా! మహాత్మా! మహిమోపేతా! నీయొక్క దివ్యమహిమచేత తిరిగి జీవం చితిని, నీ ఋణమెట్లు తీర్చుకొనవలయునో తెలియదు. యోగివర్యా! నీవు కోరినంత ధనము నీ పాదములు చెంతనుంచి నీ పాదపూజ చేసికొని గాని నిన్ను పంపను. దయచేసి కాదనకుడు, గ్రామమునకు రండు"—అని తిమ్మయ్య ప్రాధేయపడి, సిద్దయ్యను గ్రామములోనికి గొనివచ్చి, స్వగృహమునకుం గొంపోయి, ఉచితాశీనుని జేసి, నూతన వస్త్రాభరణములతో సత్కరించి, పుష్పమాలాలంకృతునిజేసి, ఘన ముగ కుటుంబ సభ్యులందరూ సిద్దయోగికి పాదపూజల సలిపి, రూపాయలు ఆయన ముందు కుమ్మరించినాడు.

"పిచ్చివాడా! ధనమిచ్చి ప్రాణములను కొనగలమా! గురుమహిమ వలన నీవు సజీవుడవైతివి. గురుమహిమ ప్రభావమిట్టిదని తెలియుటకే శ్రీగురుడు తన లీలల నట్లు ప్రకటనము చేసినాడు. మనమందరము నిమిత్తమాత్రులము. గురువే సత్యము, గురువే శివము. గురువే సుందరము. గురువే ప్రేమ. గురువే శాశ్వతము. గురు కరుణ లేక ఏదియూ జరుగదు. కనుక ధనము నాకేలనయ్యా!



సీ॥ దయ కల్గి వర్తింపు-దయ ఒక్క చేతోడు
గావచ్చు నీ వెంట-కడవరకును
మోక్షమంచగ దయ—మొదటి సోపానమ్ము.
కరుణ గల్గినరుబు—చొరరు నరక

లోకమునకు —నాకలోకమ్ము చనెదరు
బాధలుండవు కృపామతుల కెప్పుడు
గత జన్మమునవారు కరుణావిహీనులై
చరియించి నటువంటి జన్మవలన

ఆ॥వె॥ నేటి జన్మమందు-నిర్ధనులై యుంద్రు
ఒరుల దయన గూడ-ఒల్ల లేరు
సకల గుణ విశాల—సాధు హృదయలోల
మర్మ మెఱిగి యింక—మసలవయ్య.

అని యింక ఎన్నియో విషయములను బోధించి బయలుదేరినాడు. "అయ్యా! మా కింకొకరితో బనిలేదు. మా ప్రాణదాతవు. నీవే మాకు గురుదేవుడవు. నీవే మాకు దేవుడవు. హా సర్వస్వము నీవే!"—అనితమ్మ మొదలు సిద్దయ్యతో ముడు మాల వరకు బయలుదేరిరి.

సిద్ధయోగి ప్రసిద్ధ భారతము :-

-: నలువది నాలవ భాగము :-

పది రెండు వత్సరములు ఒక సద్గురు సేవలో నిమగ్నుడై గురుసేవావ్రత దీక్షతో తప్తకాంచన సన్నిభుడై, యోగియై, జ్ఞానియై, సంపూర్ణుడై సిద్ధయ్య స్వగ్రామమున కేతెంచుచుండెనన్న వార్త. గ్రామస్థులను,తలితండ్రులను, బంధుమిత్రులను ఎంతగానో ఆనందపరిచింది. వారి ఆనందమునకు మేరలేదు.

గ్రామమంతయు పచ్చని తోరణాలతో అలంకరించినారు. రంగు రంగుల పతాకముల నెగుర వేసినారు. ఇండ్ల ముంగిట రంగు రంగుల రంగవల్లులద్దీర్చినారు. గృహముల నన్నియు అలంకరించినారు. వీధుల నన్నియు సౌందర్యములతో సుందరముగ తీర్చి దిద్దినారు. హిందూ వనితలు మంగళహారతులతో సిద్ధయ్యను గ్రామములోనికి ఆహ్వానించుటకు సమాయత్తమైనారు. వారు వీరననేల ? యావన్మందీ సిద్ధయోగిని ఆహ్వానించుటకు ఎవరి శక్తి కొలది వారు సంసిద్ధులై గ్రామము ముంగిట నిలచి యున్నారు,

పల్లకీ సిద్ధము చేసినారు.

సిద్ధయ్య గ్రామ పొలిమేరలలోని కడుగిడగనే "సిద్ధయోగికి జై! వీరబ్రహ్మ గురుదేవులకు జై!"—అని జయ జయధ్వానములు మిన్నుముట్టినవి. ఇదంతయూ చూచి సిద్ధయ్య తనలో తాను నవ్వుకొనుచు "ఎందుకీ హంగామా! గురుగృహము నుండి స్వగృహమునకు తిరిగి వచ్చుచున్నాను. నా గ్రామమునకు నేను తిరిగి వచ్చుటలో విశేషమేమున్నది. వింత యేమున్నది. తల్లి ఒడికి బిడ్డ చేరినట్లు నేను తిరిగి చేరితిని. దానికింతగా ఆర్భాటమా! మిత్రులారా! ప్రేమ స్వరూపులారా! మీ ఆనందము కాదనను. మామూలు మానవుడను, మీలో ఒకనిని తప్ప అన్యము కాను, నన్నేలయింత ఎత్తున కెగుర వేసెదరు."— అనినాడు.

అందరూ పల్లకిలో కూర్చొనమని ఒత్తిడి చేసినారు.

"లేదు. నా గురుదేవులు నాకు ప్రసాదించిన పాదుకలు, యోగదండకము, కమండలపు, ముద్రిక—యివి మాత్రమే పల్లకీ నెక్కుటకు అర్హములు. అంతియే గాని నేను కాదు. నేను పాదచారిగానే వచ్చెదను"—అని నడుచుచూ బయలు దేరినాడు.

మంగళాంగులు మంగళ గీతములు పాడుచుంటిరి. సన్నాయి మేళమూ శ్రవణానందముగా మారుమ్రోగుచున్నది. విరిజల్లులు కురియుచున్నది.

సిద్ధయోగి గ్రామమునకు జని స్వగృహమున కేతెంచినాడు. తల్లి ఆదంబి, తండ్రి శేరు సాహెబు ఎదురు వచ్చినారు. తలితండ్రులకు పాదాభివందనము చేసినాడు సిద్ధయ్య. కుమారుని గుండెల కత్తుకొని ఆనందించినారు దంపతులు. ఆనంద బాష్ప వృష్టితో సిద్ధయ్యను తడిపి వేసినారు. ఇక మిత్రబృందము సరేసరి.

"సిద్ధయోగికి జై! వీర గురునకు జై!"—అని జనులు అనుచుండిరి. సిద్ధ యోగి మెడ నిండుగా పూలమాలలు వేసి వారి వారి సంతోషానంద అభిమానముల వ్యక్తము చేయుచుండిరి.

సిద్ధయోగికి జరుగుచున్న గౌరవ మర్యాదలు, సన్మానములు చూచిన తలి తండ్రులు ఆనంద మెంతని చెప్పగలము. అది వర్ణనాతీతము. అదీ వారికే తెలియ వలయును గాని యితరులు లెక్కకట్టజాలరు. బిడ్డ కెక్కడ దృష్టి తగులునోయని వారి మనము కుందుచున్నది. సిద్ధయోగి వాటన్నిటికీ అతీతుడని వారికి తెలియదు.

అప్పటి కప్పుడే ఒక చిన్న వేదికయూ తయారైనది. అందు సిద్ధయోగి నాహ్వానించి, పుష్పమాలలాంకృతుని చేసి, సిద్ధయోగికి జై అని, వీరయోగికి జై— అని జయజయ ధ్వానములు జేసినారు. పిదప ఒక పెద్ద మనిషి వేదిక నెక్కి "జను లారా! ఈనాడు మహాసుదినము. సిద్ధయ్య సిద్ధయోగియై మరల మన గ్రామమున కేతు దెంచినారు. వీరగురు సార్వభౌముని శిష్యుడై ఎన్నియో వేదాంత రహస్యముల నేర్చుకొనిన దిట్ట. మహిమాన్వితుడు. విజ్ఞాని. దారిలో మరణించిన తిమ్మారెడ్డిని బ్రతి కించిన జీవనదాత. ఆ తిమ్మారెడ్డియు ప్రస్తుతము మనమధ్యనే యుండినాడు."— అనగానే తిమ్మారెడ్డి ప్రక్కనుండి లేచి నిలువబడి అందరకూ నమస్కృమాంజలు లర్పించినాడు. ఆపెద్ద మరలా తన ఉపన్యాసము కొనసాగించినాడు. అటువంటి మహామహిమాత్ముడైన సిద్ధయోగిని, సిద్ధసేవితుని, ఈ రోజు మనము ఘనముగ సన్మానించుటకునే భాగ్యము కలుగుట ఎంతయో అదృష్టము. వారు మనకు మంచి మంచి విషయములను బోధింతురు. దారిలో వారినే హత్యచేయుటకు ప్రవర్తించిన తలవరులును, సిద్ధయ్యగారి మాహాత్మ్యమునకు తలయొగ్గి సిద్ధయోగిని అనుసరించి వచ్చినారు. వారున్నూ యీ సభ యందే యుండిరి."— అని చెప్పి కూర్చుండినాడు.

సిద్దయ్య చెప్పుట ప్రారంభము చేసినాడు....

గురుధ్యానమును జేసి "ప్రేమస్వరూపులారా! పవిత్రాత్మ స్వరూపులారా!— గురువునుమించిన దైవములేడు. గురువుబ్రహ్మ, గురువేవిష్ణువు, గురవే ఈశ్వరుడు, గురువు నిత్యము, శాశ్వతము, గురువును నమ్మి సేవించ వలయులును. గురుసేవా ప్రభావము అమోఘము తద్వారా శాశ్వత పరబ్రహ్మస్థానమును సాధింపవచ్చును.

"ప్రతిదినము బ్రహ్మముహూర్తకాలముననే నిద్రమేల్కాంని, రాత్రి ధరించిన వస్త్రముల విసర్జించి శుద్ధ వస్త్రములను ధరించవలయును. బ్రహ్మరంధ్రమున సహస్ర దళ కమలములపై సూక్ష్మము, నిర్మలము, పవిత్రము, గ్లానిరహితమై ప్రకాశించు ఆగురుదేవుని పవిత్ర స్వరూపమును ధ్యానించవలయును.

శ్లో॥ ఆకాశే దివ్యరేఖాంతః సహస్ర దళ మండితే
హంస రూపే త్రికోణేచ స్మరేత్తం మధ్యతో గురుమ్॥.

గురుగీత

"సహస్రదళ పద్మమునందు, బ్రహ్మరంధ్రము వద్ద, త్రిభుజోన్నతి గల పీఠముపైన హంసరూపములో గురుదేవుని ధ్యానించవలయును. అని పెద్దల ఉవాచ. అది ఆకాశ తత్త్వమంలి దివ్యకాంతి రేఖకు చివరి అంచు. అదే ప్రతి శిష్యుడు తన గురుదేవుని రూపమును, భావనలో ప్రతిష్ఠించుకొని ఆరాధించ వలసిన అత్యుత్తమ స్థానము. అక్కడ శూన్యమేకాని, అశూన్యమే పవిత్రం. అదే పరబ్రహ్మకుస్థానం. అదే గురుస్థానం.

"ధ్యానసమయము నందు బ్రహ్మరంధ్రస్థిత సహస్రదళపద్మము నందు శ్రీగురుడు ఆసీనుడై యుండినట్లు భావించవలయును. అతడు ప్రసన్నవదనుడై యుండి నట్లు, మందస్మిత వదనారవిందుడై యుండినట్లు, వ్యాఖ్యాన ముద్రలో ఆయనహస్త ముండిన యట్లు భావింపవలయును. అదియునుంగాక శిష్యుని పట్ల అతని హృదయము ప్రేమమయమై యుండినట్లుగా. అతని హృదయమంతయు ప్రేమతో నిండి యున్నట్లుగా శిష్యుడు భావించ వలయును. అతడు శాంత స్వరూపుడై యుండినట్లు నిత్య సంతుష్టుడై వెలుంగు చున్నట్లు. అతడే పరబ్రహ్మ స్వరూపుడై యుండినట్లుగ గూడ శిష్యుడు భావించి, ధ్యానించ వలయును. ఎల్లప్పుడు అదేరూపమును మనము మననము చేయుచుండవలయును. ధ్యానము చేయుచుండవలయును.

"గుర్వాజ్ఞ ననుసరించి యిష్టదేవతనుగూడ ధ్యానించవలయును. సమయోచిత ములగు కర్తవ్యములను ఆచరించవలయును. గురుదేవుడే ఆయాదేవతా స్వరూప ములను దర్శింప చేయును, ఆయనయే ఆయిష్టదేవతా స్వరూప మంత్రమును గూడ బోధించును.

"ఇచ్చట ముఖ్యమైన విషయ మొండు గ్రహించవలసి యున్నది. గురువు యిష్ట దేవతను దర్శించగలడుగాని, యిష్టదేవతమాత్రము గురుదర్శనము చేయలేదు. అందువలనే యిష్టదేవత కంటె గొప్పవాడు గురుదేవుడు. గురువే బ్రహ్మ, గురువే విష్ణువు, గురువే మహేశ్వరుడు. అంతయూ గురుమయముగా శిష్యుడు చేసికొనవలెను.

పద్యం : గురునిమీద మనసు కూడ గట్టిగ నుంటె। శత్రువులెందైన చనకగలరె!
శత్రువుల శిఖ బట్టి చెండ గురుడున్నాడు। భయములేల నౌరుల
భ్రమలు సిద్ధా !

అని అస్మద్గురు దేవులు సిరబ్రహ్మ స్వాములు సెలవిచ్చియున్నారు. వారి మాటలు అమోఘములు. అప్రతిహతములు, సత్యములు, జీవభరితములు. సంతతా నంద ప్రబోధకములు.

శ్లో॥ అభీష్టదేవే రుష్టేచ సమర్థో రక్షితే గురుః
నసమర్థా గురౌరుష్టే రక్షితే సర్వదేవతాః॥

—బ్రహ్మ వైవర్త పురాణం : బ్రహ్మఖండం.

ఇష్ట దేవత శిష్యుని కోపించినచో గురువు రక్షింప గలడు. కాని గురుదేవుడే కోపించినచో యేదేవత కూడ సాధకుని రక్షింపలేదు. అదియే గురువులోని గొప్ప తనము. అందువలననే గురువును మించిన దైవము మరి యొకడు లేడు.

శ్లో॥ యస్య తుష్టో గురుః శశ్వజ్జ యస్తస్య పదేపదే
యస్య తుష్టో గురుస్తస్య సర్వనాశశ్చ సర్వదా॥

—బ్ర. వై. పురాణం : బ్రహ్మఖండం.

ఏ శిష్యునిపై గురువెల్లప్పుడు సంతుష్టుడై యుండునో అతనికి అపజయ మంటూ ఉండదు. ప్రతి పని యందూ అతనికి విజయశ్రీ లభించుచునే యుండును అయితే గుర్వాగ్రహమునకు మాత్రము అవకాశ మివ్వరాదు. గుర్వాగ్రహము సర్వనాశనమునకు నాంది.

శ్లో॥ 'గు' కారంతు గుణాతీతం 'రు' కారం రూప వర్జితం.
గుణాతీత స్వరూపంచ యోగి దద్యాత్మ గురుః స్మృతః ॥

గు. గీ :

'గు' కారము గుణాతీతమైనది. అది పరబ్రహ్మకు చిహ్నం, 'రు' కారము రూపమున కతీతమైన పరబ్రహ్మకు చిహ్నం. కనుక సర్వగుణములకు, రూపములకు అతీతమైన స్థితికి చేర్చగలిగినవాడు గురువు. అట్టి గురుదేవుని విడువక ప్రార్థించవలయును.

శ్లో॥ అత్రి నేత్రోద్భవ శశశ్చ తుస్స్వాహా త్రిలోచనః
యశ్చ దుర్వసనో బ్రహ్మ శ్రీగురు కథితః ప్రియే॥

గు. గీ :

"గురుదేవుడు చంద్రునివలె అతి చల్లనివాడు. ప్రాపంచిక విషయ వాసనలతో విసిగిపోయి వేసారిన శిష్యులపై వెన్నెల అనే చల్లని తన కరుణ కురిపించి వారికి శాంతినిహూర్చును. తానే చతుర్ముఖుడైన బ్రహ్మ. తానే విశ్వవ్యాపియైన విష్ణుమూర్తి. తానే సర్వమున కధిపతియైన శివుడు. తాను కాని దేదియూ లేదు. గురువు మహానుభావుడు, మహిమోపేతుడు.

శ్లో॥ 'గు' శబ్దస్తు గుణాతీతో రూపాతీతో రుకారః
గుణరూప విహీనత్వాత్ గురుఃరిత్యభిధీయతే॥.

గు. గీ :

"సత్త్వ రజ స్తమో గుణముల కతీతమైన దేదైతే యుండినదో దానికి ప్రతినిధి 'గు' శబ్దం. ఆ విధముగ రూపము లేనట్టిది, రూపమున కతీతమైన పరబ్రహ్మ స్థానమునకు ప్రాతినిధ్యం వహించువాడు— అనునది గ్రహించ వలయును.

శ్లో॥ 'గ' కారస్తు శివః ప్రోక్తః। 'ఉ' కారో బ్రహ్మోచ్యతే
'రు' కారస్తు రవిః ప్రోక్తో గురుః సర్వార్థ కోవిధః॥

గు. గీ :

'గ' కారము పరమ శివునకు ప్రాతి నిధ్యము వహించు చున్నది. 'ఉ' కార శబ్దము, బ్రహ్మదేవునికి ప్రాతినిధ్యము వహించుచున్నది. అటులనే 'రు' కారము



భాస్కరునికి ప్రాతినిధ్యం వహించుచున్నది. దీనిని బట్టి గ్రహించవలసిన దేమిట నిన గ+ఉ+రు = ఈ మూడు శబ్దములు కలిసి సంపూర్ణ ప్రజ్ఞకు జ్ఞానమునకు' పరవిద్యకు ప్రాతినిధ్యం వహించుచుండె ననుట వాస్తవము. కనుక 'గురు' పదము సంపూర్ణమైనది. గురువెప్పుడునూ సంపూర్ణమైన వాడే. అతడే బ్రహ్మ పథం.

"ఈ విధముగ ఎంతైనను చెప్పుకొన వచ్చును. ఇప్పటికే కాలాతీతమై నది. నా యందు ప్రేమానురాగములతో, అభిమానములతో, మీ బిడ్డనైన నన్ను ఈ విధముగ అభిమానించినందులకు, సన్మానించి నందులకు, గౌరవించి నందులకు నా హృదయపూర్వక నమస్సులు— అర్పించుచుంటినని చెప్పి నాటికా కార్య క్రమము ముగించినాడు.

34)

-: నలువదైదవ భాగం :-

"నాయనా! సిద్దయ్యా! ఎంత ఎత్తున కెదిగి పోతివిరా! మొదటలో తెలిం
దూషించితిమి. దూరితిమి. దుర్భాషలాడితిమి. గురుదేవులనూ తిట్టితిమి.
మానించితిమి. నిన్ననూ నానామాటలంటిమి. పలువిధంబుల పరిహసించితిమి. కి
తిమి. పదిమందిలో అవమాన పరచితిమి. బేటా! అట్టి వేమియూ మనము సం
కొనక మమ్ముల నెప్పటి యట్లు సమాదరింపుము తండ్రీ!" —అనినాడు పీరుసాహే
సిద్దయ్యను దగ్గరగా చేర్చుకొని.

"నీవు తలపెట్టిన పనులన్నియు పూర్తియయినవా తండ్రీ!"- అని ఆ
అడిగినది.

"అమ్మా! అన్నియూ గురువాజ్ఞతో పరిసమాప్తమైనవి. గురుదేవులునూ య
సమాధి ప్రవేశించిరి గదా!"—సిద్దయ్య.

తండ్రి : ఔను మేమునూ ఆదృశ్యమును చూడజాలక పోతిమి. గురుదే
మాకునూ ఆహ్వానము పంపియున్నారు. సరియే కొనిమ్ము ఎవరి కె
వరకు పున్నెమో! అంతియే లభించును కాని, ఆశించినంత మాత్రమ
అన్నియూ లభించవు గదా! నీకు దండకమండలాది వస్తుసామాగ్రి
కుమారులకే మఠాధిపత్యము నంతయూ అప్పగించిరి.

సిద్దయ్య : ఔను తండ్రీ! గురుదేవుని ప్రసాదము మహా మహిమోపేతమై
అవి సామాన్యమైనవి కావు. చేదోడువాదోడుగా నుండును. ఎప్ప
సన్నంటి పెట్టుకొని యుండుమని "జపమాల" ప్రసాదించినారు. స
పాదార్చనమే సకల శుభములకు మూలము. గురుపాదములు తప్ప అ
మింకేమియుండును. గురుపాదముల వద్ద శరణాగతి చెందుటకన్న శిష
వాంఛించున దేమియూ లేదు. అన్నియూ సమకూరి నట్లే! అందువల
పాదుకల సహితము నాకు ప్రసాదించినారు -అన్నిటి కన్న మిన్న
ప్రజల బాగోగులు గ్రహించుటకు, భక్తి బీజముల నెల్లెడల నాటు
ఎచ్చటెచ్చట ఎవరికేది యవసరమో తెలిసి కొనుటకు యోగదృష్టిని
దించి జన్మము సార్థకము చేసినారు-సాధు రక్షణమే మోక్ష సాధన
మహిమను కూడ నాకే ప్రసాదించినారు. కన్నపుత్రులకు సహితము

యని అమోఘరహస్యములను నాకు తెలిపినారు. అన్నిటికీమించి 'తృప్తి'ని ప్రసాదించినారు-సాధు రక్షణమే మోక్షదాయకమని చెబుతూ, ఆఖరుగా 'సిద్ధా! ఇంటికింజని గృహస్థాశ్రమమును స్వీకరించి తలిదండ్రులకు సేవచేయమని ఆశీర్వదించిపంపినారు. ఇంతకన్న కావలసిన దేమున్నది తండ్రీ!"

తల్లి : ఇన్నినాళ్ళు ఆయన పంచనే యుంటివి. మఠము నందు నీకునూ కొంత స్థానమును కల్పించి యుండిన ఎంతయో బాగుండెడిది కదా బేటా!

సిద్ధ : చాల పొరబాటుగా ఆలోచించుచుంటిరి. గురుదేవుల ననుమానించుట కోరి నరక మార్గమున బడిపోవుట, కలనైననూ అట్టి ఆలోచనలను రానీకుడు.

తండ్రి : పది రెండు సంవత్సరంములు నిన్ను కన్న కుమారుని కంటెను మిన్నగ ప్రేమించిరి గదా! విద్యా బుద్ధులు చెప్పి సంపూర్ణ మానవునిగ నొనరించిరి గదా! ఏ ఆపేక్ష్యా లేకుండిన అట్లేల చేయరుగదా!

తల్లి : ఆపేక్ష్యత లేదని కాదులే! శిష్యునకాపేక్ష్యత ఉన్నదీ గనుకనే నన్ను తనంతటి వానిని చేసిరి. అయిననూ పుత్రునకూ శిష్యునకు తేడా యున్నదీ, అదెట్లనిన, వివరించి చెబుదును....వినుడు.

—పూర్వకాలమున 'ధర్ముడు' అను ఒక ఋషి గలడు. ఆయన ధర్మపత్ని పేరు 'అహింస! ఆ దంపతులకు నల్వురు కుమారులుండిరి. వారునూ ధర్మపరాయణులే. కడుదైవభక్తి కలిగిన వారలు. తలి తండ్రులను సేవించి తరించుచుండిరి. వారెప్పుడూ యోగ శాస్త్రమును గురించియే యెక్కువగా ఆలోచనము సేయుచూ, ఆ యా శాస్త్రాభివృద్ధికి అనునిత్యము ప్రయత్నించుచుండెడివారు. అందులో మొదటివాడు సనత్కుమారుడు. రెండవవాడు. [1]) సనాతనుడు. మూడవ వాడు [2]) సనకుడు నాల్గవవాడు [3]) సనందుడు.

---

1. విశ్వకర్మ బ్రాహ్మణులలో సనాతనుడను గోత్రఋషి కలడు, విశ్వకర్మ బ్రహ్మర్షి కుమారులలో సనాతనుడు రెండవవాడు.
2. సనగ లేక సానగ ఋషికూడ విశ్వకర్మ బ్రహ్మర్షి కుమారుడే. ఇతడునూ గోత్ర ఋషియే.
3. సనందనుడు ఋషికూడ విశ్వకర్మబ్రాహ్మణ గోత్ర ఋషులలో ఒకరు.

వీరు వారివారి యోగ శాస్త్రపరిశీలన, పరిశోధన కార్యక్రమాలలో భాగమ
వారు కపిలుడు, వోఢుడు, ఆసురి, శ్రేష్ఠుడు, యోగయుక్తుడు, తపోనిధి అయి
పంచశిఖుడు అను మహాఋషులను సందర్శించినారు. కాని ఆ ఋషులు ఈ సనతు
మార సోదరులకు జ్ఞాన యోగం ప్రసాదించలేదు. మహాయోగపు పరిమా
మాత్రం చెప్పిరిగాని, మిగతా విషయములను బహిరంగ పర్చలేదు. అప్పు
సనత్కుమారుడు తనతపశ్శక్తిచే కమలసంభవుని దరిచేరి యోగ విజ్ఞానం గురిం
బోధించమని ప్రార్థించినాడు.

పద్మాసనుడు అప్పుడు అతని వినయతకు, విధేయతకు, విజ్ఞాన తృష్ణ
పట్టుదలకు సంతసించి "సాధ్యుడా! విజ్ఞానబోధ చేయుటకు సందియ మేమియున
లేదు. నీవు నాకు కుమారుడ వగుటకు సమ్మతించిన అటులే నీకు విజ్ఞానయో
మంతయు విడమర్చి బోధించెదను. విజ్ఞాన మనునది ఎవరికి పడితే వారికి చెప్పవల
పడదు. అది పరమ రహస్యము, గోప్యము. ఇది పరమ సత్యము. కనుక య
కుమారునకు తప్ప అన్యులకుపదేశింప వీలుగాదు." అనినాడు.

అప్పుడు సనత్కుమారుడు చేతులు జోడించి, "కమల సంభవా! విభూ! నీ
నేను శిష్యుడను. కనుక నీకు నేను పుత్రుడనే కదా! హిరణ్యగర్భా! పుత్రునికి శిష
నకు తేడా లేదు గదా స్వామీ!"— అనినాడు.

బ్రహ్మ : ధర్మనందనా! ధర్మానుష్ఠాన మందు పుత్రునకు, శిష్యునకు కొంత తే
యున్నది నాయనా!

సనత్ : అదెట్లు దేవా!

బ్రహ్మ : చెబుతాను విను. పున్నామ నరకమునుండి రక్షించును కనుక అతని
'పుత్రుడు' అని ఈ లోకము ఈ పుత్రశబ్దమునకు నిర్వచనము చెప
చున్నది. అటులనే శేషపాపమును హరింపచేయువాడు గనుక 'శిష్యుడ
అని వేద శ్రుతి వక్కాణించుచున్నది.

సనత్ : విరించీ! పుత్రుడు రక్షించే ఈ పున్నామ నరకం ఎటువంటిదో తెలపీయం
స్వామీ! అంతియేగాదు శేషపాప మననేమియోగూడ తెలపీయుడు. ఎందుల
మిగిలిపోయిన పాపమును శిష్యుడు హరించగలడు. వివరించండి స్వామీ!

బ్రహ్మ : కుమారా! ఇది పరమప్రాచీనమైనది. యోగాంగ శక్తి యుక్తమైనది. సదా గ్రాహ్యమైనది. భయమును హరింపు నటువంటిది. మానవులకు ఎంతయో ఉపయోగకారి. సాధ్యుడా! జాగ్రత్తగా విను. ఈ పున్నామాదులైన నరకములు షోడశ నరకములుగా చెప్పుదురు.

1. పరదారావ్యామోహము - దుష్టసాంగత్యము - పాపజన సాంగత్యము. — తోటి ప్రాణుల, సహజీవులపట్ల కాఠిన్యము వహించుట యిత్యాదులు.-

2. ఫలాది వస్తువుల చౌర్యము - వృథా సంచారము - వృక్షజాతుల వినాశనము చేయుట యిత్యాదులు.

3. నిషిద్ధ వస్తుసే - ప్రాణిహింస, - జంతువులను చంపుట - తోటిప్రాణుల కరుణ బంధించుట - సొమ్ముకొరకు తగవులాడుట - అనవసర కలహము — యిత్యాదులు.

4. స్వధర్మరాహిత్యము - సర్వప్రాణులకు భయంకరముగా ప్రవర్తించుట-సంపారైశ్వర్య వినాశనకర కార్యకలాపముల యందు మునిగి తేలుట యిత్యాదులు.

5. హత్యలు సేయుట - మిత్రుల పట్ల కాఠిన్యము వహించి అపకారము నల్పుట- అసత్యవాదము - మధుర పదార్థము లితరుల కిడకుండ తనొక్కడే భుజించుట మొదలగునవి.

6. కుట్ర-కుతంత్రము-కుచ్ఛితము. ఎదటివారి కపకారము సేయవలయునని దుశ్చింత - ఎదటి బాగుఓర్వలేక వారి కెట్లైనను ఎగ్గు కల్పింప బూనుట - వారు బాధలు పడుటచూచి సంతసించుట, ఫలాదిభోజన పదార్థముల దొంగిలించుట, పరులస్వేచ్ఛాపహరణము - యోగనాశనము - వాహనాది ప్రయాణ సౌకర్యములు దొంగిలించుట - వాటిని నాశన మొనరించుట - ప్రయాణీకులకు ప్రజలకు అవాంతరములు కల్పించుట - అపాయముల సృష్టించుట యిత్యాదులు.

7. రాజభాగమును కాజేయుట - అనగా ప్రభుత్వమునకు రావలసిన ధనమును జమకట్టక ఏవోమాయోపాయములచే ఆ ధనము నపహరించుట - తనకు

రావలసిన భాగము కంటె అన్యాక్రాంతముగ తోటివాని భాగమును మాయో పాయములచే కపటవృత్తులచే కాజేయుట - అధికారి భార్యతో రహస్య సంబంధము కలిగి యుండుట - దేశద్రోహము - ప్రజాద్రోహము - యిత్యాదులు.

8. పిసినిగొట్టు తనము - పరులకుపకరించకపోవుట - స్వార్థబుద్ధి - స్వార్థ బుద్ధితో సొంత స్నేహితునకు - బంధువులకు అపకారము సేయుట - వారి ఆస్తుల కొల్లగొట్టుట - దొంగ సంతకములను సృష్టించి - దొంగపత్రములను సృష్టించి- తనవారి గృహాది భూముల నాక్రమించుకొనుట - స్త్రీలను వెడల గొట్టుట - చిత్తచాంచల్యము - చపలత్వము - అయాచితముగ లభించిన సొమ్ములను సద్వినియోగము చేసికొనక పాడుచేయుట - అత్యాశ - యిత రుల సౌభాగ్యమును చూచి ఈర్ష్యచెంది ఎటులైన వారి నిడుముల పాల్జేసి వారి సౌభాగ్యముల దోచుకొనుట - లేదా తనకట్టి భాగ్యము లేక పోయినదని వగచుట - కుందుట యిత్యాదులు.

9. వేదశాస్త్ర పారంగతుడైన విప్రునిగాని - ఏ యితర పండితునినైనగాని దేశ బహిష్కరణ సేయుట - సేయించుట — బ్రహ్మజ్ఞాన సంపన్నుడైన బ్రాహ్మణుని ద్రవ్యాపహరణము - అట్టి బ్రాహ్మణ నింద - దూషణము - వైరము- బంధుజన ద్వేషము - పగ - యిత్యాదులు.

10. శిష్టాచార వినాశనము - భ్రష్టాచార వినాదము - శిష్టజన ద్వేషము-శిశువధ- శాస్త్రచౌర్యము - చేసినదానము తిరిగి స్వీకరించుట - ధర్మవినాశనము - యిత్యాదులు.

11. వేదనాశనము — అనగా శిక్ష, వ్యాకరణము, ఛందము, నిరుక్తము, జ్యోతిష్యము, కల్పము యిత్యాది శాస్త్రములతో వేదముల నశింపచేయ బూనుట - షడ్గుణ నీతి నిషేధము - అనగా సంధి, విగ్రహము, యమము, ద్వైదీభావము, ఆసనము, ఆశ్రయము - అను ఆరుగుణాల నీతిని కాదని ప్రవర్తించుట యిత్యాదులు.

12. సజ్జనులతో నిత్యశత్రుత్వము - అనవసర వ్యాగుద్ధము - నింద - అనా చారాలింగనము - అయోగ్యపు కార్యాచరణ - సంస్కార హీనత్వము -

ఎదటివారి బాగు నోర్వజాలకపోవుట - ఎదటివారి నెల్లప్పుడు నిందించుచూ, ఎదటివారి బలహీనతల నే కఱువు పెట్టుచూ-తానే గొప్పవానిని చాటుకొనుట యిత్యాదులు.

13. ధర్మార్థకామములకు కీడు కల్గించు పనుల యందాసక్తి కలిగియుండి. ఆయా కార్యక్రమముల కవాంతరములు కల్పించుట - బాధ్యతను విస్మరించుట - పురోహితాది కార్యక్రమములు సరిగా నిర్వహింపక, నిర్లక్ష్యము ప్రదర్శించుట - వేషాడంబరము — మోక్షనాశనము - ధర్మార్థ కామ మోక్షములలో ఒకదానితో నొకటి విరుద్ధముగ నాచరించుట - సజ్జనుల మధ్య బేధాభిప్రాయముల సృష్టించి అంతఃకలహముల ప్రేరేపించి ఐక్యమత్యమునకు, శాంతి యుత సంఘ జీవనమునకు విఘాతము కల్గించుట - యిత్యాదులు.

14. నిత్యదీనత్వము - ధర్మరాహిత్యము - నిషిద్ధ కార్యాచరణము - దయా హీనత్వము - కారుణ్య రాహిత్యము - మానవత్వము లేక చరించుట - అసూయ - గృహదహనాది కార్యక్రమముల నిర్వర్తించుట - సమాజ వినాశన కార్యములం తగుల్కొనుట - ప్రజా దుఃఖమును కల్గించుట యిత్యాదులు.

15. అజ్ఞానము - మూర్ఖత్వము - మొండితనము—పరనింద—ఓర్మి రాహిత్యము— పరుల బాగును సహించ లేకపోవుట - అతి కోపము - అశౌచము - అమంగళము - అబద్ధములాడుట - పెద్ద, చిన్న తారతమ్యము లెరుగక చిట్టి బుట్టిలాడుట - ఎంతమాట పడితే అంతమాట అనుట - ఎదటి మనసును బాధపెట్టుట - యిత్యాదులు....

16. సోమరితనము - ప్రతి విషయమునకూ విసుగుకొనుట - అత్యంత కోపిష్ఠి- అందరి పట్లనూ అతతాయిగా వ్యవహరించట-తానే సర్వజ్ఞుడనని, తక్కిన వారలకేమియూ తెలియదని తలచి, ఇతరుల మంచిపనుల సహితము తన వక్రభాష్యముచే పనికిరావని ప్రచారము సేయుట-రాజుయొక్క అల్పజ్ఞతను అనరాగా గై కొని తోటి పండితులను, మిత్రులను బంధువులను అగౌరవ

పరచుట - అవమాన పరచుట - వారిపై నేరముల ప్రచారము సేయుట - పిర్యాదుల సేయుట - గృహదహనాది కార్యక్రమముల నిర్వహించుట - ప్రజాకంటకుడగుట — యిత్యాదులు....

"ఆతతాయి :

శ్లో॥ అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణి ర్ధనాపహః
క్షేత్రదార హరశ్చైవ। షడైతే హ్యాతాలాయనః"

"గృహారామాది వ్యవస్థలను తగులబెట్టువాడును, విష ప్రయోగముల చేసి హత్యలు నిర్వహించివాడును, ఆయుధపాణియై దోపిడీలు, మానభంగములు యిత్యాదీ నేర ప్రవృత్తి కలవానిని, పరుల మానధనముల నపహరించు వానిని, పరుల భూములను, యిండ్లను అపహరించువానిని, దొంగ సంతకముల చేసి, లేక చేయించి ఇతరుల ఆస్థులను ఆక్రమించుకొను వానిని, పరదారల నపహరించువానిని యిటువంటి వారిని "ఆతతాయి" లని పిలుతురు.

"పరదారేచ్ఛయూ మానవుని నరకగామి సేయును. కావున మానవులీ విషయమున కడుంగడు జాగరూకులై యుండవలయును. కేవలము "ఇచ్ఛ" యే మానవుని నరకగామిగా చేసిన, యింకనా పరదారను అనుభవించిన యింక ఎటు వంటి నరక బాధల ననుభవింపవలసి వచ్చునో జనులు తెలియుట మంచిది.

"సత్య విషయములపై ఈర్ష్య, తత్ వ్యతిరేక ప్రవర్తన చాల నింద్యమైనది. ఈ నరకములన్నియు పున్నామ నరకము క్రిందకే వచ్చును. పున్నామాదులైన ఈ పాపముల గల పురుషుడు తన సంతతి ద్వారా జగత్పతియైన దేవుని సంతోష పరుచవలయును.

"పాపము నుండి విడిపింప చేయు ఈ శుభ సంతతి వలన సంతోష మందిన పరంధాముడు, పరమేశ్వరుడు, జగద్గురుడు, భయంకరమైన ఈ పున్నామ నరకమును సర్వవిధముల నశింప చేయునని శాస్త్రము. "సాధ్యసా! ఈ కారణములవల్ల సుతుని పుత్రుడని ప్రశంసించినారు."— అని బ్రహ్మదేవుడు సనత్కుమారునికి చెప్పినాడు. చంద్రీ. అందువలన పుత్రుడే శ్రేష్టుడు."— అనినాడు సిద్ధయ్య.

"సిద్ధయ్యా! పుత్రుడు పున్నామ నరక బాధల నుండి తప్పించునంటివి. ఇప్పుడున్న పుత్రులందరూ తమ తమ తండ్రులను ఆయా నరకముల నుండి తప్పించుననియే నమ్మమందువా!"

"అట్లు చేయకలిగినప్పుడే ఆ పుత్రుడు పుత్రశబ్దమున కర్హుడు గానీ లేకున్న పుత్రశబ్దమతని పట్ల వర్తించదు. ప్రతి పుత్రుడూ పుత్రుడు గానేరడు."

"నా కింకో అనుమానము. పుత్రుడు-పుత్రిక. ఈ రెండు శబ్దములూ ఒకటిగనే యున్నవి. కించిద్భేదము తప్ప. పుత్రుడు పున్నామాదుల నుండి తప్పించ గలిగినపుడు పుత్రిక మాత్రమెట్లు తప్పించ కుండును. ధర్మమనునది అందరకూ ఒక్కటియే గదా!"

"నిజమే తండ్రీ! కాని శాస్త్రమేదియందలకో అవ్విషయమున నిశ్శబ్దము వహించి యున్నది.

"సరియే! శేషపాపములని చెప్పితివి గదా! వాటి వివరణ కూడా చెప్పుదువా?"

"తప్పక! బ్రహ్మదేవుడే సనత్కుమారునకు శేష పాపములను గూడ వివరించినాడు. అవి కూడ చెప్పెదను వినుడు.

1. దేవ ఋణము, ఋషి ఋణము, ప్రాణి ఋణము, పితౄణము, విశేషించి మానవ ఋణము, సర్వవస్త్వైకత్వము విడిచిపెట్టరాదు. తద్వారా పాపము సంభవించును.

2. ఓంకారము నెప్పుడూ విడువరాదు. ఓంకారము సర్వపాపక్షయకరము. ఓంకారమే బ్రహ్మము. ఓంకారమే విష్ణువు. ఓంకారమే శివుడు. ఈ జగత్తంతయూ ఓంకార సంభూతము.

3. పాపపురుషులు చేయుట పాపమని వేరుగా చెప్పవలయునా! మత్స్య భక్షణము మహాపాపమని బ్రహ్మదేవుడే చెప్పుచున్నాడు. తండ్రీ! నేను మొదటనే మీ చేత మాంస భక్షణము మాన్పించితిని. చూచితిరా మాంసాహారము నిషిద్ధమన్న సంగతి యిప్పటికైననూ మీకు సుబోధకమైనది గదా!

4. పొందరాని పొలతిని పొందుట.

5. ఇంక నెయ్యి, పాలు, మజ్జిగ, వెన్న యిత్యాది వస్తువులు అమ్ముటయూ పాపకర్మమనే పురాణములు చెప్పుచున్నవి. అందువలననే కాబోలు గ్రామముల యందు పాలవుత్పత్తుల నమ్మెడివారు కారు. ఉచితముగనే యిచ్చెడివారు.

6. చండాలాదుల నుండి దానస్వీకరణ తగదు. చండాలాదులనిన బీద, బిక్కు జనముల నుండి బలవంతపు దాన స్వీకరణ మంచిది కాదు.

7. తన తప్పులు కప్పిపుచ్చుకొని, ఒరుల తప్పుల గూర్చి ప్రచారము సేయుట కడుంగడు దోషము.

8. మాత్సర్యము- పరుషవాక్యములు పలుకుట-కఠినత్వము వహించి యుండుట.

9. టాకిత్వం (అయోగ్యుల పేర్లు ఉచ్చరించడం)

10. శాశవాదిత్వం - అనగా దుష్టులతో, దుర్మార్గులతో, దుశ్శీలురతో, దురహంకారులతో సాహచర్యం-లేక మాటలాడుట.

11. ఎదటివానిని భయకంపితుల సేయుట.

12. అధర్మాన్ననుష్టించి ప్రజల దృష్టిలో, ప్రభువుల దృష్టిలో అధర్మపరుడు కావడం.

ఇవన్నియూ నరకమును కలిగించునని పెద్దలు చెప్పుచున్నారు. ఈ పాపములు చేసినవారు, జ్ఞానవిజ్ఞాన సంపూర్ణ స్వరూపుడైన శంకరుని గనుక సంతోషపెట్టగలిగితే, ఆ [illegible] పాపములు గూడ న[illegible]ంచి జయశీలుడగును.

[illegible] ఇట్లు చెప్పినారు "ధర్మపుత్రా! ననత్కుమారా! [illegible] [illegible] కర్మ [illegible] సంతరించుకున్న పాప [illegible] తలితండ్రులు, ఆశ్రిత మానవులు, సోదరులు, బాంధవులు చేసిన పాపమునూ సంపూర్ణముగా నశించిపోతుంది.

"ఇది పుత్రధర్మం-శిష్యధర్మం. సాధ్యుడా దీనికి వ్యతిరేకమైతే గతులు గూడ వ్యతిరేకమగును. కనుక తెలిసినవాడు పుత్రులనూ, శిష్యులనూ సంపాదించు

తరుణ. శేషపాపముల నుండి మాత్రమే తరింపచేయువాడు విష్ణువైతే సర్వవిధ పాపముల నుండి తరింపచేయువాడు సుతుడు."- అని బ్రహ్మదేవుడు సనత్కుమారునికి చెప్పినాడు."- అని సిద్దయ్య తలి తండ్రులకు, పుత్రులకు, శిష్యసహా ఉన్న భేదమును విశదీకరించి చెప్పినాడు. ఆదంపీ పీరుసాహెబులు అతని జ్ఞానమున కెంతయో సంతసించి, సిద్దయ్యను కేవలము తమ పుత్రునిగా కంటే ఒక యోగిగా, గురువుగా స్వీకరించడం, తమ జన్మలకు ధన్యత చేకూర్చుననితలంచి "సిద్దయ్యా! నీవు సామాన్యుడవు కావు. నీవు మాకు గురుడవు. దేవుడవు."—అని పీరుసాహెబు నమస్కరింపబోయినాడు.

"తండ్రీ!"— అని సిద్దయ్య అతని రెండు చేతులటులే పట్టుకొని, కుమారు డెంత ఎదిగినా తలితండ్రుల కెప్పుడూ తనయుడే. బాబా! నన్నెప్పుడూ మీ కుమారుడు గానె, పుత్రుడు గానే ఉండనీయండి."— అని కౌగలించుకొని ఆనంద భాష్పములు రాల్చినాడు.

"అయితే యింతకూ బ్రహ్మదేవుడు సనత్కుమారునకు యోగవిజ్ఞానం బోధించినాడా! సనత్కుమారుని బ్రహ్మదేవుడు కుమారునిగా స్వీకరించినాడా!"— అనినది అప్పుడే లోనికి ప్రవేశించుచు అచ్చాంబి.

"అచ్చాంబీ! నీవా! నీవెప్పుడిట కరుదెంచితివి. నే చెప్పినదంతయూ వింటివా!"— అనినాడు సిద్దయ్య.

"అవును సిద్దయోగీశ్వరా! ఈ శిష్యురాలి వందనంబులు స్వీకరింపుడు. మీకు జరుగు మహోత్సవములు, సన్మానములు, వేడుకల కోలాహల మధ్యమమున నావంటి శిష్యురాలు తమకెట్లు గుర్తుండును"- అనినది అచ్చాంబి సరసముగ.

"నీవు ఒక్కర్తివే వచ్చితివా!"- సిద్దయ్య.

"లేదు. లేదు. నీకు శిష్యులు, శిష్యురాండ్రు కావలయును గదా! శేష పాపము హరింపసేయుటకు. ఇదుగో, సరస, చిన్నాబాయి, కమల, అనర్కలి అంతమూ వచ్చినారు. మరి నీ పున్నామనరకముసు బోగొట్టుట కెవరున్నారో తెలియదు— బావా! నీవు చెప్పిన విషయములు నాకు తెలియవు. తరువాతేమి జరిగినదో చెప్పు బావా!"- అనినది అచ్చాంబి.

"చెప్పు నాయనా! అమ్మాయి సంతోషపడి అడుగుచున్నది" — అనినది ఆదంబి.

"అయితే వినండి. అందరూ సావధానముగా వినుడు"

అందరూ కూర్చొనినారు. సిద్ధయ్య చెప్పుట ప్రారంభము చేసినాడు.

"అయిన పితామహా! ముమ్మాటికీ సత్యము. నేను నీ పుత్రుడను. నాకా యోగ విజ్ఞాన సరస్వతిని ప్రబోధము సేయుము."- అనినాడు సనత్కుమారుడు.

బ్రహ్మ : పుత్రకా! నీ తల్లితండ్రులు నిన్ను నాకు దత్తునిచ్చిన నీవు నాకు దాయాదుడవైన పుత్రుడ వగుదువే గాని ఔరసుడవు మాత్రము కానేరవు.

సనత్ : ఆ సుత భేదముల గూర్చి వివరింపుము తండ్రీ!

బ్రహ్మ : ఔరసుడు, క్షేత్రజ్ఞుడు, దత్తుడు, కృత్రిముడు, గూఢోత్పన్నుడు, అపవిద్ధుడు- అని దాయాదులైన బాంధవులు ఆరుగురు. వీరికి ఋణం, పిండదానం, ధనం, వీరి క్రియలు, గోత్రం, కులవృత్తి, శాశ్వతప్రతిష్ఠ- ఇవన్నియు సమానముగనే యుండును.

సనత్ : వీరందరూ దాయాదులైన బాంధవులుగా పేర్కొంటిరి. దాయాదులు కాని బాంధవులెవరైన యుందురా! అబ్జభవా! తెలియగోరెదను.

బ్రహ్మ : కానీనుడు, సహోఢుడు, క్రీతుడు, పౌనర్భవుడు, స్వయందత్తుడు, పారశవుడు — ఈ ఆరుగురూ దాయాదులు కాని బాంధవులు. వీరికి ఋణ, పిండ దానాదుల మాటే ఇచ్చటలేదు. వీరు పేరు మాత్రమే వహించెదరు గాని తండ్రి కుల గోత్రాదులకు వీరికి సమ్మతి లేదను విషయము గ్రహించవలయును.

సనత్ : విశ్వబ్రహ్మా! వీరి విశేషములను వివరింపుము.

బ్రహ్మ : పుత్రకా! తనకు ప్రతిబింబముగ తన ధర్మపత్నియందు స్వయముగ జన్మించినవాడు 'ఔరసుడు'. భర్తను పుంసకుడైనా, పిచ్చివాడైనా, వ్యసనపరుడైనా — అతనికి సంతానయోగం లేదని తెలిసికొనినప్పుడు, ఆ భర్త అనుమతితో, కామదృష్టి లేకుండా కేవలం సంతానం బడయుటకే కాంక్షగా

కలిగిన భార్య ఇతరుని పురుషుని వల్ల కలిగిన కుమారుడు 'క్షేత్రజ్ఞుడు'. తలిదండ్రులచే దత్తుచేయబడినవాడు 'దత్తుడు'- మిత్రపుత్రుడూ, మిత్రుని చేత దత్తుడు, వీరిని 'కృత్రిముడు'- అని చెబుతున్నారు. గృహములో నున్న ఏ పురుషుని ద్వారా అతడు పుట్టెనో తెలియనివాడు 'గూఢోత్పన్నుడు! — బయట నుండి స్వయముగా తీసికొని రాబడినవాడు 'అపవిద్ధుడు' - కన్యకు పుట్టినవాడు 'కానీనుడు'. కడుపులో ఉండగా తల్లికి పెండ్లియైనచో పుట్టినవాడు 'సహోఢుడు'— వెలయిచ్చి తీసికొనబడిన వాడు 'క్రీతుడు'— తరువాత పునర్భవుడు - వీరిలో రెండు రకములు.

1. ఒకని కిచ్చినకన్యను అపహరించి, మరొకనికి యిచ్చినపుడు ఆమెకు పుట్టినతనయుడు 'పునర్భవుడు'- (2) కరువు కాలములలో గానీ, యితర కష్టదశలలోగానీ, తనను తానుయితరుల కిచ్చుకొనినవాడు 'స్వయందత్తుడు' - తరువాతివాడు 'పారశవుడు'- సువ్రత అనగా మంచి వ్రతము గల్ల స్త్రీయని అర్థము. పెండ్లి అయినది గానీ, కానిది గానీ, శూద్రస్త్రీ అయియుండి, బ్రాహ్మణుని వల్ల పొందబడిన సుతుని 'పారశవుడు'- అని అందురు.

'కనుక సనకాగ్రణా! నిన్నునీవు నాకు స్వయముగ యిచ్చుకొనదగిన వాడవు కావు. నీకు తలితండ్రులుండిరి. నీవు వెళ్ళి వారిని త్వరగా పిల్చుకొని రమ్ము'- అని చెప్పినాడు బ్రహ్మదేవుడు.

అప్పుడు సనత్కుమారుడు తన తల్లిదండ్రులైన ధర్ముడు, అహింసాదేవిని బ్రహ్మ సముఖమునకు కొనితెచ్చినాడు. ఆ పుణ్యదంపతులు వాణీనాథునకు నమస్కరించినారు. అప్పుడు సనత్కుమారుడు తన తల్లితండ్రుల జూచి "జననీ జనకులారా! యోగవిజ్ఞానము బడయవలయుననియు అందు నిష్ణాతుడ కావలయునని బ్రహ్మదేవుని ప్రార్థించి అర్థించితిని. ఆయన నన్ను పుత్రునిగా బడసినగాని యోగ

---

క్షేత్రజ్ఞులు : పాండవులీ విధముగ జన్మించినవారే
కానీనుడు : కర్ణుడు.



విజ్ఞాన ప్రబోధము చేయజాలనని వచించియుండె. గనుక తలితండ్రులారా! నన్ను ఈ విశ్వనాధునికి, విశ్వబ్రహ్మమునకు దత్తము సేయుడు"- అని చేతులు జోడించి ప్రార్థించినాడు.

అంత నా 'అహింసాధర్మము' పుత్రుని విజ్ఞానసుగ్రహించి కుమారుని బ్రహ్మదేవునికి దత్తునిచ్చి వెడలినారు.

అంత బ్రహ్మదేవుడు మొట్టమొదలుగా సనకాగ్రజునకు ద్వాదశ పత్రయోగమును బోధించినాడు"— అని చెప్పి అంతటితో నాటి ప్రబోధమును ముగించినాడు సిద్ధయ్య.

సిద్ధయోగి ప్రసిద్ధభారతం :-

-: నలువది ఆరవ భాగం :-

రాళ్ళపల్లి యంతయూ అత్యంత కోలాహలముగ నున్నది. సిద్దయ్య తిమ్మయ్యను బ్రతికించుట సంచలన వార్త యయినది. జనులెల్లరు గుంపులు గుంపులుగా చేరి యిదే విషయములు చెప్పుకొనుచుండిరి. అంతియేగాదు సిద్దయ్యకు హాని చేయ బోయిన తలవరులు సహితము సిద్దయ్యకు దాసులై అతని పంచనే పడియుండిరట. సిద్దయ్య మహనీయుడని, మహిమాన్వితుడని—అతని దివ్యశక్తిని వేనోళ్ళ కొనియాడుచుండిరి.

తిమ్మారెడ్డి కుటుంబ సభ్యుల ఆనందమునకు మేరలేదు. మరణించిన వ్యక్తి తిరిగి సజీవుడగుట సామాన్య విషయమా! "ఎంతైననూ గురువునకు దగ్గ శిష్యుడు. గురువంతటి శిష్యుడు. గురువుగారు కక్కయ్య భార్య ముత్తిని, పిచ్చిరెడ్డినీ బ్రతికించినాడు. మరి శిష్యుడు మాత్రము తక్కువ తినెనాయేమి? తిమ్మయ్యను బ్రతికించినాడు."— అని అనుకొనుచుండిరి.

సిద్దయ్యకు ఘనముగ కానుకలు సమర్పింపవలెననియు, ఆయన ఆశీస్సులు పొందవలెననియు, తిమ్మారెడ్డి భార్య, తిమ్మారెడ్డి తల్లి తండ్రులు ఆయత్తమగుచుండిరి.

సిద్దయ్య మాహాత్మ్యము ప్రక్క గ్రామములకు ప్రాకినది. గోవిందస్వామి బ్రాహ్మణుడు. మంచి భక్తుడు. సిద్దయ్యను గూర్చిన విశేషములు అతని చెవినబడినవి.
[illegible]
రాళ్ళపల్లి కరుదెంచి తిమ్మారెడ్డి కడ కేగినాడు.

అదే సమయమున తిమ్మారెడ్డి, అతని కుటుంబ సభ్యులు ఇతర గ్రామస్థులు కలసి ముడుమాలకు బయలుదేరుటకు సిద్ధముగ నుండిరి. అట్టి సమయమునందే తెంచిన బ్రాహ్మణునకు తిమ్మారెడ్డి కుటుంబ సభ్యులు అతనినెంతయో ఆప్యాయమున నాహ్వానించి, కూర్చుండచేసి, మాటలాడి, సేదతీర మజ్జిగ పానీయమిచ్చి



గౌరవించినారు. గోవిందస్వామి తన సందేహము వెలిబుచ్చగా, తిమ్మారెడ్డి యావద్వృత్తాంతము పూసగ్రుచ్చినట్లు చెప్పినాడు. అప్పుడు గోవిందస్వామి తానునూ వారితో బయలుదేరుటకు సంసిద్ధతను వ్యక్తము సేయగా "అంతకంటెనా! స్వామీ!" అని అతనిని గూడ బండిలో నెక్కించుకొని బయలుదేరిరి. తిమ్మారెడ్డి, అతని బంధుగులు ఒక బండియందు, తిమ్మారెడ్డి భార్య తలితండ్రులు, అత్తమామలు ఒక బండియందు, గోవిందస్వామి ఇతరులు మరియొక బండియందునూ బయలుదేరినారు. పలువిధ కానుకలు, సరకులు బండ్లయందు చేర్చినారు.

"ఆహా! యదుకులమున శ్రీకృష్ణమూర్తి జన్మించినటులు, ఈ సయ్యాదు కులమున సిద్ధయోగి జన్మించుట దైవలీల గాక మరేమి?"— యనుకొనుచుండిరి.

గోవిందస్వామి మనసంతయు సిద్దయ్య పైననే యున్నది. బండ్లు ముడుమాలకు చేరినవి. గ్రామమంతయు మరల హడావిడిగ తయారైనది.

అప్పుడే సిద్దయ్య స్నానము ముగించుకొని. తటాకము నుండి బయల్వెడలినాడు. వచ్చుచున్న యా బండ్లను జూచి "ఎవరా!" యని యనుకొనునంతలో తిమ్మారెడ్డి బండి నుండి దూకి సిద్దయ్య పాదములపై బడెను. అందరూ సిద్దయోగిని చుట్టుముట్టి జయజయధ్వానములు బల్కిరి.

సిద్దయ్య అందరితో ఇంటికి చేరినాడు.

వచ్చిన జనమంతయూ నుండుటకుగాను సిద్దయ్య ఇంటి ముందున్న ఖాళీ స్థలములో అప్పటికప్పుడు పందిళ్ళు ప్రారంభమైనవి. అందరూ అందులో విడిది చేసినారు.

సిద్ధయోగి ప్రసిద్ధభారతం :-

-: నలువది యేడవ భాగం :-

సిద్దయ్య ఇంటిముందు తెల్లవారు సరికి మరలా పందిళ్ళ - అందులో మళ్ళీ మనుష్యులు. వీటన్నిటినీ తెలిసికొని కరణం పాపరాజుగారికి కొంత కంటగింపైనది. తను బ్రాహ్మణుడు. సర్వజనులతో పూజింపతగినవాడు. భూమికి దేవత వంటివాడు. అటువంటి తాను గ్రామాధికారియై యుండగా, తనకు లేని గౌరవము, పూజలు, దూదేకుల సిద్దయ్యకా! దూదేకుల సిద్దయ్య కింతటి ఘనకీర్తియా! ఉత్సవములా! ఊరేగింపులా! శూద్రుని, అందునా తురుష్కుని పట్టుకొని ఊగులాడుటకీ ప్రజలే మాత్రము సంశయింపరేల? కాకోదర విషంబు సరిగా పైకెక్కక, సొమ్మసిల్లి పడి యున్న తిమ్మారెడ్డి ముఖమున నీళ్ళకొట్టి పైకి లేపినంతమాత్రమున తానే బ్రతికించి నట్లు డబ్బా కొట్టుకొనుచున్న యతని దమననీతి నేమనవచ్చును. ఆఁ! తిమ్మారెడ్డి కేదో ధనమిచ్చి యిట్లు ప్రచారము చేయించుకొనుచుండెను కాబోలు. లేకున్న ధనము వచ్చుటెట్లు? ఇల్లు గడువవలయును గదా!"— అనుకొని ఎకాఎకిన సిద్దయ్య ఇంటికి వచ్చినాడు.

"గ్రామాధికారులకు శుభంబగుగాక!"- యనినాడు సిద్దయ్య.

"మాకెప్పుడునూ శుభములే లేవయ్యా! మీ సంగతే ఆలోచించుకొనుడు. శుభాశుభముల మధ్య కొట్టాడు బ్రతుకులు మీవి. అవును సిద్దయ్యా! కన్నతల్లిని, తండ్రిని, గ్రామమును, బందుగులను విడిచి పండ్రెండు వత్సరములా బ్రహ్మము గారి పంచగాచి వచ్చితివి గదా! ఏమిచ్చెనయ్యా నీ గురువు. ఎంత ద్రవ్యమిచ్చినా దేమిటి? ఏదీ చెప్పుము. వీరంవరూ విందురు."— అని పాపరాజు అపహాస్యము చేసినాడు.

"పాపరాజుగారూ! శిష్యుడనెడివాడు, గురువువద్ద జీతముకొని పనిచేయు పాలేరు గాదు. ఆచార్యుడు శిష్యునకు ప్రసాదించవలసినది జ్ఞానము. దాని విలువ మీకు తెలియదు. మీకు తెలిసినది మీకూ, మీ పాలేళ్ళకు మధ్యనున్న జీత బత్తెముల సంబంధము తప్ప వేరుకాదు. గురుదేవులు నాకిచ్చినవి జ్ఞానకాంతులు. వాటితో బాటు—"

"మాకు తెలుసులేవయ్యా! ఆయన వాడి వాడి అరిగిపోతే పనికిరాక పారేసిన
శిష్య- అంతేగా!"

"రామ రామ! ఎంతటి అపహాస్యము సేయుచున్నారు. శ్రీరామచంద్రుని
లు భరతుడు ఎందుల కొదలదాల్చి పట్టాభిషేకము చేసినాడు. అవిమాత్ర
వి కావా! వాటికి పట్టాభిషేక యోగ్యత ఎందుకు కలిగినది."

"ఇదుగో సిద్దడా! ఊరికా పురాణాలకీ ప్రస్తుతానికీ ముడిపెట్టకుగానీ! ఇదుగో
కొలువు సెయ్యి. యిట్టాంటి చెక్క చెప్పులు పది జతలు చేయించి యివ్వ
కూటికీ గుడ్డకు తరుగులేకుండా గింజలిస్తాలే! ఎందుకీ వీరంగమంతా! తెలి
"— అని పాపరాజు అనగనే, సిద్దయ్య చెయ్యి పైకెత్తి 'ధే'—యని బిగ్గరగా
ాడు.

పాపరాజు అతని అరుపున కొంకింత తత్తరపడి, సిద్దయ్య తనను కొట్టుటకు
త్తెనని దురహంకార పరీవృతుడై "ఛీ! ఏమి నీ కండకావరము. పశువును
చినట్లు నన్ను, నాయంతవానిని, అందునా బ్రాహ్మణుని 'ధే'యని విదలిం
గ్రామాధికారినను గౌరవ మిసుమంతైననూ లేక నన్నిటు పరిహసింతువా!
ిముందు అవమానింతువా! ఈసడింతువా! దుర్మదాంధ! నిన్నేమి సేతునో
ము.

"యోగినని గర్వపడుచు, నియోగిని నన్ను పరిహసింపయిది యూరకపోవు
ంటివా! భోగిని త్రొక్కిన నెంతటి భోగినయిన నది కఱువకపోవునా!" అని
కరించినాడు కరణం పాపరాజు.

"కరణంగారూ! శాంతము వహింపుడు. ఆగ్రహింపకుడు. ఆగ్రహ మన్ని
యందునూ పనికిరాదు. ఆగ్రహ మరిష్టదాయకమే గానీ, ఆనందదాయకము

సీ॥ ఆగ్రహమ్ము నణచ నవకాశముండిన।
అణచుటెంతయొ మేలు అగడు బాయు
ఆగ్రహమ్ము నణచ నవకాశమే లేక।
ఆగ్రహించితివిబో అగడు కల్గు

కనుక నాగ్రహమును కనిపెట్టియుండుట।
అణచుకొనుట కీడు నాపుకొనుట
ఊరక కోపమ్ము నేరముల్బుట్టించు।
ఎగ్గులు పలుకల్గు సిగ్గు చెడును

ఆ॥వె॥ ఆగ్రహమును మించు। అపకారి లేదయా శాంతిబాయ జేయు శత్రువదియె,
రమ్యగుణ సుమిత్ర! రాజీవ దళనేత్ర! భవ్యగుణ పవిత్ర! భరతపుత్ర."

సీ॥ తనను తాకాపాడుకొన నిచ్ఛగలవాడు
కోపానలము నుండి తప్పుకొనుచు
తిరుగవలయునయ్య దీర్ఘదర్శియనంగ
కోపమ్ము ముంచును కొంపనీట

మధురమైనది మైత్రి మల్లెపూ తెప్పగా
ఆహ్లాదమున్నిచ్చు హాయి గూర్చు
తలమొగ్గి కోపంపు వలలోన బడితివా।
సర్వనాశనమ్ము సంభవించు

ఆ॥వె॥ ఎవ్వడైన నిన్ను ఏడిపించిన గాని। ఓర్పు చూపుటెంతో నేర్పు సుమ్ము
గ్రామకరణమీవు క్షేమమ్ము నీకెపుడు। పరమయోగిరాజ పాపరాజ!

అని "మామక విజ్ఞాపనము శాంతముగా విని తరువాత నిర్ణయమునకు రమ్ము"— అనునంతలో పాపరాజుగారి పశుకాపరులు చిరుతపులి దెబ్బతిని గాయపడిన నొక గోవత్సమును మెల్లగ తోలుకొని అటువైపుగనే వచ్చినారు.

"ఏమది? ఏమైనదిరా! దూడకేమైనది. అయ్యయ్యో! యిదేమి? గాయములైనవి. రక్తము స్రవించుచున్నది. దూడ గడగడ వణకుచున్నది. ఏమైనదిరా? త్వరగా చెప్పుడు"- అని తొందర చేసినాడు పాపరాజు.

"అయ్యా! మేము మామూలుగనే గోవులు తోలుకొని అడవికేగితిమి. చిఱుత యొకటి ఎంతసేపటి నుండి పొదచాటున దాగియుండెనో మేమెవ్వరమూ గ్రహింపజాలకుంటిమి. ఉన్నటులుండి ఒక్కసారి యాచిఱుత ధేనువుమీదకురికినది. అప్పుడే

అరచినాడు. ఆ అరుపునకా చిఱుత ధేనువు నటవదలి పఱుగు పఱుగున పారిపో
నది. ధేనువునకు మెడయంతయూ గాయములైనవి."— అని గోపాలురు చూప
పాపరాజు మొగము క్రిందికి వ్రేలాడవైచినాడు. "పేరుకు తగినట్లు పాపరాజునేగా
పుణ్యుడను గాను. పాపిని గనుకనే సిద్దయ్యను ద్వేషించి, దూషించితిని"- అ
సిద్దయ్య కాళ్ళపైబడి శరణు వేడినాడు.

"మునివర! నీ మాహాత్మ్యము నెఱుగక నిన్ను తూలనాడితిని. నిందించితి
దూషించితిని. మలకనచేసి పల్కితిని. అజ్ఞానుడనై, అవ్యక్తా వ్యక్తములు తెలియ
అర్థము చేసికొనలేక, అవివేకినై ప్రవర్తించితిని. సిద్దయ్యా! నా నేరములను పై
నన్ను రక్షింపుము. పులివక్త్రమున బడిన ధేనువు నీవలన రక్షింపబడినది.
మహిమ వర్ణింపనలవిగాదు. నీ వలన రక్షింపబడిన యీ ధేనువు నీదియే కాని నా
కాదు. మహాత్మా! ఈ ధేనువును నీవే స్వీకరించి నన్నుద్ధరింపుము"- అని కరణ
పాపరాజు ఆ ధేనువును సిద్దయ్య కొసంగినాడు. "సిద్దయ్యా! మీ-మా పెద్దల పూర
పుణ్యవశమున, సుకృతమున మా గ్రామమున జన్మించితివి. సిద్దయ్యా! నీకిక్కడ
ఒక మఠమును నిర్మించెదము. నీవందు నివసించి సర్వజనులను పావనముచేయుము
ఆధ్యాత్మిక ఔన్నత్యమును జనంబులకు కల్గింపుము. భక్తి ప్రచారము సేయుము
గురుభక్తిని ప్రబోధింపుము"- అని చెప్పగనే తిమ్మారెడ్డి "ఆర్యా! మఠ నిర్మాణమ
నకు వలయు ధనములో సగభాగము నేనొసగెదను. నా జీవన దాత! నా ప్రాణదాత
సిద్దయ్య దేవుడు"— అని తన కృతజ్ఞతను, భక్తిని చాటుకొనినాడు.

గోవిందస్వామియు "మఠ విశిష్ట కార్యముల యందు నామోపినంత నేను
సాయపడగలను."— అనినాడు. మిగతా జనంబులు ఎవరికి తోచినట్లువారు, వారివా
శక్త్యానుసారము వాగ్దానము చేసినారు.

ఒకనాడు గ్రామ ఈశాన్య దిశన గల నిర్మల స్థలంబున శుభముహూ
వేళలో శంకుస్థాపన మొనర్చి మఠ నిర్మాణంబునకు ప్రారంభోత్సవము జరిగనది.

మఠము గూడ అనుకొన్న గడువు కంటె ముందుగనే పూర్తియయినది
గోవిందస్వామి నాటినుండియు సిద్దయ్యను గురువుగా స్వీకరించి, ఎక్కడికి
బోక సిద్దయ్య మఠంబుననే నివశించుచు, అనేక వేదాంత రహస్యంబుల తెలియ
జేయుచు, సిద్దగురు సేవలో కాలము గడుపుచుండెను.

సిద్ధయోగి ప్రసిద్ధ భారతం :

: నలువది ఎనిమిదవభాగం :

రోజులు గడచుచున్నవి. సిద్ధయ్య వెంటవచ్చిన తలవరులు సిద్ధయ్యకు సేవ సేయుచు సిద్ధయ్య మఠమునందే స్థిరపడి పోయిరి. గోవింద స్వామియు యచ్చటనే యుండె గదా! కరణము పాపరాజుగారు సిద్ధయ్యకు భక్తుడై వారి కుటుంబమునకే కొలంతయూరాకుండ కనిపెట్టుకొని యుండిరి.

ఒకనాడు.... ఒకరిద్దరు వ్యక్తులు మఠపరిసర ప్రాంతములందు తచ్చాడుట తలవరులు గ్రహించినారు. వారి కనుమాన ముదయించినది. నాడు యోగదండాది వస్తువుల దోచికొని దండని పురమాయించిన దౌర్భాగ్యులు వారేనని తెలిసి కొను టకు తలవరుల కెంతయో కాలము పట్టలేదు. జాగ్రత్తగా నుండ వలయునని ఒకరి నొకరు హెచ్చరించుకొనిరిగాని, గోవిందస్వామికి కూడ ఆవిషయము తెలయ పర్చ లేదు. వారిని పట్టి బంధించి సిద్ధయ్య స్వాముల ముందు ప్రవేశ పెట్టి వారికి తగిన దండనము విధింప చేయవలయునని వారి అభిలాష.

ప్రొద్దు పోయినది....

అందరూ నిద్రల కుపక్రమించినారు.

అదేమి కర్మమో తలవరులకు అపరిమితమైన నిద్రముంచుకొచ్చినది. కాపలా కాయవలయు ననుకొనినవారు ఒడలు తెలియని నిద్రకుపక్రమించినారు. దుర్మార్గులైన ఆయిద్దరూ మఠ ప్రాంగణమున కేతెంచినారు. మెల్లగా తలుపులు తీసి లోన ప్రవే శించినారు. వీరగురుదేవుడు సిద్ధునకు ప్రసాదించిన యోగదండము, పాదుకలు, బెత్తము దివ్యకాంతుల నీనుచున్నవి. వాటి నెటులైనదోచుకొనిపో వలయు ననుదేవారి ఎత్తుగడ. మెల్లగా ఒకడు పాదుకలపైన మరియొకడు వెండిబెత్తముపైన చేయి వేసి నారు. అంతియే!— పెద్దశబ్దముతో, ఒక దివ్యవెలుగక్కడ వెలిగినది. వారిద్దరికీ అంధత్వము సంప్రాప్తమై దిక్కు తెలియక లబోదిబోమని యేడ్వసాగిరి. వారి యేడ్పులకు, వెలువడిన శబ్దమున కందరూ నిద్రలేచినారు. తలవరులునూ నిద్రలేచి, యిద్దర్ని పట్టుకొనినారు. అప్పటికే సిద్ధయ్యకు సంకేతము రాగా, అతిరయమున కచ్చటికి చేరినాడు.

"గురుదేవా! నాడు ఈ సొమ్మును దోచుకురమ్మని మమ్ముల పురమాయించిన పెద్ద మనుష్యులు గూడ వీరేస్వామీ! ఇప్పుడు వాటిని దొంగిలించుట కిందు ప్రవేశించి, ఆ పవిత్ర సామానుల ముట్ట జాలక అంధులై విలపించుచుండిరి."— అనినారు తలవరులు.

"మీరా!— మిత్రులారా! ఎంతటి దుష్టకార్యమున కొడిగడితిరయ్యా! ఎందులకీ పాపకార్యమున కొడంబడితిరి. గురుస్వాములు మిమ్ముల కాదని అంతయూ నాకే కట్టపెట్టిరని అసూయతో యింతటి దారుణ కార్యమున కొడంబడితిరా! చూచితిరా! దానిఫలితమెంత తీవ్రముగా నుండినో! దేవుశాగ్రహించిన గురుదేవుడు కాపాడ గలడుగానీ, ఆ గురువే ఆగ్రహించిన భగవంతుడునూ ఏమియూ సేయలేడు. ప్రస్తుతమీ పరిస్థితి అట్టిదే. మిమ్ములనే శక్తియూ రక్షించజాలదు."— అనినాడు సిద్దయ్య.

"సిద్దయ్యా! బుద్దిగడ్డితిని యిట్టి దుస్సాహసమున కొడిగడితిమి. బెత్తము మహిమోపేత మైనదని, తద్వారా సిరిసంపదలు పొందవచ్చునని, పాదుకలు తొడిగి కొని ఎక్కడికి పడితే అక్కడకు ఎగిరి పోవచ్చునని తలంచి యిటువంటి దుష్ట కార్యమున కొడంబడితిమి. మమ్ములను క్షమించు. మాకేదియో మార్గమును చూపింపుము. మేమీ అంధకారమును భరించలేము. మాకు దృష్టి ప్రసాదించి మమ్ముల నీ శిష్యులుగా స్వీకరించి జ్ఞానభిక్షపెట్టు. మా జీవితాలకొక మార్గమున చూపింపుము."— అని యేడ్వ మొదలు పెట్టినారు.

అప్పటికే అచ్చటకు జనులు చేరినారు. బాగా తెల్లవారి పోయినది. "తలవరులారా! వీర్లనిద్దరనూ ఏటికిం గొంపోయి స్నానము చేయించి తీసికొని రండు. గోవిందస్వామీ!— తప్పు చేసిన వారిని దండించుట కంటె క్షమించుటలోనే ఔచిత్య ముండినది. వారికిభోజనాది యేర్పాట్లు చేయుము."— అని చెప్పి తానూ ప్రాతః సంధ్యాది కార్య క్రమముల నిర్వహణ కేగినాడు సిద్ధయ్య.

మరల అందరూ మఠ ప్రాంగణమునకు చేరినారు. సిద్దయ్య తల్లితండ్రులు కూడ చేరినారు. అచ్చాంబి తనస్నేహితురాంద్రతో కూర్చున్నది. కరణంపాపరాజు మొదలైన యితర పెద్దలు కూడ చేరినారు. మఠంలో నిత్యపూజ, ధూపదీప నైవేద్యాలనంతరం అందరికీ సిద్దయ్య ప్రసాదము పంచినాడు.

"సిద్దయ్యా! మా కర్మమింతేనా!"– అని యేడ్చినారు అంధమిత్రులు

"మిత్రులారా! శ్రీవీరబ్రహ్మ గురుదేవుని మనమున ధ్యానించి, క్షమాపణలు చెప్పుకొని, ఇదిగో ఈ ప్రసాదమును తిని, ఈ నీరమును మీ కన్నుల నుంచు కొనుడు."— అని చెప్పినాడు.

వారటుల సేయగనే స్పృహతప్పి పడిపోయిరి.

సిద్దయ్యవారి కనురెప్పలు తెరచి. జలబిందువుల నందుంచినాడు. అటులే వారి నోటలో విభూతివేసి జలమింత పోసినాడు. పది నిముషములలోలేచి కూర్చుని, వారి కంతయూ యథాతథముగ కన్పించుట గాంచి సిద్దయ్య పాదములపై బడి మ్రొక్కి అనేకభంగుల స్తుతించుట ప్రారంభించినారు. "మిత్రులారా! మీరు చేసిన పాపమింకనూ తీరలేదు. మీరు వెంటనే తీర్ధయాత్రలకు బయలుదేరి సాధుసత్పురుషుల సేవించుచు యాత్ర పరిసమాప్తయయిన పిదప తిరిగిరండు."- అని చెప్పినాడు.

"సిద్దయ్యా! నీకన్న సాధు వెవడు? నీకన్న సత్పురుషు డెవరు? మేము నీ పాదముల నిడువము. మేమెక్కడికీ పోము."— అనినారు.

"మీరు నన్ను గురువుగా స్వీకరించ వీలుపడదు. మీరు నాకు సహాధ్యాయులే! మీకూ, నాకూ గురువు ఆవీరగురుడు తప్ప అన్యులులేరు. మీరు చెడుమార్గమున బడి పతితులైనారు. కనుకమీరు కొంత ప్రపంచము తిరిగి రాక తప్పదు."

"అటులైన యిపుడు మమ్ముల నెచటికేగ మందువు"

"ముమ్ముందుగా కందిమల్లాయ పల్లెకుంజని, మాత గోవిందమాంబ పాదములకు ప్రణమిల్లి గురుదేవి యాజ్ఞవడసి, గురుసమాధిని దర్శించి, పూజించి, మీ తప్పుల నొప్పుకొని, పశ్చాత్తాపపడి, మీ యాత్ర దిగ్విజయ మగునట్లుగా ఆశీర్వచనముల బడసి యాత్రను ప్రారంభింపుడు.

అఖండ నామకీర్తులబడసిన తీర్థరాజము ప్రయాగ, గంగా నదుల యందు స్నానముల నాచరించి, కాశీవిశ్వేశ్వరుని సేవించండి. గంగా ద్వారము, దానినే హరిద్వార మందురు. దానియందు స్నాన మాచరింపుడు. అంతర్వాహిని యగు సరస్వతీ

"వరుణానదీ, కుశావర్త, శతద్రుమ, విపాశా, శరావతి. వితస్త, అసిక్ని, మరుద్వృధ, మధుమతి, పయస్వతి, ఘృతవతి నదులలో స్నాన మాచరించిన బ్రహ్మహత్యాది మహాపాతకములు కూడ నశించును. వీటిని దేవనదులని కూడ యందురు.

"చంద్రభాగ, రేవతి, సరయూనది, గోమతీ, వేదిక, కౌశికి, నిత్యజల, మందాకిని, సహస్రవక్ర, పూర్ణానది, పుణ్యనది, అరుణ, బాహుదానదులు పదునారు యోజనముల దూరము నుండియే పవిత్రవంతమై పుణ్యఫలితముల ప్రసాదించును.

"వైరోచని, పుష్కరతీర్థము, ఫల్గుణది, గయాక్షేత్రము, కురుక్షేత్రము మహాపుణ్యదాయకములు. అలకనంద యందు స్నానమాడుట కడుంగడు విశేషము.

"శ్రీశైలము, అనంత పద్మనాభము. రామేశ్వరము, సేతుబంధము, శ్రీరంగము, నైమిశారణ్యము, పురుషోత్తమతీర్థము సేవింపతగినవి. కోటిరుద్రము, నర్మద మహాఫలితముల నొసగును.

"మాతృకేశము, కుబ్జతీర్థము, కోకాముఖి, ప్రసాద తీర్థము, విజయ తీర్థము, చంద్రతీర్థము, గోకర్ణము, శంఖ కర్ణములయందు స్నానము అవశ్యాచరణీయము. అయోధ్య, మధుర, మాయ, కాంచీ పట్టణము, ద్వారక మోక్షదాయకములు. సాల గ్రామము, శబల గ్రామము ముక్తిదాయకములు.

"గోదావరి, భీమేశ్వరము, పంణిరాఖ్యములు, పూర్ణానది, కృష్ణవేణి, తుంగభద్ర, పంపా సరస్సు, హరిహర క్షేత్రము. భీమానది యివన్నియూ మీరు తిరుగ వలసినదే!

"చంద్రభాగ తీరమున వెలసిన పాండురంగ విఠలుడు, మాతులింగము, వారణాసి, పాపవినాశనము, మధ్యపాదము, చక్రతీర్థము, కోటి తీర్థము. పద్మద తీర్థము, కావేరీ సంగమములు, మలాపహా సంగమము, నివృత్తి సంగమము, తుంగ భద్రా నదుల సంగమ.

"పాతాళ గంగయందు స్నానంబులాడి, శ్రీశైల మల్లికార్జునుని సేవింపుడు. కృష్ణాసాగర సంగమము, కావేరి సింధు సంగమము కూడ పవిత్రమైనదే. తామ్ర

వహ్ని కృత మాలానది, పయస్విని నదులయందు స్నానము సేయుడు. శేషాద్రి శిఖరమున నెలకొనియున్న శ్రీ వేంకటేశ్వరస్వామిని, శ్రీ రంగనాధస్వామిని, అనంత పద్మనాభస్వామిని. బృహదీశ్వర లింగమును, చిదంబర స్వామిని, జంబుకేశ్వరుని, కుంభకోణము, కన్యాకుమారి, మత్స్యతీర్థము, పక్షితీర్థము. రామేశ్వరము, ధనుష్కోడి, శబరి పర్వతమందున వెలసి హరిహరతనయుడైన అయ్యవ్వను, పంపానదీ స్నానమును-అత్యంత శుభావహములు.

"కపిల మహాముని ఆశ్రమము, ఋషభాద్రి, కళ్యాణ నగరముల సందర్శింపుడు. అహోబిలము అత్యంత పుణ్యప్రదము. ఇవ్విధముగ మీరు గురునామ స్మరణ సేయుచు, ప్రతి ప్రదేశమునందును గురుదేవుని దివ్యస్వరూపమును మీ మనోనేత్రములతో దర్శింపుచు, గురుపూజలు సేయుచు యాత్రలు పూర్తిచేసుకొని రండు"- అని చెప్పి యితర కార్యక్రమములపై సిద్దయ్య వెడలినాడు.



సిద్ధయోగి ప్రసిద్ధ భారతము :-

-: నలువది తొమ్మిదవ భాగము :-

ఆదెంబి కత్తిపీట ముందు వేసికొని కూరగాయలు తరుగుచున్నది. మాంసాహార మనునది సిద్దయ్య ప్రమేయము వలన దానినేనాడో మానివేసినారు. శుద్ధ సాత్వికాహారమునే గ్రహించుచు, కులవృత్తిని సాగించుకొనుచు, వారునూ సిద్దయ్య అడుగుజాడలలో నడుచుచు, గురునామ స్మరణ సేయుచు, ఆధ్యాత్మిక చింతనతో సుఖముగా కాలము వెళ్ళించుచుండిరి.

37)

"ఆదంబీ!" పీరుసాహెబు వెంబడే కూర్చుని ఆదంబి తరిగిన కూరగాయ ముక్కలను పళ్ళెరములోని కెత్తుతూ

"క్యాహై!"— అన్నది ఆదంబి.

"దేఖో!- సిద్దయ్య బడాహోగయా! యవ్వనమునందు ప్రవేశించినాడు. ఏ వయసున కావయసు ముచ్చట తీరకున్న జీవితమున అనుభవించవలసిన సుఖసౌఖ్యములు దూరము కాగలవు. యోగమహిమచే సిద్దయ్య సాక్షాత్తు శివదేవుని వలే వెలిగి పోవుచున్నాడు. ఆదంబీ! ఎంతటి మహిమాన్వితుడైనను, అర్ధాంగి లేక జీవితము సంపూర్ణము కానేరదు. శివుడు పార్వతిని వివాహమాడెను. విష్ణువు లక్ష్మిని వివాహమాడెను. బ్రహ్మనేపుడు సరస్వతిని వివాహమాడెను. వీరబ్రహ్మ గురుదేవులు గోవిందమాంబను వివాహమాడె గదా! సంతానమును బడసిరి గదా! గుర్వాజ్ఞ కూడా సిద్దయ్యను పరిణయమాడి కుటుంబ జీవనమును సేయమనెగదా! కనుక యింక ఆలస్యము సేయుట పాడిగాదు. మీ భయ్యా ఉన్నాడు గదా! అల్లీఖాన్! అల్లీఖాన్ బేటీ అచ్చాంబి అందముగా నుండును. మరి నీవు చొరవ తీసికొని మీ అన్నయ్యను అడుగగలవా బిడ్డనిమ్మని!"- అనినాడు పీరుసాహెబ్.

ఆదంబి మౌనము వహించినది. పీరుసాహెబు మళ్ళీ చెప్పనారంభించినాడు.

"అదియునుంగాక ఒక్క ఊరనుండువారము. ఒకరికొకరము తోడుగా నుండగలవారము. అచ్చాంబియు సొగసరి. గుణవతి. పూర్వబంధుత్వము. వేరుచోటికి పోనేల? మనకు మాత్రము వేరు ఎవరుండిరి?" అనినాడు పీరుసాహెబు.

ఆదంబి ఆలోచనలో పడినది. సిద్దయ్య వీరగురుని చేరిన నాటినుండి అల్లీఖాను ఆదంబి కుటుంబముపై కినుక వహించి యున్నాడు. వృద్ధుడైనాడు. పలుకుట మానినాడు. ఆయన పెత్తనము లేదు. అంతయూ వదిన కాశింబి పెత్తనము. ఆమె గయ్యాళి. ఏమనునో యేమొ!- అయిన ఆడపెండ్లివారు మొగ పెండ్లి వారి నడుగుట సాంప్రదాయముగానీ, మగపెళ్ళివారము మనము వెళ్ళి పిల్లనిమ్మని అడుగుట-ఔచిత్యముగా నుండునా!" ఆమె ఆలోచన తెగలేదు.

మళ్ళీ పీరుసాహెబు చెప్పుట ప్రారంభము చేసినాడు.

"ఆదంబీ! ఏదియో ఆలోచించుచున్నావు. మనము సామాన్యులమను మాట నిజము. అల్లీఖానుగారు ధనవంతులు. మన కుమారునకు, వారి కొమరిత నిచ్చుటకు యిచ్చగింతురో లేదో!- యని కదా నీ అనుమానము. ఫరవాలేదు ఆదంబీ! కోషిశ్ చేద్దాము. మేనరికం తప్పదని మీ వదినకు నేనే నచ్చచెప్పవలయును."

ఆదంబియు ఆలోచన చేసినది. "అంతయూ గురు కటాక్షము. జరుగవలసిన యోగమున్న జరుగుటన్నది న్యాయము. అందుకైననూ ప్రయత్నము ప్రధానమే గదా! అటులనే వెడలెదను."— అని ఆదంబి ఆలోచించుకొనినది.

....o....

సిద్దయోగి ప్రసిద్ధభారతం :-

ఏబదియవ భాగము

కాళింబి అల్లీఖాను భార్య. ఆదంబికి వదినె. అల్లీఖాను కంటె వయసులో బాగా చిన్నది. అదియునుంగాక ఆమె శరీరసౌష్ఠవం కలిగిన వ్యక్తి. అందునుండి ఆమెలో యింకా వృద్ధాప్యపు ఛాయలు గోచరబడినట్లు కన్పించదు. తెల్లగా, బాగా బలిష్ఠంగా ఉన్న శరీరధారిణి కాళింబి. ఆమె నడుచుచుండిన ఒక చిన్న గున్నయేనుగు నడచినట్లుండును. అయిననూ ఆమె ముఖములోని అందమూ, పెదవుల తీరు, కనుల కదలిక ఆమె సౌందర్యమునకు పెట్టని తొడవులు. తనకన్న సౌందర్యవతి ఆ గ్రామ పరిసరాలలో లేదను గర్వాతిశయమునకు కూడ ఆమె నిర్భయస్థురాలు.

ఆదంబికి ఆమె మనస్తత్వము తెలుసు. కాని అడుగుదామనే తపనతో, అన్న కూతురును తన కోడలిగా చేసుకొనవలెనను తపనతో, ప్రేమతో, ధైర్యమువహించి వచ్చినది. మెల్లగా తలుపు తట్టినది. కాళింబి వచ్చి తలుపు తీసినది.

"ఓహో భాభీ! ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు. దారితప్పి వచ్చితివే? మా అన్న రాడా యెనే! సిద్దయ్య క్షేమమే గదా!"— బాగుగనే పరామర్శించినది కాశింబి. "హే!బేటీ యిదరావ్! దేఖో కౌన్ ఆయా!"— అని కాశింబి కుమార్తె అచ్చాంబిని పిలచినది. అచ్చాంబి లోపలనుండి వచ్చి ఆదంబి పాదములకు నమస్కరించినది. జీతేరహో బేటీ!"— అని దీవించి, అచ్చాంబిని కౌగలించుకొని నుదురు ముద్దాడినది. అచ్చాంబిని వెంట కూర్చుండబెట్టుకొనినది. మెఱుపు తీగవంటి అచ్చాంబి అందమునకు, ఆమె సౌందర్యసోయగములకు, బంగారము కఱగి పోతపోసినటులున్న నిండైనఅచ్చాంబి విగ్రహము ఆదంబిని ఎంతగానో మైమరపించినది. ఆనందపరచినది. "జా!బేటీ జా! థోఁడా ఖానేకో లావ్!" అనినది కాశింబి.

"ఫరవానై భాబీ!"— అని తాను తెచ్చిన పూలను, పండ్లను, మిఠాయిలను తీసి అచ్చాంబి కిచ్చినది ఆదంబి.

"వదినా! మరేమియూ అనుకోవద్దు. ఒక్క విషయము అడుగవలయునని వచ్చితిని. మనమందరము బంధువులము. మాకు మాత్రము మీరుగాక మరెవ రుండిరి! మమ్ములను కనిపెట్టియుండవలసినవారు కూడ మీరే గదా!"— అన్నది ఆదంబి.

"అరే! బోలోభాభీ! క్యా సమాచార్ హై!"— అన్నది కాశింబి.

"కుచ్‌నై భాభీ! మీ కుమార్తె అచ్చాంబిని మా సిద్దయ్యకిచ్చి వివాహము సేయమని అడుగుటకు వచ్చితిని. అచ్చాంబి పుట్టిననాడే నా కోడలని అనుకున్నాము. గుర్తుండియే యుండును. భాభీ! అక్కలికిని నా కొమరునకిచ్చి వివాహము జరిపిన, మణి పొదగిన బంగారు ముక్కెరవలె, యిద్దరూ మీ మా కనులముందే యుందురు. ఏమందువు వదినా!"— అనినది ఆదంబి.

అప్పటికే కాశింబి రోషకషాయిత నేత్రయయినది. కూర్చున్న కాశింబి ఒక్క ఉదుటన పైకిలేచి "ఏమిటి కూసితివి. నా బంగారు బొమ్మను నీ కొడుకున కివ్వవలయునా! నీకు నోరెట్లు వచ్చినది అడుగుటకు ఆదంబీ! ఇప్పుడడిగిన అడిగితివి. ఇక ముందెప్పుడిట్టి ప్రస్తావన తేబోకుము, నీ అంతస్థు ఎక్కడ? మా అంతస్థు ఎడ?"

"ఖాఫీ"— ఆశ్చర్యముతో అనినది ఆదంబి.

"ఖాఫీ! గీఫీ! జాన్తానై. పదిరెండేండ్లపాటు ఆ వీరబ్రహ్మమును పట్టుకు నూగులాడి, ఊరూరా తిరిగి, అడ్డమైన కూళ్ళతిని, తిరిగి వచ్చిన నీ బైరాగి కొడుకు నకు, నా కూతురునీయవలయునా! అసలట్లడుగుటకు నీనోరెట్లు వచ్చినది. అసలు నీకెన్ని గుండెలు? ఎంత ధైర్యం. కితనా హిమ్మత్ హై తుమ్‌కో!"— నిప్పులవర్షం కురిపించినది కాశింబి.

ఆదంబికి నోట మాటరాలేదు

"కష్టనిరంతరుడు, మతభ్రష్టుడు, మాయావి, మంత్రగాడు- అయిన నీ కొడు కునకు నిర్దుష్టపలితమైన పుత్త్రికనెట్లు యిత్తుననుకొంటివి. ఆగర్భదరిద్రునకు ధని కులతో వియ్యమందుట సాధ్యపడునా! పిల్లికి పులికి నేవిధముగా స్నేహము చేకూ రును ఊర పదిమందికి పదివరుపులు కుట్టి యిచ్చి, పదిరూకలు సంపాదించినంత మాత్రమున శ్రీకలితులమైన మమ్ము పిల్లనడుగ నెట్లు చెల్లుబాటగును—మీ సుతుడు మతభ్రష్టుడైనందున మీతో మాకు సంబంధమెట్లు కుదురును. మీ కుమారునకు మా కుమార్తె నిచ్చిన బంధుజనములందరు మమ్ముల నవహేళనము చేయరా! తోటి బందుగులు మమ్ముల కులబహిష్కరణము సేయరా! ఇంకొక్క క్షణమైనను నీవు మా యింట నిలువరాదు. వెంటనే వెడలిపొమ్ము. మంచిగ బయటకు నడువకున్న మెడబెట్టి బయటకు నెట్టవలసి వచ్చును."— అని నిప్పులు గ్రక్కినది కాశింబి.

"గడ్‌బడ్ క్యాహై యిసీసుబోమే!- యితనా పరేశాన్‌కా కారణ్ క్యాహై అజీబేగం!- శాంత్‌హో!- శాంత్‌హో!"— అనుచూ బయటకు వచ్చినాడు అల్లీఖాన్. సోదరి ఆదంబిని చూచి "అరే! బహెన్! తుమ్! కబ్ ఆయే బహెన్! కైసా హై! సిద్దయ్యా అచ్చాహైనా! పీరూ క్యోం నహీఁ ఆయా!"— ఆమె దగ్గరకు వెళ్ళినాడు అల్లీఖాన్.

"అజీ తైరో! ! వాళ్ళ బైరాగి సిద్దయ్యకు మన అచ్చాంబినిచ్చి షాదీ చేయ వలయునట"— ఈసడించినది కాశింబి.

అల్లీఖానుకు పరిస్థితి అర్థమైనది.

"బహెన్! మై క్యాకరూఁ! నేనేమీ చేయలేను. దుర్బల్ హూఁ! కంజోర్ హూఁ! దాని నోటికి బలానికి తట్టుకొని నిలబడలేను నాకు మనసులో యుండినన్నూ, కాళింబిని ఎదిరించి చేసే ధైర్యము, సాహసమూ నాకు లేవు. నన్ను క్షమించు తల్లీ! ముఝే మాఫ్ కరో!"— ఆదంబి చేతులలో ముఖము దాచుకొని తన నిస్సహాయతకు కుమిలి కుమిలి యేడ్చినాడు అలీఖాన్.

"ఠీక్ హై! భయ్యా!"— అని ఆదంబి వెళ్ళబోవుచున్న సమయమున అచ్చాంబి లోనుండి పరుగు పరుగున వచ్చి "అత్తా! నీవు వెళ్ళకు. నేను గూడ నీతోనే వచ్చెదను: నేను సిద్దయ్యబావనే వివాహము చేసికొనెదను. నాకూ యిష్టమే!" అని అత్తను కౌగలించుకొని యేడ్చినది.

అప్పుడు కాళింబి పళ్ళు పటపట కొరుకుచూ, ఆదంబిని ఒక్క నెట్టు నెట్టినది. "కదలవేమే! గానుగెద్దువలె అటులనే నిలువబడి చూచుచుంటివి. ఏమి? ఎవ్వరైన నడ్డువత్తురేమోనని తలంచుచుంటివా! మాయచేసి, మనుషులను మోసపుచ్చి నీ కొడుకు మళాలు కట్టించుకొనుచుంటెను గదే! అది నీకూ అబ్బినదాయేమి? మంత్రాలు వేసి, మాయలు చేసి నా కూతురును లాక్కొని పోవలయునని చూచుచుంటివా?ఛప్పనాతీ!"— అని ఆమె నుండి అచ్చాంబిని బరబరా యివతలకు లాగి కొట్టుచు, లోనికి బలవంతముగా ఈడ్చుకొని పోయినది.

ఆదంబి నిస్సహాయురాలై, అవమానాగ్నిలో నిలువెల్ల దహించుకొని పోవుచుండ, దీనవదనయై ఇల్లు చేరి భర్తకు విషయమంతయు వివరించి వెగిలి వెగిలి యేడ్చినది.

—•—

సిద్ధయోగి ప్రసిద్ధ భారతం :

: ఏబది ఒకటవ భాగం :

అచ్చాంబికి సిద్దయ్యయనిన చెప్పలేని ప్రేమ. అభిమానము, చిన్నతనము నుండియు సిద్దయ్య యంటే ఆమె మనసు లగ్నము చేసియున్నది. అదియుసుంగాక ఆదంచి అనిన అచ్చాంబికి ఎనలేని గౌరవము. అంతటి భక్తియూ నున్నది.

సిద్దయ్య అంతటి పొడుగూ కాదు, పొట్టీగాదు. మధ్యస్థముగా నున్న విగ్రహము. వెలుగు లీను ముఖ మండలము. కాంతులీను కళ్ళు. వెడల్పైన ఛాతి, కోర మీసము. ఇప్పుడిప్పుడే పెరుగుతున్న నల్లని గడ్డము. బంగారు జిగితో వెలుగొందు మేని ఛాయ. విశాలమైన ఫాలభాగము. త్రిపుండ్రములు—వీటన్నిటినీ చూచినపుడు అతడు అప్పుడే యవ్వనమందడు గిడిన సాంబశివుడా యని అనిపించు చుండును. అచ్చాంబి బొట్టు పెట్టుకొని, తను పార్వతినని తలపోసుకొనుచుండును. అసలా సిద్దయ్య రూపమే గొప్ప ఆకర్షణీయము. అతననిన ఆమెలోని అనురాగము అఖండము.

ఇప్పటి ఆలోచనలు ఆమెను ఉక్కిరి బిక్కిరి ఆడనిచ్చుట లేదు. సిద్దయ్య తనను వివాహము చేసికొనిన యట్లు అతని ప్రేమాంకమున తాను శయనించినట్లు, అతను లాలించినట్లు, ప్రేమించినట్లు, దగ్గరగా తీసికొని ముద్దాడినట్లు, హిమాలయ పర్వత ప్రాంతములన్నియు వారు విహరించినట్లు, ఆకాశయానము చేసినట్లు, తాను కిరీటధారియై నట్లు — ఓహ్!— చెప్పలేము ఆమె ఆలోచనలు.

కాని అవన్నియూ బూదిపాలైనవి. తనఅత్త అదంబిపట్ల తనతల్లి ప్రవర్తించినతీరు చాలగర్హనీయము. అమానుషము. సభ్యనాగరికత సమాజమందు ఒక స్త్రీ తనతోటి స్త్రీని ఆ విధముగ దుర్భాషలాడుట, దూరుట, కసరుట, నెట్టుట మానవత్వమునకే ఒకమాయని మచ్చ. తల్లిపై ఆమెకు అసహ్యము, కోపము పెల్లుబికినవి. ఆదంబిపై జాలి, దయ కలిగినవి. "సిద్దయ్యబావ మాఅమ్మ ప్రవర్తన విని ఎంతగా నొచ్చుకొనునో యేమో! అదేసమయమున నన్నేవిధముగ అర్థము చేసికొనునో! దీని కంతటికి కారణము నేనేనని యూహించి నన్ను అపార్థము చేసికొనడు గదా! నన్ను కాదనడుగదా!"— అని చాల బాధపడినది. శోకపరితప్తి హృదయంతో కృంగిపోయినది.

"సిద్ధయ్య పురుషోత్తముడు. వీరబ్రహ్మగురు పాదసేవచేసి పునీతుడైన పుణ్యపురుషుడు, పవిత్రుడు, మహామహితాత్ముడు, మహోన్నతుడు. తప్తకాంచన సన్నిభుడై సువర్ణకాంతులు వెదజల్లుచున్న దివ్య మంగళ విగ్రహుడు, యోగి. ఆత్మానాత్మ వివేకజ్ఞానము కలిగిన విజ్ఞాని. అతనే నా జీవిత భాగస్వామి, అటువంటి దివ్యపురుషుని, ఉత్తముని, భక్తునికి భార్యగా బ్రతుకుట కన్న ఏ స్త్రీకైననూ వేరు భాగ్యమేమున్నది.

"సతత గురునామ స్మరణచేయుచు, గురుపాదుకా పూజలందు, ధ్యానము నందు నిమగ్నమైయుండి, నిత్యము గురుపురాణమును, గురువాక్యములను ప్రబోధము చేయు ఆ అమృతమూర్తి వాక్కులు వినలేని శ్రీనిభంబులగు నా వీనులేల? అటువంటి మహితకరుని కర్ధాంగిని గాకున్న నా సతీజన్మమేల? అట్టి దివ్య సుందర విగ్రహుని భామమునందు భాసిలకున్న మిసిమించి వెల్గు నాదేహమేల? కళానిధి యనంబగు ఆసిద్ధమూర్తి మోము వీక్షింప జాలని నా నయనమ్ములేల? దివ్యమనసు కల్గిన దివ్యతేజః స్వరూపుడైన సిద్ధయ్య పదయుగళిపట్టి నే సేవింపకున్న నాయీ కరపద్మ ప్రయోజనమేల?

"ఎట్లు నేను నామనోహరుని, చిత్తచోరుని, ప్రేమికుని చేరగలను? నా మనంబతనికి ఎరిగించుటెట్లు? నా నిర్ణయ మతనికి తెలియ బఱచుటెట్లు? నా విన్నపంబతడు మన్నించునా? నన్ను పెండ్లియాడునా? మదభీష్టములెల్ల దీర్చునా !"— అని తనలో తను విరహవేదన ననుభవించుచున్నది అచ్చాంబి.

ఎంత శాంతి వహించి యుండదమన్నను మనసు ఊరుకొనుటలేదు. చెట్ల నీడలకు చేరినది. కాని యాశీతల పవనము లామెకు ఓదార్పు కల్పించ లేక పోయినవి. ఎంత ఆలోచనము చేసినను మార్గమరయ లేకున్నది. అట్లు చింతించుచు, ఒక చూతము నీడన పవ్వళించి చూతమనుచు మదిలో తలచి అటుగా అడుగులు వేసినది.

ఇంతలో చెట్లపై చిలుకలు అరచుట విన్పించినది.

చిలుక పలుకలు అందముగానుండును. ఆనందము గానుండును. చెట్లకున్న చిన్నచిన్న మధుర ఫలముల కొఱికి తినుచూ క్రిందపడవైచుచున్నవి.

"చిలుకా! నేను చిలుకల కొలికిని. నన్నట్లు చూచెదవేల? నను జూచి మధుర ఫలముల కొఱకి క్రిందకేల విడతువు. నీకంఠమునుండి శ్రావ్యమైన సంగీత ధ్వను లకు బదులు కఠినోక్తులు వెల్వడుచుండె నట్లున్నది. నీకిది తగునా? నన్ను జూచి జాలిపడవలయునుగానీ!— అట్లేల కొఱకొఱ చూచెదవు. అందులకే జనులు నిన్ను బంధించి పంజరమున పెట్టెదరు."— అని చిలుక ద్వేషమును వ్యక్తపరచుచు, రకరకములైన ఆలోచనా తరంగములు ముసురు కొనగ వాటి నుండి తప్పుకొన లేక మోకాళ్ళపై తలనుంచి, ప్రక్కనున్న గడ్డి మొక్కల పీకుచూ, మునిపళ్ళతో కొఱకుచూ, కూర్చుని ఆలోచనా ప్రపంచములోనికి జారిపోయినది.

ఇంతలో అస్తమానమైనది. సూర్యుడు పశ్చిమాద్రికి చేరినాడు. చందమామ పెద్ద పెద్ద అంగలు వేయుచూ పైకొచ్చిన మనిషిలా కొండపైకి చేరినాడు. అసలే విరహతాపమున క్రుగ్గుచున్న అమచ్చెకంతి చందమామ చల్లని కాంతుల సునిశిత స్పర్శము సహితము సహించు స్థితిలో లేదు.

"చంద్రా! నీకునూ నాపై దయ సన్నగిల్లెనా! సూదుల వంటి నీ అమృత కిరణములతో నన్నేల యిట్లు తీయగా గ్రుచ్చిగ్రుచ్చి చంపెదవు. ఏల నన్నట్లు విరహవేదనా పీడితురాలను చేసి సంతసించెదవు. శీతకిరణుడవు నీవు. నాకేల యిట్లు వేడిని కల్పింతువు. విరహిణుల నిట్లు వేధించుటవలన కాబోలు పరమేశ్వరుడు ప్రతీ దినమూ నీ కరముల తఱుగు చుండును. ఆపరమేశ్వరుడటు సేయకున్న నాబోటి చెలులు ధరణి మనగలరా! చాంద్రమా! విరహిణులనిట్లు హాయిహాయిగాతీయగా [illegible] చెలియా చెలియా!"— అని అచ్చింబ [illegible] [illegible]వాదపడినది.

ఇంతలో ఆలోచనములన్నియు వరసిద్ధుని [illegible]కి మరలినవి. బా[illegible] [illegible]హారంబున కసలు రాడుకాబోలు గతమంతయు ననూ చెప్పుడూ వచ్చెడివాడు కాడు. [illegible] [illegible] [illegible]

[illegible]

తెలియుటెట్లు ?"— అని పరిపరి విధముల ఆలోచనము సేయగ, ఇంతలో ఒక స్నేహితురాలటు రాగ ఆమెతో కలసి ఇంటికింజనినది.

నాటిరాత్రి గ్రామదేవాలయమునందు హరికథా కాలక్షేపముండుటచే జేసి అందరూ అచ్చటి కేతెంచుచుండిరి. అచ్చాంబియు తన స్నేహితురాండ్రతో కలసి అచ్చటి కేగినది. "అచ్చటికి సిద్దయ్యకూడ వచ్చును. కనుక సిద్దయ్యను చూడ వచ్చును. అవకాశ ముండిన మాటలాడవచ్చును. బావయేకదా! పరాయివాడు కాదు గదా!"— అనుకొనుచు హరికథకు బయలు దేరెను.

అప్పటికే కథ ప్రారంభమైనది.

రుక్మిణీ కళ్యాణ కథ బహురసవత్తరముగ సాగుచున్నది. రుక్మిణియు కృష్ణుని కొఱకు విరహవేదనతో నుండినది. రహస్యముగ నొక బ్రాహ్మణుని ద్వారక పంపుచుట్టమును వినుట తోడనే తనకునూ ఆలోచన కలిగినది. తన స్నేహితురాలి నొకదానిని సిద్దయ్య యొద్దకు రాయబార మంపుటెంతయో యుచితముగా తోచినది.

సరళ యను స్నేహితురాలిని చేరబిల్చి తన బాధనంతయూ వెళ్ళబోసుకొనినది అచ్చాంబి. "అయిన యిప్పుడు నన్నేమి చేయమందువు" అనినది సరళ.

"సరళా! నీ వెటులైనను మా బావను కలిసి నా బాధ నంతయు అతని కెఱింగింప వలయును. మీ అమ్మ వచ్చి వెళ్ళినప్పటి నుండియు, మీ మఱదలు పచ్చి గంగ ముట్టుట లేదు. పవలు, రేలు నిద్రలేక, రాక బావా బావా యని నిన్నే స్మరించు చున్నది. విరహతాపము భరింపజాలక 'ఏమగునో'యని ఒకటే కృంగిపోవుచున్నది. కుందుచున్నది కృశించుచున్నది. నీవు గనుక అచ్చాంబిని వివాహమాడకున్న ఆమె జీవంబులతో నుండుట అసంభవము. ఎటులైన సరియే! వచ్చి ఒకసారి పలుకరించి, వివాహమాడుదునని మాట యిచ్చి వెళ్ళుము. పదివేల నమస్కారములని చెప్పుము.

"సరళా! నీ నేర్పును, ఓర్పును, ఉపయోగించి నా బాధనాతని కర్థమగునట్లు చెప్పుము. ఆ బాధ్యతంతయూ నీకే వదలుచున్నాను. ఎటుల చేసెదవో యేమో! ఇది కొంత ధైర్యసాహసముతో కూడికొనిన వ్యవహారమే అయిననూ తప్పదు. శుభవార్తతో తిరిగిరమ్మ."—అని సరళను ఒప్పించి అచ్చాంబి తన విరహతాప సందేశమును పంపినది.

సరళను పంపినదే గాని మరల అందులో అనుమానము, బాధ, బావ సాంప్రదాయబద్ధ జీవనము చేయువాడు గాని యిటువంటి రాయబారములకు, ప్రేమలకు

అతీతుడేమొ! బావ ప్రేమ స్వరూపుడే గాని మోహిగాడు. నేను వసు. బాధ ఆయన కుండదు. నా మాటలు తప్పుగా భావించవద్దు కదా! అయిన నేనేల యిట్లు వికల మనస్కురాలనగుచుంటిని. బావ నన్ను సరిగా అర్థము చేసికొనునా! లేక అపార్థము చేసికొని ఈ విషయమునేమైన గోరంతలు కొండంతలు చేయునా! అటులే జరిగిన ఈ జన్మమిక వృథాయే యగును."— అని ఆలోచనలతో, ఎపుడు నిద్రించినదో తనకే తెలియదు.

o....o

సిద్ధయోగి ప్రసిద్ధభారతం :-

-: ఏబది రెండవ భాగం :-

నాడు సిద్దయ్య ఒక్కడే పూజా గృహమందు కూర్చొని ఉండెను. ప్రశాంత వదనుడై యుండెను. అదే అదను కనిపెట్టి సరళాకుమారి లోనికి ప్రవేశించి సిద్దయ్య స్వాములకు వందన సమర్పణ చేసి నిల్చుండినది.

"ఓహో! సరళాకుమారియా! చాల దినములకు కన్పించితివి. కుశలమా! ఏమిటి విశేషము."— అనినాడు సిద్దయ్య.

సరళ : గుర్తించగలిగితిరే. కాలగతిలో మరచితిరేమొనని యనుకొంటిని. గుర్తించ జాలరేమొనని ఒకింత కంగారుపడితిని. ఎటులైన పాతమిత్రుల నింతగా గుర్తించగల్గుటయూ మా అదృష్టమే. అన్నా! మీతో ఒక ముఖ్య విషయము మాటాడ వచ్చితిని. అనుమతింతురా?

సిద్ద : ఇందున అనుమతించుట కేమున్నది సరళా! చెప్పుము. సందేహమెందులకు

నేనేమియూ పరాయివాడను కాను కదా!

సరళ : అన్నా! మీ మరదలు అచ్చాంబి విషయమై, వయసునకు చిన్నదాననైనను, పెద్ద విషయమునే భుజమున పైచికొని వచ్చితిని. నీవు శాంతమూర్తివి, ప్రశాంత మూర్తివి, సిద్ధమూర్తివి, ప్రసిద్ధమూర్తివి, ప్రేమమూర్తివి. అర్థము చేసుకొనెదవనీ, అనర్థమునడ్డగించగల శక్తిమంతుడవనీ నీముందు ఈ ఆలాపన. దీనాలాపన.

సిద్ధ : అదేమిటి సరళా! అంతగా కృంగిపోయి మాటాడెదవేల? విషయమేమిటో సవిస్తరముగా చెప్పుము. అంతయూ గురుదేవుని కరుణ. చెప్పుము.

సరళ : అచ్చాంబి నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమించుచున్నది. నీవులేక ఒక్క క్షణ మైనను నిలువలేని స్థితికి వచ్చినది. నిన్ను తప్ప అన్యులనొల్లనని భీష్మించు కొని కూర్చుండినది. నీవు తప్పక ఆమెను వివాహమాడవలయును. లేకున్న ఆమె ఏమైపోవునో తెలియదు.

సిద్దయ్య ఆలోచనలో పడినాడు. అటునిటు పచార్లుచేయ ప్రారంభించినాడు. తెల్లని వస్త్రాలలో ఆయన రజతాద్రివాసుడైన రుద్రమూర్తిలా వెలిగిపోవు చుండెను. మరల సరళాకుమారియే మాటలాడ ప్రారంభించినది. సిద్దయ్య భీకర విగ్రహము నొకసారి తలదించికొనినను అతను ప్రేమమూర్తి గనుక తాను భయపడుట అనవసరమని ఊహించినది.

సరళ : మరణించినట్టివానిని కరుణించి మనిచినట్టి ఘనుడవు. మరణింపదలచిన ఈ తరుణీమణిని మనుపుట నీకొక లెక్కయా అన్నా! తాపసశ్రేష్ఠుడవు, దయామయుడవు. మనసెరుగుట నీకు లెక్కలోనిది కాదు—నాడు మీ తల్లి వచ్చి మీ యిద్దరి వివాహ విషయము మాటాడినదిమొదలు, నాటి దుర్ఘటన తలచు కొని కుమిలి కుమిలి యేడ్చుచున్నది. అన్నము తినదు. నీరు త్రావదు. ప్రాయోపవేశము చేయుటకు సిద్ధపడుచున్నదా! యనినట్లున్నది. కనుకు తీయదు. అహర్నిశలు బావా! బావా! యని నిన్నే స్మరించుచున్నది. కలవ రించుచున్నది. పలవరించుచున్నది. మీ అనుబంధమీనాటిది కాదుగదా అన్నా! చిన్నతనము నుండి నీపైననే మనసు పెట్టుకొని జీవించుచున్న మగువ అచ్చాంబి. నీపై తానేర్పరచుకొనిన తమినోపజాలక చెందమంతెంతయో

కుందుచున్నది. 'మా బావ ఎప్పుడు వచ్చును. ఎప్పుడు నను చేపట్టును'-
యని ఒకటే నిరీక్షణ. ఒక్కొక్కసారి ఉలికిపడుచున్నది. నిట్టూర్చుచున్నది
ఎంత పిలచిననూ పలుకదు. సుంతయేని కనులు విప్పిచూడదు. కను
అన్నా!— నీవు వచ్చి చూచి, పలుకరించి, ప్రేమ వచనములు చెప్పి, ఓద
ర్చిన గాని ఆమె కోలుకొనదు— తల్లి, తండ్రి, స్నేహితురాండ్రమై
మేము ఎంతసేపు చెప్పిననూ, ఎంత ఒత్తిడి చేసిననూ, బుజ్జగించిననూ
ఒక్క మెతుకు గూడ తినుటలేదు. ఎవరు పిల్చిననూ ఒకటే యేడుపు. మా
మాటికి అటునిటు చూచును. బావా! యని రోదించును. సిద్ధయ్యన్నా! పూ
మహనీయులు. మీ అత్తగారు పరమ గయ్యాళి. కన్నకూతురు మనసు తెలి
కొనలేక కాఠిన్యమును ప్రదర్శించుచున్న కఠినురాలు. ఒట్టి పాషా
హృదయ. ఆమెకు పట్టుదల, పంతము ఎక్కువ. ధనమదమామెకు దంచె
సున్నది. ఆ సంగతి మీకుగూడ తెలుసును. అన్నా! ఆమెతో తగవులాడు
కేరికినీ ఓపిక లేదు. ధైర్యమునూ లేదు. ఆమె నెదిరించు మగవాడే గ్రా
మున లేడు. మీరెట్లు చేతురో యేమో!- అది మీ యిష్టము. మహా
ఆమె మనసును మార్చెదరో!- మాటలతో మార్చెదరో!- మీ యిష్ట
మీరు మాత్రము అచ్చాంబి నెట్టిపరిస్థితులలోనైననూ వివాహము చేసికొ
తీరవలయును. ఇటుల అంటున్నందులకు అన్యథా తలంచవలదన్నా!
తోబుట్టువుగా భావించి నా హితవు పాలించమనే నా ప్రార్థన. అన్న
అంతయూ నేనే చెప్పుచుంటిని. నన్ను మరో విధముగ భావించకుము. ఆ
సర మటువంటిది గనుక, మనసులో ఉన్న ప్రతిమాటా ఉన్నదున్నయ
నీ మ్రోల క్రుమ్మరించిన, తగురీతి స్పందించి, కాగల కార్యమును జరిపిం
గలవని, కథను సుఖాంతము చేయుదువను తపనతో, ఆర్తితో, ఆశ
పలుకుచుంటిని తప్ప అన్యము గాదు.

సిద్ధ : ఫరవాలేదులే చెప్పుము.

సరళ : ఇంకేమి చెప్పమందువు. చెప్పవలసినదంతయూ చెప్పితిని. అయిన మరొక
విశేషము. నీవిటీవల అచ్చాంబిని చూచితివో లేదోగాని, అయన్నుల మి
చిన్నెలుగల వన్నెలాడి. నీకేదగును. నెలను హసించునెమ్మొగము. నిర్మల

నెన్నొసలు నీటుగ భాసించుచున్నవి. వేల్పు కన్నెలు హసించు రూపము. ఆమెయొక సౌందర్యరాశి. బంగారుబొమ్మ. ఒప్పులకుప్ప. అచ్చాంబి పాల భాగమునకు సరిగావలెనని సృష్టికర్త క్రొన్నెలను మొదట సృజించి కుదరక చెడగొట్టుచూ చేయచుండెనా యనినట్లు క్రొన్నెలలో మార్పులు కన్పించు చున్నవి. అంతటి అందాల సుందరి అచ్చాంబి, యింకా చెప్పమందువా!

సిద్ధ : సరళా! అమ్మ పుట్టిల్లు మేనమామ దగ్గర వర్ణించినట్లు అచ్చాంబిని గురించి నీ వింతగా వర్ణించి చెప్పుట వింతగానే యున్నది. సరళా! మంచి రాయబారమే తెచ్చితివి. జాణవు సుమా! సోదరీ! నీమాటలన్నియూ వింటిని. అచ్చాంబి అందచందమూ వింటిని. అన్నింటినీ మించి సరళా! మానవునకు కావలసినది సౌశీల్యము. అంతఃసౌందర్యము. ఆత్మనివేదనము. చర్మ సౌందర్యము శాశ్వతము కాదు. ప్రతి గుడిలోనూ ఒక దివ్యజ్యోతి వెలుగుతూ ఉంటుంది. మన దేహమే ఒక దేవాలయం. ఆ దేవాలయంలో అత్యంత సౌందర్యవంతుడైన పరమాత్ముడు వెలుగుతూ ఉంటాడు. ఆ సౌందర్యమును గాంచవలె. ఆరాధించవలె. బాహ్యసౌందర్యము వలన ప్రయోజనము శూన్యము. సరియే!— నేనిపుడు అచటకు వచ్చిన- మా అత్తయు మామయు వైరభ్యము ప్రకటించుటయేగాక గందరగోళము సృష్టించి వీథిన పడుదురు. అది ఎవరికినీ మంచిది గాదు. అందువలన నేను వచ్చి పలుకరించుట, పరామర్శించుట ప్రస్తుత సమయమునకు సరిపోదు. భయపడవలదని నా మాటగా చెప్పుము. జరుగవలసినది జరిగియే తీరును. అత్తమామలు నిమిత్తమాత్రులు. నిర్ణయము గురుదేవులది. దానికి తిరుగు లేదు. మా అత్తయు, మామయు-వారే స్వయముగ వచ్చి, నన్ను బ్రతిమిలాడి తోడ్కొని పోయి, అచ్చాంబి నిచ్చి వివాహము సేతురు. ఇది తథ్యము జరిగి తీరును. ఎటువంటి అనుమానమునకు గానీ, అపోహకు గానీ అవకాశము లేదు. ధైర్యముగా నుండమని చెప్పుము. వ్యామోహము కంటె భక్తి, ప్రేమలు పెంచుకొనమని చెప్పుము. వ్యామోహము సర్వవిధముల అనర్థదాయకము.

అని చెప్పగా సరళాకుమారి సిద్ధయ్యకు నమస్కరించి వెళ్ళిపోయినది.

—/o/—

సిద్ధయోగి ప్రసిద్ధ భారతం :

: ఏబది మూడవ భాగం :

రాయబార మందిరంచి తిరిగివచ్చిన సరళాకుమారిని చూచి అచ్చాంబి అమితా నంద పరవశురాలై ఒక్కసారిగా ఎగిరి ఆమెను కౌగలించుకొని ముఖమంతయూ ముద్దులతో నింపినది. స్నేహితురాండ్రందరు చుట్టూ చేరినారు.

“అరెరే! ఓక్యాహై! అచ్చాంబీ! నేనెవరనుకున్నావు. సిద్ధయ్యను కాదు సుమా! సరళాకుమారిని.”— అన్నది సరళ.

అందరూ పకపక నవ్వినారు.

“అది సరేలే! నీ ముఖావలోకన మాత్రమున నీ ముఖ మండలము ప్రసా రము సేయు హాస దరహాస చంద్రికలే నాయీ ఆనందమునకు కారణము. విజయము మనదే అని నా మనసు ఘోషించుచున్నది. నీ ముఖము వలన వింటే గదా! నా కత్యంత ప్రీతి, ఆనందమును. ఆఁ! ఇప్పుడు సెప్పుము. మా బావ యేమనెను. నన్ను చేసికొందునని చెప్పినాడా! ఎన్ని యిబ్బందు లొచ్చిననూ, కష్టము లొచ్చిననూ, నన్ను విడువనని చెప్పెనా?” అని ప్రశ్నమీద ప్రశ్న కురిపించే అచ్చాంబి ఆరాటమును చూచి ఆమె ఎంత గాఢముగా, దృఢముగ, తీవ్రముగ సిద్దయ్యను ప్రేమించుచున్నదో, వాంఛించుచున్నదో చూచినవారికెవరికైనను తెలియును.

“అచ్చాంబీ! నీ భాగ్యమును నేనేమని వర్ణనసేతును. అతడే నన్ను గుర్తించి నాడు! పాత పరిచయమును గుర్తుచేసి సరళాకుమారిని గదూ!- యని అడిగినాడు.”

“అబ్బ! అంతగా గుర్తించెనా!”

“ఆఁ! మరేమనుకుంటివి.”

“ఆఁ! తరువాత విశేషము సెప్పుము. త్వరగా చెప్పు. అబ్బా! ఆలస్యం చేయకే సరళా!”

“తొందరపడకే పిచిమొద్దా! నీవు చెప్పమన్న మాటలన్నియూ సెప్పితిని. అన్నిటిని ఎంతో శ్రద్ధగా ఆలకించినాడు. నన్నెంతయో గౌరవముగా చూచినాడు. ఒంటరిగనే మాటలాడితిని. చేతిలో చెయ్యివేసి మరీ చెప్పినాడు”

“ఒంటరిగనే మాటలాడితివా! చేతిలో చెయ్యివేసి చెప్పెనా! అయిన....”— మరియొక స్నేహితురాలేదియో అనబోవుచుండ.

"తప్పు. తప్పు. అటుల అనకుడు. అతడు స్వామి. మామూలు మనుష్యులతో పోల్చదగినవాడు కాదు. అన్యార్థములు ధ్వనించు రసోక్తులు ఆయనపట్ల పలుకరాదు"— అనినది మరియొక చెలి.

"మూడు రోజులలో ప్రేయసి రత్నమును జేరి పెండ్లియాడి తోడ్కొని పోగలను. శంకవలదు. ధైర్యముతో నుండుడు"- అని చెప్పినాడు. అనినది సరళ.

"మూడు దినమ్ములా! నావల్ల కాదు"- అని మూర్ఛబోయినది అచ్చాంబి. కాశింబి పరుగు పరుగున వచ్చి 'అయ్యయ్యో ఇప్పుడేమి సేయుట. అరె అల్లా!' అని "చూడండమ్మా! అమ్మాయికి ఏదైననూ మంచి ఔషద మిప్పించవలయును"- అనినది కాశింబి.

"హాఁ! గీదీ! తప్పక యిప్పించవలయును. మకరధ్వజ రసాయన సేవనము గానీ, పూర్ణచంద్రోదయ సేవనము గానీ ఈయవలయును. లేకున్న ఈ రోగము కుదరదు. మలయ పవనము సోకిననూ ఉలికిపడుచున్నది. మాటిమాటికి నిట్టూర్చుచున్నది. పోనీ భిషగ్వరుని పిలిపించి వాతధ్వంసినీ లేహ్యమిప్పించిన ఎట్లుండునో!" అని ఒక చెలి సూచన.

"పిచ్చివారలారా! ఏమి మాటలాడుచుంటిరి. మీ బుద్ధికి తోచిన ఔషధములేవి పోసిననూ ఈ చెలికి ఈ వ్యాధి తగ్గదు. దీనికి సరియైనమందు 'సిద్ధౌషదము' తప్ప మరేమియూ పనిచేయదు." అనినది సరళాకుమారి.

"సిద్ధౌష[illegible]!"- అ[illegible]నది కా[illegible]బి.

సిద్ధ[illegible] మాట [illegible]గానే అ[illegible] [illegible] తెరచి అటు[illegible] [illegible] మూస[illegible]కొనినది.

కా[illegible] సరళాకుమారిని ప్రక్కకు బిల్చి "బేటీ సిద్ధౌష[illegible] [illegible] నీ మాటలవల్ల యేదియో తి[illegible] నుండినట్లుగా తోచుచున్నది. శ్లేషార్థమును [illegible]గించుచుం[illegible]. అంత మాత్రము బుద్ధియు [illegible] దాచుచుంటివి. అమ్మాయికి అనుంగు నెచ్చెలివి. మదనకామరాజు లేహ్యము, మకరధ్వజాది వం[illegible]ల మా[illegible]లు వింటినిగాని "సిద్ధౌషధము"ను గూర్చి నేనింతవరకూ వినలేదు. [illegible] విషయమేమిటో [illegible]"- అనినది కాశింబి.

"మాజీ! శంకను వీడి వినుము. పెద్ద మనసుతో అర్థము చేసి కొనుము. నీవునూ ఆడదానివే గదా! పట్టుదలలు, పంతము లన్నివేళలా పనికిరావు. సమయా సమయములను బట్టి పట్టు విడుపులు అనుసరించవలయును. మొండి పట్టుదలలు, పంతములు, ప్రాణములు తీయును గానీ, ప్రాణముల పోయజాలవు. బిడ్డల బాగును గూర్చి ఆలోచించవలసినది కన్నతల్లిదండ్రులే గాని అన్యులుగాదు. తల్లివైన నీవు నీ బిడ్డ మనసు నీ పాటికి ఎఱింగియే యుందువు. పెద్దవారి పట్టుదలలకు పిల్లలను బలిసేయుట క్షంతవ్యము గాదు. భగవంతుడు కూడా మెచ్చడు."–సరళ.

"అసలు సంగతి చెప్పవేటీ!"—కాళింది.

"అదే చెబుతున్నాను మాజీ! అచ్చాంబి సిద్దయ్యను గాఢముగా ప్రేమించి నది. అంతగా యింతగా అని చెప్పలేము. ఎంతగానో ప్రేమించినది. ఆమె అనుకొనినట్లు సిద్దయ్యతో ఆమె వివాహము గనుక జరుగకపోయిన ఆమె మరణిం చుటకైన సిద్ధముగా నున్నది. కాని అన్యపురుషుని మాత్రమెట్టి పరిస్థితులలోనై ననూ అంగీకరించదు. మీ యొక్క కఠినపు ప్రవర్తన వలన అచ్చాంబి మనసు తీవ్రముగా గాయపడినది. అది ఒక సిద్దయ్య తప్ప అన్యులు మాన్పలేరు! 'సిద్దౌషధ' మనిన అదియే గాని వేరుగాదు. అంతకన్న వేరు మార్గములేదు. నీవు నిజముగ నీ కుమార్తె యోగక్షేమములు కోరినదానవైన, ఆమె సజీవురాలుగా నుండి, పది కాలములపాటు పిల్లా, జెల్లలతో పాటు సంతోషముగా జీవించవలయునన్న మీరీ పెండ్లికొప్పుకొని తీరవలయును. తరువాత మీ యిష్టము."—అని చెప్పి సరళ ప్రక్కకు తప్పుకొనినది.

కాళిందిలో ఆలోచన ప్రారంభమైనది. హృదయ కవాటము మెల్లమెల్లగా తెరచుకొనుట కారంభమైనది. తన మూర్ఖత్వము వలన తన కూతురు ఎంతటి దుస్థితికి దిగజారినదో అర్థము కాజొచ్చినది. కాని దళసరిగా పేరుకొని పోయిన అహంకారపు పొరలు యింకా కలుగడం ప్రారంభం కాలేదు.

'అమ్మా! అచ్చాంబీ!" - అని అచ్చాంబిని గుండె కొన్పుకొని తలనిమురుతూ దుఃఖించినది. "మాఁ!" అని తల్లి గుండెలో తలదాచుకొని రోదించినది అచ్చాంబి.

"దిగులుపడకు. నీ మనసు నా కర్థమైనది. భయపడకు. అమ్మా! నిన్నొక ప్రజల నేలు ప్రభువు చేతిలో బెట్టి, మహారాణిగా చూడాలని, ధనవంతురాలిగా, దర్జాగా జీవించుచుండిన చూడవలయునని ఆరాటపడుట, ఆశించుట కన్నతల్లిగా నా తప్పా! -తల్లీ!

'సిద్దయ్య మతభ్రష్టుడు, బీదవాడు, దేశదిమ్మరి అటువంటి వానిని కోరుకొను చుంటివి. ఆలోచించుకొనుము. నీకు అతనే కావలయుననిన, అతనితో నీవునూ బైరాగి జీవితము జీవించవలయునని యనుకొనిన, అతని వలనే విభూతి రుద్రాక్షలు ధరించి, సన్యాసిలా ఊరేగవలయుననిన అటులనే కానిమ్ము. గర్భదరిద్రుని కట్టుకొని దరిద్ర బాధతో నీవు తల్లడిల్లి పోదలచిన నేను మాత్రమేమి చేయగలను! నీ కర్మ మెట్లుండెనో అటులనే జరుగును"-అనినది కాళింది.

"చాలు! నీవింక మాట్లాడకు. నీ దృష్టి ఎప్పుడూ డబ్బు మీదనే. డబ్బు తప్ప నీకు వేరు ఆలోచనము లేదు. శ్రీమంతుడైతే చాలు శీలరహితుడైననూ ఫరవాలేదు. సిరిగల్లవాడైన చాలును. వాడు తిరుగుబోతైననూ ఫరవాలేదు.

"అమ్మా! మనభాగ్యమెంత? మనసిరి సంపదలెంత? ఆ మహానుభావుడైన సిద్దయోగి సంపాదించిన అపారమైన యశస్సు, కీర్తి యివన్నీ ఈ ధనపు రాసుల ముందు నీ కగుపించుట లేదు కదూ! ఆ పుణ్యపురుషుని చరిత్రము వినియూ నీ మనసు కరుగకున్నది. నీ ధనముతో నీవు ఒక చచ్చినవానిని బ్రతికించగలవా? రెండు సింహములను సృష్టించగలవా? ఎందుకమ్మా!- డబ్బు, డబ్బు, డబ్బు యని డబ్బు తోడనే చావనున్నట్లు పలికెదవు. నీవు మరణించునపుడు ఎంత డబ్బుమూట గట్టుకొని పోయెదవో చూచెదములే....

-కడప నవాబు చెంగట రాతికి నమస్కరించి ఖండఖండములు చేసిన ఘనుడు మాబావ. తనను దోచుకొనవచ్చిన తలవరులను శిష్యులగా మార్చుకొన్న మానవతావాది మాబావ. సర్పకాటుకు బలై ప్రాణములు కోల్పోయిన తిమ్మారెడ్డిని సజీవునిగా చేసిన పుణ్య పురుషుడు సిద్దయ్యబావ. అడవిలో పులినోట బడ్డ గోవత్సమును యిక్కడనే యుండి కాపాడిన కరుణామయుడు మాబావ. అతనిని నోటి కొచ్చినట్లు దూషించి మరికొంత పాపమును మూట గట్టుకొనకుము. అసలట్లు పలుక

నీకు నోరెట్లు వచ్చినది. నీది నాలుకయా లేక తాటి పట్టెయా।"—యని అచ్చాంబి ఆగ్రహమును వెడల గ్రక్కినది.

ఆమె అరపులకు తండ్రి అల్లీఖానుగూడ వచ్చినాడు.

"బేటీ! మేరాబాత్ సునో!" - తండ్రి.

"నహిఁ! నహి! మైనహఁ సునేగీ!" - అచ్చాంబి.

"అరె అల్లా! మైఁక్యాఁ కరూఁ!" - తండ్రి.

"అమ్మా! ఆఖరుగా మీకు చెప్పుచున్నాను. వినుడు, మీరట్లు వృథా ప్రసంగములు చేసి నా మనసు మార్చుటకు ప్రయత్నములు చేయవద్దు. దానివలన ప్రయోజనము శూన్యము. నన్ను బావకిచ్చి వివాహము సేతురా సరి! లేదా! మీరు నా శవమును మాత్రమే చూచెదరు. అప్పుడు బాబుకో, నవాబుకో మీ యిష్టమొచ్చిన వానికిచ్చి చేసికొనుడు."—అని గబాగబా వెళ్ళి తలుపులు బిగించి కొనినది.

.... [o] ....

సిద్ధయోగి ప్రసిద్ధ భారతం

## ఏబదినొల్గవ భాగం

"బేగం!— నేను మొదటనే చెబితిని. నీవు మొండి తనము వహించి, మూర్ఖత్వముతో అమ్మాయి మనసు బాధపెడితివి. దేనికైననూ, పట్టు విడుపు ఉండవలయునుగాని, పట్టినపట్టు విడువకుండుట అన్ని విషయములందునూ పనికిరాదు. ఇప్పుడేమి సేయుదము,"— అని అల్లీఖాను వాపోవుట మొదలిడినాడు.

కాళింది యేడ్పు లంఘించుకొనినది.

"కామోష్ ! రోనేతో క్యాఫాయిదాహై ! బిడ్డను రక్షించుకొనవలయును గాని, యేడ్పు ప్రయోజనములేదు. బేటీని బ్రతిమలాడుకో ! సిద్ధయ్యకే యిచ్చి షాదీ చేయుదమని బేటీకి చెప్పు."— అనినాడు అల్లీఖాన్.

కాళిందీకి తప్పలేదు.

"బేటీ! అచ్చాంబీ ! నీ మనసు తెలిసికొనలేక అట్లు మూర్ఖముగా ప్రవర్తించి నాము. నిన్ను సిద్ధయ్యకే యిచ్చి షాదీ చేయుదము. తలుపులు తెరువుము. భోజనమునకు రమ్ము ! అవో! బేటీ ! దర్వాజా ఖోలో!" — అని బ్రతిమిలాట సాగించినది కాళింది.

"మాజీ! నీ మాటమీద నాకు నమ్మకములేదు. నీవు మూర్ఖురాలివి. నీకు దబ్బేలోకం. మనసు ప్రధానముగాదు. నీవు కఠిన చిత్తురాలవు. నీ హృదయం ఒక రాతిబండ."— అని లోపలనుండే అరచినది అచ్చాంబి.

"నై! నై! నై! నై !— బేటీ ! నై ! నీకు నేను అన్యాయంచేయను. దర్వాజా తెరువుము."— అని మరలా బ్రతిమలాడినది.

"అమ్మా! నీవు మా అత్తవారింటికి వెడలి, వారిని మంచి చేసికొని, నన్ను సిద్ధయ్య కిచ్చి వివాహము సేయుటకు సంపూర్ణాంగీ కారముతెలిపి, ఏ అదంబి నైతే నీవు అవమానించి బైటకు నెట్టితివో ఆ అదంబిని, మా అత్తను ఇటకు తోడ్కొనివచ్చి క్షమాపణ చెప్పవలయును. ఆమె ఇటకరుదెంచి నన్ను అన్నము తినుమని చెప్పినగాని తినను నీ మాటమీద నాకు నమ్మకములేదు. నిన్ను నమ్మి నేను భోజనముసేయను."— అని ఖండితముగా బలికినది అచ్చాంబి.

ఇక వేరు మార్గములేక, పిల్లదక్కదేమో ననుభయంతో, కాళింది అల్లి ఖానులు యిద్దరూ బయలుదేరి ఆదంబీ పీరుసాహెబుల గృహమున కరిగినారు.

కాళింది వెళ్ళి వెళ్ళుటతోడనే ఆదంబిని కౌగలించుకొని భోరుమని ఏడ్చినది. బ్రతిమలాట ప్రారంభించినది.

కాళింది :- వదినా! నా తప్పులు క్షమించు. నిన్ను నేను చాల బాధపెట్టితిని. ధన మదమున కన్నుగానక అట్లు ప్రవర్తించితిని. ఇప్పుడు నా బిడ్డయే నాకళ్ళు తెరపించినది. సిద్దయ్యను తప్ప అన్యులను వివాహమాడనని భీష్మించుకొని కూర్చుండినది అన్నపానములు విసర్జించిది.

[ఆదంబి లోలోన ఆనందమునో నున్నానూ, బెట్టుసడలనీయక కొంచెము కోరిన్యము ప్రదర్శించి చూతమని మది తలచియిట్లనినది.]

ఆదంబి :- చాలు చాలు లేవమ్మా! నీ తోటి బంధుత్వము మొన్ననే తెలిసినది. ఇంకెందులకు ? వలదు వలదు. మా కుమారునకు పిల్లనిచ్చువారలే లేక పోలేదు. ఆదియునుంగాక మేము వెలివేయబడ్డ వారము. మా ఇంటికి వచ్చుట మీ పరువు మర్యాదలకు తీరని విఘాతము. ధనికురాలవు. పేను బీదవారము మేము మనకు వియ్యమెట్లు చెల్లునమ్మా! నా కొడుకు దేశ దిమ్మరి మాయగాడు. మంత్రగాడు జూదరి. అట్టివానికా నీవు నీకూతు నిచ్చుట. రెండు రోజులు కాలేదుగదమ్మా! ఇంటి కొచ్చిన ఆడపడచును మెడబెట్టి గెంటితివికదా! అప్పుడే ఎట్లు మరువగలము.

కాళింది ! క్షమించు వదినా ! అటుల మాటలాడకు ఇప్పుడు బిడ్డ ప్రాణము నీచేత నున్నవి. నీవు కాదన్న మా బ్రతుకులు బజారు పాలగును నీవు ఒప్పుకొని తీరవలయును అచ్చాంబిని సిద్దయ్యకు వివాహము చేయవలయును.

ఆదంబి: భలేదానివిలే— వదినా! ఇంత మాత్రమునకే యింతగా యిదికావలయునా! నిన్ను ఉడికించుట కట్లంటినిగాని వేరుగాగాదు. జరిగినది మర్చిపో. తప్పులు సేయుట మానవున కలవాటే ! అయితే అది తెలిసికొని దిద్దికొనుట విశేషము. నీవిప్పుడు పశ్చాత్తాపమున నుంటివి. పశ్చాత్తాప పడు వారు ధన్యులని పరమాత్ముడు చెప్పియుండెను. పరమేశ్వరుడు నీకు

మంచిచేయును....... పరేశాన్ పడపోకు.......నా కోడలెప్పుడూ నా కోడ లేనమ్మా!

కౌశింబి: ఆకలంకదరహాసి తాస్వాజ్ఞాపై నీవు మా యింటికి రావలెనట. సిద్దయ్యతో వివాహమునకు లగ్నము నీవే నిర్ణయించవలయునట. 'దిగులెందుకే పిచ్చి పిల్లా ! నీ కోర్కెతీరబోతుందిలే అన్నము తిందువుగానిరా!'— అని నీవు యనినగాని అన్నము తినదట కాన నీవిప్పుడు శీఘ్రముగవచ్చి ముందు కోడలి కింత అన్నము తినుపింపుము. నీకు నమస్కారములు చేతును....

అచ్చాంబి: అటులనే కానిమ్ము అయిన లగ్నమెపుడు నిర్ణయించగలము....

పీరు : అలస్యమేల? ఎల్లుండి లగ్నముండినది. అనాడే కళ్యాణముచేతుము ....

అల్లీ : బావా! నాదొక విన్నపము. అయిన రభస యేదో ఆయిపోయినది. దానిని గూర్చి యింక వాదోపవాదములు అనవసరము. మా బేటీ అచ్చాంబిని సిద్దయ్యకిచ్చి వివాహము చేయుటకు అందరమూ అంగీకరించితిమి. దీనికింక ఎటువంటి అవరోధముగానీ! అలస్యముగానీ లేదు....కానీ!

పీరు : ఇంక కానీ ఏమిటి బావా!

అల్లీ : ఏమియునూ లేదు. ఈ వివాహము వర్ణాంతరముగాదు; మన కులములోనే మనము వియ్యమందుకొనుచుంటిమి. కాని సిద్దయ్య ఈ మధ్యకాలమున పరమత సంస్కారముల కలవడియుండెను. కనుక మహమ్మదీయ మతస్తులైన ముల్లాలు సిద్దయ్యను సంస్కరించి వివాహము చేయవలయుననితెలిపి యుండిరి. కనుక ఈ ఒక్క కోర్కెను మీరు కాదనకుడు. అంగీకరింపుడు. లేకున్న బంధువర్గమంతయు వివాహమును బహిష్కరించు ప్రమాదమున్నది.

పీరు : సిద్దయ్యను సంస్కరించుటయా! అగ్నికి చెదలంటునా బావా ! అగ్నిని నీటితో కడిగిన అది సంస్కరించబడినట్లేనా? అట్లు చేసిన దానిలోని సహజమైన అగ్నినశించిపోయి కేవలము బొగ్గులుగనో, కట్టి పుల్లగనో మారునుగాని అగ్ని అందు కన్పించదుగదా! అయిన అగ్నికి సంస్కారమేమిటి? సిద్దయ్య

అగ్ని. అగ్నిని సంస్కరించబూనుట సాహసము. అడుగో సిద్దయ్య యిటే వచ్చుచున్నాడు. అతనినేఅడుగు

సిద్ద : ఏమిటది. నన్నడగమనుచుంటిరి. అచ్చాంబి విషయమా ! ఆమెను వివాహ మాడుటకు నా కెటువంటి సందేహముగానీ సంశయముగానీ లేవు. ఆమెతో నా వివాహము గుర్వాజ్ఞ గురు నిర్ణయము దాని నెవరూ తపలేరు....

అల్లీ : చూడు సిద్దయ్యా ! నీవన్నది అక్షరాలా నిజము. అసలు అబ్బాంబి పుట్టి నప్పుడే నీ భార్యగా ముద్రపడి పోయినది. అమ్మాయియూ నిన్ను ప్రాణ సమానముగ భావించియున్నది అన్నియూ సరియే!

సిద్దయ్య: ఆయిన యింక సందియ మెందులకు? నిన్న మొన్నటి వరకు ధన మధాంధకారమున కన్నుమిన్నుగానక, ఎదటివారునూ పరువు మర్యాదలు కలవారేయని ఏ మాత్రము తలంచక మీ కఠిన వైఖరితో అసందర్భపు ప్రలాపముతో, అనుచిత వైఖరితో మమ్ము అవమానించినారు. మానసికముగ హింసించినారు. ఇంకేమి కావలయును ....

అల్లి : కోపింపకు సిద్దయ్యా। నీవు మహానుభావుడవు. కాదనను. అందరమూ సంఘ జీవులము కదా! కొంత మేలకు సంఘమును సమాజమును కూడ దృష్టియందుంచు కొనవలయునుగదా!

సిద్దయ్య: ఇప్పుడు సంఘముతో వచ్చిన యిబ్బందియేమి ?

అల్లీ : ఏమియనూలేదు. నీవు వీరదేశికుని మతముచేకొనినదాది, మనకుల శ్రేష్ఠు లందరు మిమ్ములను హీనముగ చూచుచుండిరి. ఇప్పుడా హైన్యమును పాఱద్రోల వలయునుగదా। అందుకు సంప్కారవిధి ద్వారా నిన్ను సంస్క రించవలయునని ముస్లింమత ముల్లాలు, గురువులు చెప్పుచుండిరి.

సిద్దయ్య : మామా! మీరు చాల పొరబడుచుంటిరి. వీరదేశికునికి మతమనునది ప్రత్యేకతగాదు. ఆయన మతము ప్రేమ, అన్ని మతములు, కుల ములు ఆయనకు సమానము. ఆయన నాకు ప్రత్యేకించి ఒక మత మివ్వనూలేదు. నేను తీసికొననూలేదు! నన్ను ఆయన శ్రేష్ఠునిగా చేసెనే గాని, భ్రష్టునిగా చేయలేదు. నన్ను సంస్కరింపబూనుట విచారకరము నేనేనాడో వీరగురుని వలన సంస్కరింపబడితిని. ఇంక నన్ను సంస్క రించువారెవరు? అయిననూ వీరగురుడు నన్ను తోటి మానవునిగా స్వీక

రించెనేగాని, నా మతమును మార్చలేదు. నా కులమును మార్చలేదు. మతము మార్చి, మందుపోసి, ఒల్లు కాల్చి నన్నేమి చేయలేదు. నాకే ముద్రలూ అద్దలేదు. ఇంక మీరు నన్నేవిధి సంస్కరింతురు? తినగూడనివి తింటినా? చేయగూడని దేదైననూ చేసితినా! ఎవరినైన నిష్కారణముగ దూషించితినా! పరుల ఆస్తులు కాంక్షించితినా! కాజేసితినా! ఏ దుష్కార్యము చేసితినని మీరు సంస్కరింతురు! ఏ పాప కార్యము చేసితినని మీరు నన్ను సంస్కరింతురు.

అల్లీ : సిద్దయ్యా! నీకు తెలియని ధర్మములులేవు. కులమువీడినట్టి, కోతి వనము వీడినట్టి పక్షి వెలయ లేవని పెద్దలు చెప్పుదురు.

సిద్ద : నేను కులమును వీడలేదు. ఎవరు చెప్పిరి నేను కులము వీడితినని. అయిననూ కులము ప్రధానమా! గుణము ప్రధానమా!
(అల్లీఖానుకు ఏమి చెప్పవలయునో అర్థముగాలేదు అవును సిద్దయ్య అనునదియూ నిజమే! సిద్దయ్య ఏవిధముగ గురుదరి చేరెనో ఆ విధముగనే ఆతనిని శిష్యునిగా స్వీకరించెను ఆతని మతమును మార్చలేదు. కులమును మార్చలేదు. గదా-అనికొనినాడు అల్లీఖాను.)

అల్లీ : సరియే। కాని జనుల కట్టు అగపడుచుంటివిగదా। అట్లాంటి కొఱకు మేము మా పట్టుదలన్నియూ వదలుకొంటిమి మేమే విధముగ సంయమనము ననుసరించి సర్దుబాటుతో ప్రవర్తించుచుంటిమో. అటులనే నీవునూ సహకరించిన సర్వ కార్యములూ సక్రమముగా నెరవేరును.

సిద్ద :- సరియే అటులేకానిండు. నన్ను నిజముగ సంస్కరింపగల ఘనులుండిన అట్టులే కానిండు.

అల్లీ ; మేనమామ మాట కూడ తండ్రిమాటతో సమానమే. నా మాట మన్నించినందులకు సంతోషము.
(అని అల్లీఖాను పీరుసాహెబువైపు చూచి "బావా। యెల్లుండి సాయంకాలమునకు వాటంబులగు ఘోటకంబులను. పచ్చడంబులమర్చిన కచ్చడంబులను పంపించెదను. సకుటుంబ బంధు మిత్ర సపరివార సమేతముగా విచ్చేయుడు. పెండ్లికుమారుని సంస్కార కార్యక్రమంబు నెరవేర్చి, సాలంకృత కన్యాదానంబు గావింతును. ఇంక మీ ప్రయత్నంబుల నీరుడుడు.")

అని చెప్పి "బుహన్! ఆదంబీ! అ(! అ(!"-అని ఆదంబిని తోడ్కొని నిజ నివాసంబున కరిగినాడు.

అత్తను చూడగానే కోడలు అచ్చాంబి అమితానంద పరవశురాలై అత్తకు ఎదురేగి కౌగిలించుకొని పాదాభివందనము చేసినది.

"బహూ! బహూ ఆనందముగ నున్నది. నీదు కోర్కె తీరినది. ఎల్లుండియే లగ్నము. సిద్ధయోగి భార్యవై చెలో గలవు. దిగులుమాను ఇంకనీ నిరశన వ్రతము సమాప్త మొనరించి అన్నమారగింతువుగాని పద"—అని లోనికి తీసికొని పోయినది

"అత్తా! మన మిద్దరమూ ఒకే పళ్ళెరములో భుజింపవలయును. నీకేమైన అభ్యంతరమా!"-అనినది అచ్చాంబి

"అరే! అంతకంటేనా! బహూ! తప్పక అటులనే చేయుదము అనినది అచ్చాంబి.

అప్పుడు కాళింబి ఒక వెండిపళ్ళెరమందు అన్నము, పప్పు, పాయసము గైకొనిరాగ, అత్తగారైన ఆదంబి అచ్చాంబికి తినిపించినది. అచ్చాంబి ఎంతో తన్మయత్వమంది తాను మరల అత్తగారికి తినిపించినది. ఇద్దరూ ఆ కంచమున భోజనము చేసి తృప్తిగా తేన్చినారు.

"అచ్చాంబీ! మరి యింటివద్ద యింకా పనులెన్నియో నున్నవి. చూడవలయునుగదా! మరి వెళ్ళి వచ్చెదను"-అని కాళింబి వైపు తిరిగి "భాభీ! మైజావుంగీ!" -అని నది.

"అచ్చా! భాబీ," - అని కాళింబి అనగా, ఆదంబి ఆనందముగా నవ్వుకొనుచూ కోడలివైపు తిరిగి చెయి ఊపుచూ యింటికి వెడలినది.

.... [ం] ....

సిద్ధయోగి ప్రసిద్ధ భారతం :

ఏబదిఐదవ భాగం !

పెండ్లి పనులన్నియు హడావిడిగా జరిగిపోవుచున్నవి. జల్లిఖాను ఇల్లంతటికీ వెల్లవేయించి అదియొక శ్వేతమందిరమువలే అలంకరించినాడు రంగురంగుల కాగితములతో తయారుచేయబడిన పలువిధ పుష్పమాలికలను, బుట్టలను వ్రేలిమాద దీసినారు. నూతన వస్త్రములు ఖరీదుచేసినారు గుఱ్ఱమును సిద్ధము చేసినారు. దానికి ఒడలంతయూ పట్టుబట్టలతో, రకరకాల పూసలతో, రకరకాల ఊలుతో అల్లిన బంతులతో అలంకరించినారు.

గృహప్రాంగణ మంతయు పచ్చని మామిడాకు తోరణములతో అలంకరించినారు. కిటికీలకు, గుమ్మములకు ఆకుపచ్చని పట్టుతెరలను వ్రేలియాడతీసినారు, గుమ్మములకు వివిధ రంగుల పూసలతో అల్లిన అల్లికలను అలంకరించినారు, పెద్ద పందిరి వేయించినారు.

బంధుజనములకు శుభలేఖల నంపినారు సిద్దయ్య సంస్కారణ కార్యక్రమము తిలకించి, వివాహమున కరుదెంచి, వధూవరులను ఆశీర్వదించవలసి, తానర్పించు చందన తాంబూలాది భోజన సత్కారముల స్వీకరించమని అయా శుభలేఖలయందు వ్రాయించినారు.

ఇది యిటులుండ.

అక్కడ పీరుసాహెబు తన గృహమును పలువిధ రీతులలో అలంకరించినాడు. బంధుజనంబులకు కబుర్లుపంపినాడు. పెండ్లి పనులన్నియు సిద్దయ్య చిన్ననాటి స్నేహితులు, తలవరులు, కులమత విచక్షణ లేకుండ ఆ కార్యక్రమములందు పాల్గొని సిద్దయ్యను సేవించు చుండినట్లుగనే తలంచి ప్రతి కార్యమును నేర్పుగా చేయించుచుండిరి.

పీరుసాహెబు భార్యతోచెప్పి కందిమల్లాయపల్లె బయలుదేరినాడు. గురుదేవి గోవిందమాంబను, గురుపుత్రులను కలసి సిద్దయ్య వివాహమునకు తప్పక విచ్చేయవలయుననియు. వధూవరుల నాశీర్వదించవలెననియు, పలుమారులు చెప్పి, ప్రణామముల నర్పించి, వారి ప్రయాణమునకు బండ్లనేర్పాటుచేసి వచ్చినాడు.

తరువాత పలుగురాళ్ళపల్లె గోవిందయ్యకు కూడ అహ్వానము పంపినాడు. సిద్ధయ్యచే బ్రతికించబడ్డ తమ్మారెడ్డికి, సకుటుంబముగా విచ్చేయవలయునని ఆహ్వాన పత్రికముల పంపినాడు.

ముహూర్తము నాటికి బంధువులు, మిత్రులు, ఇతర జనంబులందరూ విచ్చేసినారు. పలుగురాళ్ళపల్లి గోవిందస్వామి సిద్ధయ్యకు తానే అలంకరించుటల సేయవలయునని పట్టుబట్టినాడు. తమ్మారెడ్డి మిగతా పనులభారమంతయూ స్వీకరించినాడు.

పెండ్లి కుమారుని తోడ్కొని వచ్చుటకు అల్లీఖాను గుఱ్ఱములండి పలురకు వాహనములను, జనములను పంపినాడు.

సిద్ధయ్య ముఖమున మూడుగీతల వరుస గల్గు సుగంధముపు దిద్దినాడు గోవిందస్వామి. కుంకుమాక్షతలు దిద్దినాడు. మెడలో స్ఫటిక, రుద్రాక్షహారములను ధరింపచేసినాడు. దండలకు, ముంజేతులకు రుద్రాక్షమాలికలను కట్టినాడు.

'అబ్బో ! సాంబశివునివలె రుద్రాక్షలన్నియు ఈనాడే ధరించినాడు. ఫాలభాగమున జూడుము, ఎంత అందముగా శివనామము, దిద్దుకొనినాడో ! అయిన గురువు శివస్వరూపుడుగదా!"— అనుకొనినారు కొంతమంది.

'ఔనుమరీ ! ఈరోజు సంస్కరింప బడబోవుచుండెనుగదా ! రేపటినుండి యివన్నీ ఉండవు. అందుకని ఆఖరి రోజుగదా! మొత్తము ఉన్న విభూతినంతయూ పూసికొనినట్లున్నాడు వజ్రాలన్నియూ ధరించినాడు'— అనికొనినారు కొంతమంది

బంధువులు కొందరు బండ్లపైనను. అందలంబులలో మరికొందరు, పెండ్లికి తరలి వచ్చుచుండినారు. కొందరు యువకులు గొనబు దుస్తులు ధరియించి పొచ చాయలై మాటలాడుకొనుచూ వచ్చుచున్నారు. చక్కని సోన్నాయి వాయిద్యము చెవులకింపు గొల్పుటయేగాక హృదయానందమును చేకూర్చుచున్నది. సుగంధ ముత్తైదువలు పలురకముల పట్టుచీరలు ధరింపుకొని సిద్ధయ్యను చూడ కనుకలనిడియుండిరి.

సిద్ధయోగి బహుసుందరముగ తయారైనాడు పలుగురాళ్ళపల్లి గోవిందస్వామి తనచాతచక్యము నంతయు నుప యోగించి తన నుశ్కువదీప అందముగ సిద్ధయ్యను

తీర్చిదిద్దినాడు. పెండ్లి కొమరునిగ సిద్ధయోగిని జూడ ఎన్ని కన్నులైననూ చాలవు. అంతటి అందముతో, సౌందర్య శోభలతో వెలిగిపోవుచున్నాడు.

మెల్ల మెల్లిగ వాయిద్యములు తోడురాగ, మంగళాంగులు వెంటరాగ, సిద్ధయ్య మేనమామ అల్లీఖాను ఇంటి ముందు ఆగినాడు. అల్లీఖాను ఎదురేగి సిద్ధయ్యను గుఱ్ఱముపై నుండి దింపి సభాస్థలికి తోడ్కొనిపోయినాడు.

విశుద్ధ సత్త్వము సిద్ధయ్య రూపుదాల్చి మెల్లగా నడచి వచ్చుచున్నదాయని నట్లు శాంతి, ప్రేమ దయ, కరుణ, స్నేహము, సౌభ్రాతృత్వము యిత్యాది సకల గుణములు కలసి అచ్చట రాజ్యమేలు చున్నవాయనినట్లు సిద్ధయ్య పాదస్పర్శమాత్ర మున ఆ ప్రదేశమంతయు పవిత్రముగ మారిపోయినది.

సిద్ధయోగి మూర్తీభవించిన శివమూర్తివలె, తనకై ఏర్పరచబడిన ప్రత్యేకా సనముపై ఆశీనుడైనాడు. అప్పటికే సిద్ధయ్యను, సంస్కరించుట కక్కడ చేరిన ఖాజీలు సిద్ధయ్యను జూచి, ఆతనిలోని కాంతులకు కళ్ళుమూసికొనినారు. అల్లీఖాను వారిదగ్గరకుచేరి సలాములుచేసి 'ఇక మీకార్యక్రమము ప్రారంభింపుడు"— అని ప్రార్థించినాడు.

ఖాజీలు పవిత్రగ్రంథమైన ఖురానులోని సంప్రోక్షణములగు మంత్రములను (అయత్‌లను) మహోద్ధతితో గానము సేయుచు, మంత్రజలములను సిద్ధయ్యపై జల్లుటకు లేచినారు.

ఒక ఖాజీ తన అయత్ గానమునుపూర్తిచేసి, సిద్ధయోగి ముఖముపైజ్వాజ్వల్య మానమై ప్రకాశించుచున్న సౌగంధిక శివనామమును తుడుచుటకు భయము భయము గనే ప్రయత్నించినాడు. అది చెరిగినట్లే చెరగి మరల ముఖమున ప్రదీప్తించు చుండెను. మరల తుడువ అప అతని ముఖమునుండి చెఱగదు సరిగదా !.... ఖాజీ చేతికి సహితము అంటుకొని వదలదాయెను. ఖాజీ తనచేతని తుడిచి, తుడిచి, చేతులు నొప్పులు పుట్టి తనముఖమునకు పట్టిన చమటచు తుడుచుకొనగా, అతని ముఖమున ఆశివనామము అంటుకొని వెలుగ ప్రారంభించినది—అది జూచి అందరూ ఆశ్చర్యపడుటయే గాక, ఖాజీయు భయభ్రాంతుడయ్యెను....

రెండవ ఖాజీ రుద్రాక్షమాలికల తీయ ప్రయత్నించుచుండ, ఒకమాల తీయ మరియొక మాల అతని గళ సియను ప్రత్యక్షమగుచుండెను. తీసితీసి అక్కడ ఒక కుప్పగ పడవేసినాడు. కాని సిద్ధయోగి మెడలో ఎప్పటివలె రుద్రాక్ష మాలికలు తరుగని కాంతితో ప్రకాశించుచునే యున్నది. ఇకతీయలేక "నావల్లకాదు"— అని మొదటి ఖాజీ ననుసరించినాడు.

తమ ప్రయత్నము సఫలీకృతము కాకపోవుట వారిలో క్రోధజ్వాలలుప్రజ్వ మింపజేసినవి. కళ్ళుకోపమున ఎఱ్ఱబారినవి. అఖరకు తపోనిధియైన సిద్ధయోగిని జూచి" నిన్ను కులములో కలుపుకొన వీలులేదు. నీవిటనుండి వెంటనే వెళ్ళిపో! ఇక్కడ నీవు పనికిరావు "— అని ఖాజీలు కోపముతో పెద్దకేకలు గద్దించినారు.

"అహా! అనాడు ద్రౌపదికి దుశ్శాసనుడు వలువలూడ్చి నపుడు ఎట్లు వలువలు వెల్లువలై వచ్చిపడినో, అట్లే రుద్రాక్షమాలిక విప్లేల గుట్టలై పడినది. అది పురాణము. కాని ఈనాడు మన కనులార జూచితిమి. తుడిచిన కొద్ది బొట్టు ప్రకాశవంతమై వెలుగుచున్నది. రుద్రాక్షమాలిక లెటనుండి వచ్చు చున్నవో గదా! మాల తీసిన మరియొక మాల మెడను చేరుచుండెను. సిద్ధ యోగి మహా మహిమాత్ముడని చెప్పుటకు యింతకన్నవేరు నిదర్శన మేమి కావల యును." -అని జనులు వేనోళ్ళ కొనియాడుచుండ మరికొంత మంది అయనకు నమస్కరించి "మహాప్రసాదము" -అని అ ప్రక్కన గుట్టగా పడియున్న రుద్రాక్ష మాలికల నుండి మాలికల గైకొనుచుండిరి

ఒక ప్రక్కజనులు సిద్ధయోగి మాహాత్మ్యమును కొనియాడుచుండ ఖాజీలకు ఏమిచేయుటకు దిక్కుతోచక "వీడు కనికట్టువిద్య ప్రదర్శించుచున్నాడు. ఇతడు జాదూ చేయుచున్నాడు సిద్దయ్య మామగాడు, మాంత్రికుడు. ఇటువంటి వానిని సంస్కరింపబూనుట మాదియే తప్పు ఏదియో అల్లీఖాను కాళ్ళా వేళ్ళా బడినాడని అంగీకరించితిమి గాని, లేకున్న యితని ముఖముగూడ చూచువారలము గాము. నేటి నుండి యితనిని కులమునుండి సంపూర్ణముగ వెలివేసితిమి."— అని అల్లీఖానువైపు జూచి "జీఖో! అల్లీఖాన్! మేము ఖాజీలము. గురువులము, మతపెద్దలము, మమ్ములను నీ విధముగ అవమానపరచుట సహింపరాని విషయము తాను సంస్కరింపబడుట కిష్టము లేక ఈ ఇంద్రజాల విద్యలను ప్రదర్శించు చున్నాడు. ఇతనికి నీ కొమరిత నీయరాదు, ఈయతగదు. వెంటనే వెళ్ళి పొమ్మను."-అని ఖాజీలు కోపముతో

ఇంత జరుగుచున్నను సిద్దయ్య కనులు మూసికొని కూర్చుండెనేగాని ఏ మాత్రము కనులు తెఱువలేదు. పల్లెత్తి మాట్లాడలేదు.

ఖాజీలిద్దరూ సిద్దయ్యకు ఎదురుగా ఒకరి నానుకొని ఒకరు నిలువబడి "నీవు మాపై యింద్రజాల విద్యల ప్రదర్శించుచుంటివిగదా! జాగ్రత్త! నిన్నేమి చేయుదమో! చూడు"-అని యిసకలకు వా ప్రయత్నించగా, వారి భుజములు, ఒకరి భుజమింకొకరి భుజమున అంటుకొని పోయినవి. ఒకరికొకరు అంటుకొని పోయి, విడివడలేక, క్రిందపడి దొర్లుచూ, పైకి లేవలేక పదిమందిలో పరాభూతులైరి. "అరె అల్లా! కార్మకాలి ఈ కార్యక్రమమున కొప్పుకొంటిమి. ఈ ప్రమాదము నుండి ఎట్లు బయట పడుట ఇట్లు ఒకరి నొకరు అంటుకుపోయి గృహంబులకు చనుటెట్లు."-అని యేడ్వనారంభించిరి.

దిక్కుతోడక ఖాజీలు యేడ్చుచుండ ఇతర జనములకూ, అచ్చాంబి స్నేహితురాండ్రకు అదియొక వింతగానూ, ప్రదర్శనగానూ తోచినది. నవ్వుకొనిరి.

అపుడు అల్లీఖాను, కాశింబి యిద్దరూ సిద్దయ్య కడకు వచ్చి ఒకరి కొకరు దగ్గరగా చేరి భుజములు కలువ నిలబడి "సిద్దయ్యా! ఎందులకీ ప్రదర్శనలు"-అని అనగనే వారి భుజములను అంటుకొని పోయినవి. ఎంతలాగిననూ రాక, పరాభవాగ్నితో కాలిపోయి కుషించి సిద్దయ్య పాదములపైబడిరి. అది చూచి యితరులు క్రిందబడ్డ ఖాజీలను లేవదీసి సిద్దయ్య పాదములపై పడవైచిరి. "దేవా! మూఢులము. మూర్ఖులము. మా తప్పు మాకు తెలిసి వచ్చినది మమ్ము కాపాడువాడవు నీవు తప్ప అన్యులులేరు. నీ ప్రభావ మెఱుంగ లేక నీవునూ సామాన్య మానవుడవని యెంచి, మత ద్వేషముతో నిన్ను సంస్కరింప బూనుకొంటిమి నీవు అగ్నివి. అగ్నికి చెదలంటునా? అగ్నియే ఒకరిని సంస్కరించును అట్టి అగ్నివి నిన్ను సంస్కరింప బూనుట మేము చేసిన ఘోర తప్పిదము బుద్ధి వచ్చినది. భుజముల విడివడ జేయుము. కన్నియను వివాహమాడుము."-అని ప్రార్థనలను మొదలిడినారు.

ఇంతలో అందరూ 'సిద్దయ్య! సిద్దయ్య' అనుచు వెనుకకు తిరిగి చూచినారు సిద్దయ్య, అచ్చాంబీ! కలసి చిర్నగవుల వెలయించుచూ అల్లీఖాను యింటిలో నుండి వచ్చుచుండిరి. ఆ దృశ్యమును చూచి అందరూ "యిదేమి! సిద్దయ్య ఇంత

వరకూ యిక్కడే ఉండెనుగదా! ఎప్పుడు లోనికేగెను? ఎట్లులోనుండి వచ్చు చుండెను"-అని ఆశ్చర్యపడి యిటుచూడ, ఎక్కడ కూర్చునియున్న సిద్దయ్య అక్కడే కూర్చుని యుండెను. మరికొంత సేపటికి సిద్దయ్యను వెంటనిడుకొని ఆదంబీ పీరు సాహెబులు వచ్చుచున్న దృశ్యమక్కడ ప్రత్యక్షమయ్యెను. ఎక్కడ బడితే అక్కడ సిద్దయ్య దివ్యస్వరూపము ప్రత్యక్షమై, ఎవరు సిద్దయ్యయో, ఎవరు సిద్దయ్య కాదో, ఎవరూ తీర్మానించుకొనలేక పోయిరి.

ఇంతలో ఆ వివాహ వేదిక యంతయూ దివ్యకాంతులతో నిండిపోయినది. ఆ దివ్యకాంతిలో సిద్దయ్య తన దివ్య స్వరూపమును ప్రత్యక్షము చేసినాడు.

జనులెల్లరు నమస్కారాంజలు లర్పించినారు. సిద్దయోగికి జై, సిద్దయోగికి జై అని జయజయధ్వానముల చేసినారు.

యోగి వరేణ్యా! మా తప్పులు మన్నింపుము. నీ విడక ఈ కన్యను వివాహ మాడ వచ్చును. నిన్ను సంస్కరింప వచ్చి మేము సంస్కరింపబడితిమి. మమ్ము లను నీ శిష్యులుగా స్వీకరించి మాకు ముక్తిమార్గము ప్రసాదింపుము. అజ్ఞానముతో ప్రవర్తించి నీ మనసుకు నష్టము కలిగించితిమి మమ్ముల క్షమింపుము. పాహిమాం!- పాహిమాం!"-అని ప్రాధేయపడిరి.

ఒక్కసారిగా అంతయూ మామూలుస్థితికి వచ్చినది ఖాజీల భుజములు విడి పోయినవి. అల్లీఖాను కాశింబి భుజములు కూడ విముక్తము కాబడినవి.

సిద్ధయ్య యథాస్థానమునందే కూర్చుండియుండెను.

"భగవాన్! సిద్దయ్యా! దయామయా!"-అనిరి ఖాజీలు అతని పాదములపై బడిరి. అల్లీఖాను పాదములబట్టి వదలడాయెను. కాశింబి తన గర్వమంతయూ అణిగిపోవతలవొంచి సిద్దయ్య పాదముల చెంత నిలబడిపోయినది.

సిద్దయ్య మెల్లగా కన్ను తెరచినాడు.
మరలా జయజయధ్వానములు పెల్లుబికినవి.
"లేవండి" -అనినాడు సిద్దయ్య.
"మమ్ముల క్షమించితినని యనిన గాని లేవము".

"అందరినీ క్షమించువాడు ఆగురుదేవుడు. అంతయూ ఆ గురుదేవుని మహిమ. గురులీల దాని నడ్డుకొను వారు లేరు. మీ అజ్ఞానమును మీరలే గుర్తె రిగి కనులు తెరచికొనుడు. గురుదేవునిపై నమ్మకముంచుడు. అంతయూ శుభము

-: ఏబ దీ ఆరవ భాగం :-

మంగళతూర్యారవంబులు దిక్కులు పిక్కటిల్ల మార్మోగుచున్నవి. ఖాజీలు ఖురాన్నోక్త ఆయతులను ఎంతయో వీనుల విందుగా పాడుచుండిరి. పణుగురాళ్ళ పల్లె గోవిందస్వామి ప్రభృతులు సామవేదమును బహు శ్రావ్యముగా గానము సేయుచుండిరి. వివాహ వేదికలో వాట వీరసనేల జాతి, మత, కుల, వర్గ, వర్ణ భేదములులేవ. వేవుని పెండ్లికందరూ పెద్దలే యనినట్లు సర్వులు సహృదయముతో ఆశీనులైరి

"ఆహా ! ఎంతటి ఆనందకర దృశ్యము. ఇరుమతములవారు కలసి వీర పెద్దలముల మెచ్చి, విజయవంతముగ, విశాల హృదయముతో, విశ్వగురు మెచ్చగా, విస్తృత పరిధిన నిర్వహించబడిన వివాహము బహుశా చరిత్రలో ఒక్క సిద్ధయ్య వివాహమే యేమొ ! ఎంతటి నేత్రానందకరము. ఎంతటి హృదయానందకరము. ఎంతటి మనోరంజకము. ఎంతటి విశాల దృక్పథము.

ఖిల జనులందరు సంతసానంద డోలికల నూగుచుండ, హృదయానంద ముప్పొంగుచుండ, చంద్రకళా శోభితుడైన సిద్ధయోగి, వెన్నెలబోలు చిన్నగవుల వెలయించుచు, స్నిగ్ధ సౌకుమార్య, సుగంధ సౌరభముల నీనుచు, సౌందర్యరాశియై సకల కళాస్వరూపిణియై అలరారుచున్న అచ్చాంబి గళసీమన సిద్ధయ్య నల్లలు గట్టినాడు.

తదుపరి ఒకరి నొకరు జూచికొని పండువెన్నెల బోలు ప్రేమపూరితములై పారిజాత పుష్ప పరిమళ శోభితములై, ముత్తెముల కాంతులీను నగవుంతో సభ నంతయూ సంతోషపరచినారు.

అంత ఒకరి శిరముపై నొకరు తలంబ్రాలు బోసికొనినారు. కాంతలంతియు ఎంతయో సంతసించి ప్రధాన గృహంబున పాన్పు నేర్పాటుచేసినారు. సౌందర్యరాసులైన స్త్రీలు నూత్నదంపతుల తీసికొని ప్రధాన గృహ ప్రవేశము చేయుటకు పోవ కన్నియలందరు వాకిట నడ్డగించి.

"సిద్ధయోగీంద్రా ! సిగ్గేల? ఇప్పుడింత సిగ్గులువలదు. నీధర్మపత్ని నామమిట ఎఱిగించుట తప్పదు. పేరుచెప్పుము"— అనినారు.

సిద్ధయ్య అసలే అందగాడు. అతని రూపము బహు ఆకర్షణీయము. అందుననూ తపస్సుచే బలపడి ద్విగుణీకృత కాంతులతో ప్రకాశించు చున్నవాడు.

"యువతీ రత్నములారా! ప్రవిమలముగ మీకుకాదు. భార్యాభిఖ్యను వివరముగనే చెప్పదలచితిని· ఆలింపుడు. నా భార్య నామధేయము 'అవర్ణముఖి' అనిచెప్పి!"అ ఇక నడువుడు"—అనినాడు·

"ఇదేమి! సిద్ధయోగీంద్రుడు ఈ నూతన నామంబిడెను. అవర్ణముఖి యనిన కళావిహీనమైన ముఖమనిగదా అర్థము స్ఫురించుచున్నది. పరిహాసమునకు బల్కెనా?.... లేక...."— అని ఒక వనిత వ్యక్తము చేసినది.

"ఆగుడాగుడు. మా సిద్ధయ్యన్న మీరనుకున్నంత యిదేమీగాదు. భార్య నామధేయమును గూఢార్థము స్ఫురించునట్లు బల్కినాడు. అచ్చాంబి పేరులోని మొదటి అక్షరము 'అ' గదా! అనగా అక్షరములను వర్ణములనియు అందురులే! అందువలన అవర్ణముఖియనగా 'అ' కారము ముఖాక్షరమైయున్నందున, అనగా మొదటి అక్షరమైయున్నందున, అనగా మొదటి వర్ణమైయున్నందున 'అవర్ణముఖి' యనినాడు. అంతియేనా సిద్ధయ్యన్నా!"— అనినది సరళా కుమారి.

"లెస్సబల్కితివి. భాషయందు నీకు మంచి ప్రావీణ్యమున్నది· ఎంతయైననూ తెలుగింటి బిడ్డవుగదా! తెలుగు వెలుగుల సామాన్యమా!"— అనినాడు సిద్దయ్య,

"నేను నీ సోదరినే గదా! అన్నా!"—అనినది సరళా కుమారి.

"అచ్చాంబీ! ఇంక నీవంతు వచ్చినది· పతిని నామము తెల్పుము."— అనినారు ఆడబడుచులు. "మూగనోము పట్టకే తల్లీ! మూగపిల్లలు పుట్టుదురని పెద్దలందురు........ కనుక భర్తపేరు బల్లగుద్ది మరీ చెప్పవలయును."

"అటులనా! అటులయిన వినుడు. జాంబూఫలము, ముకురము, క్షీరాంబుధి వేళ్ళ - యను దానిని ద్రివర్ణంబులుగ వ్రాసి నడివర్ణంబులు గైకొన్న నానాథుని నామము."- అనినది అచ్చాంబి.

అచ్చాంబిలో యింతటి నేర్పు, తెలివితేటలు, తెలుగుభాషలో యింతటి నేర్పరి తనము. కవితా రీతుల నర్థము చేసికొనుట — మొదలగునవి ఉన్నట్లు సిద్దయ్యకసలు తెలియదు. సిద్దయ్య ఆశ్చర్యపోక తప్పలేదు.

"భళా!, ఎంత చక్కగా చెప్పితివి. అచ్చాంబీ ! ఆంధ్రభాష నెప్పుడింత పటిష్టముగా నేర్చుకొంటివని తెలుగింటి ఆడపడుచు వన్నందుకు భేష్! తెలుగుతనము, తెలుగుగౌరవమును నిలబెట్టితివి."- అనినాడు సిద్దయ్య.

సిద్దయ్య మెచ్చుకోలుకు అచ్చాంబి సిగ్గుతో మొగ్గలా ముడుచుకు పోయినది- ఆ మేలిముసుగులో.

'ఆవర్ణముఖి'కి అర్థం చెప్పిన ఆ సుదతీలలామ సరళాకుమారి అచ్చాంబికి ఆప్తురాలు. రాయబారము నడిపిన రాజహంసి నిండు పదహారణాల తెలుగింటి వెలుగు పంట-ఆమెయే దీనికినీ భాష్యము చెప్పినది.

"జాంబూ నదము అనిన బంగారము. బంగారము అనే 'పసిడి' అనికూడ నందురు. ముకురము అనిన అద్దము. క్షీరాంబుధి అనిన పాల సముద్రము. దీనినే పయోధి అనికూడా అందురు. వేశ్య అనిన భోగిని. ఈ పదములను అట్లగా పసిడి, అద్దము, పయోధి, భోగిని- అను వాటిలోని మధ్యాక్షరములను కలిపిన అట్లగా

| | | |
|---|---|---|
| 'పసిడి' లోని మధ్యాక్షరము | - | సి |
| 'అద్దము' - లోని మధ్యాక్షరము | - | ద్ద |
| 'పయోధి' — లోని మధ్యాక్షరము | - | యో |
| 'భోగిని' - లోని మధ్యాక్షరము | - | గి |

కలిపిన 'సిద్దయోగి' అని వచ్చెనుగాదా! అని సరళా కుమారి అర్థము ప్రతీకరించగా అందరూ అచ్చెరు వందిరి. అచ్చాంబిలో ఇంతటి తెలివి తేటలున్నట్లు తలి దండ్రులకూ తెలియదు. దీనికంతకూ కారణము సరళా కుమారితో స్నేహము తప్ప అన్యము కాదని అచ్చాంబికి తప్ప అన్యులకు తెలియదు.

"ఇదంతయూ మాకు తెలియదు. మామూలు భాషలో చెప్పినగాని తెలిసీయదు"—అని కొంతలు అడ్డు తగిలిరి. అపుడు సిద్దయోగి" అచ్చాంబీ నేనూ

వచ్చితిమి. లోపలకు రానిండు" అనినాడు. "సిద్ధయోగి నేనూ వచ్చితిమి." -అనదీ లాల్యాంబి.

అంతనా వెలదులందరు సిద్ధయోగి దంపతులను పాన్పుపై కూర్చుండ చేసి నా వారివారికి వచ్చిన పెండ్లిపాటలను సొంపుగా యింపుగా పాడినారు బంతు లాడించినారు. రకరకముల వేడుకలన్నియు పూర్తి చేసినారు. వారివారి ముచ్చ టలు తీర్చుకొనినారు.

అవ్విధముగ మరిరెండు దినంబుల నిత్య కళ్యాణము, పచ్చతోరణముల్లు వేడుకలు ఘనముగ జరిగినవి. బంధుమిత్రులకు షడ్రసోపేత భోజనము న.దించి నారు చందన తాంబూలముల నర్పించినారు.

అ తరువాత కౌశంబీ, అల్లీఖానులు వధూవరులకు లాంఛన ప్రాయముగ మంచంబులు, కంచంబులు, పేటికలు, చేటికలు, కచ్చడంబులు, పచ్చడంబులు, ఇంకననేక రకముల వస్త్రభూషణ వస్తుజాలంబులు సమర్పించినారు. అ తరువాత ఊరేగింపు జరిపి సాగనంపగా సిద్ధయోగి సపరివారుండై ధర్మపత్నితో స్వగృహం బునకు చేరి బంధుమిత్రుల నందర మూడు దినంబుల నుంచుకొని వారిని సేవించి పంపించినాడు.

పిదప మాతృమూర్తి గోవిందమాంబకు పాదపూజలొనరించి, వస్త్రభూషణ సమర్పించి అర్చించి ఆశీస్సుల బడసినాడు. గురు నందనులకు కౌశేయాంబర దక్షిణ తాంబూలాదుల సమర్పించి, అర్చించినాడు. తక్కుంగల వారలందరకూ వారి వారి నర్హతల దృష్టియందుడుకొని ఎవరికినీ ఏ లోపము రాకుండ అందరినీ తృప్తి పరచి పంపినాడు.

.... ० ....

—: ఏబది ఏడవ భాగం :—

ధర్మపత్నితో గృహస్థ ధర్మంబుల నెరవేర్చుచూ సంసారము సాగించు చున్నాడు సిద్ధయోగి. కాలమెంత సేపు గడుపవలె! దాని నడ్డగల వారెవరు! కాల చక్రము తిరిగి పోవుచునేయున్నది.

గ్రామ ప్రజలలో సిద్ధయోగీంద్రునిపై భక్తి ప్రపత్తులు యిబ్బడి కిబ్బడియైనవి. అతను మహాత్ముడని, మహనీయుడనీ, దివ్యాంశ సంభూతుడనీ నమ్మకము బలపడి నది. సిద్ధయోగీంద్రునకు ఒక మఠము కట్టించవలయుననెడి సంకల్పమునకు వచ్చి నారు ప్రజలు. అనుకొనుటయే తడవుగ గ్రామ కరణము పాపరాజు అధ్యక్షతన పనులు ప్రారంభమై త్వరలోనే మఠ నిర్మాణము పూర్తయినది. అందు సిద్దయ్యను గురుపట్టాభిషిక్తులను చేయదలచి అన్ని యేర్పాట్లు పూర్తిచేసిరి.

"నాకా! గురుపట్టాభిషేకమా! భలేవారలే మీరు. నాకటువంటి ఔన్నత్యమేమియూ లేదు. నేను మీలో ఒకనిగా మెలగుట నాకత్యంత ప్రీతి. నన్ను వేరు సేయకుడు. అదియునూ గాక గురు పట్టాభిషేక యుక్తుని సేయుటకు నా కంతటి శక్తి సామ ర్థ్యము లేవి? అంతటి మహత్తరశక్తి పీఠము నధిష్ఠించ వలయునన్న సామాన్యమా! అది ఒక్క వీరగురు సార్వభౌమునకే చెందినది. అన్యులకసాధ్యము."-అనినాడు సిద్దయ్య.

ప్రజలు తప్పదని మొరాయించినారు.

తనపై తనతోటి వారి కేర్పడిన గౌరవ, భక్తి, ప్రేమ భావములకు సిద్ధయ్య ఎంతగానో పొంగిపోయినాడు. వారిని నిరుత్సాహ పర్చుటకునూ అతనికి బాధగానే తోచినది.

"మీరింతగా నాపై ప్రేమాభిమానముల పెంచుకొని నందులకు కృతజ్ఞుతను. గురుదేవుల ఆజ్ఞ అయిన గాని గురుపీఠమలంకరించజాలను. ఒకటి రెండురోజు లాగుడు. తర్వాత చెప్పెదను."—అని నాటికి వారిని పంపి వేసినాడు సిద్దయ్య.

ఆనాటి రాత్రి సిద్దయ్యకు శ్రీగురుడు స్వప్న దర్శన మిచ్చి "సిద్దా! అలస్య మెందులకు కారణజన్ముడవు. కావలసిన కార్యము లెన్నియో నున్నవి. నాయంతటి

వాదవైతివి. గనుకనే నన్ను గన నేర్చితివి. గురుపీఠ మధిష్ఠించి నిర్వహింపుము."- అని ప్రబోధము చేసినాడు.

"గుర్వాజ్ఞ"—అని సిద్ధయ్య శ్రీగురునకు నమస్కరించి తన నిర్ణయమును గ్రామ ప్రజలకు తెలియజేసినాడు.

"ముహూర్తము నిర్ణయింపుడు" -అనినారు ప్రజలు

నాల్గురోజుల తర్వాత ఒక ముహూర్తము నిర్ణయించినాడు సిద్ధయోగి ప్రజలు ప్రయత్నములలో మునిగి పోయిరి. సిద్ధయోగి తనకు తెలిసిన విశిష్ట సాధు శేఖరులకు ఆప్తులకు శుభలేఖలు పంపినాడు. కందిమల్లయ పురమునకు తాను ధర్మపత్నితో స్వయముగ వెడలి, గురుదేవి గోవిందమాంబను, గురుపుత్రులను ఆహ్వానించి నాటికి వారికి తగు శకటములను పంపి రప్పించుకొనినాడు.

నాడే ముహూర్తము. ముడుమాల పురమునకు మరొకసారి సిద్ధయోగి బంధువులు, మిత్రులు, సాధువులు, సన్యాసులు, అనేకమంది అరుగు దెంచినారు. ఇరుగు పొరుగు గ్రామముల నుండియు ప్రజలేగు దెంచిరి. పలుగురాళ్ళ పల్లెనుండి గోవిందస్వామి, బంధుమిత్రులతో సహా అరుదెంచినారు. తిమ్మారెడ్డి దంపతులు, తలిదండ్రులు యితరులు లెక్కకు మిక్కుటముగానే తెంచినారు.

సిద్ధయోగి ధర్మపత్ని అచ్చాంబిని పన్నీట జలకంబు లాడించినారు. పట్టు పుట్టములను కట్టబెట్టినారు. అచ్చాంబికి పసిడిసొమ్ములు పెట్టి అలంకరించినారు ఉత్సవముతో భార్యాభర్తలను మఠమునకు చేర్చినారు.

అందరి అభీష్టము ననుసరించి సిద్ధయ్య గురుపీఠమధిష్ఠించినాడు. గోవిందాచార్యాది గురుపుత్రులు వేదమంత్రములను గానముసేయుచుండగ, సాధువరేణ్యులు అక్షతలు జల్లినారు. పోతులూరయాచార్యులు అమృత కలశంబు చేబూని శీర్ష భాగమునుండి శీర్షముపై ధారవోయగా సిద్ధయోగి మహాగురు పట్టాభిషిక్తుడైనాడు. అంత భక్తజనంబులు సిద్ధయోగికి పాదపూజ లొనర్చినారు. గురుకట్నములు సమర్పించినారు. నూతన వస్త్రములు సమర్పించినారు. చందనము సమర్పించినారు.

గురుపూజ పరిసమాప్తమైన పిదప మూడు దినంబులు అన్నప్రదానము చేసినారు. తరువాత సిద్ధయోగి గురుదేవుని సంస్తుతించి పూజించి నూతన వస్త్రాదులు సమర్పించి ఆశీర్వాదములు పొందినాడు. మరియు పూజ్యులగు వారి నెందరినో తాంబూలాదులతో సత్కరించి సంతృప్తి పరిచినాడు.

కందిమల్లాయపల్లెకు ధర్మపత్నితో సహా వెడలి, సిద్ధయ్య వీరబ్రహ్మగురు సమాధిని పూజించి వచ్చినాడు. అందరూ క్షేమం.

.... [o] ....

సిద్ధయోగి ప్రసిద్ధ భారతం

—: ఏబది ఎనిమిదవ భాగం :—

పల్గురాళ్ళపల్లె విప్రవరుడు గోవిందస్వామి సిద్ధయోగినిచేరి "సిద్ధయోగి చంద్రమా! శేముషీవిస్తంద్ర! నాదొక్క మనవి. వినుము మీకు నేను శిష్యుడ కావలయుననియున్నది. కారణం విచ్చికావుము. వేషధారులనేకులు ఈ విశ్వమందు విచ్చలవిడిగ నుండిరిగాని వారిని నేనాశ్రయింపను. నీవే సద్గురుండవను నమ్మకము నాకు కుదిరినది. కనుక కాదనక నాకోర్కె దీర్పుము.

"నీవు చెప్పిన ఘనమైన సూక్తులెన్నియో వింటిని. నీ మహిమను సహితము కన్నులార గాంచినాడను. భవజలనిధి పడియుంటిని. నన్నుద్ధరింపుము."— అని గోవిందస్వామి చేతులు జోడించినాడు.

"విప్రకులాగ్రణీ! నీకుపదేశ మిచ్చుటకు నాకెటువంటి అభ్యంతరమూలేదు. కాని నీవు బ్రాహ్మణవంశ సంజాతుడవు. నేను దూదేకుల మహమ్మదీయుడను. విన్న నీకులపువారు బహిష్కరింతురు....

"లోకనిందపడుట నీకు మాత్రము మంచిదా బ్రాహ్మణ స్వామీ! నేనునూ లోకనిందపడవలసి యుండును. పలువురు పలువిధములుగా దూషింతురు. సంభా

కించుడు. గోవిందస్వామీ! మీ కులమునందునూ గురువులుండియే యుందురు. వారి అండజేరి కటాక్షమొందుట శ్రేయస్కరము. ఆ మార్గము ననుసరించిముక్తి బొందుము"—అనినాడు సిద్దయ్య.

"కోవిదవర్యా! నీ వెరుగని ధర్మములన్నవా స్వామీ! వీరగురు శుశ్రూషలో, సేవలో నీవు నేర్చుకొనని విశేషములేమున్నవి. గోపన్న విప్రుడేకదా! కబీరు మహమ్మదీయుడేగదా! మరిగోపన్నకు గురువు కబీరుదాసేగదా. కులము, మతము అజ్ఞులకుగానీ విజ్ఞులకుగాదు. సుజ్ఞానశేఖరా! నన్ను బ్రాహ్మణుని గావించి కరుణించుము.........

"అమేయ విద్యానిధీ! వశిష్ఠ వ్యాసాదుల భవము లెరింగియు భూసురుడ నంచు నన్ను వెలివేసిన నేమగును? నిరతము నిన్ను సేవింపుచుంటిని. శుశ్రూషలు నీకు సేయుచుంటిని. నిన్ను నమ్ముకొనియుంటిని నీవే గురుడవు సదుపదేశ మిచ్చి సంరక్షింపుము. పరమబ్రాహ్మణోత్తముడైన వీరగురు బ్రహ్మము నీకు మంత్రోపదేశమీయలేదా?"- అనినాడు గోవిందస్వామి

సిద్దయ్య కరుణా హృదయుడై చిరునగవుల వెలయించుచు "గోవిందస్వామీ! లోకమునకు నీ వలన వివేకము కలుగుటకు నేనట్లు వెనుకాడితినిగాని వేరుగాదు. సుశ్లోకుడవైన నీకుగాక కారణమింకొకరి కెట్లు నీయగలను. తగిన యేర్పాట్లుచేసి కొనుము.........

గోవిందస్వామి సిద్దయోగి యాజ్ఞవడసి కారణముబొందుటకు వలసిన వస్తు సముదాయములను, హితభక్తాళిని కూర్చుకొనినాడు. వాద్యవిశేషంబుల సహితము సమకూర్చుకొని సిద్దయోగిని సమీపించినాడు.

నాటి రాత్రి....

సిద్దయోగి దంపతులు సుస్నాతులై పీతాంబరముల ధరించి గురుపీఠమలంకరించగా మంగళ తూర్యారవంబులు మారు మ్రోగినవి, భక్తజనంబులు శ్రీగురునామ స్మరణము సేయుచూ, ఉత్కంఠతతో భజనలు ప్రారంభము చేసినారు. గోవింద స్వామి గురుదంపతులకు చరణ సమర్చనలు సలిపినాడు. అంత సిద్దయోగి శిష్య

వరుని ముఖవస్త్ర భాసితునొనర్చి హస్తమస్తక సంయోగ మాచరించి శ్రవణమందు తనదు వక్త్రము నొకింతజేర్చి మంత్రోపదేశము చేసినాడు.

మంత్రోపదేశానంతరము తీర్థప్రసాదంబు లిచ్చినాడు. అట్లే ఇతరులకును తీర్థ ప్రసాదంబులివ్వ అందరూ వారివారి స్థానములకు వెడలినారు.

కాలము గడచుచున్నది. సిద్ధయోగి గోవిందస్వాములకు తారక, సాంఖ్య అమనస్కాది విద్యలను, కాలజ్ఞాన విశేషంబులను బోధించినాడు. పురజనులకు వేదాంత శాస్త్రములను ప్రబోధము చేసినాడు. సకల ప్రదేశములు సంచారముచేసి సుజ్ఞాన ప్రభల వెదజల్లినాడు. హైందవులకు మహమ్మదీయులకు ఐకమత్యమును కలుగజేసి 'సబ్ కామాలిక యేక్'— అను నినాదమును సుప్రతిష్ఠము చేసినాడు.

సిద్ధయ్య పీరయ్య అను కుమారుని గాంచినాడు.
సిద్ధయోగి శిష్య సందోహమును సమార్జించినాడు
సంవత్సరములు గడచిపోయినవి.

ఒకానొక పుణ్యదినమున సిద్ధయోగి వీరగురుదేవు ననుసరించి సమాధి స్థితి నందినాడు.

—: మంగళం :—

అంగీరస నామ సంవత్సర చైత్ర బహుళ త్రయోదశి గురువారం- ఉత్తరాభాద్ర నక్షత్రం. వసంతఋతువు. అనగా 3?-4-92 న సంపూర్ణము.

